

ముఖచిత్రం

## బుద్ధ ప్రతిమా శీర్షము

అక్షియుగమ్మున కృపాఝరులు ప్రవహింపజేసి
కొన్న శాక్యముని ప్రతిమాశీర్షమిది. తెల్లరాతిపని.
5 వ శతాబ్దపు గాంధార శిల్పము.

రేఖావైఖరిలో ఆనాటి సారనాథ్ సాంప్రదాయముతో దీనికిగల సాన్నిహిత్యం విశదమౌతున్నది.

## బుద్ధుని పాదపద్మాలు

ఘంటసాల స్తూపంలోని శ్రీ పాదాలు—ఇవి చెక్కబడిన శిలాఫలకపు మూలలు విరిగిపోయినాయి. ఎండ, వానల తాకిడికి శిల్పం చాలా దెబ్బతిన్నది. మడమల వెనుకవైపున ఒక పద్మం చెక్కబడివుంది. అరికాళ్ళలో చక్రాలు రెండున్నవి. బుద్ధదేవుని సహజ దివ్యలక్షణాలుగా పురాణాలలో వర్ణితమైన ముప్పయిరెండు లక్షణములలోనివే ఈ "సహస్ర కిరణాంచిత సుందర ధవళచక్రములు" రెండును. చక్రాలను పరివేష్టించి యింకా అనేక చిహ్నాలున్నవి. వీనిలో స్వస్తిక, త్రిశూలము మాత్రమే స్పష్టంగా కనపడుతున్నాయి. తక్కినవి సంజ్ఞామాత్రంగా గోచరిస్తున్నాయి. పాదపద్మముల క్రింద ప్రచురించిన పద్యం శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి రచన.



కవరుపై తుదిచిత్రం

# ఈ సంచికలో





గౌరవ సంపాదకులు:
శ్రీ పి. శ్రీనివాసాచారిగారు

ప్రచురణ:
వి. ఆర్. జి. కె. ఎమ్. ప్రసాద్
ఛెయిర్మన్,
బుద్ధజయంత్యుత్సవ సంఘం,
జగ్గయ్యపేట.



# ధన్యవాదాలు

పలువుర సహాయసహకారాలు లేకపోతే జగ్గయ్యపేటలో బుద్ధజయంత్యుత్స వాలు వైభవంగా జరగడంకాని, ఈ సంచిక ఈ రూపంలో వెలువడడంకాని సాధ్య మయ్యేది కాదు.

ముఖ్యంగా,

మా విజ్ఞప్తిని ఆలించి వెంటనే విరాళాలిచ్చిన దాతలకు,

మా కమిటీతరఫున ఆనరరీ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌గా పనిచేసిన శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యం గారికి,

అల్పవ్యవధిలో అందంగా ముద్రణ ముగించిన బి. ఎస్. కె. ప్రెస్ అధినేతలు శ్రీయుతులు నాగిరెడ్డి, చక్రపాణి గార్లకు,

పారిస్‌లోని ముస్సీ గైమెట్, బోస్టన్‌లోని మ్యూజియమ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, లండన్ లోని బ్రిటిష్ మ్యూజియం, మద్రాసు మ్యూజియంలలోని శిల్పాల, కళాఖండాల ప్రతికృ తులను వినియోగించుకొన్నందుకు ఆ ప్రదర్శనశాలల నిర్వాహకులకు,

కోరిన వెంటనే తమ అమూల్యమైన రచనలు పంపిన రచయితలకు,

ఈ సంచికలో చిత్రరచన సలిపిన శ్రీ గోపి, శ్రీ మూర్తి గార్లకు,

జగ్గయ్యపేట బుద్ధజయంత్యుత్సవాలకు చిత్రరచనతోను, అలంకారాలతోను సొబగులు దిద్దిన శ్రీ రామగోపాల్ గారికి, ఆయన పరివారానికి,

ఈ సంచిక ప్రచురణలో సహాయపడిన శ్రీ వేటూరి ఆనందమూర్తి, శ్రీ చీమకుర్తి శేషగిరిరావు గార్లకు,

ఈ సంచికకు గౌరవ సంపాదకులుగా వుండుటకు అంగీకరించిన శ్రీ పి. శ్రీనివాసా చార్యులుగారికి,

మా ధ న్య వా దా లు.

వి. ఆర్. జి. కె. ఎమ్. ప్రసాద్

# సందేశాలు

## ఇండియా వైస్-ప్రెసిడెంట్

న్యూఢిల్లీ. 12 మే, 1956.

తెలుగు నాటగల ప్రాచీన బౌద్ధక్షేత్రాలలో బుద్ధజయంత్యుత్సవాలను మీరు జరపనున్నారని విని చాలా హర్షించాను. బుద్ధభగవానునికి భక్త్యంజలి ఘటిస్తూ మీరు జరపనున్న ఈ ఉత్సవాలు జయప్రదంగా ముగియగలవని ఆశిస్తున్నాను.

ఎస్. రాధాకృష్ణన్

# ఆంధ్ర గవర్నర్

మకాం, విశాఖపట్నం. 16, ఏప్రిల్ 1956.

బుద్ధజయంతి ఉత్సవములు జగ్గయ్యపేటవద్ద భక్తిశ్రద్ధలతో జరుపబడనున్నవని తెలిసి చాలా ఆనందించాను. చారిత్రాత్మకమయిన ఆ ఉత్సవాలకు చిహ్నంగా ఇంగ్లీషు లోను, తెలుగులోను ఉత్తమ సంచికలు ప్రచురించడం, మేనెల 24 వ తేదీ మొదలుకొని ఈ ఉత్సవములు జరుగనున్న మూడు రోజులు గొప్ప వస్తుప్రదర్శనంకూడ యేర్పాటు చేయడం ముదావహం. మన రాష్ట్రములోనున్న నాగార్జునకొండ, అమరావతి మొదలగు స్థలములు తలచుకొన్నపుడు ప్రాచీనకాలమున బౌద్ధవాఙ్మయమునకు, బౌద్ధశిల్పమునకు కృష్ణానదీ పరిసరములు ఆటపట్టుగ ప్రఖ్యాతిచెందిన సంగతి జ్ఞాపకం వస్తుంది. ఆ ప్రదేశమందే మహాసిద్ధుడగు నాగార్జునుడు నివసించి బోధకావించాడు. బుద్ధుని సందేశము జగమెరిగిన విషయము ; ప్రస్తుతం యావత్ప్రపంచానికి బుద్ధుని సందేశములయిన సౌహార్దము, పవిత్రత, ఔదార్యము, నిఖిలమతసహనశీలము, అహింసావ్రతము ఇదివరలో యెప్పటికన్న ఈనాడు అత్యావశ్యకములుగ ఉన్నవి. ఈ ఉత్సవములు విజయవంతముగ కొనసాగుగాక.

సి. యం. త్రివేది

# మధ్యప్రదేశ్ గవర్నర్

పచ్‌మర్హి. 3 మే, 1956.

ఆంధ్రదేశంలో బౌద్ధశిల్పావశేషాలుగల ప్రాంతాలు అనేకం వున్నవి. ఈ కొననుంచి ఆ కొనవరకు ఏడు కేంద్రాలున్నవి. ఇవి ఏ కారణంచేతనోగాని "లంజెదిబ్బ"లని వ్యవహరించబడుతున్నవి. ఈ స్తూపాలను భక్తురాలైన వేశ్య నిర్మించినదేమో తెలియదు. భట్టిప్రోలులో, ఘంటసాలలో, గుడివాడలో యివివున్నవి. నా స్వగ్రామమైన గుండుగొలనులోకూడా ఒకటి వున్నది. దానిపేరు గంగమ్మదిబ్బ. వీటినిబట్టి జగ్గయ్యపేట నుంచి, ఘంటసాలవరకు బౌద్ధసంస్కృతినిగురించి అనేక విషయాలు తెలియజేసే చిహ్నాలు పుష్కలంగా కలవని తెలుస్తున్నది. బౌద్ధసంస్కృతిని తెలియజేసే శిల్పావశేషాలనుగురించిన అసక్తిని వృద్ధిచెయ్యడానికి, ప్రభుత్వంతో సహకరించేనిమిత్తం ప్రజలు కూడా కృషిచెయ్యడం మంచి పని. ఆంధ్ర ప్రభుత్వం మీ కృషికి తోడ్పడేందుకు కృష్ణాజిల్లా స్థానికాధికారుల నియమించడమేకాక, విరాళంకూడా యిచ్చిందంటే, మంత్రి వర్గాన్ని ఎంతగానో ప్రశంసించవలసి వున్నది. ఈ శుభసందర్భంలో మీకు ప్రోత్సాహం కలిగించడానికి సందేశాలు, ఆశీర్వచనాలు ఎన్ని అయినా యివ్వవలసిందే.

బుద్ధుడు హిందూదేవుళ్లలో ఒకడుగా పరిగణింపబడలేదు. అయినప్పటికీ, అతని పేరు, అతని బోధలు, అతని విగ్రహాలు, బౌద్ధ సంస్కృతీస్మారక చిహ్నాలు ఘనంగా ప్రశంసింపబడుతున్నవి. బ్రిటీష్‌వారితో సమరంసాగించినప్పుడు మనజాతి బుద్ధుడు ఉపదేశించిన ధర్మాన్ని పునరుద్ధరించింది. రాజకీయ స్వాతంత్ర్యం పొందడానికి సాధనంగా బుద్ధుని మహోపదేశాలు పునరుద్ధరింపబడిన తర్వాత సాంఘిక, నైతిక రంగాలలో ఉదాత్తజీవితం గడపడానికి సాధనంగా అవి ఉపయోగపడగలవు. బుద్ధుని జీవితం అతని బోధలు చిరస్మరణీయంగా చేసేనిమిత్తం మీరు సాగిస్తున్న మహోత్కృష్టమైన కృషి జయప్రదం కాగలదని ఆశిస్తున్నాను.

బి. పట్టాభిసీతారామయ్య

# ఒరిస్సా గవర్నర్

రాజ్‌భవన్, పూరి. 16, ఏప్రిల్ 1956.

బుద్ధుని రాబోవు 2500 వ జయంత్యుత్సవమును ఉచితరీతిగ జరుపుటకు జగ్గయ్యపేటవద్ద ప్రయత్నములు చేయబడుచున్నవని తెలిసి సంతోషమయినది. నిజముగా యీ ముహూర్తం గొప్ప చరిత్రాత్మక సన్నివేశము. అంతర్జాతీయముగ ప్రపంచమెల్లెడల మహాజను లెందరో దీనిని స్మరించనున్నారని భావింపబడుచున్నది. ఇట్టి మహత్తర సంఘటనకు చెందిన ఉత్సవములు ఆంధ్రదేశములో, చిరకాలముగా బౌద్ధవిజ్ఞాన వికాసముతో సన్నిహిత సంబంధము కల్గియున్న స్థలములలోగూడ జరుపబడుట చాల యుక్తమయిన విషయము. అందువలన ఈ జగ్గయ్యపేట ఉత్సవ నిర్వాహకులకు నా అభినందనలు తెలుపుకొనుచున్నాను. ఈ సందర్భమునందు అచ్చట జరుపబడుతున్న ఈ ప్రదర్శనం, ప్రచురింపబడే సంచికలు, ప్రజలందరకు నేడు గౌతమబుద్ధ భగవానుని జయంతి సకల జగదాదరణీయమగుటలోని విశేషమును ఉద్బోధించ గలదని విశ్వసించుచున్నాను.

పి. ఎస్. కుమారస్వామిరాజా

# ఆంధ్ర ఉపముఖ్యమంత్రి

కర్నూలు. 16, ఏప్రిల్ 1956.

మీరు బుద్ధజయంతి ఉత్సవములు జరుపనున్నట్లు తెలిసి సంతసించాను. బుద్ధుడు తన ఉత్తమ ధర్మబోధలతో యావత్ప్రపంచానికి మార్గదర్శి అయ్యాడు. చారిత్రకముగా బౌద్ధమత వికాసమునకు ఆలవాలమయిన ప్రాంతీయులైన మీరు, ఈ ఉత్సవ నిర్వహణలో ఉత్సాహముతో నేడు పనిచేయుట ఎంతో తగియున్నది. జయంతి నిర్వహణము అర్థమైన రీతిగా విజయవంతముగా నెరవేరుగాక యని నా హృదయ పూర్వకమయిన కోరిక.

యస్. సంజీవరెడ్డి

# ఇండియా సుప్రీంకోర్టు జడ్జి

నూఢిల్లీ. 19, ఏప్రిల్ 1956.

బుద్ధజయంతి ఉత్సవములు జరుపుసందర్భములో తమరు దయతో ఈ నెల 10 వ తేదీన వ్రాసిన ఉత్తరము అందినది ; నా హృదయపూర్వక అభినందనలు. ఆంధ్ర దేశములో, అనగా, ముఖ్యముగా మున్నొకప్పుడు బౌద్ధవాఙ్మయము, బౌద్ధసంస్కృతి అత్యున్నతస్థాయిలో వికసించుటకు ప్రధానరంగమై వెలిగిన ఆంధ్రప్రాంతములో, మీరు యిప్పుడు ఈ ఉత్సవములు నిర్వహించుటకై చేయు ప్రయత్నము చాల ముదావహము. బౌద్ధసంస్కృతి యెంత విస్తృతముగా యే విధముగా వ్యాపించినదో, ఆంధ్రదేశముపై దానివలన యెట్టి శాశ్వతమయిన సల్లక్షణములు ముద్రింపబడినవో నేటి ప్రజలకు—విద్యాధికులైనవారికిగూడ—తగినంతగా తెలిసియుండలేదు. అందువలన మీ యత్నము చాల ప్రశంసింపదగియున్నది. షుమారు ఒక సంవత్సరమునకు పూర్వము నేను స్వయముగా అమరావతి నాగార్జునకొండలను దర్శించుభాగ్యము అబ్బినది. అచ్చటి పురావస్తు సంచయశేషములు సూచించెడి అత్యద్భుతమైన సంస్కృతిని సుస్పష్టముగా నేను ఆనాడు అర్థముచేసుకోగల్గితిని. మీరు చేయు ప్రయత్నములు విజయవంతముగ ప్రజా బాహుళ్యమునకు ఆ అద్భుత చరిత్రను మరల బోధపరచగలవనుటకు నా కెట్టి సందియమును లేదు.

బి. జగన్నాథదాస్

# ఇండియా ప్రభుత్వ మంత్రి

న్యూఢిల్లీ. 6, మే 1956.

బుద్ధభగవానుని పంచవింశతి శతవార్షిక జయంత్యుత్సవం జగ్గయ్యపేట ప్రజలు స్వయంకృషితో జరుపుతున్నారని విన్నప్పుడు నాకు సంతోషం కలిగింది. ఈ విధంగా మనం జోహారులర్పించడం సముచితమేకాదు, అది చరిత్రయెడల మనం చూపవలసిన కృతజ్ఞతను సరైన లక్షణంకూడా. బుద్ధదేవుడు లోకానికి చూపిన జీవితవిధానాన్ని, నైతిక సూత్రావళిని ఆదరించి, ఆచరించాలన్న కాంక్ష ఈ ఉత్సవంలో మన ప్రజలకు కలదని నే నాశిస్తున్నాను. ఈ అభిప్రాయంతోనే మన ప్రజలు, ప్రభుత్వంకూడా బుద్ధజయంతి జరుపుతున్న విషయం అందరు గ్రహించాలని నా అభిమతం. సరైన ఉద్దేశ్యంతో ఉత్సవం జరపడంవల్ల కలుగవలసిన ఫలితం పునశ్చరణ, జీవితం అంకితంచేసు కొనడానికి పునస్సంకల్పం. ఉత్సవ బాహ్యకార్యక్రమాలు మన గురుతరధర్మాలకు ప్రత్యామ్నాయం కాజాలవు. ఈ ఆశయంతో నిర్వహించేపక్షంలో మీరు ప్రచురించే ప్రత్యేక సంచిక పాఠకులకు, భారతమాత కన్న ఈ పుత్రరత్నాన్ని, మానవకోటికి యిత డిచ్చిన అమూల్య సందేశాన్ని, ఇతని ధర్మసంప్రదాయాన్ని, ఇతని జీవితాన్ని జ్ఞాపకం చెయ్యగలదని నమ్ముతున్నాను.

మీ ఉత్సవ కార్యక్రమం జయప్రదమగుగాక.

వి. కె. కృష్ణమీనన్




కవిత్రయంవలెనే ఆంధ్రదేశాన్ని వైభవాన్విత మొనర్చిన నదీత్రయంలో నడిమిదైన కృష్ణానదికి యిరుతటములా, రెండువేలేండ్లనాడు నాగార్జునకొండ, జగ్గయ్యపేట, అమరావతి, ఘంటసాల, మున్నగు బౌద్ధక్షేత్రాలెన్నో వర్ధిల్లుతూ వచ్చినాయి. బౌద్ధధర్మోద్బోధములతో, దివ్యశిల్ప కవితాకళావిలాసాలతో విలసిల్లిన ఈ ప్రాంతాలు నాడు సర్వప్రపంచ వాసులకు తీర్థయాత్రాస్థలాలై విఖ్యాతికెక్కినాయి. తెలుగు సీమను సుభిక్షంచేసే కృష్ణానదిలో నాటికి నేటికి మార్పులేదు కాని, తెలుగుజాతికానాడు సంస్కృతీ భిక్షను పెట్టిన బౌద్ధధర్మ స్రవంతి మాత్రం కొంతకాలానికి అంతర్వాహినియై కనుమరుగైనది. ప్రపంచమంతటా నేడు భక్తిశ్రద్ధలతో జరపబడుతున్న 2500 వ బుద్ధజయంత్యుత్సవ సందర్భంలో ఈ అంతర్వాహిని పాతాళ గంగవలె పైకుబికి తెలుగునాడుకే కాక స్పర్థా సంతప్తమైన లోకానికి కంతకు అమృతశీకరాలను వెదజల్లుతున్నది.

# సమర్పణ

యావత్ప్రపంచంలోను బుద్ధదేవుని 2500 వ మహా పరినిర్వాణ జయంత్యుత్సవం అమిత భక్తిశ్రద్ధలతో, అత్యంత వైభవోపేతంగా జరుప బడుతున్న ఈ శుభసమయంలో ఈ సంచికను తెలుగు పాఠకులకు వినయ వినమ్రులమై సమర్పిస్తున్నాం. తలపని తలంపుగా కలిగిన పెక్కు అంత రాయాలవల్ల ఈ సంచికకు మేము ఆశించినంత సమగ్రత కలగక పోయినా, చంద్రునకో నూలుపోగుపలె, ఈ లఘుకృతినే బుద్ధజయంతి స్మృత్యర్థదీపికగా అందజేస్తున్నాం.

భారతజాతి పునర్నిర్మితమౌతున్న సమయమిది. భారతజాతియే కాదు; నేడు విశ్వమంతటినీ అలమికొన్న అస్థిరత్వమును, బాధను, సంక్షోభాన్ని చూస్తే విశ్వంభరయే కొత్తజాతి నొకదానిని ప్రసవించుటకు వేపన పడుతున్నట్టు తోస్తుంది.

ఈ నూతన సృష్టికి కావలసిన ఉపాదానము, పరికరము భారత జాతియందు, భారత ధర్మమందు, సంప్రదాయములందు వుండనేవున్నవి. వీటిని యిప్పటి పరిస్థితులకు అనువుగా సంస్కరించి, మలచి, రూపెత్తించ వలసి వున్నది. నిన్నటి వరకు గాంధిమహాత్ముడు సాగించిన—నేడు నెహ్రూపండితుడు సాగిస్తున్న మహాయజ్ఞమిదే. విశ్వమయమై వున్న మహాదుఃఖమును బోనాడ సంకల్పించి, పావన గయాక్షేత్రమున బోధి వృక్షం కింద సిద్ధిగన్న బుద్ధ దేవుని సందేశానికి, నేడు నెహ్రూపండితుడు కొత్తగా టీకచెప్పడం ఈ యజ్ఞంలోని భాగమే.

గౌతమ బుద్ధుడు శుష్కవిరాగి కాదు. అతని యోగపద్ధతి అంతా కరుణపై ఆధారపడి వున్నది. అతనిని ప్రేరేపించినది జగత్తుపట్ల ఉపేక్షకాదు. జగత్తుపట్ల రోతకూడ కాదు. లోకంపట్ల జాలియే ఒక మహాశక్తియై, అతనిచే సంసారాన్ని త్యజింపజేసి, అడవులకు పరుగెత్తిం

చింది. విశ్వమునంతను ఆవరించుకొన్న ఆ జాలితో, అతడు వ్యక్తిగత జీవితంలో తండ్రి పట్లను, దారాపుత్రుల పట్లను అమిత కాఠిన్యం వహించాడు. ఈ అవస్థలన్నీపడి అతడు చివరకు పొందిన నిర్వాణపదం శుష్క శాంతికాదు—కరుణారస సాక్షాత్కారం.

వ్యష్టికి తరణోపాయంగా గౌతమ బుద్ధుడు బోధించిన పంచశీలనే సమష్టికి తరణోపాయంగా, కొత్తస్వరంతో భారతప్రధాని విశ్వ సమ్ముఖమున నిలబడి ఉద్ఘాటిస్తున్నాడు; జగత్కల్యాణానికి మంగళాచరణం చేస్తున్నాడు. జాతీయ దురహంకారుల హుంకారముల మధ్యనుంచి ఉద్భూత మౌతున్న కొత్త ప్రపంచానికి ఈ సందేశమే శ్రీరామరక్ష.

విరోధం అసురుల స్వభావం; మైత్రి మానవ స్వభావం. "నిర్వైర స్సర్వభూతేషు యస్స మామేతి పాండవ" అని శ్రీ కృష్ణుడు అర్జునునికి బోధించాడు—సర్వభూతము లందు ఎవనికి వైరముండదో వాడే నన్ను పొందుతాడని శ్రీ కృష్ణుని బోధ.

శ్రీ కృష్ణ పరమాత్మ సర్వభూతరతి, బుద్ధదేవుని అహింస, వర్తమానకాలంలో, గాంధిజీ ద్వారా, అనంతరం ఆయన వారసుడైన నెహ్రూ పండితుని ద్వారా తిరిగి ప్రబుద్ధమైనాయి. రక్తప్లావితమైన భూతలానికి శాంతిని చేకూర్చు ఈ సందేశం శ్రోతవ్యం, మంతవ్యం, నిధిధ్యాసితవ్యం.

వఠ్సాల్దెరామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద్

ఛైయిర్మన్,
బుద్ధజయంత్యుత్సవ సంఘం, జగ్గయ్యపేట.

# ప్రబోధం

చంపకు ప్రాణులన్—జాలి ముఖ్యమ్మ—
యేజీవి ప్రగతియో యెగ్గుచెందేను!

లోకుల సొత్తుకై లోభవంచనలేల,
యిచ్చిపుచ్చుకొనుటల్ హెచ్చించు ప్రీతి!

కూటసాక్ష్యము నింద కూడవసత్యముల్,
సత్త్వసంశుద్ధికి సత్యమే భాష!

మందులుమాకులు, మాలిన్యదములు,
శుద్ధదేహముబుద్ధి సోమరసపరమె!

పరభార్యలన్ మోహ పరవశత దాకి
చెడగొట్టుకోకుమీ శీలధర్మములు!

# ప్రవక్తలలో లోకోత్తరుడు

## మహాత్మా గాంధి



బాల్యదశలో నేను ఇంగ్లాండు వెళ్ళినప్పుడు చదివిన మొట్టమొదటి మతగ్రంథం "లైట్ ఆఫ్ ఏషియా". అందలి ప్రతి పుట క్షుణ్ణంగా చదివాను. సర్ ఎడ్విన్ అర్నాల్డ్ మనోహరంగా రచించిన బుద్ధుని ఉపదేశాలపట్ల నాకు అపారమైన గౌరవం కలిగింది. పూజ్యభావంతో పుస్తకం ముగించాను. దక్షిణాఫ్రికాలో నేను జీవనం ప్రారంభించినప్పుడు ఆ గ్రంథం మరొక పర్యాయం పఠించాను. అప్పటికి నేను ప్రపంచంలోని గొప్పమతాలకు సంబంధించిన గ్రంథాలు కొంతవరకు చదివాను. "లైట్ ఆఫ్ ఏషియా" నేను రెండవసారి చదివినప్పుడుకూడా నాకు మొదటి పర్యాయం కలిగిన పూజ్యభావం యెంత మాత్రం తగ్గలేదు. తరువాత కొంతకాలానికి ఎరవాడ జెయిలులో వున్నప్పుడు మరికొంత సాహిత్యం చదివాను.

బౌద్ధమత అధ్యాపకులవలె, హిందూతత్వ వేత్తలవలె హిందూమత ప్రధాన సిద్ధాంతాలకు, బౌద్ధమత ప్రధాన సిద్ధాంతాలకు ముఖ్యమైన భేదం వున్నదని నేను భావించను. బుద్ధుడు నిజజీవితంలో అనుష్ఠించినది హిందూ మత ధర్మమనే నా అభిప్రాయం. అతడు సంస్కర్త అన్న మాట నిజమే. ఆ కాల పరిస్థితులు కడు దారుణమైనవి. తనఉన్నతికి, సంఘంవున్నతికి అత్యవసరమని తాను భావించిన సంస్కరణను సాధించడానికి యెంతటి బాధ అనుభవించడానికైనా అతడు లెక్కచెయ్యలేదు.

చరిత్ర చెప్పేమాట నిజమే అయితే. అంధప్రాయంగా తత్కాలస్థితిని సమర్థించే బ్రాహ్మణులు అతని సంస్కరణను నిరాకరించారు. వారి స్వార్థపరత్వమే అందుకు కారణం. అయితే, సామాన్యప్రజలు తత్వవేత్తలు కారు. వారు వేదాంతగోష్ఠితో కాలక్షేపంచేసేవారు కారు. క్రియా జీవితమే వారి వేదాంతం. వారికి సహజజ్ఞానం పుష్టిగాను పదునుగాను వుంది. వారు బ్రాహ్మణుల స్వాతిశయాన్ని, స్వార్థపరత్వాన్ని లక్ష్యపెట్టలేదు. కనుక తమ ధర్మాన్ని గురించి సరిగా చెబుతున్న ప్రవక్త బుద్ధుడేనని గుర్తించడానికి వారు సందేహించలేదు. నేనుకూడా సామాన్య మానవుడనే; ప్రజలమధ్య జీవిస్తున్నవాడనే. కనుక బౌద్ధ మతం ప్రజాబాహుళ్యపు ఆచరణావధిలోకి వచ్చిన హిందూ మతమేనని నేను గ్రహించాను. సుగ్రాహ్యమైన బుద్ధుని ఉపదేశాలకు విద్వాంసులు సంతృప్తిచెందకపోవడం కద్దు. వారు తమ మేధను సంతృప్తిపరచుకొనాలని ఆశించి, ఆశాభంగం చెందుతారు. మతం ముఖ్యంగా హృదయానికి సంబంధించిన విషయం. ధీశాలిననే అహంకారంతో దానిని పరిశీలించడానికి పూనుకుంటే ఆశాభంగం కలుగక తప్పదు.

బుద్ధుడు నాస్తికుడు కాదని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను. భగవంతుడు తనదగ్గరకు స్వాతిశయభావంతో వచ్చేవానికి, భక్తునకైనా సరే, దర్శనమివ్వడానికి నిరాకరిస్తాడు. నేలమీద సాష్టాంగపడి, ముక్కు నేలకు రాచుకునేవారిని అతడు నమ్మడు; ముక్కుమీద మచ్చలు చూడ్డానికి అతడిచ్చగించడు. రోజూ మసీదులో సాష్టాంగపడి నుదురు నేలకు రాచుకొనడంవల్ల అనేకమంది ముసల్మా

నుల నుదురుమీద ఏర్పడిన పెద్ద మచ్చలు మీలో కొంత మంది చూచేవుంటారు. భగవంతుడు అపేక్షించేది యిట్టి మచ్చలు కాదు. అతడు శీలాన్ని తరచి, తరచి చూస్తాడు. ఒకడు తన ముక్కు కోసుకోవచ్చు; అరగతీసుకోవచ్చు. కాని, సాటిమానవునితో శత్రుత్వం వహిస్తే, తోడివారికోసం హృదయం గాయపడకపోతే, హృదయంలోనుంచి రక్తం ధారాళంగా ప్రవహించకపోతే అతనిని తనవానినిగా భగవంతుడు గుర్తించడు. గర్వమెట్టిదో యెరుగని ప్రజలు నమ్రతతో భగవంతుని సమీపిస్తారు. ఇదే బౌద్ధమత ముఖ్య ధర్మమని నా అభిప్రాయం. బౌద్ధమతం విశేషంగా ప్రజా సామాన్యానికి తగిన మతం.

బౌద్ధమతం భారతదేశంనుంచి బహిష్కరించబడిందన్న మాట నేనెంతమాత్రం అంగీకరించను. బౌద్ధమత ధర్మాలలో ముఖ్యమైనవెల్ల చైనా, సింహళం, జపాన్ దేశాలలో కంటె భారతదేశంలోనే యెక్కువగా కార్యరూపందాల్చింది. మన బర్మామిత్రులకంటెకూడా యెక్కువగా మనమే బౌద్ధమతాన్ని ఆచరణలో మన్నిస్తున్నామని చెప్ప సాహసిస్తున్నాను. బుద్ధుని బహిష్కరించడం సాధ్యంకాని పని. భారతదేశంలో అతడు జన్మించినమాట కాదనడం యెలా సాధ్యం? తన జీవితంతో అతడు తన పేరు చిరస్థాయి చేసుకున్నాడు. కోటానుకోట్ల ప్రజల జీవితంలో నేడతడు జీవిస్తున్నాడు. చిన్న దేవళానికి వెళ్లి అతని ప్రతిమను పూజిస్తేనేమి? పూజించకపోతేనేమి? అతని నామం జపిస్తేనేమి? జపించకపోతేనేమి? నా హృదయం పరిశుద్ధమైనదయితే, నేను రాముని పేరు 'మురా' అని తప్పుగా పలికినా దోషంలేదని, తప్పుగా పలికినా బ్రాహ్మణపండితుల కంటె నే నెక్కువ భక్తితో ఉచ్చరించగలనని నా హిందూ మతం చెబుతుంది. సత్యాన్వేషణకై లక్షలాది ప్రజలు ఏ ఒక్క వ్యక్తి అనుచరులమనో చెప్పుకోనవసరంలేదని బుద్ధుడు మనకు బోధించాడని నా అభిప్రాయం.

బుద్ధభగవానుని సందేశం మనమెంతవరకు పాలిస్తున్నామో, మానవకోటికి ధర్మముపదేశించిన ఆ మహాత్మునికి జోహారులర్పించగల యోగ్యత మన కెంతవరకు కలదో, యెవరిమట్టుకు వారు ఆత్మపరీక్ష చేసుకోనడం మంచిది. ఆచంద్రతారార్కం అతడు లోకోత్తరులలో ఒకడుగా ఎన్నబడగలడనటానికి నాకెట్టి సందేహం లేదు.

మనం హిందువులమైనా, మరెవరమైనా మానవకోటికి బుద్ధదేవుడు అనేక శతాబ్దాలక్రితం చేసిన ఉపదేశాన్ని మన జీవితంలో పాలించడానికి పరాత్పరుడు తోడ్పడుగాక.

1925 లో కలకత్తాలో జరిగిన బుద్ధజయంతి వైశాఖోత్సవ సందర్భంలో మహాత్ముడు చేసిన ఉపన్యాసంనుంచి సమాధృదము.

లుంబినీ వనమునకు పోవుచున్న మాయాదేవి. జావాశిల్పం. 8 వ శతాబ్దిది.



# అపూర్వక్రియాశక్తి సంపన్నుడు

## శ్రీ అరవిందయోగి

(లైఫ్ "డివైన్" నుంచి)



బుద్ధుడు తాత్విక సమస్యను పరిశీలించడానికి నిరాకరించాడు; అనత్యమైన వ్యక్తిత్వం ఏవిధంగా ఏర్పడుతున్నదో, దుఃఖపూరితమైన జగత్తు ఏరీతిగా సృష్టి అవుతున్నదో, దీనిసంతతినుంచి విముక్తి చెందడానికి ఉపాయమేదో తెలుసుకొనడమే ముఖ్యం. కర్మసూత్రం కాదనలేని సత్యం. నిజంగా వ్యక్తిత్వంలేని వస్తువులు వ్యక్తిత్వంతో సృష్టికావడమే దుఃఖకారణం. కనుక కర్మ బంధంనుంచి, వ్యక్తిత్వంనుంచి, దుఃఖంనుంచి విముక్తి చెందడమే మన లక్ష్యం. ఆ కారణాన్ని తొలగించడంవల్ల మనం ఈ లక్షణాలేవీ లేక సత్యము, నిత్యము అయిన స్థితి పొందగలుగుతాము. అదేదైనానరే, బంధ విమోచనే ప్రధానం.

అజ్ఞేయమై, సమస్త జగత్తుకు ఆధారభూతమైనది శుద్ధ సత్. సమస్త విశ్వానికి అతీతమై, దానితో ఏ సంబంధము లేక సర్వతంత్ర స్వతంత్రమైనదన్న భావాన్ని స్ఫురింప జెయ్యడానికి అనత్ అనే శబ్దం వ్యవహరిస్తాము. స్వతంత్ర మైనదంటే, జగత్తులోని చేతనాశక్తి సృష్టించగల సమస్త వస్తువులకు, సకలవిధములైన ఉనికికి అతీతమైనదన్నమాట. తన వ్యక్త స్వరూపాలుగా వాటి వాస్తవికత సది కాదనదు. కాని, ఏ స్వరూపంచేతగాని ఎన్నెన్ని స్వరూపాలచేతగాని అది పరిమితంకాదు. ప్రశాంత స్థితిలో కార్యాచరణకుగూడా వీలున్నట్టే సత్‌కు అనత్‌కు వైరుధ్యం లేదు. ఇవి పరస్పర విరుద్ధమైనవి కావు; అన్ని విభేదాలవలె అన్యోన్య సంపూరక మైనవి.

ఏకభావమందే అన్వయ వ్యతిరేక స్థితులు రెంటిని గుర్తించడం సాధ్యమైనట్టే, సర్వాతీతము, అజ్ఞేయము అయిన ఆత్మకలదన్న ఎరుకతోపాటు దానిని ప్రబుద్ధాత్మ యందు సాక్షాత్కరింప చేసుకొనడంగూడా సాధ్యమే, కనుకనే బుద్ధుడు నిర్వాణ స్థితియందున్నప్పటికీ లోక రంగంలో అద్భుతంగా కార్యకలాపాలు నిర్వర్తించగలి గాడు. అంతరాంతరంలోని అనుభూతియందు వ్యక్తిత్వ వివర్జితుడై, క్రియారంగంలో ప్రచండశక్తి సంభరితుడైన వ్యక్తిగా వ్యవహరించాడు. మహీమండలంలో అంతటి మహత్ఫలితాలను సాధించిన మహామహుడు మనమెరిగి నంతలో మరొకరు లేరు.

దీనినిబట్టి వ్యావహారిక జగత్తు లీనమైపోయిన ఒకానొక అవస్థావిశేషం పొందడం జీవునికి సాధ్యమని తెలుస్తున్నది. ఆ అనుభూతియందు ఆత్మవస్తువునహితం స్పష్టంగా గోచరంకాదు. ప్రగాఢ నిశ్శబ్దస్థితికి అతీతమైన నిశ్శబ్ద స్థితిలోకి ప్రవేశించడం సాధ్యమే. అయితే, పరమప్రాప్య మైన సంపూర్ణానుభూతి యింతమాత్రమే కాదు. ఈ అను

భవమొక్కటే నిజంకాదుకూడా. ఈ నిర్వాణం, ఆత్మవిలీన మైన ఈ స్థితి పరమశాంతిప్రదము, మోక్షదాయకము అయినప్పటికీ బాహ్యజీవితంలో ఫలనిరపేక్షము, ఫల ప్రదము అయిన కార్యనిర్వహణకు విరుద్ధంకాదు. వ్యక్తి త్వాన్ని అతీతించి, శూన్యంవంటి చలనరహితమైన గంభీర ప్రశాంతస్థితిని అంతరంగంలో అనుభవిస్తూ, శాశ్వతమైన సత్యం, ధర్మం, ప్రేమ—వీటికి సంబంధించిన కర్మలు బాహ్యరంగంలో నిర్వహించడమే బుద్ధుని సందేశంలోని నిజమైన సారాంశ మన వచ్చునేమో—అది అహంకారా నికి, వ్యక్తి పరమైన కర్మ పరంపరకు, సశ్వర భావా లకు, రూపాలకు అతీతమైన అంతస్తు నారోహించడం. అది, కేవలం స్థూలదేహ ధారణకు సంబంధించిన కష్టాలనుంచి, దుఃఖంనుంచి తప్పించు కొనడంకాదు. సమగ్రశక్తియుతు డైనవాడు ప్రశాంత స్థితిని, క్రియాశీలాన్ని తనలో సమన్వయ పరుచుకొన గలిగినట్టే, స్వస్వరూపజ్ఞానం పరిపూర్ణంగా కలిగిన ఆత్మ సర్వతంత్ర స్వతంత్రమైన అనత్‌ను చేరుకొని కూడా జగత్తుపై తన అధిపత్యాన్ని నిలుపు కొనగలదు. అది ఇంద్రజాలంవంటి భగవల్లీలా విలాసాన్ని అది మధ్యాంతరహితంగా ప్రదర్శిస్తూ సదా దానికి అతీతమై వుండగలదు; తనకు కూడా తానతీతమై వుండగలదు. ఇందుకు విరుద్ధమైన అనుభవం జీవుడు అనత్‌పైనే తన దృష్టిని కేంద్రీకరించడం వల్ల కలిగేఫలితమే. అంతట వ్యక్తిత్వాన్ని జగద్వ్యాపారం నుంచి ఉపసంహరించు కొనడం, యవనికాభ్యంతరమందు ప్రవేశించడం, నిత్య వస్తు చేతన యందు పురోగమించడం జరుగుతుంది.





బుద్ధుని జ్ఞానోదయం — బోధివృక్షంక్రింద ఖాళీగావున్న శిలావేదికనుబట్టి, దానిపై గల "త్రిరత్న" అభిజ్ఞనుబట్టి ఈ భావం సూచితమౌతున్నది. పార్శ్వముల నిలిచినవారు నలుగురు లోకపాలకులు. (సాంచీస్తూపంలో శిల్పం. క్రీస్తు పూర్వం మొదటి శతాబ్దం)

# బుద్ధుడు ప్రతిపాదించిన సాధన సాధ్యాలు

## శ్రీ ఎస్. ఎన్. వర్మ

బ్రాహ్మణకుమారు లిద్దరు బుద్ధభగవానుని సమీపించి, బ్రహ్మసాక్షాత్కారం పొందగల మార్గం చూపవలసిందని అర్థించారట. అంతట అతడు వారికి 'అర్హత్' సిద్ధించగల విధానం బోధించాడట. "అర్హత్" సంస్కృతం నుంచి పుట్టింది. "అర్హత కలిగిన", "ఆరాధ్యమైన" అని దాని అర్థం. సర్వవిధ భ్రాంతి విరహితుడై, నిర్వాణప్రాప్తి కలిగిన వానికి బౌద్ధమతంలో "అర్హత్" అంటారు.

శ్రీ కృష్ణుడు అర్జునునికి ఉపదేశం చేస్తూ యోగి సాధించగోరే లక్ష్యమే మహోత్కృష్టమైన లక్ష్యమని స్పష్టీకరించాడు. అనగా, ఎవని మనస్సు సమగ్రంగా సుశిక్షితమై, సమస్తవాంఛా విరహితమైనదో అట్టివాడు పరమ శాంతి స్వరూపమైన నిర్వాణం పొందగలడు.

అర్హత్ సిద్ధించే విధానమేమిటి? "అతి" వర్జించి మధ్యమ మార్గమనుసరించడమే కర్తవ్యం. భోగలాలసత్వంగాని, ఆత్మహింసగాని తగదు. మధ్యమ మార్గానికి బుద్ధదేవుని జీవితం ఆదర్శప్రాయమైన నిదర్శనం. బుద్ధుని జీవితం, బౌద్ధమత సాహిత్యం తెలుసుకుంటే మనకు రెండు విషయాలు సుబోధకం కాగలవు. బుద్ధుడు జితేంద్రియుడు, అతీతమైన ఆధ్యాత్మికస్థాయి నందుకున్నవాడు మాత్రమే కాదు; అతడు దృఢగాత్రుడు, అసాధారణ క్రియాశక్తి సంపన్నుడుకూడ. అతడు చక్కని భోజనం చేసేవాడని, చక్కని దుస్తులు ధరించేవాడని వర్ణించబడింది.

మధ్యమ మార్గం అనుచరించేవారు సంయోచనలనే దశవిధ శృంఖలాలను ఛేదించడానికి అష్టాంగ సాధన ప్రణాళికను అనుష్ఠించాలి. ఆ పది బంధాలివి ;

1. నేను, నాది అనే భ్రాంతి. అది నిత్యము, విశ్వవ్యాప్తము అయిన జీవనస్రవంతికి తాను భిన్నమనుకొనడం ; విశ్వగతిలో నిరంతరం మార్పు చెందుతున్న కార్యకారణ పరంపరకు వేరుగా తనకు శాశ్వతమైన వ్యక్తిత్వం కలదనుకొనడం. ఇది భగవద్గీతలో అహంకారం అనే పేరుతో వ్యవహరింపబడింది. ఇది అపరా ప్రకృతి ఎనిమిది లక్షణాలలో ఒకటి.

2. సందేహం—ముఖ్యంగా ఉత్తమ జీవితసాధనకు అవలంబించే మార్గమందు శంక కలగడం. హిందువుల యోగపద్ధతులలో సందేహం అజ్ఞానంలోకి దిగజారిపోయే తామసిక ప్రవృత్తిగా పేర్కొనబడింది.

3. బాహ్య సత్కర్మానుష్ఠానమే పరమ ప్రయోజనకారి అన్న నమ్మకం. ఇదికూడా నిజంగాబంధమే. ఎందుచేతనంటే, ఈ భావం తాను ధర్మపరుడననే దురహంకారానికి, స్వాతిశయానికి, దారితీస్తుంది.

4. కామం (విషయవాంఛ). శుష్క వైరాగ్యాన్ని బౌద్ధమతం ఆమోదించదు. కాని, ఇంద్రియాలను సవ్యమైన రీతిని మచ్చికచేసి, పదునుపరచి, వాటికి క్రమశిక్షణ గరపే విషయంలో బౌద్ధమతం చూపే పట్టుదల యింతా అంతా కాదు. బౌద్ధులనేకులు ఏక పత్నీవ్రతులు. బ్రహ్మచర్యం అవలంబించడం, మత్తు పదార్థాలను నిషేధించడం 'అర్హత్' పొందడానికి అనివార్యమని బౌద్ధమతావలంబులకు ఆదేశించబడింది.

5. దుశ్చింత. దీనిని విశ్వజనీనమైన ప్రేమసాధనద్వారా జయించాలి.

6. ఐహిక జీవితమందు మమకారం.

7. ఇటనుంచి నిర్గమించిన తరువాత స్వర్గలోకంలో నివసించాలన్న కాంక్ష.

8. స్వాతిశయం.

9. తనదే ధర్మమన్న దురహంకారం.

10. అవిద్య.

అష్టాంగ సాధన ప్రణాళిక యిది :

(1) సమ్యక్ దృక్పథం (2) సమ్యక్ ఆశయం (3) సమ్యక్ భాషణం (4) సమ్యక్ ప్రవర్తన (5) సమ్యక్ జీవనం (6) సమ్యక్ కృషి (7) సమ్యక్ భావం (8) సమ్యక్ అనుభూతి (ప్రగాఢధ్యాన స్థితిలో కలిగే అనుభవం)

దశవిధ బంధాలలో మొదటి మూటిని జయించినవాడు ప్రవాహాన్ని అధిగమించినవాడు. అతనికిక తిరోగమనం లేదు. అతనియం దావిర్భవించిన శక్తి "అర్హత్" పొందే స్థితికి అతనిని గొనిపోగలదు.

క్రమక్రమంగా తామసిక, రాజసిక ప్రవృత్తులను సత్వగుణ ప్రాభవంతో జయించి, తరువాత తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రశాంతతయందు విలీసంచేసి, నిర్వాణం పొందడమే ఈ సాధన నియమావళిని అభ్యసించడంవల్ల కలుగగల ఫలితమని సూక్ష్మంగా పరిశీలిస్తే తెలుస్తుంది.

నిర్వాణస్థితి అంటే విశ్వవ్యాప్తము, విశ్వాతీతము అయిన సత్ కాదు. అది అసత్. కార్యకారణ బంధాన్ని త్రెంచి, సంసార చక్రాన్ని అతిక్రమించగోరే వారెవరైనాసరే, ఈ అష్టాంగ సాధన మార్గం అవలంబించవచ్చు. యుగయుగాలుగా సంసారచక్రంలో పరిభ్రమిస్తున్న జీవునికి పూర్వ వర్తమాన భవిష్యత్తులున్న మాట నిజమే. కాని, ఆ వ్యక్తిత్వం ఎరుకకలిగిన ఆత్మకాదు; మోక్షప్రాప్తికై అనేక జన్మలలో పురోగమిస్తూ స్థలకాల పరిస్థితులను నిర్ణయించుకోగలది కాదు ప్రవాహరూపమైన పరిణామంలోను, అనిత్య స్థితిలోను దానికిగల నిత్యత్వం కార్యకారణ పరంపరలో గల నిత్యత్వమే. ఈ కార్యకారణ పరంపరలో ప్రతి ఒక్కరము చిక్కుకొనివున్న వారమే. అనేక జన్మలలో జరిగే నిరంతర ప్రయత్న ఫలితంగా జీవుడు ఈ బంధం నుంచి విముక్తుడై నిర్వాణం పొందుతాడు.

గుణాత్మకమైన జగల్లీలా విలాసమంతా పరమపురుషుని యందే కలదని, పరమపురుషుడు దానికి బద్ధుడుకాడని భగవద్గీతలో చెప్పబడింది.

యేచైవ సాత్త్వికాభావా రాజసాస్తామసాశ్చయే
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు తేమయి.

(7 వ అధ్యాయం 12 వ శ్లోకం)

ఎవడు ఈ క్రీడకంతకు అధారమో, ఎవనియందు ఈ క్రీడ జరుగుతున్నదో ఆ పురుషోత్తముని సహాయంతో జీవుడు ఈ ప్రవాహాన్ని అతీతించగలడు. తెంపులేకుండా సాగిపోతున్న ఈ సంసారచక్రం కార్యకారణ సంభూతమని, దీని సతీతించడానికి మధ్యమ మార్గానికి సంబంధించిన సాధనల నభ్యసించాలని బౌద్ధమతం బోధిస్తున్నది.



సుమాంగద గాథా చిత్రము. గాంధార శిల్పం. 2-4 శతాబ్దులది.



బుద్ధుని నదీస్నానం—జావాశిల్పం.

# సుగత! జోహార్!!

శ్రీ పింగళి నాగేంద్రరావు

ఇది పుణ్యభూమిరా!
ఇది మాతృభూమిరా!!
ఇది ఫలించేకర్మ
కర్తవ్యమగురా...

అఖిల సంఘ గణాల
కాహ్వాన మిదిరా!
చొరవతో సరుదెంచు
సుగత! జోహరురా!!

సమతతో జగమెల్ల
సంబద్ధమగురా!
సంఘ తంత్రమె యింక
జరుగు తంత్రమురా!!

పరమ మైత్రీధర్మ
పంథా యిదేరా!
చౌరవతో నరుదెంచు
సుగత! జోహారురా!!

జ్ఞానాగ్ని జరిగేటి
కామదహనమురా!
ఆనంద భోగమే
అపరామృతమురా!!

భువనభువనాలకును
బుద్ధగతి యిదిరా!
చౌరవతో నరుదెంచు
సుగత! జోహారురా!!!

# మైత్రీ దీపం

బుద్ధదేవుని గీతమే
శుద్ధసత్వప్రభాతమే!
శ్రద్ధచేసే జ్ఞానులే
బుద్ధగతి సుఖియింతురే!!

ఘనమైన స్వార్థపరతన్
అనుమాన బాధ పడకే!
అనుబద్ధమే జగమ్మౌ
అనురాగమాత్రమునకే!!



కామరాగవికారమే
భూమిదుర్భర ఖారమే!
క్షేమసుఖమును కోరితే
ప్రేమ తారకమంత్రమే!!

కక్షలును ప్రతికక్షలున్
అక్షయమ్మగు బాధకే!
అక్షిగననగు సూక్ష్మమే
రక్ష మైత్రీదీపమే!!





పశువులు - పశుపాలకులు. అమరావతి

# భారతీయ శిల్పానికి మణి మకుటమైన ఆంధ్రబౌద్ధుల కళాసృష్టి

## శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

స్వాతంత్ర భారత దేశంలో కల్లా, అతి శైశవప్రాయంలో ఉన్నదైన ఈ ఆంధ్రరాష్ట్రం, సాక్షాత్తూ బుద్ధ భగవానుని పాదచిహ్నాలను, ఈ నేల, నోచుకొన పోయినా, బౌద్ధ శిల్పం, బౌద్ధ చిత్రకళలు ముఖ్యంగా శిల్పం మహోన్నతస్థాయి నందు కొన్న దేశమై, తక్కిన భారతరాష్ట్రాల కన్నా మిన్నయై వెలసింది. ఆంధ్రులు అశోకునికి చాల పూర్వమే బౌద్ధ మతాన్ని స్వీకరించారు. ప్రొఫెసర్ కె. ఆర్. సుబ్రహ్మణ్యం, విశిష్టంగా రచించిన 'ఆంధ్రలో బౌద్ధ శిథిలాలు' అన్న ప్రత్యేకవ్యాస సంపుటిలో, "ఆంధ్రుల బౌద్ధ స్వీకరణము అశోకుని పూర్వకాలంనాటిదని నిస్సందేహంగా చెప్పవచ్చును" అని నుడివారు.

ఆంధ్రులు అతిఉద్రేక స్వభావులు, అతి శీఘ్రంగా అతి తీవ్రమైన ఉద్రేకాలకు పాల్పడుతారని ఈ నాటికీ కూడా పేరు పడేఉన్నారు. వాళ్ళకు ప్రేమకల్గితే అతిప్రేమ, ద్వేషం కల్గితే అతి ద్వేషంగా, అలవి కాకుండా ఉద్వేలగంగా ఉంటుంది. కాని మొత్తంమీద చూసుకొంటే, ఆంధ్రుడు, దయా, దాక్షిణ్యం, అపరిమితమైత్రీస్వభావం, సహజంగా అతిథి పూజనం, కలవాడు. ఒక్కొక్కప్పుడు అతి తిక్కగా, చంచలంగా కనబడ్డాకూడా, స్నేహ ధర్మం వాళ్ళలో ఉన్నంత మరెచ్చటా ఉండదు. అందుకనే ఏ క్రొత్త అభ్యుదయ భావమైనా, క్రొత్త నూతనాదర్శమైనా, వాళ్ళ నిట్టే అతి స్వాభావికంగా ఆకర్షిస్తుంది. అట్లాంటి తత్వమున్న మనుష్యులవటం చేతనే, విశ్వమానవ సౌభ్రాత్రాన్ని, జీవకారుణ్యాన్ని, విశ్వప్రేమ ఆదర్శాన్ని, మూఢాచార నిరసనాన్ని, మానవుని పరమోత్కృష్ట స్వభావం ఏది ఉందో దాన్ని ప్రేరేపించే, ప్రచారప్రబోధాలు గల బౌద్ధ ధర్మం వాళ్ళ నిట్టే ఆకర్షించి, బౌద్ధానికి సుస్వాగతమిచ్చేటట్లు చేసి ఉంటుంది.

ఏ మాత్రం భావుకత గలవారైనా, మధ్యయుగాల మసక చీకటుల చీల్చుకొంటూ చూపుసారిస్తే, ఆజానుబాహులు, తప్తకాంచనవర్ణులు, సుందరదీర్ఘకాయులూ అయిన పూర్వాంధ్ర పురుషులు కోటానుకోట్లు బౌద్ధ ఆరామాలకు పోయి, నవనవోన్మేష భక్తి కుసుమాలతో పూజలు చేస్తున్న దృశ్యం కన్నులకు కట్టుతుంది. గోదావరి, కృష్ణ, వంశధారాది జీవస్రోతస్వినీపరివృత సస్యశామల ధాత్రీతలమంతటా కొండలూ కోనలూ కూడా, "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి (బుద్ధుడే నాకు శరణు, ధర్మమే నాకు శరణు, సంఘమే నాకు శరణు) అన్న గీతాలాపం ప్రతి ధ్వనిస్తుంటాయి. ఇది కేవలం నాభావోన్మత్తత కాదు. ఆంధ్ర దేశ

మంతటా విరజిమ్మబడినట్లున్న త్రింశత్రయ స్తూపాలు ఈ నా ఊహకు సాక్ష్యం పలుకుతూ నిలుస్తాయి. ఆంధ్ర దేశ మంతటా విస్తరించుకొని, ఉత్తరాన శాలిహుండం నుంచి దక్షిణాన చినగంజాం దాకా, తూర్పున ఘంటసాల నుంచి పడమట గుత్తి వరకు విరజిమ్మ బడ్డట్లున్న స్తూపాలన్నీ ఇదే చెప్తాయి. Mr. లాంగ్ హర్స్ట్ చెప్పినట్లు, "దక్షిణాన ఉన్న మరే ఇతర దేవాలయాది శిల్ప ప్రతిష్ఠల కన్న కూడా ఈ బౌద్ధ స్థలాలు అత్యధిక శిల్ప ప్రావీణ్య విశేషం గలవి".

ఈ పూర్వ స్థలాల మళ్ళీ త్రవ్వి కనుగొని మన దృష్టికి తెచ్చి నందుకు, పురాతత్త్వ పరిశోధక ప్రథమాచార్యు లనదగు, సివిల్, మిలిటరీ, ఉద్యోగులు, పరిశోధకు లెందరకో, ముఖ్యంగా మెకంజీ, ఎల్లియట్, బర్గెస్, సూయెల్. రీ, లాంగ్‌హర్స్టు, రామచంద్రనుల వంటి, వైతాళిక సములైన పరిశోధకుల కెంతో ఋణ పడి ఉన్నాము.

ఆంధ్రలో బౌద్ధ శిథిలా లున్న స్థలాల నన్నింటినీ, చూశా నని నేను చెప్ప బోవటం లేదు. కాని అమరావతి, నాగార్జునకొండ, జగ్గయ్యపేట, ఘంటసాల, భట్టిప్రోలులో బౌద్ధ విశేషాలను సందర్శించే భాగ్యం మాత్రం నాకు కల్గింది. వీనిలో కూడా మొదటి రెండూ ప్రపంచ ఖ్యాతిగడించిన స్థలాలు. రెండూ కూడా, దక్షిణ దేశపు నదులలో కెల్లా ద్వితీయ స్థానం ఆక్రమించే కృష్ణానదీ తీరాన గుంటూరు మండలంలోనే ఉన్నాయి. ఈ నాడు అమరావతి పాడు బడిన పల్లెఅయి శతాబ్దాలుగా అక్కడ విలసిల్లిన విశ్వ విద్యాలయ మంటూ ఏదీ లేక పోయినా, నాగార్జునకొండ నిర్జనప్రదేశంగా మిగిలిపోయి ఒక నాటి ప్రఖ్యాత విద్యా కేంద్రం ఏదీ ఇప్పుడు లేక పోయినా, ఆ ప్రదేశాలను దర్శించిన ఎవరికైనా ఈ నాటికీ, కృష్ణానదీ స్వచ్ఛజలాల అలల తళుకులలో మిశ్రమమయి, బౌద్ధ ధర్మంలోని, శాంత గంభీర అనిర్వచనీయానందాలు, పరిసరాల సంత టినీ నింపినట్లు స్ఫురిస్తూనే ఉంటుంది. శిల్పశాస్త్ర నిష్ణాతు డనుగాని సామాన్యుడనగుటచే సాధికారంగా చెప్పలేక పోవచ్చునేమో గాని, దేశాటనంలో సర్వ భారతదేశంలోని ప్రతి పెద్ద, చిన్న. పూర్వయుగ శిల్ప విశేషాలను పరికించిన వాడను కాబట్టి, తత్తదాచితంగా నేను ఈ అభిప్రాయం చెప్పటానికి కూడా సాహసిస్తున్నాను. ఎన్నో శతాబ్దాల కాల గర్భంలో చివికిపోయి, విగ్రహధ్వంసకుల చేతుల్లో విరిగి పోయి పాడుపడి పోయినా కూడా, ఈ నాటికి అమరావతీ. నాగార్జునకొండలలో లభించిన శిల్పావశేషాలు సునిశిత సౌందర్య మహిమలోగాని, ఆధ్యాత్మిక విలాస విశేషంలో గాని, భావగాంభీర్య భంగిమంలోగాని మరివేటికి తీసి పోవని మాత్రం గట్టిగా చెప్పగలను.

అమరావతికి, కేవలం ఆంధ్ర చరిత్రలోనే కాక, భార తీయ, ప్రపంచ బౌద్ధ చరిత్రలలో కూడా విశిష్టస్థానమున్న దన్న విషయం మీరందరెరిగినదే. శాతవాహన రాజధాని యైన ధాన్యకటకానికి అరమైలు మాత్రపు దూరంలో ఉన్న ఈ ప్రఖ్యాత నగరం, మహాయాన బౌద్ధ సిద్ధాంతానికి ఆట పట్టయిన కేంద్రస్థానం. కాని అంతకన్నాకూడా అక్కడ ఉన్న మహాస్తూపంవల్లనే ఈ పురం ఇతోధికమైనప్రఖ్యాతి లోకి వచ్చింది. ఈ స్తూపం ఎత్తు నూరు అడుగులు. భూచక్రవ్యాసం నూట అరవై రెండు అడుగుల ఏడంగు ళాలు (దీనితో పోల్చి చూసుకొంటే; భట్టిప్రోలు స్తూపం నూట నలభై ఎన్మిది అడుగులు - ఘంటశాల, నూట ఇరవై రెండడుగులు-నాగార్జునకొండలో ముఖ్యస్తూపం నూట ఆరు అడుగులు) "అమరావతి మూలచైత్యం క్రీ. పూ. 200 నాటిది. కొన్ని (రిలీఫ్) రాతి పలక చెక్కడాలు క్రీ. పూ. 1, 2, శతాబ్దాలనాటివి. బందేకట్టు పలకలు, చుట్టూ రాతి కటకటాలు, పిట్టగోడ క్రీ. శ. రెండవ శతాబ్దినాటిది. అథవా క్రీ. శ. 250 తర్వాత నాటివి మాత్రం కావు." అని డా॥ ఆనందకుమారస్వామి అభిప్రాయపడ్డారు. అమరావతి స్తూపానికి మహదాలంకారమైన, ఈ గోడని గురించి జేమ్సు ఫెర్గుసన్ ఇల్లా అన్నారు. "చారిత్రకంగా బర్హూత్ స్తూపంచుట్టూ ఉన్న పిట్టగోడ, భారతదేశ శిథిలాలన్నిటిలోకి ప్రముఖమైన దయినప్పటికీ, శిల్ప వైదగ్ధ్యంలో గాని, వైశద్యంలోగాని అమరావతి స్తూపపు పిట్టగోడకు ఎంత మాత్రమూ దీటురాదు. నిజానికి అమరావతిలోని ఈ పిట్ట గోడ, భారతదేశంలోని పూర్వ శిల్ప విశేషలన్నిటిలోకీ కూడా గొప్పదని చెప్పవచ్చును. అసలు బర్హూత్‌లోని పిట్ట గోడ కిది రెండున్నరరెట్లు పొడవు ఉంది. బైటిప్రాకారము వ్యాసం 195 అడుగులు, లోపలి ప్రాకారంవ్యాసం 165 అడుగులు. ఇదే బర్హూత్‌లో ఉన్న దానికి దాదాపు రెండు రెట్లుంది. ఈ రెండు పిట్ట గోడలమధ్య, ఉత్సవ మార్గ ముంది. అంతకు పూర్వపు కట్టడాలలో ఈ మార్గం టోపీ పైనే ఉండేది. ప్రాకారపు గోడ బయటి ఎత్తు 14 అడు గులు. లోతట్టు ఇదే ఇంతకు రెండడుగులు తక్కువ ఉంటోంది. ఇకలోపలి గోడ ఎత్తు ఆరడుగులుమాత్రమే"

భారతీయ పూర్వ శిల్పకళా, సౌందర్యవిలాసాలను బైటి ప్రపంచానికి చాటి చెప్పి, ప్రపంచ దృష్టిని ఆకర్షింప చేయుటకు బాధ్యులైనవారు ముఖ్యంగా, ఈ ఫెర్గుసన్ పండితుడు, ఇ. బి. హావెల్, డాక్టరు. ఎ. కె. కుమార స్వామిగారలే!

అమరావతీస్తూప తదితర శిల్పవిశేషాలను నేనంతగా చెప్పనక్కరలేదు. ఈస్తూపం నమూనాను ప్లాస్టర్‌లో తయారు



బుద్ధదేవుని సుజాత సత్కరించుట. శిలాఫలక మధ్యవలయమున ఈ దృశ్యము చిత్రితము.
పైభాగమున నిరంజనానదీ స్నానమును, దిగువన బుద్ధుని జ్ఞానోదయము
ఇందే చెక్కబడియున్నవి—అమరావతీ శిల్పం, బ్రిటిష్ మ్యూజియం.

చేయించి మిస్టర్ పెర్సీబ్రౌను, మద్రాసు మ్యూజియంలో నెలకొల్పి వుంచారు. కాని ఒక్క విషయం చెప్పాలనుకొంటాను. ఈ ప్రాకారం ఒక్కటే దాదాపు 17,000 చదరపు అడుగుల విస్తీర్ణం కలిగి అంతటా రిలీఫ్ చెక్కడాలతో నిండివుంది.

ఈ రిలీఫ్ చెక్కడపు చిత్రాలుకూడా, మనదౌర్భాగ్యం చేత ఇప్పటికి చాలా నష్టమయిపోయాయి. 18-వ శతాబ్దాంతంలో కర్నల్ మెకంజై అమరావతీ స్తూపాన్ని దర్శించేటప్పటికే యెన్నో పాలరాతి చెక్కడాలు జీర్ణమయిపోయాయి. అప్పటిపాలకులు 1796 లో తమ స్థావరాన్ని అమరావతికి మార్చుకొని అక్కడి పాలరాళ్లన్నీ తవ్వి సున్నపుబట్టీల కెక్కించారు. అమరావతిలోని ధూళికూడా చరిత్రసంప్రదాయాలతో నుతికెక్కి వుంటుంది. అల్లాంటిది మహోత్కృష్ట శిల్పవిశేషాలున్న శిలలు సున్నానికికూడా లేకుండాపోయాయి. తర్వాత పాపపరిహారార్థం అన్నట్లు అక్కడ అమరేశ్వరాలయం చుట్టూ కొత్తఊరు కట్టించ ప్రయత్నించాడు. ఈ ధ్వంసకాండను తప్పించుకొనీకూడా చెదురుగా కొన్ని పాలరాతి చెక్కడాలు దొరికాయి. వాట్లను, లండను, పారిస్, కలకత్తా, మద్రాసు మ్యూజియములకు తరలించారు. ఇప్పుడు అసలు చోట ఏ కొద్దిరాళ్ళు మాత్రమో మిగిలివున్నాయి. 125 దాకా పాలరాతి చెక్కడాలు సర్ వాల్టర్ ఎలియట్‌వల్ల లండన్ తరలింపబడ్డాయి. వీట్లను అందుకనే "ఎలియట్ మార్బ్ల్సు" అంటారు.

ఎల్గిన్ పాలరాలతోనూ, అసిరియన్ ప్రాచీన ఫలక శిల్పాలతోనూ సరిసమానంగా పోటీపడుతూ లండన్‌లో ఒక మూల అతిప్రశాంతమైన ఒక సందులో ప్రాచీన ప్రపంచ శిల్పకళా విశేష సర్వస్వానికి కాణాచియైన ఒక పురావస్తుశాలలో, ఈ అమరావతీ శిల్పాలు, తమ లాలిత్యాన్నీ, రాజసాన్నీ, శక్తినీ, వేదనాత్మైక్యాన్నీ వెలివర్చుకొంటూ, నేను లండనులో తిరిగినన్నాళ్ళు నా కంటబడ్డాయి. ఇంగ్లీషుఛానల్ దాటి పారిస్‌నగరం చేరేటప్పటికి మళ్ళీ "మ్యూజీ గుయిమెట్" మందిరంలో, మరో మూడో నాలుగో అమరావతి పాలరాతి శిల్పఫలకాలు కనబడ్డాయి. ఈమధ్య కలకత్తా ఇండియన్ మ్యూజియమ్‌లో మరో పధ్నాల్గింటిని లెక్కపెట్టాను. ఇక మద్రాసు మ్యూజియమ్‌లో, అమరావతి శిల్పంలో చిత్రశిల్పనిధులు, చిన్న పెద్దా అన్నీ కలుపుకొని దాదాపు మూడు వందల పైచిలుకు వున్నాయని నేను వేరే చెప్పనక్కరలేదు. ఆంధ్ర శిల్పుల అమూల్య రత్న సంపదలు ఇన్ని చోట్ల యిల్లా విరజిమ్మబడ్డాయని నాకు కొంచెం విచారం కల్గినా, వున్నచోట్ల మాత్రం ప్రతి చోటా ఇవి చాలా జాగ్రత్తగా భద్రపరుపబడుతున్నాయని, చక్కగా ప్రతిష్ఠితం చేయబడ్డాయని ఒప్పుకోక తప్పదు—ఒక్కచోట తప్ప—వాటి జన్మస్థలంలో తప్ప!

రెండేళ్లక్రితం నేను అమరావతిని రెండవసారి సందర్శించినప్పుడు అక్కడ మిగిలిన కొద్ది పాలరాతి శిల్పఫలకాలను ఒక పాత కొట్టంలో గుట్టగా పోసి వుంచటం చూశాను. వీట్లలో ఏ ఒక్క చిన్నరాతి ముక్కైనా సరే, దాని అందం దాని చందం చూస్తే ఒక్కొక్కటీ ఒక్కొక్క రాజమందిరం కట్టి దాచివుంచటానికి అర్హతే!

అమరావతిలోని శిల్పం అంతా యెక్కువగా రిలీఫ్ శిల్పం. అంటే రాతిపలకమీద ఉబ్బెత్తుగా చెక్కిన చిత్రాలు తప్ప పూర్వ విగ్రహరూపంలో వున్నవి తక్కువ. డాక్టరు కుమారస్వామి చెప్పినట్లు, "ఈ చిత్రాలు మంచి ఉధృతంతో, కదులుతూన్నట్లు చైతన్యంతో, ఒక్కొక్కప్పుడు భక్త్యావేశాన్ని రూపిస్తూ మరొకచో హాస్యజనకంగా వుంటూ, సర్వత్రా చికిలి మెరుంగు సగిషీపని మెరిపిస్తూ, అతిలాలసాయుతంగా వుంటాయి." చిత్రంలోని ప్రతి చిన్న అలంకరణ విశేషం కూడా అత్యాకర్షణీయంగా, నిరూపింపబడి, అలంకార చిత్రణంలో, విశిష్టాతి విశిష్టాలు కనిపిస్తాయి. నిజానికి అమరావతి శిల్పము ఆంధ్రుల ప్రతిభాసంపత్తినుండి ఉద్భవించిన మహోత్కృష్ట ఫలము.

"అమరావతి శిల్పాలు భారతీయ శిల్ప పరమావధిని సూచిస్తాయి." అంటూ సాధికారంగా ఫెర్గుసన్ పండితుడు అభిప్రాయం ఇచ్చాడు. హేవల్ యిల్లా అన్నాడు. "అమరావతిపాలరాళ్లపైని రమణీయమైన చెక్కడాలలో, జంతు జీవన సౌందర్యము, అత్యద్భుత సౌందర్యాన్నొలికించే పరిసరపు సగిషీపనితో మిళితమయి సుందరాతిసుందరంగా కనబడుతుంది. అమరావతి శిల్పాలలో మానవ రూపము, చిత్రవిచిత్ర భంగిమలలో, సజీవ చైతన్యాన్ని ప్రతిబింబిస్తూ, అత్యంత నైపుణ్యంతోనూ, అతిస్వతంత్ర ప్రజ్ఞతోనూ చెక్కబడింది" అనికూడా ఆయన అన్నాడు.

విస్తృత భావస్వాతంత్ర్యము, ప్రతి చిన్నరేఖా, వంపు, నిమ్నోన్నతాలన్నీ వేనోళ్ళ భావాన్ని చాటేప్రజ్ఞ, ఇవి ముఖ్యంగా అమరావతీ శిల్పంలోని అపూర్వ లక్షణాలు. అంత కన్నా ముఖ్యంగా గమనించ వలసింది, ఈ శిల్పం ఈ గడ్డపైన పుట్టిన దేశీయశిల్పం. అక్కడి ప్రజలోని అంతఃశక్తి వల్ల ఉత్పన్న మయింది. అంతర్వాణి పిలుపుకు జాగృతితమయి, ఒక ఆశయసిద్ధిలో హృదయార్పణ మొనర్చు కొన్నది. గాంధార, గ్రీకు రోమన్, శిల్పరీతులకు, ఇతః పూర్వం భారతీయ శిల్పాలపై ఏ మాత్రమో ప్రభావం ఉండి ఉన్నా, క్రీ. శ. ప్రారంభ కాలంనాటికి కృష్ణాతీరాన్న



సలగిరి గర్వభంగము - సలగిరియను ఏనుగకు
మత్తెక్కుట, మత్తుదిగిన సలగిరి బుద్ధదేవుని
శరణుజొచ్చుట అను రెండు వృశ్యములు
యిందు చెక్కబడిసవి. అమరావతి.

ఈ శిల్పకళ ఉద్భవించేనాటికి వాట్లప్రభావం చాలాసన్నగించి పోయింది. "అమరావతీ శిల్పాలు, బారహత్, ఎల్లోరా శిల్పాలలాగే నిజానికి భారత 'దేశీయ' శిల్ప శైలులుగానే గోచరిస్తాయు. మౌర్యశిల్పం, పూర్వ సాంప్రదాయ విధానాలు చెడ గొట్టుకోకుండా తెచ్చుకోడానికి తడుము లాడిన కాలా న్ననుసరించి వచ్చినవిగను కొంత మౌర్య శిల్పానికి అనుయాయి లవటం కూడా కల్గింది. కొన్ని కథావస్తువులు, శిల్పాలంకార విశేషాలు, వాయవ్య దిశదైన గాంధార శిల్పాన్నించి సన్నగా జాలువారిదిగిరానే వచ్చాయి. కాని ఈ దేశీయ శిల్పంవాట్లను తసలోఅంతర్భాగాలుగా జీర్ణింప చేసుకొంది" అని డాక్టర్ మార్షల్ చెప్పిస మాట చాల నిజమైస మాట.

నేను, ఇతరుల సుంచి ఎరువు తెచ్చుకొని, జీర్ణం చేసుకొన్న విషయం చెప్పకోటానికి సిగ్గు పడేరకం మనిషిని కాక పోయినా, అమరావతిలోని బుద్ధుని విగ్రహం శైలిలో, బాహ్య శిల్పవిధాన ప్రభావాలు స్వల్పాతి స్వల్పమని, పురావస్తు పరిశోధక శ్రేష్ఠులే అభిప్రాయం వెలుపర్చారు "బ్రిటీష్ మ్యూజియమ్‌లో అమరావతి శిల్పాలు" అన్న గ్రంథంలో మి॥ డగ్లస్ బారట్ ఇల్లావ్రాశాడు. "అమరావతి విగ్రహాలు, మధ్యకాలపువుగాని చివరి కాలపువుగాని చూసు కొంటే, మధురవాట్లతో పోలిసవి బహుస్వల్పంగా ఉంటాయి....నిజానికి అమరావతి విగ్రహాలలోనే ఎక్కువ సహజత్వం ఉట్టిపడు తూంటుంది. ఉత్తరాది, విగ్రహాలకన్నా వీనిలో అలౌకిక విగ్రహదేవత్వము చాలా తక్కువ. నిజానికి తలపై ముంగురులు, ఉష్ణీషము, ప్రభాచక్రం, ఇవి ఈ శిల్ప మధ్యకాలంలో అతిగా చెక్కబడిన సన్యాసుల విగ్రహాలకు అమర్చిచూసుకో గలిగితే, అమరావతి బుద్ధుని స్వరూపం ఇట్లే గోచరిస్తుంది. ఈ భిక్షుకులకు బోడి తలలున్నాయి. భుజాలు రెంటిని కప్పిన కాషాయాంబరం అతి సహజంగా జీరాడుతుంట."

"అమరావతిలో బుద్ధుని విగ్రహము బ్రహ్మ పదార్థ ధ్యాసరతుడయిన వేదాంతి స్వరూపాన్నికాక, తక్కిన భారతీయ మతాలలో మాదిరిగానే, భక్తితత్పరుడయిన సామాన్య సన్యాసి రూపాన్నివెలువరుస్తుంది" అని కూడా బారిట్ అంటాడు. ఒక వేళ ఆంధ్ర శిల్పి, మధుర నుంచి బుద్ధుని రూపకల్పస భావాన్నేకాక కొంత చిత్రశైలిని కూడా స్వీకరించాడని మనం ఒప్పుకొన్నా, తన సృష్టిలో, ఆంధ్ర జీవితాన్ని ఆంధ్ర చైతన్యాన్ని పరిసరాలను ప్రకోపింపచేసి అన్నిటినీ జీర్ణింప జేసుకొన్న సూత్న శిల్పసృష్టి ఒనర్చాడని నేను అంటాను.

కొన్ని అమరావతి శిల్పాలు ద్రష్టలో గాఢమైన భావ చైతన్యం కల్గిస్తాయి. స్వవిషయమే చెప్పకో వలసివస్తే, మద్రాసు మ్యూజియమ్‌లో భద్రపరుపబడిన, నలుగురు భక్తురాండ్ర శిల్పం నన్నెంతో ఉత్తేజిత పరిచి, నాహృదయాంతరాలను కదిలించివేస్తుంది. ఎంత సూక్ష్మంగా ఎంత సూటిగా, భగవంతుని పాదాలపై ప్రణమిల్లుతున్న అభక్తురాండ్రు తమసర్వస్వము భగవదర్పితం చేసి కొంటూన్న భావం స్ఫురింప చేస్తుంది.

మద్రాసు మ్యూజియమ్‌లోని మరొక అమరావతి శిల్పం చిత్రంలోని అద్భుతఘటనా విశేషంచేత సన్నాకర్షిస్తుంటూంది. ఆ చిత్రంలో, మదగజం "నలగిరి"ని బుద్ధుడు లొంగదీయటం చిత్రించబడింది. కరుణాసముద్రుడయిన ఆ ప్రభువు ప్రోల ఆ ఏనుగులో కల్గిన అద్భుత పరివర్తనాన్ని ఆ శిల్పఖండం అత్యద్భుతంగా చాటిచెపుతూంటుంది. బుద్ధుని వ్యక్తి గాంభీర్యత, కరుణాప్రసారాలు, ఆ చిత్రంలో కన్నులకట్టినట్లు ఉట్టిపడుతూ వుంటాయి. దేవదత్తునిచే ప్రేరేపితులయిస మావటీళ్లు మదగజాన్ని విచ్చలవిడిగా వదలగానే, రాజవీధులవెంట మదగజం ఘీంకరిస్తూ వస్తూంటే యెవరికివారు భ్రాంతులై చెల్లాచెదరై పారిపోతూంటారు. ప్రభువుపై పడటానికి గజం పరుగెత్తివస్తుంటుంది. అంతవరకూ చూస్తూంటే వెన్ను జలదరిస్తుంది. దేవదత్తుని కుతంత్రం పారినట్లే, సఫలమయినట్లే, భయం కల్గుతుంది. కాని, నలగిరి, తథాగతుణ్ణి సమీపించి, మెత్తపడి, పశ్చాత్తాపంతో, తబ్బిబ్బులాడుతూ, చివరిక మేకపిల్లలా సాధువై పోయి ఆయన పాదాలకు మోకరిల్లి ప్రణామం చేస్తూంటే ఓహో ఏమి దృశ్యం! ఈ హఠాన్మాత్రపరిణామానికి దేవదత్తులో ఏ భావాలు కలిగి వుండాలి? చిత్రంలో అది చూపింపబడకపోయినా, ఏ రాజప్రాసాద అంతర్భాగంనుంచో ఇదంతా కనిపెట్టుకున్న అతని మొగం అందులో వరుసగా కల్గేవికారాలు, ఏనుగును వపలుతూంటే, ఆశ, ఆనందం, ఆవేశం, ఇంతలో నైరాశ్యం, అశక్త దౌర్జన్యం, ఇన్నీ మన కళ్ళముందర తేలికగానే కనబడతాయి.

ఆంధ్రలో తక్కిన బౌద్ధకళాక్షేత్రాల విషయానికి మరలే లోపుగా, అమరావతి పాలరాతి శిల్పాల విషయం మరికొన్ని మాటలు నివేదించుకొనేందుకు అనుమతి వేడుతున్నాను. అమరావతి శిల్పాలు మొదట్లో పల్చని సున్నపు పూత, పైరంగులు వేయబడి రంగురంగులుగా ఉండి ఉండేవి అని సర్వసామాన్యాభిప్రాయం ఒకటుంది. అదే నిజమయిఉంటే ఈ పాలరాతి చెక్కడపు చిత్రాలు కూడా, అజంతా, బాగ్‌లలోని త్రివర్ణ చిత్రాలతో తులతూగుతా ఉండి ఉండేవే అని మనం నమ్మకంగా చెప్పకో వచ్చును. "అమరావతిలోని చిత్రకళావైదగ్ధ్యం, విస్తృత

సంపదలకు, ప్రపంచంలో ఎక్కడైనా ఏమాత్రమైనా పోలిక అంటూ ఉంటే, మళ్ళీ అజంతా, బాగ్ చిత్రాలలోమాత్రమే కనబడుతుంది" అని డాక్టరు బర్గెస్ అన్నాడు. అమరావతి స్తూపగోళం కట్టిన పాలరాళ్ళూ, చుట్టూ ఉత్సవమార్గ ప్రాకారమూ, వాటి నావరించియున్న అలంకరణచిత్రాలూ సరిగ్గా అర్థంచేసుకోటానికి అజంతా, ఫ్రెస్కో చిత్రాలతో కూడా కలుపుకొని సమన్వయపరుచుకొని పరీక్షచేసు కొంటేనేగాని వాట్ల విశిష్టతలే గోచరించవు. అజంతా చిత్ర కారులూ, అమరావతీ శిల్పులూ, చిత్రలేఖనం శిల్పం అన్న రెండు విడి కళలలో ప్రతిభ ప్రదర్శించిన ఒకే ఒక శిల్పులేమో అన్న నా ఊహ తొందరపాటైతే మన్నించ గోర్తాను.

నాగార్జునకొండ, లేక శ్రీపర్వతం, (పూర్వపుపేరు) పాల రాతి చెక్కడాలుకూడా ఇంతటి విశిష్టత కలవే. ఈ శ్రీపర్వతం నీడలో పూర్వం విజయపురి అన్న చిన్న పట్టణం ఇక్ష్వాకువంశీయుల రాజధానిగ వెలసిల్లింది. శాత వాహనుల తర్వాత ఇక్ష్వాకులు వేంగీసామ్రాజ్యం పాలించిన నాడు చుట్టూ మూడు పచ్చపచ్చని పర్వతాలు, ఒకవైపు కృష్ణాతరంగిణీ, కలిగి బహురమణీయంగా ఉండే ఈ శ్రీపర్వతపుకోన మహాయాన బౌద్ధమత స్థావరంగా ఉంటూ అమరావతి తర్వాత అమరావతి అంతటి మహోత్కృష్ట బౌద్ధ విద్యాకేంద్రంగా ఉండేవి. ఇక్ష్వాకు పరిపాలనలు చేసిన రాజులు ఎక్కువగా హిందువులే అయినా, వాళ్ళ రాణులు ఎక్కువగా బౌద్ధాన్ని అభిమానించేవారు. నాగార్జున కొండలో దొరికిన శిలాశాసనాలను పరికిస్తే బౌద్ధాన్ని అభి మానించిన మహారాణి, ప్రప్రథమురాలు, ఛాంతిశ్రీ అని తెలుస్తుంది. రెండవ రాణి అడవి ఛాంతిశ్రీ. మనకు తెలి సిన మూడవ మహారాణి బౌద్ధాన్నభిమానించిన ఆమె పేరు భులచ్ఛాంతిశ్రీ. ఇక్ష్వాకులకు సంబంధీకురాలు కాక పోయినా, ఉపాసిక బోధిశ్రీకూడా కాషాయవస్త్రాలు ధరిం చిన మహాధనికురాలనీ రాణివాసపువారికన్న మిన్నఅయిన స్థితిలోనే ఉండేదని నేననుకొంటాను. ఆమె పుట్టుపూర్వోత్త రాల విషయం చాలా సందేహాలున్నాయి. ఆమె సింహళం లోని గోవాగ్రామంలో పుట్టిందని మహావంశంలో పేర్కొన బడింది. కాని ఈమె ఆంధ్రదేశంలో నాగార్జునకొండవద్దనే కాక తదితర ప్రదేశాల బౌద్ధారామాలకుకూడా అతి విరా ళంగా దానాలు ధర్మాలు చేసిందని చెప్పటానికి సందేహం లేదు. శ్రీ కె. గోపాలాచారిగారు వ్రాసిన ఆంధ్రుల ప్రాచీన చరిత్రప్రకారం "బోధిసిరి విజయపురివద్ద రెండు చైత్య గ్రామాలు కట్టించటానికి సహాయపడింది. (ఒకటి, విహారం పక్కనున్న దిగువ ధమ్మగిరివద్దనున్నది. సింహళ స్థవిరాది పతులకు చెందినట్లుగానే కట్టబడింది రెండవది, కులహ విహారంవద్ద కట్టించింది.) సింహలవిహారంలో బోధివృక్షానికి ప్రాకారం కట్టించింది. ధమ్మగిరిలో ఒక గది కట్టించింది. మహావిహారంలో మంటపస్తంభం కట్టించింది. దేవగిరిలో ప్రార్థనమందిరం కట్టించింది. పూనాసియల్‌లో చెరువూ చుట్టూవసారా, మంటపమూ కట్టించింది. కంటకశిలలో మహాచైత్యానికి ప్రాగ్ద్వారంవద్ద రాతిమంటపం కట్టించింది. హిరుణాథువలో మూడు ఆరామగదులు, పాపిలవద్ద ఏడు గదులు, విహురవద్ద రాతిమంటపం కట్టించింది." బోధిసిరి వితరణం చవిచూసిన ఈ పేళ్ళున్న గ్రామాలు స్థలాలు ఏవేవో అని ఇప్పుడు మనం ఆశ్చర్యపడనవసరంలేదు. బౌద్ధధర్మంపట్ల ఈ మహాస్త్రీలకు ఇంతటి భక్తిప్రవర్తు లుండేవని, హృదయపూర్వకంగా తమధనకనక వస్తు సర్వ స్వాలను, విజయపురివద్ద అసంఖ్యాకులైన చైత్యాలు స్తూపాలు, విహారాలు నిర్మించటానికి వెచ్చించారనీ తెలిస్తేచాలు.

ఇక్ష్వాకుల రాజధాని అయిన ఈ విజయపురి మహా వైభవంతో వెలిగిపోయి ఉండాలి. సుదూరదేశాలనుంచి, వర్తకవ్యాపారాలకు కేవలం వణిజులేకాకుండా, బౌద్ధధర్మ జిజ్ఞాసులు, విద్యార్థులు, గురువులుకూడా ఎంతోమంది ఇక్కడకి వచ్చేవారు. విజయపురి ప్రపంచ ప్రఖ్యాత విజ్ఞానకేంద్రంగా ఇక్ష్వాకుల పూర్వకాలంలోనే పేరు గడించు కొనే ఉండిఉండాలి. మధ్యమార్గదర్శకుడై "మాధ్యమిక" సిద్ధాంతాన్ని బౌద్ధంలో ప్రవేశపెట్టిన నాగార్జునాచార్యుడు, మహావేదాంతి, తన చివరిరోజుల్లో చాలాకాలం శ్రీ పర్వతం వద్దనే గడిపాడని టిబెటన్ చరిత్రలున్నాయి. కాని విజయ పురిచరిత్రపట్ల సమ్మోహితుడనై ముఖ్యవిషయమైన ఆంధ్ర బౌద్ధశిల్పవిషయాలను వదిలి శాఖాచంక్రమణం చేయుట నాకు తగదు.

అయితే అమరావతి పాలరాతి శిల్పాలలాగా, నాగార్జున కొండశిల్పాలు అంత విస్తృతంగా తరలింపబడిపోలేదు. కాదంటే ఏ నాలుగో అయిదో పారిస్‌లో మ్యూజీగమెట్‌లో భద్రపరుపబడి, ఆంధ్రుల బౌద్ధశిల్పప్రతిభను జగమంత టికీ చాటుతున్నాయి. నాగార్జునకొండ శిల్పాలన్నిటినీ తవ్వి వేయటంకూడా పూర్తికాలేదని చెప్పటం ఇక్కడ నేను విస్మరించరాదు. ఇంకా తవ్వితే ఇంకా ఎన్నో పురాతన శిల్పాలు, శిధిలాలు, వస్తువిశేషాలు గృహాలు అక్కడ బైలుపడే అవకాశం చాలాఉంది. ఈతవ్వడపు పనికూడా జరుగుతోంది కాని, పురాతత్వపరిశోధన బుద్ధితోకాక, నాగా ర్జున సాగరనిర్మాణార్థమై జరుగుతోందని చెప్పటానికి విచా రిస్తున్నాను. ఈ ప్రదేశం అంతా నాగార్జున సాగరం

అడుగున మునిగిపోతుంది. ఒక పవిత్రచారిత్రక పూర్వ వైభవచిహ్నశిథిలం ఇల్లానకీనమైన జలప్రణాళికలో జలాంతర్గతమైపోతుందన్నందుకుకూడా, నామటుకు నేను పెద్దగా ఆక్రోశించను. కారణం ఈ మహానాగార్జున సాగరం, కోటానుకోట్ల ఎకరాల భూమిని పండించి కాటకంతో కుములిపోతూన్న దేశాన్ని సుభిక్ష మొనరింపబోతోంది. ఆ మహా బౌద్ధాచార్యులూకూడా, విశాలహృదయంతో ఈ ప్రణాళికను దీవిస్తాడనే నేను తప్పక నమ్ముతున్నాను.

నాగార్జునాచార్యుని కాలంలోనూ తర్వాత కొన్ని శతాబ్దాల వరకూకూడా, విజయపురి ప్రపంచ విద్యార్థుల విద్యాదాహాని తీర్చే, విశ్వవిద్యాలయంగా నిలచింది. "కాశ్మీర, గాంధార, చీన, చిలాట, తోసలి, అపరంత, వంగ, వారణాసి, యవన, పాలూర, దమిళ, తంబపణ్ణి" దేశాలనుంచి విద్యార్థులు తండోపతండాలుగా వేదాంత విద్య నేర్చుకోటానికై వచ్చేవారు. ఇకమీద, పూర్వవైభవానికి ఛాయామాత్రంగా నిలవటంకాక, దాహంతో తపిస్తున్న పరిసర క్షేత్రాలన్నిటికి జలం అందించే జలనిధిగా నిలచి అనేక గృహాలకు ఆనందం చేకూర్చిపెటుతుంది. ఈ గృహాలు ఇప్పుడు దారిద్రంతో అంధమయమయి నాగరిక జీవన సౌకర్యాలు లేక కుమిలిపోతున్నాయి. నాగార్జునాచార్యుడు జీవితధర్మసందేశాన్ని ఇచ్చాడుగాని శ్మశానవైరాగ్యం బోధించినవాడుకాడు. మానవ మస్తిష్కాలలోని చీకటి గుహల్లోకి వెలుగును ప్రసరింపచేసి, అజ్ఞానాన్ని, వేదనని పారద్రోలటమే అతని ఆశయము. కాబట్టి, దుర్భరదారిద్ర్యమూ కోరుకొన్నదికాక నెత్తిపై రుద్దిన దారిద్ర్యము, జీవితాలను చేరపట్టిస్తుందనీ, సామాన్య జీవితవిజ్ఞానాన్నే అందచేయలేనప్పుడు ఇక ఆత్మవికాసాన్ని అసలు అందచేయలేదని చెప్పేవారిలో నాగార్జునాచార్యుడే ముందు ఉండి తీరుతాడు. అందుకని తప్పకుండా, ఈ కోన, సాగరంగామారి, జీవనదాత్రగా మారుతుందంటే, అతని ప్రబోధానికి సాంప్రదాయానికీ అనుగుణంగాఉన్న మహత్కార్యమే అని అతని ఆత్మ సంతోషించి తీరుతుందనీ ఏమాత్రం విచారించదనీ నేను భావిస్తున్నాను.

బుద్ధదేవుడు కపిలవస్తునకు తిరిగి వచ్చుట. అమరావతి





ఇంతటితో ఈ విషయం వదిలేద్దాం. కాక నేను చెప్ప వలసిందేమిటంటే నాగార్జునకొండ త్రవ్వకంలో బైలుపడిన శిల్పవిశేషాలును, ఎక్కడో ఒకచోట జాతీయనంపదగా మాత్రం భద్రపరుపబడతాయని :

ఈ మధ్య భారతప్రభుత్వం పంపిన ఒక కమిటీవారు, శ్రీ పర్వతశిఖరమే యిల్లాంటి మందిరానికి బాగుంటుందని నిర్ణయించినట్లు వార్త తెలుస్తోంది. నాగార్జున కొండ అడుగునా ప్రక్కలా అంతటా ఏర్పడబోయే నాగార్జునసాగరంలో మునిగిపోయినా, పర్వతాగ్రం మాత్రం నీటిమట్టానికి చాలా పైనే వుంటుందట. నాకుకూడా ఈ అభిప్రాయం బాగుంది. ఇల్లాగే చేస్తారని ఆశిస్తున్నాను. కాక ఒకవేళ ఇతర అడ్డంకులు వేటివల్లనైనా ఇది వీలుగాకపోతే, మరో కొత్త స్థలం నిర్దేశించినా ఫరవాలేదు. ఎందుకంటే అదే మళ్ళి ఇంకొక నాగార్జున కొండగానే వెలుస్తుంది. కారణం నాగార్జునుని కీర్తిప్రతిష్టలు, ధర్మనందేశము, అంతగా అక్కడి శిథిలాల ప్రతి చిన్న రాతిముక్కలోనూ, చెక్కడం విశేషంలోనూ అలుముకొని పోయివున్నాయి.

నేను క్రిందటిసారి అక్కడికి వెళ్ళినప్పుడు, నాగార్జున కొండ శిల్పాలలోని ఒక చిత్రం నన్ను యెంత గాఢంగా ఆకర్షించిందంటారు! ఆ చిత్రంలో కపిలవస్తు రాజమందిరంలో దుఃఖతరంగం పొర్లుతూన్న దృశ్యం కనబడుతుంది. రాకుమారుడు సిద్ధార్థుడు అన్వేషియై మహాభి నిష్క్రమణ మొనర్చాడు. సారధియైన ఛన్నుడీవార్తను మందిరంలో వినిపించాడు—శుద్ధోదన మహారాజు క్రుంగిపోయి తల వాల్చుకొని సింహాసనంపై దాదాపు మూర్ఛపోయిన స్థితిలో ఉన్నాడు. ఛన్నుడు శోకమూర్తియై అతని పాదాలవద్ద మోకరిల్లి ఉన్నాడు. రాజపరిచారకులు మొగాలు విషాదార్తులై వివిధభావాల ప్రతిబింబిస్తూ అతి నిపుణంగ చెక్కబడ్డాయి. అన్నిటినీ మించిన చిత్రవిశేషం రాజకుమారుని దిగవిడిచి వచ్చిన అశ్వరాజం కంటకము కంట నీరెట్టి వాపోతుంటుంది. ఒక నిముషమాత్రంసేపు, ఆ రాయి రాయే కన్నీటితో కరిగిపోతుందా అన్న విభ్రమావస్థలో పడిపోయాను నేను. నాగార్జునకొండ శిల్ప ప్రభావం అంతటిది. కంటకం వస్తునమీకరణ మాత్రంకాని చిత్ర విశేష నంపద, బుడిబుడి శోకాల్నిగాక గాఢ వేదనను ప్రేరేపించే సుమనస్కత, చేతిశాస్త్రపు చిలుక పలుకులుకాక, జీవితార్థ ప్రబోధ కలిగి ఈ శిల్పం అతి విశిష్టశ్రేణికి చెందుతుంది. అక్కడ మిగిలిన చిన్నరాతి బొమ్మ ముక్కకూడా ఉత్తేజిత శక్తి గలదని, చేతివ్రేళ్ళు మాత్రమే మిగిలిన ఒక రాతి బొమ్మ ముక్కను చూసి నేను గ్రహించాను. అది చూడగానే బుద్ధవిగ్రహంలోని భద్రఖండం అని నాకనిపించింది. ధర్మచక్రాన్ని సాగించిన ఆ చేతివ్రేళ్ల మార్దవము చక్కదనము, శక్తి, చైతన్యాలను, గుర్తింపలేని వాళ్ళెవరుంటారు?

అమరావతి నాగార్జునకొండ శిల్పాలు, ఆంధ్రదేశంలో బౌద్ధశిల్పానికి రెండు మహోన్నత శిఖరాలవటంచేతనే ఇంత విరివిగా వాట్లనుగురించి చెప్పకొచ్చాను. ఇంతకన్న తక్కువ ప్రాముఖ్యంగలవైన, గోలీ, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, ఘంటసాల, గుంటుపల్లి, గరికిపాడు, శాలిహుండం, రామతీర్థం ఇత్యాది స్థలాలలోని శిథిలాలు కూడా వీటి పద్ధతిని అవి కొన్ని ప్రత్యేకతలు కలవే. వీట్లలో కొన్ని స్తూపాలు నాగార్జునకొండ, అమరావతిలకన్న కూడా ప్రాచీనమైనవే. కాని విదేశప్రభుత్వోద్యోగుల కళాధ్వంసక స్వభావాలవల్లనూ, స్వార్థపరత్వాల వల్లనూ ఈ చోటులలో యెక్కువగా శిల్పవిశేషాలు మిగలలేదు. కాని మిగిలిన కొద్ది రాళ్ల మీది చిత్రాలు కొన్నికూడా, అమరావతి-నాగార్జున కొండ శిల్ప స్వర్ణయుగానికి ప్రాతిపదికలుగానే స్ఫురిస్తాయి. జగ్గయ్యపేటలో పూర్తి శిథిలావస్థలో వున్న స్తూప కుడ్య చిత్రశకలాలుకూడా, సౌందర్యఖనులుగానే వుంటాయి. ఈమధ్య నేనీ ప్రదేశానికి వెళ్లాను. బొమ్మలన్నీ ముక్కలు ముక్కలై వున్నాయి. మిగిలిన ఒక్క బుద్ధవిగ్రహమూ మద్రాస్ మ్యూజియమ్‌లో వుంది. ఇది నిజంగా ప్రత్యేక విశేషమే. కేవలం పాడయిపోకుండా మిగిలిందనేకాదు. తక్కిన శిల్పరీతులకు ఈ విగ్రహ శిల్పానికి కాలంలోనూ, శైలిలోనూకూడా చాలా అంతరం కనబడుతుంది. విగ్రహం దిగువ పద్మంలో ఒక శాసనం చెక్కివుంది. ఈ అక్షరాలు ఆరవశతాబ్దంనాటి అక్షరాలు. శాసనం సారాంశం : యీ విగ్రహం, నాగార్జునాచార్యుని శిష్యుడైన జయప్రభాచార్యుల ఆధ్వర్యంలో నిర్మింపబడిందని. అమరావతి స్తూప ప్రథమ దశాకాలం క్రీ. పూ. 200 నాటికి వెళ్తుంది. తక్కిన శిల్పాలుకూడా ఆ కాలానికే చెందుతాయి. ఇది చాలా తర్వాత కాలంనాటిదని నిర్ణయింపబడింది.

జగ్గయ్యపేట పాలరాతి శిల్పాలలోకల్లా అతి ముఖ్యమైనది, ఒక చక్రవర్తిని చూపించే చెక్కడపు చిత్రం. చక్రవర్తిచుట్టూ, రాణి, యువరాజు, మంత్రి, పట్టపు టేనుగు, గుఱ్ఱము, చక్రము, అన్న సప్తరత్నాలూ చెక్కబడి ఉంటాయి. ఈ లాంఛనాలు ఇతన్ని మహారాజాధిరాజుగా చక్రవర్తిగా ప్రకటిస్తాయి. ఈ బొమ్మలో గమనించదగ్గ విషయాలు ; చక్రవర్తిమీద నలుచదరపు నాణాలు ఆకాశం నుంచి జల్లబడుతుంటాయి. మానవుల అలంకారాలు. వాళ్ళ సుదీర్ఘస్వరూపాలూగూడా, మరుగుజ్జు రూపాలు చెక్కే గాంధారశిల్పరీతికి చాలా వ్యత్యాసంగా ఉంటాయి.



సప్తాలంకార సమన్వితుడగు చక్రవర్తి—నాణెములు వర్షముగా అతనిపై కురియుచుండుట పైభాగమున కననగును. జగ్గయ్యపేట

ఈ మార్పే మానవస్వరూపాన్ని అమరావతి శిల్పాలలో అతి అందమైన దేహాంగాలతో తేర్చి దిద్దేందుకు మూలక మయిందనవచ్చు. జగ్గయ్యపేటలో దొరికిన మరొక శిథిల విశేషం పుణ్యశాల. ఒక రెండతస్తుల ఆరామస్వరూపం చెక్కబడిఉంది.

గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకాలోని భట్టిప్రోలు గ్రామం నా చిన్ననాడెప్పుడో చూచాను. అందుచేత అక్కడి స్తూపవిషయాలు నాకంతగా జ్ఞాపకంలేవు కాని కృష్ణాజిల్లా పురావస్తుపరిశోధన సాగించిన అలెగ్జాండరురీగారి వాక్యాలు ఉటంకిస్తాను. "1820 నాటికి భట్టిప్రోలు స్తూపం ఇటుకలు, పాలరాళ్ళు అన్నీకూడా కొల్లగొట్టేశారు. ఇటుకలు పెద్ద సైజున చాలా మంచివై ఉండటంచేత రోడ్ల నిర్మాణంకు వినియోగించారు. పాలరాళ్ళు కృష్ణకాల్వకు లాకులు కట్టూ అందులో వాడుకొన్నారు. అయితే ఈ రాళ్ళమీద ఏమన్నా చెక్కడాలుండేవా అని కొంత సందేహం లేక పోలేదు. రీకన్నా, భట్టిప్రోలు ముందు సందర్శించిన రాబర్టు సూవెల్ వీట్లమీద చెక్కడాలున్నాయనే అభిప్రాయపడ్డాడు. 1878 లో మద్రాసు ప్రభుత్వానికి పంపిన నివేదికలో ఈయన ఇల్లా తెల్పాడు. "అవి నిజంగా చెక్కడాలున్నరాళ్ళే అన్నవిషయం వెల్లటూరు లాకుగోడల లోను నేలచప్టాకు విరివిగావాడిన ఆ పాలరాళ్ళను బట్టీ తెలుస్తుంది. కొన్నిటిమీద అమరావతి పద్ధతిలో బొమ్మలు చెక్కినట్లున్నాయి. కాని అంత అందపు చెక్కడాలు కావు." నేనుకూడా ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తాను. గుంటూరు జిల్లాలో పల్నాడులో దొరికే పాలరాయినే ఈ స్తూపాలలో విరివిగా వాడారు. ఈ రాయి సహజంగా అందంగాని నునుపుగాని, వర్ణవైవిధ్యంగాని కలదికాదు. బండగా మొద్దుగా, ఉంటుంది. ఈనాడు సిమెంటు పరిశ్రమలో దీన్ని వాడుతున్నారు. ఇల్లాంటి బండరాయిలో జీవంపోసి, సుందరాతి సుందరంగా మలచి, ప్రజాబాహుళ్యానికి అమరసందేశం అందించిన ఆంధ్రశిల్పుల హస్త కౌశలమెంతదో! ఇంత బండరాయి కనకనే, శిల్పవిశేషానికి తప్ప, శిల్పిచేతిలో మలచబడి బొమ్మ చెక్కబడిఉంటే తప్ప, ఈ పల్నాటిరాతిని, భట్టిప్రోలులోగాని తదితర స్తూపాలలోగాని స్తూపనిర్మాణంలో వాడివుండరనీ, అథమం, ఏస్వల్ప శిల్పవిశేషమో, పద్మమో, ధర్మచక్రమో, పడగ విప్పిన పామో, బోధి లేక శ్రీపాదవృక్షమో లేకుండా ఉండి ఉండదని నా నమ్మకం. ఏదైతేనేం, భట్టిప్రోలులో స్తూపం ఘంటసాల నాగార్జునకొండలవాటి మాదిరిగాకాక గట్టి ఇటికరాళ్ళతో కట్టబడినదైనప్పటికీ, ఈనాడు పూర్తిగా అందుబాటులేకుండా శిథిలమయిపోయింది.

గుడివాడ బౌద్ధస్తూపానికికూడా సరిగ్గా ఇదే గతి పట్టినట్టు తోస్తుంది. "బెజవాడ బందరు మధ్య రాజబాట వెయ్యటానికి 1840 లో ఒక ఇటుకలగుట్ట నేలమట్టమొనర్చబడింది" ఈ కళాధ్వంసకత్వాన్ని నిందిస్తూ రీ యిల్లా వ్రాశాడు. "ఈ కట్టడాలన్నీకూడా, రోడ్లు వెయ్యటానికి తదితర నిత్యనిర్మాణాలకోసమని ధ్వంసం చెయ్యబడటం బహుశోచనీయం. ఒక ప్రాచీన నాగరికతకు మహోత్కృష్ట చిహ్నాలైనప్పటికీకూడా వాటి ప్రాచీనత వాటిని రక్షించలేక పోయింది. ఈ పరిస్థితులలో ధ్వంసకుల చేతిలో పడక మిగిలిన శిథిలాలనే పోగుచేసుకొని కూర్చుకొన ప్రయత్నించ వలసివచ్చింది. చాలా చోట్ల వట్టిగుట్టల్లా కనబడుతున్న ఈ శిథిలాలనుంచే అనాటి బౌద్ధశిల్పం వైదగ్ధ్యాన్ని మించిన రీతులు, ఆతర్వాతకాలంలో ఎప్పుడూకూడా భారతదేశ శిల్పచరిత్రలోనే కనబడలేదని తెలుసుకోగలిగాము. తర్వాత వచ్చిన ద్రవిడ దేవాలయ శిల్పాలలోపలె కాక, బౌద్ధ ఆలయాలు మహోన్నత శిల్పపు చెక్కడాలు కలిగి ఉండటమేకాక ఆ ఆలయనిర్మాణమే మహోత్కృష్ట శిల్ప సూత్రాలపై నిర్మితమై ఉండేది."

ఇక్కడ ఇంతగా రీగారినుంచి ఉటంకించటానికి ఒక్కటే కారణం ఉంది. "దాక్షిణాత్య బౌద్ధశిల్పాలు - కృష్ణాజిల్లాలోని భట్టిప్రోలు, ఘంటసాల, గుడివాడ, మొదలైన పురాతన స్తూపాలు" అన్నపేరుతో 1894 లో రీ ప్రచురించిన నివేదిక ఈనాడు ఎక్కడా దొరికేటట్టులేదు. నాకుమాత్రం అదృష్టవశాత్తూ ఒక ప్రతి ఈ మధ్యనే పూనాలో లభించింది. ఇల్లాంటి ఉద్గ్రంథ భాగాలను విస్తృతంగా ఉటంకించాలన్న కుతూహలాన్ని అణుచుకోటం కొంత కష్టమైనా, ఈ కొద్దివిషయాలు మాత్రమే చెప్పి వదిలేస్తాను. భట్టిప్రోలువద్ద బౌద్ధపవిత్రాస్థికలున్న రెండు పాత్రలను రీ సంపాదించగలిగాడు. గుడివాడ దిబ్బనుంచి. ఒక గుట్ట ప్రశస్తమైన ప్రాచీన నాణాలు సంపాదించగలిగాడు. అక్కడ దొరికినవాట్లలో ఒక విచిత్రమైన నాణెంకూడా ఉంది. "ఒకటి గ్రీకుదో, రోమ్‌దో, తెడ్ల పడవ, పైతట్టు అర్ధచంద్రాకారంగా ఉండి రెండు తెరచాప కొయ్యలున్న పడవబొమ్మ ఉన్న నాణెం" దొరికింది. ఇల్లాంటివాట్లను త్రవ్వితీసి వెలువర్చిన రీగారు మన కృతజ్ఞతాభివందనముల కెంతయూ పాత్రుడు. ఘంటసాలలో పాలరాతిబొమ్మలను తవ్వితీసే అవకాశంకూడా వీరికి కల్గనందుకు విచారించవలసిందే. ఇది ఎట్లా జరిగిందోకూడా ముందు చెప్తాను.

భట్టిప్రోలు, గుడివాడలలో శిల్పవిశిష్టత లేమన్నా ఉండి ఉన్నాయా అన్నది సందేహాస్పదమైన విషయమే అయినా

ఘంటసాల విషయంలో ఈ అనుమానం అక్కరలేదు. ఘంటసాల, మచిలీపట్టణానికి పడమరగా పదహారు మైళ్ళ దూరంలో ఉన్న గ్రామం. కొద్ది ఏళ్ళక్రితం నేనీ ఊరు చూచినప్పుడు, స్తూపప్రాకారంలో రాళ్ళు ఇంకా కొన్ని నిలచి ఉన్నవి చూశాను. వాట్లమీద సునిశితంగా చెక్కిన ధర్మచక్ర చిత్రాలున్నాయి. ఘంటశాల అసలు పేరు కంటకశైలమని చెప్తారు. నిజానికి టోలెమి కూడా దీన్ని "కొంటొ కొస్సిల" అని పేర్కొన్నాడు. బుద్ధదేవుని అశ్వ రాజమైన "కంటకం" పేర ఇది కట్టబడిందని అనుకొంటున్నారు. ఈ కంటక చిత్రం ఉన్న కుడ్యశిల్ప భాగం, ఘంటసాల నుంచి తెచ్చినది మద్రాసు మ్యూజియమ్‌లో భద్రపరుపబడిఉంది. ఘంటసాల శిలలు మరికొన్ని పారిస్‌లో మ్యూజీగయ్‌మెట్‌లో ఉన్నాయి. 1954 లో నేను పారిస్ వెళ్ళి నప్పుడు ఈ శిథిలాలు చూశాను. ఒక పాలరాతి చెక్కడంలో మూడంతస్థుల మందిరమూ భక్తులూ చెక్కబడ్డారు. మరొక చెక్కడంలో పుత్రజనన వార్తవిని ఆనందపరవశుడైన శుద్ధోదనుడు చిత్రించబడ్డాడు. మూడవ దానిలో భార్యాపుత్రులను విడనాడి బైలు దేరటానికి నిశ్చయించు కొన్న సిద్ధార్థుని బొమ్మ చెక్కి ఉంది.

బ్రిటిష్ మ్యూజియమ్ ప్రాచ్యవస్తుశాఖ అసిస్టెంటు కీపర్ అయిన డగ్లస్ బారెట్‌గారి అభిప్రాయం ప్రకారం, ఘంటశాల శిల్పాలలో కల్లా ముఖ్యమైన చెక్కడం బోస్టన్‌లో ఉంది. ఆ రాతి పలకకు రెండు వైపులా చిత్రాలు చెక్కి ఉన్నాయి. "ఒక వైపున అమరావతి రాళ్ళలో మాదిరిదైన ఒక స్తూప సంపూర్ణ చిత్రం చెక్కబడి ఉంది. రెండవవైపు, నిరంజన నదీ తీరాన బుద్ధుని విగ్రహం చెక్కబడి ఉంది. ఎడమ మూలపైగా స్తంభం ముక్క కనబడుతుంది" రెండు వైపుల చెక్కబడి ఉండటమే ఈ శిల్పప్రాముఖ్యమా, నాకు తెలియదు. కాని ఘంటశాల వద్ద స్తూపం చాలా పెద్దదై ఉండటమే కాకుండా, ఆంధ్రలో కెల్లాచాలా ప్రముఖమైనదని కూడా నేను నమ్ముతున్నాను. ఘంటసాల శిల్పరీతులు అమరావతీ శిల్పరీతితో తులతూగుతూ ఉంటవి. ఘంటశాలలో దొరికిన బుద్ధవిగ్రహం శిరస్సు, కొన్ని విధాలలో చూస్తే అమరావతీ నాగార్జునకొండ విగ్రహాల కన్న చాలా శిల్పవిశిష్టత కలదని నా అభిప్రాయము. ఈ ముఖంలో ఎక్కువ ప్రశాంతత ఎక్కువ గాంభీర్యము ద్యోతకమౌతున్నాయి. పెదవుల చిరునవ్వు, రేయి తొలిజామున ఆకాశంలో మిలమిలలాడ్తూ నిశీథాన్ని మరింత రమణీయంగా తోపింప చేసే, నెలవంక రూపంలో ఉంటుంది.

ఘంటశాల శిల్పాలు మనకు శాశ్వతంగా కాకుండా పోవటం చాలా విషాదకరమైన విషయం. ఈ పల్లెలో 1890 లో పరిశోధన సాగించిన రీ, ముఖ్య స్తూపంపైననే తన దృష్టిని కేంద్రీకరించాడు. ఈ పాడుపడిన దిబ్బనే స్థానికులు "లంజదిబ్బ" అని పిలుస్తారు. ఒక్క ఘంటశాలలోనే కాదు; గుడివాడ, భట్టిప్రోలు, చిన్నగంజాం, పెద్దగంజాం, మరి కొన్ని స్థలాల్లో కూడా, ఈ శిథిల ప్రదేశాలను లంజ దిబ్బలనీ, బోగమాళ్ళ దిబ్బలనీ పలవటం శోచనీయమైన విషయమే. ఇల్లాపిలువబడనిది నాఎరుకలో ఒక్క అమరావతి స్తూపం మాత్రమే.

స్థానికంగా దానికి దీపాలదిబ్బ అని పేరుంది. కాని ఈ దీపాల నందర్భంకూడా గౌరవనీయంగా వచ్చినట్లు కనిపించదు. బౌద్ధస్థలాల దిబ్బ లెక్కడెక్కడున్నాయో అక్కడి దిబ్బమీది లంజె దీపంతో సంజ్ఞచేసేదని కథ చెప్పుకొంటారు. చివరిదశలో బౌద్ధ అనుయాయులు ఎంత హీనస్థితిలోకి దిగజారారో! వజ్రయాన సహజయాన కాలాలలో తాంత్రిక మతాలతో బౌద్ధం దిగజారుటచే ఈ పేరు వచ్చినదని అనుకోవచ్చు. లేదా హైందవమత తీవ్రవాదులు బౌద్ధారామాలను అణగద్రొక్కటంలో ఈ చెడ్డపేర్లు కల్పించైనా ఉండవచ్చును. నేను ఈ రెండవ అభిప్రాయాన్ని నమ్ముతున్నాను.

కాని అసలు విషయం వదిలి వెళ్తున్నట్లున్నాను. అంటే ఘంటసాలవద్ద, రీ త్రవ్వితీసిన పురావస్తువుల విషయం. ముఖ్యస్తూపంయొక్క వైశాల్యం అయన్నాకర్షించింది. అందులోనే ఎక్కువ పరిశోధనలు కావించాడు. అందులో పాలరాతి చెక్కడాలు దొరకలేదు. అస్థినిక్షేపపాత్ర స్తూప పునాదులుమాత్రం బైటపడ్డాయి. అసలిందులో పాలరాతి

జనులు-జంతువులూ. అమరావతి



శిబి జాతక కథ. అమరావతి



అమరావతి

శిల్పాలు ఉండిఉండకపోవచ్చును. నిజానికి ఘంటసాల శిల్పాలన్నీ, కోటదిబ్బలో ఉన్నాయి. రీ యిదికూడా ఉల్లేఖించే ఉంచాడు. ఇదేకాక పొలిమేర దిబ్బ అనే మూడవ దిబ్బకూడా అ ప్రక్కలనే ఉంది. కోట దిబ్బవిషయం రీ ఇల్లా వ్రాశాడు. "దక్షిణాన్న ఊరిపొలిమేర సమీపంలో ఒక చిన్న చెరువుగట్టునానుకొని ఒక చిన్న దిబ్బ ఉంది. ఇటునుంచి అటు 70 అడుగుల వ్యాసంఉండి దాదాపు గుండ్రంగా ఉంటుంది. ఇటుకరాతి పునాదిగోడలు అక్కడక్కడ కనబడతాయి. రబ్బేసంతటా అలుముకొని ఉంది. ఇదికూడా ఒక స్తూపశిథిలం అయిఉండవచ్చును.

రీగారు ఒక పెద్ద పరిశోధనచెయ్యగల అస్కారాన్ని ఇక్కడ చెయిజార్చుకొన్నారు. తర్వాత 1920 లో ఒక రైతు పొలందున్నుకొంటూ, ఈ కోటదిబ్బ అంచున దున్నుతూంటే దాదాపు 60 శిల్పశిలలు బైటపడ్డాయి. ప్రతిఒక్కటి శాక్యముని జీవితాన్నో జాతక కథలనో వర్ణించే చెక్కడపు పనితో నిండిఉంది. ఆ ఊరి పెద్దలు కొందరు నాకు చెప్పిన కథప్రకారం, కొన్నాళ్ళు ఈ రాతిఫలకాలు గుట్టగా ఒక చెట్టుక్రింద పడేసి ఉంచారట. పుదుచ్చేరినుంచి యం. జి. జోలియన్‌డూబ్రెయిల్‌గారి ఏజెంటు ఒకడు వచ్చి చూచి గప్‌చిప్‌గా ఈ రాళ్లమొత్తం అంతా 5000 రూపాయలకు కొనుక్కుపోయాడు. ఈ విధంగా ఘంటశాల శిల్పనిధులు శాశ్వతంగా మన చెయ్యిజారిపోయి పారిస్ మ్యూజీగుయ్‌మెట్ చేరాయి.

ఆంధ్రలో తక్కిన బౌద్ధస్థలాలను సందర్శించనందువల్ల వాట్లనుగురించి స్వంత అభిప్రాయాలను వెల్లడించలేను. అయితే ఈ మధ్యనే శాలిహుండంవద్ద మళ్ళీ త్రవ్వకపు పరిశోధనలు సాగిస్తున్నారని, వంశధార దక్షిణపు ఒడ్డున శ్రీకాకుళంలోకూడా పురాశిథిలపరిశోధనలు జరుగుతున్నాయని చెప్పవలసిఉంటుంది. ఇక్కడ కొన్ని ముఖ్యమైన వస్తువులు దొరికాయని కొత్తకొత్త విషయాలు వెలుగులోకి వస్తున్నాయనికూడా తెలిసింది. అనేక స్థలాలలో మట్టి దిబ్బల అడుగున మాటుపడిపోయి ఆంధ్రలో కాషాయ వస్త్రం కలాదేయమై వెలసిననాటి శిల్పవిశేషాలు శిథిల వస్తువులు మగ్గిపోయి ఉన్నాయనే, నేను విశ్వసిస్తున్నాను.

నేను జన్మచేగాని, సిద్ధాంత స్వీకృతివల్లగాని బౌద్ధుడను కాను. కాని ఆంధ్రంలోని బౌద్ధశిల్పకళావిశేషాన్ని చూచి, దేశకాలపాత్రాలకు చివరికి ఆ మతానికికూడా సంకుచితం కాని, నైసర్గిక భారతీయశిల్పకళావిశేషానికి, వైదగ్ధ్యానికి గర్వపడుతున్నాను. ఒక్క భారతదేశానికే కాక సర్వప్రపంచానికికూడా, ఇది ప్రాచీనదత్తమయిన మహానిక్షేపమని ఒప్పుకోక తప్పదు. ఈ కళ, జాతి, దేశ, కాల, పాత్ర అవధులను అతిక్రమించి విస్తరించింది. క్రైస్తవశకోదయ కాలంలో కృష్ణానదీతీరాన ఉద్భవించిన ఈ మహాశిల్పకళ 2000 ఏళ్లక్రిందట ఆశియా ఖండమంతనూ విమోహిత మొనర్చి ఉఱ్ఱూతలూగించినట్లుగానే, ఈనాటికి మనని ఆకర్షించి, తన ప్రభావంలో మనలను ముంచెత్తుతుంది.

అమరావతి కేంద్రంగా, ఈ జ్యోతిర్మాల దూరదూరాలకు తన వెలుగును ప్రసరింపచేసింది. సముద్రాలను తరించి, సౌత్ ఈస్ట్ ఏషియా శిల్పులపై తన ప్రభావం ప్రకటించింది. డా॥ రెజినాల్డు లీమే రచించిన "ఆగ్నేయ ఆసియా సంస్కృతి" అను గ్రంథంలో ఇల్లా వ్రాయబడి ఉంది. "అమరావతి శిల్పప్రభావం, సింహళం, మధ్య వక్షిణ సయాంలలో విస్తరించి దక్షిణాన సుమత్రా వరకూ కూడా వ్యాపించింది."



అమరావతి

ఈమధ్య వెలువడిన "భారతీయ కళా, శిల్పం" అన్న గ్రంథంలోకూడా మిస్టర్ బెంజమిన్‌రోలండు ఈ అమరావతీశిల్ప ప్రభావాన్నే వర్ణించాడు. "ఆంధ్ర సామ్రాజ్య ప్రభావం సాంస్కృతిక, వాణిజ్య, మత, సంబంధబాంధవ్యాలవల్ల, చాలా విస్తృత భూఖండంలో వ్యాపించింది. అమరావతి శిల్పరీతి సింహళంలో వ్యాపించ టమేకాకుండా, రెండు మూడు శతాబ్దాలనాటి బుద్ధవిగ్ర హాల ఆంధ్రశిల్పశైలి, చంపా (నేటి ఇండోచైనా)లో డోంగ్ డువాంగ్, సెలిబీస్‌లోని సెంపగావరకూకూడా విస్తరించు కొని వచ్చింది. ఈ డోంగ్‌డువాంగ్ మండలానికికూడా అమరావతి పేరుండటము కేవలం కాకతాళీయమే అంటారా?

నిజానికి, అమరావతి, నాగార్జునకొండ, సాంస్కృతిక యుగం, భారతీయ కళలో ఒక స్వర్ణయుగం. దానిప్రభ, ఏ ఒక్క కుడ్య శిల్ప శకలం మిగిలిఉన్నా అది కుల మత, వర్ణ, విచక్షణలు దురాగాతాలు క్రౌర్యాలు లేక, ద్వేషసంఘర్షణల కతీతమయిన ఒక పరమాదర్శయుత మైన సంఘనిర్మాణానికి మనను ప్రేరేపిస్తూ, ప్రబోధకంగా మిగిలి ఉంటుంది.

(ఆంగ్లానికి అనువాదం)

సింహస్తంభముక్రింది వేదిక పై చిత్రము—అమరావతి.



# తెలుగునాట నేడు మిగిలివున్న బౌద్ధక్షేత్ర శిథిలాలు

శ్రీ బి. కె. థాపర్

"భౌతిక మైనవి జీర్ణమగుట స్వతస్సిద్ధము"
—శాక్యముని

నేపాలు సరిహద్దుపై కపిలవస్తు పురమున క్రీ. పూ. 563 లో జన్మించి, క్రీ. పూ. 483 లో పరినిర్వాణము నందిన గౌతమ శాక్యముని భారతదేశ చారిత్రక పురుషులలో ప్రథమగణ్యుడు. భారతదేశ చరిత్ర యీ మహా పురుషునికి ముందు పురాణగాథలుగా సంప్రదాయసిద్ధమైన కథలుగా నుండెడిది. ఈయన అవతరణతో చరిత్ర ఆ తెర నుండి బయటపడినది. ఇంతవరకునూ దేశపు మొదటి చారిత్రక యుగమునుండి బయటపడిన మత సంబంధమైన పురావస్తు శిథిలములలో బౌద్ధమత సంబంధమైనవే హెచ్చు. శ్రీ కెన్నెర్ సాండర్స్ వాక్యములలో "దైవాంశ సంభూతుడనని గాని, అతి మానుషములైన శక్తులు తనకు కలవనిగాని యెన్నడుసూ అనకనే, దైవముగా నారాధన పొందిన మతాచార్యుడు, భారతమాత పుత్ర రత్నములలో నగ్రణి" బుద్ధుడే. కాని అనేక ప్రబోధములలో వివరించిన బుద్ధదేవుని సూక్తులు యీ వ్యాసమునకు సంబంధించినవి కావు. అందువలన వాని ప్రసక్తి యిందు లేదు. మరణానంతరము, ఆయన శరీరమునకు, శిష్యులు, అంత్యక్రియలు జరిపిరి. ఆయన భౌతికశేషము లేమిచేయవలెనన్నది యొక వివాదముగా రేగెను. దేశమున ననేక ప్రాంతములలో స్తూపము లను పేరనున్న సమాధులలో నీ పవిత్ర భౌతికశేషములను స్ఫటికముతో, సువర్ణముతో, లేక యితరమైన వస్తువులతో చేసిన పేటికలలో భద్రపరచిరి. ఈ స్తూపములు మట్టితో, యిటుకలతో కట్టినవి. ఆతరువాత శతాబ్దులలో, దేశమంతటనూ, ఆయా ప్రదేశములందు స్థానికముగా భక్తిప్రపత్తులు సంపాదించిన భిక్షుకుల, సన్యాసుల భౌతికావశేషముల భద్రపరచిన యితర స్తూపములుగూడ బయలుదేరెను. అశోకచక్రవర్తి, మొట్టమొదట బుద్ధుని యస్థులున్న చోటులనుండి, వానిని, త్రవ్వించి, యింకనూ వానిని విరివిగా దేశమందంతటనూ, సమాధిచేయించెను.

బుద్ధుని నిర్యాణానంతరము ఒక శతాబ్ది లోపుననే, తథాగతుడు స్థాపించిన సంఘముననే ఛిద్రము పొడసూపెను. ఈ చీలిక, థేరవాదులూ, మహాసాంఘికులు అను రెండు భాగములుగా బౌద్ధసంఘమును విడదీసెను. ఈ రెండు వర్గముల మధ్య నున్న విభేదములు పెరిగిన కొలది కొత్త యూహలు బయలుదేరెను. ఉత్తరోత్తరా బౌద్ధము హీనయాన మహాయానములుగా పరిణమించుట కీ యూహలే ప్రాతిపదికలాయెను. ఇయ్యది క్రీ. వె. ఒకటి, రెండు శతాబ్దుల కాలములలో జరిగియుండవలెను. కనిష్కుని పాలనాకాలమున నైయుండునని సామాన్యాభిప్రాయము. ఈ రెంటిలో మహాయానమనునది దేశమున పలు ప్రాంతముల శీఘ్రముగా వ్యాప్తిజెందెను. కళ, మతము అనువాటి ప్రాతిపదికలు, ఊహలు, బ్రహ్మాండమైన మార్పులు చెందెను. మహాయాన బౌద్ధపు బుద్ధుడు, నీతి బోధకుడైన యాచార్యుడు మాత్రమే కాదు. శాశ్వతుడైన భగవానుడు. ఆలయములలో నారాధన పొందువాడు. హీనయానమున నాయన శిష్యులు ఆయనకేదో శారీరక స్వరూపమునిచ్చుటకు జంకువారు. మహాయానమున్నో

---

**1. అమరావతి చిన్నస్తూపము**





**2. బౌద్ధచైత్యము - నాగార్జునకొండ**



**3. మహాభినిష్క్రమణము - నాగార్జునకొండ**

**4. తెల్లయేనుగు ఆకారమున స్వర్గమునుండి బోధిసత్త్వుని యాగమనము - నాగార్జునకొండ**



అయనను దైవముగా తీర్చెను. హీనయానమున తథాగతునికి కేవలము సంకేతములుండెడివి. పద్మమో, బోధి వృక్షమో, ధర్మచక్రమో, స్తూపమో, పాదములో, యేదియేని సింహాసనమో—యేదోయొక సంకేతము మాత్ర ముండెడిది.

హీనయానమునసేమి, మహాయానమునసేమి, బౌద్ధ ధర్మమునకు మూడు రకముల స్మారక మందిరము లుండెడివి. **ఒకటి: స్తూపములు.**—యివి పవిత్రమైన భౌతికశేషముల తమ గర్భముల నిముడ్చుకొనిన దిబ్బలు. **రెండు:** విహారములు.—యివి బౌద్ధభిక్షువులు నివసించునవి. **మూడు:** చైత్యములు.—ఆదిలో వీనినికూడ స్తూప విశేషముగనే చూచిరి. కాని యటుపిమ్మట నది ఆలయమను సర్థమునసే నిల్చినది. అయినను, యా చైత్యాలయములలో స్తూపమునునది యుండెడిది.

## వాసికెక్కిన ఆంధ్రయుగము

భారత వర్ష చరిత్రలో "ఆంధ్ర యుగము" అన్న కాలమును గూర్చిన శ్రద్ధ, బహుశః చాల యుగముల పట్ల లేదనవచ్చును. సర్దార్ కే. యమ్. పణిక్కర్ మాటలలో "దక్షిణాపథపు నూతన ఆర్య నాగరికత" వికాసములో నిది చాల ప్రధానమైన కాలముగా చెప్పదగును. ఆంధ్ర రాజుల వంశావళిగూర్చి యిందు చర్చించుటకు వలను పడదు. ఆంధ్రుల పేరు ఓమ ప్రథమముగా ఐతరేయ బ్రాహ్మణమున గోచరించుచున్నది. దక్షిణ భారతములోని యొకానొక తెగగా ఆంధ్రుల పేర్కొనుట జరిగెను. క్రీస్తు శకము ఆరంభము కాకమునుపు అనేక శతాబ్దుల క్రితమే, ఆర్యప్రాంతపు సరిహద్దులమీద వీరు నివసించుచున్నట్లు తెలియును. అశోక శాసనములలో, చక్రవర్తి సీమలోనున్న తెగలలో వీరి నొకరినిగా పేర్కొనుట జరిగెను. మెగాస్థనీసు, ప్లినీ వంటి విదేశీయ రచయితలు గూడ ఆంధ్రులు వీర్యవంతులనీ, శక్తిమంతులనీ వ్రాసిరి. పురాణములలో గూడ వీరి ప్రసక్తి యున్నది. ప్రాచీన భూగోళశాస్త్రజ్ఞుడు టాలెమీ, యాంధ్రదేశపు రేవుపట్టణముల బేర్కొనినాడు. అశోకుడు కీర్తికాయుడైన పిదప నీ యాంధ్రులు స్వతంత్రులైరి. ఆంధ్ర రాజులగు శాతవాహనులు తమసామ్రాజ్యమును నేల నాలుగు చెరగులకునూ విస్తరింప జేసికొనిరి. భారత ద్వీప కల్పమున నధికభాగము వీరి యేలుబడి క్రింద నుండెడిది. ఈ శాతవాహన కాలమున క్రీ. పూ. 300 మొదలు క్రీ. త. 300 వరకు వాణిజ్యమేమి, వలస సంబంధములేమి, బౌద్ధ శిల్పమూ, కళలూ నేమి చక్కగా వర్ధిల్లినవి. ఈ కాలమున బహుశః, హీనయాన మహాయానములు రెండు నున్నట్లు తోచుచున్నది. ఆంధ్రలో నున్న ప్రాచీన బౌద్ధక్షేత్రములు

భారతదేశమున మరి యెచటనూ గోచరించుట లేదు. బౌద్ధ మాంధ్రభూమి నేనాడు ప్రవేశించెనో యిదమిత్థముగా నిర్ణయింప వలనుపడదు కాని, యీ మండలము నందలి ప్రప్రథమ చారిత్రక మందిరములు బౌద్ధులవే నన్నది సుస్పష్టము. అశోకుని పూర్వపువి మాత్రము కానేకావు. సుప్రసిద్ధ ఫ్రెంచి చరిత్రకారుడు జోవోడుబ్రెయిల్ యిట్లని నాడు "ఈ యాంధ్రులన్నవారు ఒక మహత్తరమైన జాతిగా గోచరించుచున్నారు: అమరావతీ శిల్పసంప్రదాయము వీరు పెట్టిన భిక్ష. నాగార్జునుని తాత్విక సిద్ధాంతము వీరిచ్చిన వరమే." అమరావతి, నాగార్జునకొండ, జగ్గయ్యపేట, గోలి, ఘంటసాల, గుమ్మడిదుర్రు, గుడివాడ, భట్టిప్రోలు, గుంటుపల్లి, అదుర్రు, శంకరము, రామతీర్థము, శాలిహుండము అనునవి పురాతత్వశాస్త్రజ్ఞులు కనుగొనిన కొన్ని ప్రదేశములు మాత్రమే. భూగర్భమున నింకనిట్టివి యెన్ని యున్నవో!

ఆంధ్ర దేశమందలి బౌద్ధప్రదేశము లన్నిటినీ వర్ణింప బూనుట సామాన్యముగాదు. ఈ ప్రత్యేక సంచికలో నిమడ్చ దగు రీతిగా నేనీ కార్యమునకు పూనుకొన గలవాడనా? యని సందియము. కాని యీ యత్నమునకు ప్రాతిపదిక లెందరో యితర గ్రంథకర్తలు వేసి యున్నారు, వారికి నా నమస్సులు. వివరించుట నాలక్ష్యము కాదు; స్పృశించి విడుచుటయే యిందు నే చేయుచున్నది. విషయ ప్రాధాన్యమును బట్టి, పాఠక మహాశయులే యిందలి బాగోగులెంచుదురు గాక.

ఇప్పుడు చెప్పనున్న ప్రాచీన బౌద్ధక్షేత్రములు చాల వఱకు కృష్ణానదికి ఉభయ తటముల యందు విస్తరించు కొని యుండినవే. అట్టి సంఘావాసములకు నీటి వసతి యుండవలసిన యవసరముచేతనే కాక సుప్రసిద్ధుడై నాటి బౌద్ధమతప్రవర్తకుడగు నాగార్జునాచార్యుని యునికి చేత కూడ నా ప్రాంతముల కట్టి ప్రాముఖ్యమేర్పడినది. నాగార్జునునకు కృష్ణాతీరమే అనువైన స్థలముగా తోచినది. అచట పరిపాలకులగు శాతవాహనులు కూడ స్వయముగ బౌద్ధులు కాకున్నను, తన్మతవిశ్వాసముల నాదరించిన వారు కావున నీ యాచార్యునకు చేదోడు వాదోడుగా నిలచిరి. అంతియే కాదు. అమరావతీ ప్రాంతములను దర్శించి, పెంపొందించి దానిని తమ రాజధానిగా కూడ గావించు కొనిరి.

## అమరావతి (1 వ చిత్రము)

ఆంధ్రదేశమునందలి బౌద్ధ క్షేత్రములన్నిటిలోను అమరావతియే సుప్రసిద్ధమైనది. అది ఇప్పుడొక చిన్ని పల్లెగా దోచినను ఒకప్పుడది ధాన్యకటకమను పేరుతో క్రీ. పూ. 200 న ప్రసిద్ధమై యాంధ్ర రాజధానిగా విరాజిల్లినది. అది



5. ధర్మచక్రప్రవర్తనము - నాగార్జునకొండ



6. శిబి జాతకము - నాగార్జునకొండ

7. బౌద్ధస్తూపము - జగ్గయ్యపేట





8. శిల్పశిలాఫలకము - ఘంటసాల



9. బౌద్ధవిహారము - గుంటుపల్లి

10. పగోబాలు - శంకరం



కృష్ణానదీ దక్షిణతటమున, గుంటూరున కిరువది మైళ్లుత్తరమున నున్నది. దీపాలదిన్నె అనెడి స్థానిక నామముతో నచట నొక దివ్యమైన స్తూపముండెడిది. దాదాపు పన్నెండవ శతాబ్దివరకు పూజింపబడుచుండిన ఆ స్తూపమును పదునెనిమిదవ శతాబ్ది తుది భాగమున స్థానిక పాలకులు తమభవన నిర్మాణమునకై బట్టీపెట్టిన మంచి సున్నమగును గదా యని యక్కడి పాలరాళ్ళను కాల్చివేసినారు. ఉన్నతమైన కళాదర్శముల నందుకొన్న నా పవిత్ర క్షేత్రమున కంతటితో స్వస్తియైనది. తరువాత పురాతత్త్వ పరిశోధకులు, ముఖ్యముగా కర్నల్ మెకంజీ, రాబర్ట్ సూయల్ ప్రభృతులు దాని నుద్ధరించుటకు యత్నించినారు. ఆశిథిలములే నేడు మనకు మదరాసు మ్యూజియములో చూడ మిగిలియున్నవి. శిల్పభూయిష్టములైన స్తూపశిథిలములు, ప్రాకారశిలలు కొన్ని లండను చేరినవి. అవి యచ్చటి బ్రిటిష్ మ్యూజియమునందు భద్రముగ నిక్షిప్తమైనవి.

19-వ శతాబ్ది తుది భాగమున బర్గెస్ వ్రాయుచు, అప్పటికే అది మట్టికై త్రవ్వబడి గొయ్యిగా మారిన దనినాడు. అందుచేత నప్పటికే స్తూపపు ఉపరి భాగమునకు సంబంధించిన శిథిలములుకూడ కొఱవడిపోయినవి. కాని ఇప్పటి మన పరిజ్ఞానమున కందిన స్తూపపు టాకారము, కొలతలు మున్నగునవి సాధ్యమైనంతవఱకు మెకంజీ సాగించిన పరిశోధనలమీద నాధారపడిన యంశములే.

బహుశః క్రీ. పూ. రెండువందల సంవత్సరముల ప్రాంతములందా స్తూపము, మట్టి యిటుకలతో గట్టిన దిబ్బగా నుండెడిదేమో. ఈ భావన కనుకూలముగా మన కొక శాసనము, కొన్ని శిలాశిల్పములు నున్నవి. ఆ శిల్పములంత ఉబ్బెత్తుగా లేకుండుటనుబట్టి యవి ప్రాచీనములని కూడ నూహించవచ్చును. ఈ శిల్ప రీతి యచ్చముగా కొంత బార్హుత శిల్పరీతితో పోల్చదగినది. కాని కొన్ని శిల్ప శిలా ఫలకములు, ప్రాకారములో కొంత, తరువాత క్రీ. శ. రెండవ శతాబ్దిలో చేర్చినవి కావచ్చును. అచట ప్రాకారమునుగూర్చి కుమారస్వామి చెప్పుచు అంతటి లలితమైన, ఉన్నతమైన నిర్మాణము మరెచ్చటను లేదనినాడు. దాని వ్యాసము 192 అడుగులు. వేదికమీది అగ్రమునుండ యెత్తు 13 లేక 14 అడుగులు. అది మూడేసి అడ్డురాళ్లతో కలిపిన కొన్ని పొడుమైన నిలువు స్తంభములతో కట్టినది. ఈ అడ్డురాతి చువ్వలపై చక్ర, అర్ధచక్రాకారపు టలంకారములు, వాని మధ్య మరికొన్ని సూక్ష్మమైన శిల్పములు. ఈ ప్రాకారపు శిలలు వెలుపలకన్న లోపలవైపున నలంకారమయముగ నుండును. ఆ చక్రాకారపు భాగములో బౌద్ధ గాథలు సున్నితముగ చెక్కబడినవి. దాని అడుగు భాగమునకూడ జంతువుల బొమ్మలు, పిల్లల బొమ్మలు వింత

వింత రీతులుగా చెక్కబడినవి. నూట అరవైరెండు అడుగులు వ్యాసముగల యా స్తూపపు వేదిక చుట్టును గల శిలాఫలకముల మీద సైతము అద్భుతమైన పనితనమున్నది. అందు ముఖ్యమైన యంశము—అందమైన స్తూపమొకటి, దానిని చుట్టి యొక ప్రాకారము. అచటి శిలలపై ప్రతి యంగుళమున నేదో యొక శిల్పమే. కుడ్య ప్రాకారాద్యములైన మేడలు అన్నిట చెక్కబడినవి.

వంద అడుగులు ఎత్తున, అందమైన చెక్కడములతో తీర్పబడిన యీ పాలరాతి స్తూపపు కట్టడము క్రొత్తలో, నిర్మాణపు దినములలో ప్రపంచమున సద్వితీయముగ నుండియుండెడిదని తోచును. దీని చుట్టుకొని ఎన్నియో చిన్న చైత్యాలయములు, ఆరామములుకూడ నుండెడివి. పండుగ, పబ్బములకు ఆ స్తూపము మీద సంతట నాడు దీపాలమర్చెడివారు కాబోలును—రాత్రిపూట అది యొక దీపాల కొండవలె తోచియుండెడిది. అందుచేతనే దానికి దీపాలదిన్నె అని పేరు మిగిలినది.

కుమారస్వామి దాని నిట్లు వర్ణించుచున్నాడు, "అమరావతీ శిలా చిత్రములలోని చాకచక్యము, నైపుణ్యము, దివ్యమైన సౌందర్యము వర్ణించుట కాదిశేషుడే రావలెను. ఇది భారతీయ శిల్ప ప్రపంచమున సుందరమైన సుకుమారమైన సుమపుష్పము." అతడే ప్రశంసించుచు "అచటి బుద్ధవిగ్రహము లున్నతమైన శక్తిమంతమైన నిర్మాణములు. మధుర రీతికన్న సిలోనులోని అనూరాధపురపు రీతికి సన్నిహితమైనవి." అనినాడు. ప్రసిద్ధములైన కళలన్నిటివలెనే అమరావతీ కళకూడ దూరప్రభావములందు రాష్ట్రీయ మనుటకన్న జాతీయమనుటొప్పును. తొలినాటి యమరావతీ కళకును బార్హట్‌లోని కళా రీతికిని చాల పోలికలున్నవి. మరి తరువాతి యమరావతీ కళకును నాసిక్, కన్హేరకళలకును పోలికలున్నవి.

ప్రస్తుతము దీని సమీపమునే మరియొక దిబ్బయున్నది. బహుశః అది పూర్వము ధాన్యకటక స్థానమేమో. పూర్వమది యొక ప్రాకారావృతమైన నగరమను సంప్రదాయము మాత్రమున్నది. అచ్చట లభించిన కుండ పెంకులు మున్నగునవి క్రీ. పూ. ఒకటవ శతాబ్ది నాటివిగాకూడ భావింపబడుచున్నవి. ఇంకను నిచట శాస్త్రీయమైన ఖనన పరిశోధన సాగినచో నా క్షేత్ర ప్రాధాన్య మెట్టిదో వివరముగా తెలియరాగలదు.

## నాగార్జునకొండ (చిత్రములు 2 నుండి 6 వఱకు)

కృష్ణానదికి కుడప్రక్కన గుంటూరుజిల్లాలో వున్న నాగార్జున కొండకూడ బౌద్ధక్షేత్రములలో నేమంత తక్కువ తీసినదికాదు. అది మూడు మైళ్ళ వెడల్పున పర్వతా



11. నిర్మాణస్తూపములు, చైత్యము - శంకరం



12. గురుభక్తకొండవద్ద చైత్యము, దగోబా - రామ

13. గురుభక్తకొండలో 5, 6 చైత్యములలోని గదు
ఉత్తరపుదిశ రామతీర్థము



వృతమైన లోయ. క్రీ. శ. రెండు, మూడు శతాబ్దులలో నచ్చట వసించి మాధ్యమికవాదమును స్థాపించి, షష్ట్యబ్దముల పాటా సంస్థను పాలించిన సుప్రసిద్ధ బౌద్ధాచార్యుడగు నాగార్జునుని పేరిటనే పై ప్రదేశమునకు నాగార్జున కొండ అని పేరైనది. ఈ లోయలో పూర్వము విజయపురి యను ప్రసిద్ధ పట్టణముండినట్లచట లభించిన యొకానొక శాసనమువలన తెలియనగుచున్నది. ఆ ప్రాచీన పట్టణ మానాటి బౌద్ధావాసములలో దక్షిణ భారతమున ప్రశస్తమైనదిగా నుండియుండవలెను. అది యొక విద్యాలయముగా నలరారినది. సిలోను, చైనా దేశములనుండి యాత్రికు లచటికి వచ్చెడివారు. శిథిలావస్థలో నున్న యీ ప్రాంత మమరావతికన్న చాల విశాలమైనది.

ఈ ప్రాంతములందలి విశేషములను గమనించినవాడు **1926** లో మొట్టమొదట ఏ. ఆర్. సరస్వతి. తర్వాత **1926-31; 1938-40** సం॥ల నడుమ క్రమముగా లాంగర్ట్స్, రామచంద్రన్ శాస్త్రియమైన త్రవ్వకపు పరిశోధన గావించిరి. అచట కృష్ణానదిపై వ్యవసాయోపయోగములకు కట్టదలచిన నాగార్జున సాగర నిర్మాణము కారణముగా నా ప్రాంతములు నీట మునుగునని **1954** తర్వాత తిరిగి తీవ్రమైన పరిశోధన వెంట వెంటనే ప్రారంభించి సాగించుచున్నారు. అచట లభించిన శిథిలావశేషములనట్లే జాగ్రత్తగా నా ప్రాంతమందే కట్టనున్న మ్యూజియమునకు మార్చుటకు యత్నించుచున్నారు.

ఇదివఱకు జరిగిన పరిశోధనల ఫలితముగా నచట స్తూపములు, విహారములు, చైత్యములు, మండలములు, ఒక భవనపుటునికి తెలియనైనవి. అచట నిర్మాణము లన్నియు కాల్చిన యిటికలతోను, మట్టి, సున్నములతో కట్టి, గోడలు గచ్చుచేసినట్లు తోచును. అచటి స్తంభములు, నేల, ముఖ్యమైన శిల్పములు బూడిద రంగు లేక తెల్లని సున్నపు రాతితో చేయబడినవి. అలంకరింపబడిన యీ స్తూపముల వేదికలను గప్పిన శిలాఫలకములపై మామూలు స్తూప ప్రతిబింబములనే చెక్కుచుండిరి. ఆయక స్తంభ వేదికలమీది శిలాఫలకములపై బుద్ధుని జీవితములోని ముఖ్యాంశములు చిత్రింపబడినవి. కొన్ని జాతక కథలు నున్నవి.

ఇప్పటివఱకు కనుగొనిన ప్రాచీన శిథిల నిర్మాణములలో మహాచైత్య మొకటి. దాని వ్యాసము నూటఆరు అడుగులు; ఎత్తు దాదాపు ఎనభై అడుగులు. ఆ స్తూప నిర్మాణక్రమము ఆకులు గుబ్బగల చక్రపుటాకారము గలది. బెంజమిన్ రోలండ్ చెప్పినట్లు అది "విశ్వచక్రపు నాభిని చుట్టిన పునః పునరావృత్తములైన యేక కేంద్రక వృత్తము"లకు సంకేతము. ఆ స్తూపమునకు తెరచి కొనిన బహిర్ద్వారములతోగూడిన ప్రాకారనిర్మాణ ముండినట్లు తోచును. దాని పునాది యిటికలతో కట్టినట్లును తోచును. ఆ మధ్యన కాకున్నను ఉత్తరము వైపు నిలచిన గోడవద్ద నొక వస్తు విశేషముకూడ లభించినది. బహుశః అది బుద్ధదేవునకు సంబంధించినదే యేమో. ఆ వస్తు విశేషము ఇప్పుడు సారనాథ్‌లోని మూలగంధ కుటీ విహారమున భద్రపరుపబడినది.

నాగార్జున కొండలో నమరావతిలోవలె శిల్పాలంకారము తక్కువయైనను క్రీ. శ. రెండు, మూడు శతాబ్దులలో నాంధ్రదేశము నేలిన ఇక్ష్వాకులకాలపు నిర్మాణములలో

నాగార్జునకొండ



కెల్ల ప్రశస్తమైనదని చెప్పవచ్చును. ఈ రాజులు బ్రాహ్మణ మతావలంబకులైనప్పటికిని వారి యంతఃపుర స్త్రీలు మాత్రము బౌద్ధమతానుయాయులై బుద్ధుని గౌరవార్థము స్తూపములను, ఆరామములను కట్టించిరన్న విషయము వినుటకు వింతగా నుండును. ఈ నాగార్జున కొండ మహాస్తూపమునందలి శిలాస్తంభముపై గల శాసనమున నా రాణుల పేర్లు కొన్ని గోచరించుచున్నవి. అచట నా మతము కళా వికాసమున కాలంబనమైనది.

## జగ్గయ్యపేట (7 వ చిత్రము)

ఈ ప్రాచీనక్షేత్రము అమరావతికి వాయవ్యమున మూడు మైళ్ళలో పాలేరు తీరమున గలదు. ఆ పాలేరు అచటికి నాల్గుమైళ్ళ దూరమున కృష్ణలో కలియును. దీనినే బేత వోలు అనెడివారు. నాడు అమరావతీ ప్రాంతాన్ని ఏలు తూన్న పాలకులే దీనికి తిరిగి జగ్గయ్యపేట యను ప్రస్తు తపు నామాంతరమునుంచినారు. ఇచట నిటుకలతో కట్టిన దిబ్బలలో దొరికిన శిలాశిల్పఫలకమును బట్టి యీ ప్రాంత ములందేవో కొన్ని ప్రాచీన స్తూపములున్నవని యను మానింపబడెను. మరునటి సంవత్సరమే బర్గెస్ అచ్చ టికి వెళ్లునప్పటికి రాళ్లకు రప్పలకు త్రవ్వి పాడుచేయగా మిగిలిన స్తూపమొక్కటే అతనికి గోచరించినది. త్రవ్వగా నా స్తూపపు వ్యాసము మూడున్నర అడుగులుండినది. అచటి శిలాఫలకములుకూడ నచ్చుముగ నమరావతిలో దొరికినవాని వలెనే యున్నవి. స్తూపమును చుట్టిన ప్రాకా రము పూర్తిగా నాశనమైనది. స్తూపాంతర్భాగము మట్టి తోను, యిటుకలతోను కట్టినది. వేదికను చుట్టిన శిలా ఫలకములలో శిల్పము లేకొన్నిటిపైననే తప్ప తక్కిన వానిపై లేనేలేవు. కొన్ని కొన్ని సంధాన శిలలపై చెక్కిన శిల్పములు బార్హత్ శిల్పరీతిని ధ్వనింపజేయుచున్నవి. అమరావతిలోని తొలి శిల్పరీతికూడ నిట్లే యుండినది. భారమైన స్తంభాగ్రములు, ఘంటాకారము, కొన్ని శిలలపై రెండవ శతాబ్దికి చెందిన మౌర్యలిపిలో చెక్కిన శాసనము లున్నవి. వేదికను చుట్టిన శిలాఫలకములపై లోతు అధిక ముగా లేనట్లు, అమరావతిలోవలెనే శిల్పములు చెక్కబడి బడినవి. ఆయక స్తంభవేదిక లొక తూర్పు భాగమున తప్ప తక్కిన మూడు దిక్కులందును స్పష్టముగా కని పించుచున్నవి. పెద్ద పెద్ద స్తంభములా చుట్టుపట్ల పడి యున్నవి. అట్టి యొక స్తంభముపై మూడు, నాలుగు శతాబ్దులకు చెందిన శాసనమొకటి కలదు. హీనయాన విశ్వాసమును సూచించు శిల్పము లెన్నియో మన కచ్చటకనిపించును. అదియే జగ్గయ్యపేటకు గల ప్రాధాన్యము.

## గోలి

ఇది గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకాలో కృష్ణానదికి ఉపశాఖయగు గొల్లేరుపై గలదు. 1926 లో డా. డూబ్రా యిల్ ఒక చిన్న స్తూపము నచట త్రవ్వించెను. ఈ ప్రదేశ మునే సూవెల్ "List of Antiquarian remains of the Madras Presidency" Vol. 2 (1882) పేజి 60 లో పుల్లపరము అని పేర్కొనినాడు. ఇచట శిలా ఫలకములు నేడు మదరాసు మ్యూజియములో జాగ్రత్తగా నున్నవి. వానిపై శ్రీ టి. యన్. రామచంద్రన్‌గా రొక

పరిసరాలు





గోలి శిలాఫలకము

బులెటిన్ మదరాసు మ్యూజియము తరఫున ప్రకటించిరి. ఇచట శిల్ప రీతికిని క్రీ. శ. మూడవ శతాబ్దికి చెందిన అమరావతి తుదికాలపు శిల్పరీతికిని దగ్గఱ సంబంధము కలదు.

## ఘంటసాల (8 వ చిత్రము)

ఇది కృష్ణాజిల్లా, దివి తాలూకాలో మచిలీ పట్టణమునకు పదమూడు మైళ్లు పశ్చిమమున గలదు. **1919-20** సం. లలో నిచట దొరికిన ఒక ముఖ్యమైన శిలాఫలకమును బట్టి యిచటనొక ప్రధానమైన బౌద్ధ స్తూపము గలదని తెలియ వచ్చినది. అందు ఒకటిన్నర అంగుళముల వ్యాసము గల యొక గుండ్రని శిలా పట్టికపై లోతుగా నమరావతిలోని శిల్ప రీతిగానే చెక్కిన శిల్ప మొకటి యున్నది. అందలి విషయము సిద్ధార్థుడు సన్యసించిన పిదప కపిలవస్తు నకు తిరిగి వెళ్లనున్న కంటకము యొక్క చిత్రము. ఆశిలాఫలకము బహుశః ఒక స్తూపవేదికను కప్పినదై యుండి యుండవచ్చును. ఏమైనప్పటికిని **1871** సంవత్సరము నాటికే బాస్వెల్ దొర అచటి దిబ్బను గూర్చి ప్రస్తావించినాడు. దాని నడుమ ఘన చతుర ప్రాకారపు టిటుక నిర్మాణ మొకటి గలదు. దాని నుండి నాలుగు అడ్డుగోడలు విస్తరించి బాహిర ప్రాకారమును తాకినట్లున్నది.

దానిచుట్టును ప్రదక్షిణా పథము కూడ నున్నది. నాల్గు దిక్కులందును నిర్మాణము ముందునకు కొద్దిగా విస్తరించుకొని యున్నది. ఇచట లభించిన యితర శిలాఫలకము లేమంత పెద్దగా చెప్పదగినవి కావు.

## గుడివాడ

ఇది యొక తాలూకా కార్యస్థానము. బందరునకు వాయువ్యమున నిరువది మైళ్లలో నున్నది. **1870** లో బాస్వెల్ దొర యిచటనొక స్తూపమున్నట్లు మొదట గుర్తించినాడు. దీనికే 'లంజదిబ్బ' అని స్థానిక వ్యవహారము కలదు. ఎవరో ఒక భోగపు పిల్ల ఒక్కపూట మాత్రమే భుజించుచు నచట నివసించి యా దిబ్బను కట్టినట్లు వ్యవహార గాథ. ఈ దిబ్బను కూడ స్థానిక ప్రజలు ఇటుకల కొఱకై తవ్వించిరి. బహుశః బందరు బెజవాడ బాటను బాగుచేయుటకే రాయిరప్పలకు దానిని త్రవ్విరేమో. ఈప్రదేశమునే తరువాత సూయల్, బర్గెస్ దొరలుకూడ దర్శించిరి. సూయల్ యా స్తూపము అచ్చముగా సాంచి స్తూపపుటాకారమును కల్గి యుండినదని యూహించినాడు. ఆ స్తూప వైశాల్యము దాదాపు నూటనలభై చదరపు టడుగులు, ఆ చుట్టుపట్ల నెచ్చటను ప్రాకార శిలాస్వరూపము కానరాకుండుటచేత నాప్రాకారము ఇటుకలతోనో, కొయ్యతోనో కట్టబడినదనికూడా భావింపబడుచున్నది. ఈ స్తూపమునందు స్ఫటిక శిలావశేష ములు గల నాలుగు శిలావేదికలు లభించినవి. కాని యా వేదికలు ఖచ్చితముగా నేభాగమున పాతిపెట్టబడినవో తెలియరాలేదు.

ఇచట **1894** లో అలెగ్జాండర్ రియా కొంత త్రవ్వకపు పరిశోధన గావించినాడు. ఇటుకతో కట్టిన వలయాకారపు నిర్మాణము లేవో యున్నట్లు తోచినది. కాని ప్రదేశము చిన్నదగుటచేతను, చాల పాడుబడి యుండుటచేతను వివరములు తెలిసికొనుటకు అవకాశము లేకపోయినది.



## ఘంటసాల స్తూపపు ప్లానులు

1. నల్లగా చిత్రింపబడిన భాగము అచటి దిబ్బ. చుక్కలగీతలు అప్పటి స్తూపనిర్మాణ మిట్లుండి యుండనగునని సూచించును.



2. మధ్యనున్న చదరము స్తూపకేంద్రము నందలి ఘనచతురస్రాకారపు నిర్మాణ మును సూచించును. కేంద్రమునుండి వ్యాపించిన నాలుగు అడ్డుగోడల పునాదులు కూడ నిందు చూడ నగును.



14. దుర్గకొండమీద ఇటుకలతో నిర్మించిన చైత్యము

ఆ చుట్టుపట్ల లభించిన యిటుకలు, కుండ పెంకులు, నాణెములు, పూసలు పూర్వమెప్పుడో అక్కడొక నగర ముండెడిదన్న విషయమును సూచించు చున్నవి. ఆ నాణెములలో కొన్ని ఆంధ్ర చక్రవర్తులవి. అందొక చిత్ర మైన నాణెమున్నది. దానిపై రోమనులదో, గ్రీకులదో పడవ యొకటి, అర్ధచంద్రాకారపు నిర్మాణముకలది. రెండు

15. స్తూపములు - శాలిహుండము



తెరచాపదూలములు. తెడ్డు ఆకారముకల చుక్కాని— ఇవి యందలి వివరములు. ఆ ప్రదేశమంతయు నొకప్పుడు ప్రాకారావృతమై యుండినట్లు సంప్రదాయము చెప్పు చున్నది. అందు 99 బౌద్ధ స్తూపములుకూడ నుండెడివట.

## భట్టిప్రోలు

ఇది గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకాలోని ఒక చిన్న గ్రామము. అచట స్థానికముగా పిలువబడుచున్న లంజ దిబ్బ కడ నొక బౌద్ధ స్తూపనిర్మాణావశేషమున్నది. దీనిని గూర్చి 1870లో బాస్వెల్ కొంత వివరించినాడు. తరువాత నా ప్రదేశమును వాల్టర్ ఎలియట్, సూయల్ ప్రభృతులు సందర్శించి ఆ స్తూపము సంపూర్ణముగ నాశమైనదనియు, శిల్పశిలాఫలకము లేవియు కానరా లేదనియు వ్రాసిరి. కాని 1892 లో అలెగ్జాండర్‌రియా కొంత త్రవ్వకవు పరిశోధనచేసినాడు. తత్ఫలితముగ నచట శాసనసహితములైన మూడు పేటికలు, వానిలో కొన్ని ఆభరణములు, స్ఫటిక ములు మున్నగునవి యున్నవి. ఆ స్తూపమువ్యాసము నూట ముప్పైరెండు అడుగులు. దాని చుట్టును మరి యెనిమిది అడుగుల వెడల్పుగల పునాది యున్నది.

ఆ స్తూపమును కప్పిన శిలాఫలకము లేవియు నేడు కానరావు. దరిదాపుల కొద్ది మేర మాత్రమే ప్రాకారశిలలు కొన్ని చెవరుచెదురుగా పడియున్నవి. కొన్ని విరిగిపోయిన శిలలయందును, అచట దొరికిన పాలరాతి ఛత్రము నందును జగ్గయ్యపేటలోని ప్రాచీన శిల్పరీతి కొంత గోచరించుచున్నది. అచటి శాసన లిపి కూడ దాని ప్రాచీనతను చాలవఱకు నిర్ధారించుచున్నది.

## గుంటుపల్లి (9 వ చిత్రము)

ఈ గ్రామము పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు తాలుకా కామవరపుకోటకు పడమట నారు మైళ్లు దూరమున గలదు. అజంతా, పితల్‌కోరాల కడనున్నట్లే గుఱ్ఱపు నాడా ఆకార మునగల కొండ చరియలో తొలువబడిన బౌద్ధ నిర్మాణ ములు, కొన్ని స్తూపములు, చైత్యములు, విహారములు నున్నవి. ఇవికాక సమీపమునందే ఇటుకలతో గట్టిన చైత్య శిథిలమొకటియు, శిలా నిర్మితమైన స్తూపమొకటియు పెద్ద మంటపమొకటియు నున్నవి. వీనియన్నిటిలోను వృత్తా కారముగల చైత్య నిర్మాణ మతి ముఖ్యమైనది.

నిర్మాణపద్ధతిలో నా చైత్యము వర్తులాకారమున నున్నది మధ్య శిలలో తొలువబడిన పెద్ద స్తూపపు నమూనా యున్నది. దానిపై మామూలుగానే రాతి కప్పు దూలములు కూడ నందే తొలువబడినవి. ద్వారమునకు మీదనున్న కిటికీ గుఱ్ఱపునాడా ఆకారము గలది. ఈ చైత్యవాతాయ



నాగార్జునకొండ : త్రవ్విన దిబ్బల ప్లాను. ఎడమవైపున కృష్ణానది, కుడివైపున నాగార్జునకొండ—
(1) నాగార్జునుడు నిర్మించినాడన్న మహాచైత్యము. (2) (3) (4) విహారములు. (5) సింహళము నుండి వచ్చెడి బౌద్ధులకొఱకైన విహారము. (6) మహాసానక విహారము (7) ఇక్ష్వాకుల భవనము. (8) నాటి విశ్వవిద్యాలయము. (9) అతిముఖ్యమైన హారీతి దేవాలయము.

సము అచ్చముగా బీహార్‌లో గయ సమీపమందలి బరబర్ లోని లోమశ ఋషి శిలాచైత్య నిర్మాణముతో పోల్చదగి యున్నది. ఇచటివలెనే అచటకూడ నొక గుండ్రని మందిర మున్నది. ఈ బరబర్ గుహాలయములు అశోకునికాలపు బౌద్ధులెవరో తొలిచినట్లు తోచును. గుంటుపల్లి చైత్యమున కును వీనికిని గల సామ్యమునుబట్టి వాని తరువాత నిది వెంటనే తొలుపబడినదేమో అను నభిప్రాయముకూడ లేక పోలేదు.

ఈ చైత్యమునకు సమీపమునందే బౌద్ధ సన్యాసుల కొక యారామ మున్నది. అదికూడ చాల ప్రాచీనమైన విహార ముగనే తోచును.

## ఆదుర్రు :

ఇటీవలనే యిచట నొక బౌద్ధ మహా స్తూపమును గుర్తించుట జరిగినది. ఇది పశ్చిమ గోదావరి జిల్లా, రాజోలు తాలూకా నగరం సమీపమున గలదు. ఇది గోదా వరీ సముద్ర సంగమమున కారు మైళ్ళవతల, దాని యుప నదియైన వైనతేయకు పడమటిగట్టున నున్నది. స్థానిక జమీందారే ఇచటి స్తూపపు దిబ్బను కొంత త్రవ్వించినారు. ఈ దిబ్బ నక్కడివారు దూబలాజు గుడి యని పిలుచు చుందురు. పురావస్తు తత్త్వశాస్త్రజ్ఞులు దాని విషయమును తెలిసికొనుటకై కొంత పరిశోధన జరిపిరి. దీని ఫలితముగా నచ్చట బయల్పడిన నిర్మాణములలో అరవైఆరు అడు గులు వ్యాసముగల మహాస్తూప మొకటి. దాని చుట్టును ఎత్తైన వేదికయు, నాల్గు ప్రక్కలను ఆయక స్తంభములు నున్నవి. ఈ ప్రాంతములలో నటునిటు త్రవ్వగా బయ ల్పడిన యిటుకలనుబట్టి దీనిచుట్టు నెన్నియో బౌద్ధా రామము లుండి యుండెడివని యూహింపనగుచున్నది. తూర్పు గోదావరి జిల్లాలో నేటివఱకు కానవైన బౌద్ధ శిథిలము ఇది యొక్కటియే అగుట దీని ప్రాధాన్యము.

## శంకరం ( 10, 11 చిత్రములు)

అనకాపల్లి రైలుస్టేషనుకు రెండు మైళ్లుత్తరమున నున్న రెండు వరుస కొండలపైన బౌద్ధ నిర్మాణ శిథిలములున్నవి.

అచటనే శిలా నిర్మితములైన దగోబాలు, స్తూపములు. గుహలు నెన్నియో గలవు. నిర్మాణ గృహములును నున్నవి. అచటి తూర్పుకొండపై ఆరామములే కాక, తొలిచినవి, కట్టినవి దగోబాలెన్నియో ఉన్నవి అచటి గుహాలయముల యొక్కయు, మూడు చైత్యాలయముల యొక్కయు నిర్మాణకాలము ఒకటి, రెండు శతాబ్దులుగా భావింపబడు చున్నది. తరువాత పల్లవుల కాలమువఱకు నా ప్రాంతము బౌద్ధులు కావాసముగానే విరాజిల్లుచు వచ్చినది.

## రామతీర్థం (12, 13, 14 చిత్రములు)

విశాపట్టణం జిల్లాలో రామతీర్థంవద్ద కూడ కొన్ని బౌద్ధ శిథిలావశేషములు కానవచ్చినవి. ఇచటి గురుభక్తకొండపై నొక బౌద్ధారామపు ఉనికి తెలియవచ్చినది. ఇవికాక అనేక చైత్యాలయములు, ఒక స్తూపముకూడ కనుగొనబడినవి. అందు ఇటుకలతో కట్టిన చైత్యములు కొన్ని ప్రాచీనములు కానవచ్చును. త్రవ్వకపు పరిశోధనలలో ప్రాచీనకాలపు కుండలు, పెంకులు బయల్పడినవి.

ఈ గురుభక్తకొండకు పడమటనున్న దుర్గాకొండపైకూడ కొన్ని బౌద్ధారామములుండినవి—కాని యవి తరువాత జైనవసతులయి, పిదప హిందువుల కావాసముగా మారినవి.

## శాలిహుండం (15 వ చిత్రము)

శ్రీకాకుళం జిల్లాలోని వంశధారనదికి దక్షిణపు గట్టున నీ చిన్ని గ్రామమున్నది. ఇది పూర్వపు కళింగ రేవుపట్టణమున కారుమైళ్లు పశ్చిమమున నున్నది. ఆ నది కెదురుగా నున్న కొండపై నెన్నియో స్తూపములు, చైత్యములు మున్నగు బౌద్ధ నిర్మాణములు కానవైనవి. ఇచట జరిగిన త్రవ్వకపు పరిశోధనల ఫలితముగా చక్కని బుద్ధుని శిల్పములు, పూజా స్తూపములు, మున్నగువానితోబాటు స్ఫటిక శిథిలావశేషములుకూడ నెన్నియో దొరికినవి. ఇటుకలతో కట్టిన ఒకటి రెండు నిర్మాణములు తప్ప నచటి తక్కిన నిర్మాణములు శిల్పములు అన్నియు తరువాతిబౌద్ధ యుగమునకు చెందినవే యని తోచును.

ఆ స్థల ప్రాముఖ్యమునుబట్టి తిరిగి అచట త్రవ్వకపు పరిశోధనలు జరిగినవి. తత్ఫలితముగా శాసనస్థములైన శిలాఫలకములతోబాటు, వ్రాత గల మృద్ఘటముల శకలములు, ఎముక బంగారు పువ్వులు దాచియుంచిన మృత్పేటిక యొకటి లభించినవి. ఆ శాసనములనుబట్టి శాలిహుండమునకు పూర్వము శాలిపేటిక అను పేరున్నట్లును, మహావిహారము గల కొండకు మహా-ఉగ-వవ్వత అను పేరుండినట్లును తెలియవచ్చినది. ఆ శాసనములు క్రీ. శ. రెండు, ఆరు శతాబ్దుల నడుమకాలమునకు చెందినవి. శాలిహుండము చరిత్ర అప్పటిది.

“పూజింపదగినవారిని అనగా ప్రబుద్ధులనుగాని వారి యనుయాయులనుగాని, పూజించినవారును, పాప సంకటములబడనివారును, దుఃఖసాగరమును తరించినవారును, భయము నెరుగనివారును, ముక్తినొందినవారికి మ్రొకరిల్లువారును మహానుభావులు: వారి యోగ్యతల వర్ణించుట కెవ్వరి తరము.”



# పరిశోధకులకు పని కల్పించగల ముక్త్యాల ప్రాంతం

## మూడేళ్లనాడు అక్కడ బయల్పడిన వస్తు విశేషాలు

శ్రీ వేటూరి శంకరశాస్త్రి

కృష్ణాజిల్లా నందిగామ తాలూకా ముక్త్యాల గ్రామమునకు తూర్పు సుమారు మైలుదూరము లోపుగా కృష్ణా నదికి ఉత్తరపు తీరమున 'భోగాలపాడు' అనే పేరుతో బేచి రాకుగానున్న గ్రామము ఒకటి కలదు. ఇది యిప్పుడు సేద్యముచేయు మెరక పొలముగానే యున్నను ఒకే చోట దగ్గర దగ్గరగా పాటిదిబ్బలు, తెల్లటి కొండరాళ్లు, చిల్ల పెంకులు, బూడిదమాత్రము భూమి యుపరిభాగమున కనపడుచుండును. ఈ ప్రదేశము నదియొడ్డుననే కల దగుటవల్ల, కృష్ణ వెల్లువగా వచ్చినయెడల మునుగు చుండును. 'భోగాలపాడు' అనే ఈ స్థలము నేడు పాటి దిబ్బలతోను, నాపరాతి ముక్కలతోను పాడుపడి కళావిహీనమై యున్నప్పటికి, ఆ స్థలము చూచినతోడనే ఇదేదో ప్రాచీనప్రాభవము గలదిగా మాత్రము స్ఫురింపజేయగలదు.

ముక్త్యాల గ్రామములోని వృద్ధులు ఈ స్థలమునుగూర్చి ఒక కథ జెప్పగా నేను వినియున్నాను. పూర్వ మొకప్పుడు (సుమారు ఎనుబదియేండ్లకు ముందు) ఒక రైతు పొలము దున్నుచుండగా, నాగలికఱ్ఱునకు ఒక లంకెబిందె తగిలిన దనియు, దాని నారైతు యింటికి తీసుకొనిపోయి చూడగా నందు కొన్ని బంగారు నాణెములు, ధనము దొరికిన దనియు, దాని నతడు తీసికొనిన కొలదిదినములకే తన యింట నిద్దరు ఆప్తబంధువులు చనిపోగా, నంత నాతడు భీతిని జెంది యీ ధననిక్షేపమును మరల నెక్కడనో యెవరికి తెలియకుండునట్లు పాతిపెట్టినాడనియు వాడుకగా గ్రామ ప్రజలు చెప్పుచుందురు. విచారించగా స్థలజ్ఞులగు వృద్ధులు కొందరు ఈ విషయము నిజమే నని చెప్పుచున్నారు. ఇప్పటివరకు ఆ నిక్షేప మెక్కడ కలదో యెవరికిని తెలియదు.

ఈ 'భోగాలపా'డనే పాటిదిబ్బలో గల ప్రాచీనశిథిలవిశేషములను గుర్తించుటను గూర్చియు, దీని ప్రాముఖ్యమును గూర్చియు ముందుగా స్పష్టముగా మాకు యెఱుకచెప్పినది పూజ్యులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. 1946 సం.లో ముక్త్యాలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు ఉపక్రమోపన్యాసమున ఈ విధముగా శ్రీశాస్త్రిగారే వివరించియుండిరి:-

రెండు వేలేండ్ల నాటిదైన సాతవాహనసప్తశతిలో ఈ ముక్త్యాల ప్రాంతప్రదేశమును గూర్చి వర్ణనగాథలు కొన్ని ఉన్నవి. జగ్గయ్యపేటనుంచి యిక్కడికి వచ్చేటప్పుడు రోడ్డు ఎడమవైపు కొండమీద పాలేటి ప్రక్కగా బౌద్ధస్తూపమును చూచి ఉంటారు. అక్కడ నుండి ముక్త్యాలకు వచ్చేదాకా రోడ్డుకు రెండు ప్రక్కలా దట్టముగా మోదుగు చెట్లు వ్యాపించి ఉండడము కూడా చూచి ఉంటారు. జగ్గయ్యపేట బౌద్ధస్తూపమున బుద్ధవిగ్రహమునకు సాష్టాంగ



**1. అక్షరములతో నున్న తెల్లరాతి బండ—ఇందలి అక్షరములు 'దిచ్చు చెరువు శ్రీ' అని తోచుచున్నది.**

సమస్కృతి చేస్తూ ఉన్న అక్కడి బౌద్ధసన్యాసులను చూచీ, ఎఱ్ఱనిపూవులు క్రింద రాలియున్న ఇక్కడి మోదుగు చెట్లను చూచీ సూరన్న అనేకవి సంధానించిన గాథ ఇది:—

"కిరముహసచ్ఛ హేహింరేహయి
వనుహా పలాసకుసుమేహిం
బుద్ధస్స చలణవందన
పడియేహివ భిక్ఖుసంఘేహిం"

"జీబుగా నేలపై రాలెఁ జిల్కముక్కు
లట్లు పూవులు మోదుగుఁ జెట్లక్రింద
బుద్ధపాదాంబుజములకుఁ బుడమి వ్రాలి
వందనము సేయు భిక్షుకవర్గ మనఁగ"
ఈ వర్ణన మిక్కడికే చెల్లుతుంది.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు యిక నెలరోజులకు తనువు చాలించెద రనగా ప్రత్యేకముగా పనిపెట్టుకొని యిందు కొరకై యిక్కడకు వచ్చి ఈ శిథిలములను త్రవ్వించి విశేషములను బయలు పరచవలె ననుకుతూహలముతో కొంత ప్రయత్నము సాగించి యుండిరి కాని, ఆ నాటిపరి స్థితులు, మా మనోభావములు అందు కనుకూలింపక పోవడముచేత వారుండగనే వెంటనే త్రవ్వించుభాగ్యము మాకు కలుగలేదు.

శ్రీ శాస్త్రిగారియందు, వారిపలుకులయందు భక్తివిశ్వా సములు ప్రేరేప, కొన్నాళ్లు గడచిన పిదప ఇందేదో గొప్ప విశేషమే యుండగల దను తలంపుతో 1953 మార్చినెల 9 వ తేదీ నుండి 15 వ తేదీ వరకు ఈ దిబ్బను మేము త్రవ్వించుటకు ప్రారంభించితిమి. శ్రీ ముక్త్యాల రాజాగారి

కమతములో చేరిన సేద్యము చేయు స్థలములో నడ్డముగా నున్నది గాన, సేద్యమున కుపయోగపడి అడ్డము తీరునంత వరకే పైపైన త్రవ్వించినప్పటికి బయల్పడిన విశేషములు మాత్రము చాలముఖ్యమైన వనుటకు సందేహము లేదు.

ఇందు దొరకినవి కుండలు, కుండపెంకులు, శాసనపు రాళ్లు, ఎముకలు, లోహపుబిళ్లలు, రేకులు, పూసలు, ఆభరణములు, గాజులు, ఆటవస్తువులు ఇటుకలు గలవు. (వీటి వివరములు అనుబంధమున జూడుడు. ఈ వ్యాస మున ప్రచురించిన 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10 చిత్రములలోని వస్తుసామగ్రి యంతయు ఇందు దొరికిన వే.) ఇవి, వీటి విలువ తెలియని వారికి ఎముకలు, కుండ పెంకులే గాని, చారిత్రక జ్ఞానవంతులకు నిక్షేపించిన బంగారు రేకులుగా భాసిల్లగలవు.

భోగాలపాటిలో మేము త్రవ్వించిన పాత దిబ్బనిర్మాణము ఈ క్రింది విధముగా నున్నది. దీని నిర్మాణవిధానమును బట్టియు అందు దొరకిన వస్తువులనుబట్టియు ఇది యొక బౌద్ధవిహారము కావచ్చునని మేము తలంచు చున్నాము. నేలమట్టమునకు సుమారు ముప్పదియడుగుల యెత్తుగా భూమి యుపరిభాగమున 200 అడుగుల చుట్టుకొలత గల ఒక మట్టిదిబ్బ గలదు. దిబ్బచుట్టు అక్కడక్కడ 18'' పొడవు, 9'' వెడల్పు, 3'' మందము కొలతలుగల పాత యిటుకరాళ్లు, ఆ దిబ్బలో పాతుకుపోయి కనపడు చున్నవి (నెం. 6 చిత్రములోని యిటుకలు). ఈచుట్టు పట్టుల యిటుకరాళ్లే దొరకవు. పైగా నీ కొలతలు గలవి అనలే లభించవు. దిబ్బ పైభాగమున నడిబొడ్డుమీద నాలుగు వైపులను రెండేసి నాపరాతి బండలు నిలువున



**2. అక్షరములతో నున్న తెల్లరాతి బండ—ఇందలి అక్షరములు 'రతి విలాస శ్రీ' అని తోచుచున్నది.**

వరుసగా పాతియున్నవి. వాని కొలతలు 8 అడుగుల పొడవు 4 అడుగుల వెడల్పు 5 అంగుళముల మందము కలిగియున్నవి. రెండడుగుల వరకు భూమిలోకి పాతియున్నవి. రెండు బండలు అంతే కొలతగలవి ఉత్తర దక్షిణములుగా ఈ బండలపైన కప్పియున్నవి. ఇట్టి బండల నిర్మాణమును 'గొడుగుబండ'లని యిటువైపున అందురు. తూర్పువైపున మనిషి లోపలకు పోతగినంతటి సందు గలదు. లోపల నేమియు కనుపడుట లేదు. ఈ నిలువు బండలకు అనుకొని ఉత్తరపువైపున నొక పెద్ద వేపచెట్టు కలదు. అది యెప్పటినుంచి కలదో తెలియదు గాని ఈ దిబ్బ నిర్మాణానంతరము మొలచి పెరిగినదే నని మాత్రము చెప్పదగియున్నది. ఇది ఆ దిబ్బయొక్క బహిరంగ స్వరూపము.

ఈ నిర్మాణమున ఉపయోగించిన తెల్లటిరాతి బండలు తత్పరిసర ప్రాంతముల నెక్కడను దొరకవు. ఇట్టివాని నెల్ల దూరప్రదేశమునుంచి యిక్కడికి చేర్చుటకు యెంతో వ్యయప్రయాసలు పడవలసియుండును. ఒకరిద్దరు కలిసి చేయతగిన పనికూడ కానేరదు.

ముందుగా మేము పైననున్న నిలువుబండల (గొడుగు బండల) నూడబెరికి చుట్టు త్రవ్వించుటకు ప్రారంభించితిమి. త్రవ్వించగా బయల్పడిన సన్నివేశ మిట్లు కలదు.

ఈ నిర్మాణమునకు తూర్పుగా ఇరుపార్శ్వముల, ఉత్తర దక్షిణములందు రెండు తెల్లటినలుచదరపు రాతి స్తంభములు నిలువబెట్టియున్నవి. (చిత్రము 6 లోని రెండు నిలువు స్తంభములు) ఆ స్తంభముల మొకిరిమాత్రము భూమిపైకి కనుపడుచుండెను. ఈ స్తంభములు 5-6 అడుగులు నిడివి యుండి యుండవచ్చును. నాల్గువైపుల ఒక్కొక్క అడుగు కొలతతో నలుచదరముగా నున్న స్తంభము లివి. ఈ రెండు స్తంభములు ఒకదాని కొకటి యెదురుగా పది యడుగుల దూరమున గలవు. నేలమట్ట



3. 'దిచ్చు చెరువు శ్రీ' అని చెక్కబడిన రాతిబండకు వెనుక భాగమున ఎడమవైపు మూలగా రాతికి క్రిందితట్టున ఈ అక్షరములు చెక్కియున్నవి—అక్షరములు సరిగా తెలియుట లేదు—'పాచ (?) స న (?)'

మునకు విరుగగొట్టిన గుర్తులుగల స్తంభభాగము విరిగి పోయినది పోగా, నేలలో పాతుకొనియున్న స్తంభపు పొడుగు 4 అడుగులు గలదు. ఒక్కొక స్తంభము క్రింద ఒక రాతి బండ గలదు. (చిత్రము 6 లో నిలువు స్తంభముల వెనుక నున్నవి.) దాని మందము 5 అంగుళములు. పొడువు 24 అంగుళములు. వెడల్పు 18 అంగుళములు. ఈ బండల మీద కొన్ని పొడి యక్షరములు అస్పష్టముగా చెక్కబడి యున్నవి. ఒక అక్షరము 'జ'గా గుర్తించుటకు వీలుగా నున్నది-మిగిలినవి తెలియుటలేదు-ఈ స్తంభముల కించుక వెనుకభాగమున విస్పష్టమైన అక్షరములతో రెండు తెల్లరాతి బండలు గలవు. (చిత్రము 1, 2 సంఖ్య గలవి.) వాటి కొలతలు 2″ పొడవు, 18″ వెడల్పు, 5″ మందము. వీని మీద గల లిపి పోలికనుబట్టి చూడగా ఇక్ష్వాకుల నాటిదిగా గుర్తింప తగియున్నది. నెం 1. చిత్రముగా నున్నరాతికి వెనుక తట్టున యెడమ తట్టుగా క్రింది భాగమున మూలగా మరికొన్ని యక్షరములు కలవు.

ఈ నిర్మాణమునకు ఉత్తరపు దిక్కుగా భూమిలో పాతుకుపోయిన పెద్ద మట్టిబాన. అందులో సున్నము గడ్డ కట్టుకుపోయినది, బాన సగమువరకును కలదు. అది గడ్డ కట్టుకుపోయిన సిమెంటుకంటెకూడ గట్టిగానున్నది. దీనిని త్రవ్వించి బయటకు తీయుట పెద్ద కష్టమైన పనియైనది. బాన పగిలిపోయినది. ఈ నిర్మాణమునకు వెనుకభాగమున వాయవ్యదిశయందు ఒక గోడ. ఆ గోడలో తెల్లరాతి బండలు మందపాటివి నిలువున గలవు. 5-6 అంగుళముల మందము గలిగి మనిషి నిలువు యెత్తున వున్నవి. అందులో నొక బండ తొలిచి, గూడుగా చేసి, ఆ గూటిలో కరిగిన లోహపు బిళ్ళలు, రేకులు, కొన్ని లోహపు దీప హారతులను బోలిన వస్తుసామగ్రి గుప్తపరిచియున్నవి కానవచ్చినవి. (చిత్రము 8 లోని వస్తువులు) మట్టి పిడతలు, కుండలు, కుండ పెంకులు, పూసలు త్రవ్వుచుండగా కొన్ని మట్టిలో చెదురుగా కానవచ్చినవి. రంగు రంగుల కుండపెంకులు అనేక విధములైన పూజలు గలవి కలవు. పూసలకు సన్నని రంధ్రములు వేసియున్నవి. కాలికో, చేతికో వేసుకొనే రాగి కడియ మొకటి దొరికినది. పూసలు గాజుపూసలు మాత్రము కావు. విలువ గలవనియే నమ్ముచున్నాము. అనుభవజ్ఞులు పరీక్షించినగాని వాని విషయము తేలదు.

నిర్మాణము చుట్టు నిలువున బండలు పాతియు, ఇరువది యడుగుల లోతునుండి గుండ్రాళ్ళతోను, ఇసుక తోను పునాది గట్టిపరిచి అందుమీద పాటిమన్ను పోసి, పెద్ద పెద్ద యిటుకరాళ్లతో వేదిక అమర్చబడియున్నది. వేదిక చుట్టు ఇటుకరాళ్ళతో కొంతవరకును, తెల్లరాతి బండలతో కొంతవరకును మెట్లు కలవు. లోపలి వేదిక యొక్క కొలతలు తూర్పు పడమరలుగా 15 అడుగులు ఉత్తర దక్షిణములుగా 21 అడుగులు.

ఈ నిర్మాణమునందు దొరికిన శిథిలావశేషములనుబట్టి చూడగాను, నిర్మాణ విధానమునుబట్టి చూడగాను, ఇక్ష్వా



**4. వీరుల బోడు నందు త్రవ్విన రాకాసిగుడి; గుఱ్ఱపు ఎముకలు, మనిషి ఎముకలు దొరికిన సమాధి. త్రవ్వించుటకు ముందున్న దాని స్వరూపము.**



**5. గుఱ్ఱపు ఎముకలు, మనిషి ఎముకలు గల సమాధి త్రవ్విన తరువాత స్వరూపము. మధ్యనున్న రాతిబండకు కన్నమున్నది కాననగును. ఆ కన్నము పైననే అక్షరములు గలవు. అవి 'లు వి శ్రీ' గా తోచుచున్నది.**

కుల నాటి బౌద్ధభిక్షువులు ఇక్కడ విహారము కట్టుకొని యుండినట్లును, బౌద్ధాచార్యులు కొందరు ఈ విహారమున నివసించుచు బౌద్ధధర్మముల ప్రచార మొనర్చుచుండి రనియు చెప్పదగియున్నది.

ఇందు దొరికిన వస్తుసముదాయ మంతయు పోల్చి చూడగా ఇట్టివన్నియు చాలవరకు, నాగార్జునునికొండ శిథిలములందును, మహెంజొదారో శిథిలములలోను దొరికిన వాటితో పోల్చదగియున్నవి. మేము ఎక్కువ లోతుకు త్రవ్వి చూడలేదు. ఇంకను చుట్టుపట్టుల నున్న పెద్ద దిబ్బలను త్రవ్వి చూడలేదు. ఈ పనియంతయు ద్రవ్యైక సాధ్యమే గాక, నిపుణులయొక్క సలహా ననుసరించి ప్రభుత్వమువారు పెద్దపెట్టున ప్రారంభించినగాని జరుగ నేరని పనియై యున్నది. పక్కనున్న పెద్ద దిబ్బనుగాని, దీనినే యింకను లోతునకుగాని త్రవ్వి పరిశీలించినచో ఆంధ్రదేశ ప్రాచీన చరిత్ర యెంతయో బయల్పడగలదని మేము నమ్ముచున్నాము.

ఇక్ష్వాకు రాజవంశమునకు జెందిన మాఢరీపుత్ర శ్రీ వీర పురుష దత్త మహారాజునకు జెందిన శాసనములు కొన్ని జగ్గయ్యపేట స్తూపములోను, నాగార్జునకొండస్తూపములోను దొరికియున్నవి. అందు ఆ రాజవంశమునకు జెందిన స్త్రీలయొక్కయు, పురుషులయొక్కయు పేళ్ళు సుమారు ముప్పదివరకును ఇదివరకే గుర్తింపబడియున్నవి. నాగార్జునకొండలోని విశేషములనుబట్టి మాఢరీపుత్ర శ్రీ వీరపురుష దత్తుని తండ్రి, వాశిష్ఠీపుత్త్ర శ్రీ చాంతిమూల యనియు,

కుమారుడు వాశిష్టీపుత్ర ఇహువుల చాంతిమూల యనియు తెలియుచున్నది.

వీరు వేదమతావలంబకులైన బ్రాహ్మణులై యజ్ఞయాగాదులు చేయువారైనప్పటికి, బౌద్ధమతాభిమానులై బౌద్ధ స్తూపములు, విహారములు కట్టించి బౌద్ధ మతవ్యాప్తికి యెక్కువగా తోడ్పడినట్లు చరిత్రకారులు వ్రాయుచున్నారు. వీరి అగ్నిష్టోమము, వాజపేయము, అశ్వమేధము మొదలైన కర్మకాండలనుగూడ జరుపుచుండిరట.

చాంతిశ్రీ, అడవి చాంతిశ్రీ, చూల చాంతిశ్రీ, ఉపాసిక బోధిశ్రీ, నాగశ్రీ, సునీలిశ్రీ, మూలశ్రీ, అయకోటిశ్రీ, బుధశ్రీ, శివనాగశ్రీ, నదిశ్రీ, శివరాగశ్రీ, రతుమశ్రీ, నాగశ్రీ, రామశ్రీ, ఇత్యాది నామములతో సుమారు ముప్పదిమంది స్త్రీ పురుషులు ఆనాటి వారు గుర్తింపబడియున్న సంగతి సుప్రసిద్ధ చరిత్రకారులగు శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు రచించిన గ్రంథమునుబట్టి తెలియుచున్నది.

భోగాలపాటికి సుమారు 4 ఫర్లాంగుల దూరముగా ఉత్తరపు దిక్కున మరొక బోడు గలదు. ఈ బోడు జగ్గయ్యపేట - ముక్త్యాలకంకరరోడ్డునకు అంటుకొనియే తూర్పు దిక్కున గలదు. దానికి 'ఈర్లబోడు' అని పేరు. అందు వలయాకారముగ రాతిఖండలు పాతియున్న 'రాకాసిగుళ్లు'




అని పేరుగల సమాధులు (?) పెక్కు గలవు. అందు పెద్ద వాటిని రెంటినికూడ త్రవ్వించితిమి.

(నెం 4. చిత్రములోనివి రాకాసిగుడియొక్క బాహ్య స్వరూపము. నెం 5. చిత్రము రాకాసిగుడి త్రవ్వించగా తేలిన స్వరూపము.)

నెం 1. సమాధియందు + గుర్తుంచిన స్థలమునందు ఒక కుండలో కొన్ని యెముకలును, నెం 2. సమాధిలో × గుర్తుంచిన స్థలమునందు, మరొక కుండలో మరికొన్ని యెముకలును కనబడినవి. 1, 2 సమాధులకు మధ్యగానున్న బండకు ↑ గుర్తుంచిన చోటున సుమారు, ఒక మనిషి దూరగలంతటి గుండ్రపాటి కన్నము తొలచియున్నది. నెం. 1. సమాధియందున్న యెముకలు చాలా పెద్దవై యుండుటచేత అవి మనిషివి మాత్రము కావని నిశ్చయించుకొని, ఇక దేనివై యుండునాయని నిపుణుల సహాయము నపేక్షించి, గుంటూరు మెడికల్ కాలెజి అనాటమీ ప్రొఫెసరుగానున్న డాక్టరు. వి. రామచంద్రరావు (యం. బి. బి. యస్., యం. యస్. సి.) గారికి చూపగా, నెం. 1. సమాధిలో దొరకిన యెముక లన్నియు గుఱ్ఱపు యెముక లనియు, నెం. 2. సమాధిలో దొరికిన వన్నియు మానవునికి సంబంధించిన వనియు, గుఱ్ఱపు దంతములు,



**6. 'భోగాల పాడు' నందు దిబ్బ త్రవ్వించగా కనుపడిన నిలువు రాతి స్తంభములు రెండు. (1) అందలి ఇటుకలు ఆరు వరుసగా పెట్టియున్నవి చూడవచ్చును. (2) స్తంభముల వెనుక, స్తంభముల క్రింద పూడ్చిపెట్టిన బండలు చూడవచ్చును. (3) చిత్రము కుడివైపున నిలువు రాతి స్తంభమునకు ముందుగా నొక నున్నని తెల్లని రాతిబండ, దానిపైన పాత్రము చూడవచ్చును.**

వెన్నెముకలు విడివిడిగా గుర్తించి చూపిరి. రెండు సమాధులకు హద్దుగా పాతిన తెల్లరాతి బండమీద ↑ గుర్తుంచిన, కన్నము పైభాగమున, మూడు పాతయక్షరములు చెక్కబడియున్నవి. అవి అంత స్పష్టముగా కానవచ్చుట లేదు. ఫొటో తీయుటకు వీలుకాలేదు. ఎస్టాంపేజి తీసినను అంత విస్పష్టముగా రాలేదు. వాటి స్వరూప మిట్టిది. ఆ యక్షరములు చాలా పెద్దవిగానే చెక్కబడి యున్నవి: ఈ యక్షరములు 'లువిశ్రీ' కావచ్చునని తలచితిమి. క్రింది యక్షరము 'జ'

దీనికి చేరువనే మరియొకచోట ఒక తెల్లని నాపరాతి బండమీద వేగముగా అతి పౌరుషముతో పరుగిడుతున్నట్లు ఒకానొక అశ్వముయొక్క చిత్రము గండరింప బడియున్నది. ఇది చూచుట కెంతయో ముచ్చట గొల్పుచు కనులపండువుగా నున్నది. కాని ఇటీవల నెవరో ఈ చిత్రమును చెడగొట్టిరి. ముఖము చెక్కివేయబడినది.

వీటి నన్నిటినిబట్టియు ఆలోచించి చూడగా ఇక్ష్వాకురాజగు వీరపురుషదత్త మహారాజుగాని, మరొకరు గాని అశ్వమేధయాగము చేసినపుడు యాగమునకు ప్రధానాంగమగు అశ్వమును దేశముమీద వదలుట ఆచారము గదా! ఆ విధముగా వదలిన యశ్వమును, అశ్వసంజ్ఞపనము అయిన తరువాత మహావైభవముతో సమాధిచేయుట యాచారముగా నుండెననియు, అట్టి యాగాశ్వమును సమాధి చేయునపుడు, దానిని పాలన జేయు వీరునియొక్క కళేబరమును కూడా ఆ స్థలముననే సమాధిచేయుట ఆచారముగా నుండెడిదనియు మనము ఊహింప తగియున్నది. లేనిచో నొక అశ్వముయొక్కయు మానవునియొక్కయు సమాధు లొకేచోట చూచుటగాని, వీరనామకు లైనచో నిట్టి సంఘటన జరుగుటగాని తటస్థింపనేరదు. మానవుని సమాధి చేయవచ్చునుగాని గుఱ్ఱము నెందుకు జేయుదురు? అందును అనామకమైన దానిని అసలే సమాధి చేయరు కదా! ఒక సమాధియందు మానవాస్థులును, మరొకదాని యందు ఘోటకాస్థులును, రెంటికి మధ్య అడ్డముగా నున్న రాతిని తొలచి, గుండ్రపాటి కన్నము తొలచి, ఆ కన్నపు దారిపైన యక్షరములు చెక్కుటయు, ఇందుకు వేరేఅర్థము కనుపడుట లేదు. ఈ సమాధి నిర్మాణము కూడా యెంతో జాగ్రత్తతోను, భద్రముగాను చేసినటుల కనపడుచున్నది. చుట్టు పెద్దపెద్ద తెల్లరాతి బండలు, అడుగున పరుపు బండలు, పైన భద్రమునకై కప్పుబండలు కలిగియున్నది.

అశ్వమును, అశ్వపాలకుడును ఒకేసారి మృతినొందిన గదా రెంటిని ఒకేచోట సమాధిచేయుట యని ఒక ఆక్షేపము రావచ్చును. ఇంతేవరు ముందైనను, వెనుకైనను, సంబంధీకుల నిద్దరిని ఒకే చోట సమాధి చేయుట విశేషమేగాని, ఇటుల సమాధిచేయుట కిద్దరును ఒకేసారి మృతి నొంద నక్కఱ లేదు.

ఇదంతయు నా యూహాగానమే గాని, ఇందుకు ఆధారము లేవియు లేవని కొందరాక్షేపించవచ్చును. అట్టివారు దీనికి వేరే యర్థము చెప్పవలెను గదా!

ఈ విశేషము లున్నటువంటి ప్రదేశమునకు 'ఈర్లబో' డని పేరు. ఇదే 'వీరులబోడు' ఈర్లబోడైనదని శబ్దశాస్త్రవేత్తలు చెప్పగలరు. ఈ పేరు ఈ చోటికి వచ్చుటకు కూడ కారణముండి యుండవలెను. యుద్ధవీరుల సమాధు లున్న చోటునకు వీరులబో డని నామ మేర్పడియుండవచ్చును. బౌద్ధకాలమునాటి వీరుల కొందరిని వారి వాహనములతో కూడా నిక్కడ సమాధిచేయు నాచార ముండియుండునని ఊహించినను తప్పుకాదు. అయితే మేము త్రవ్వించిన నాల్గయిదు సమాధులలోను ఇట్టి విశేషము ఈ ఒక్క సమాధియందే కానవచ్చినది కాని మరి దేనియందును కానరాలేదు. ఈ సమాధినిర్మాణమే ఒక విచిత్రసన్నివేశముతో నున్నది. మిగతా వాటిలో కుండ పెంకులు అస్థికలు దొరికినవేగాని మరేవీ దొరకలేదు. ఇవి వీరుల సమాధులనియు, అందుకే 'ఈర్లబోడ'ని పిలుచుచున్నారనియు శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు చెప్పుచున్నారు. ఇదియు సంగతముగానే యున్నది.

ముక్త్యాల గ్రామమునకు తూర్పు పడమరలుగా రాళ్లతో గూడిన తిప్పలమీద 'రాకాసిగుళ్ల'ను పేరుతో చాల సమాధులు గలవు. ఇవి యెత్తైన రాతి ప్రదేశములందు బహు శ్రమతో లోతుగా భూమిని త్రవ్వి నిర్మించినవిగా కనుపడుచున్నవి. వలయాకారముగా 30, 40, అడుగుల చుట్టు కొలత గల ప్రదేశము నాక్రమించుచు మిక్కిలి బరువు గల రాతి గుండ్లుగాని, బండలుగాని సగమువరకు భూమిలో పాతి చుట్టు అమర్చబడియుండును. ఈ వలయమునకు మధ్యప్రదేశమునందు, సుమారు 8 అడుగుల పొడుగును, 4 అడుగుల వెడల్పును గల స్థలమున పొడుగున రెండు ప్రక్కల రెండు 8 × 6 అడుగుల నాపరాళ్లు పాతిక లోతువరకు భూమిలో పాతియుండును. అలాగే 4 × 6 అడుగుల నాపరాళ్లు అడ్డముగాకూడ రెండు వైపులకు పాతిక లోతుకే పాతియుండును. ఈ నాల్గు నాపరాళ్లమీదను మరల నొక పెద్ద నాపరాయి కప్పబడియుండును. ఒకే వలయమున రెండు సమాధు లున్నవి బహు అరుదుగా నుండును. వీటిలో కొన్నిటిని త్రవ్వించి చూడగా నందు, మట్టిపిడతలు అస్థికలు, కానవచ్చినవే గాని మరే విశేషమును కానరాలేదు. కొన్ని మట్టిపిడతలమీద మాత్రము



7. పాటిదిబ్బలో దొరికిన కుండలు, కుండపెంకులు, ప్రమిదలు, (పూజలుగలవి) సున్నము అతికియున్న కుండపెంకులు చూడవచ్చును - ఇవి రంగురంగులవి.

బహు ప్రాచీనమైన ఇక్ష్వాకులనాటి లిపితో పాడియక్షరములు మాత్రము కలవు. పాడియక్షరములే యుండుట చేత వాని కర్త మేమియు కుదురలేదు. వీటినిబట్టి ఈ పెడతలు, ఎముకలు, కుండపెంకులు చాలా పురాతనకాలమునకు జెందినవని ఊహించుటకు వీలగుతున్నది. రంగు రంగుల కుండపెంకులు, తీరుతీరుల పెడతలు దొరికినవి.

ఈ చుట్టుపట్టుల జనులందరు వీనిని రాక్షసుల సమాధులనియు, అందుకే 'రాకాసిగు'ళ్ల ని పిలుతు రనియు చెప్పుదురు.

ఇట్టివి లెక్కలేనన్ని నందిగామ తాలూకాలో కృష్ణానదీ తీరమున గలవు. పురాతత్త్వవేత్తలు వీటి నన్నిటిని పరిశీలించిన కొన్ని చారిత్రక విశేషములు తప్పక బయల్పడ గల వని నాతలపు.

## అనుబంధము

1. గుండ్రని లోహపుపోత బిళ్లలు ఏడు దొరకినవి (చిత్రము 8 మొదటి వరుస)

| | బ॥ | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 1. | 110 తు॥ | 6 అం॥ | ½ అంగుళము |
| 2. | 97½ ,, | 5½ ,, | డిటో |
| 3. | 53 ,, | 4½ ,, | ¼ ,, |

| | బరువు | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 4. | 45 తు॥ | 5 అం॥ | ¼ అంగుళము |
| 5. | 42 ,, | 4½ ,, | ¼ ,, |
| 6. | 31½ ,, | 3¾ ,, | ¼ ,, |
| 7. | 31 ,, | 3¾ ,, | ¼ ,, |

ఇవి రాజముద్రికలకొఱకు పోత బోసిన లోహపు బిళ్ళలుగాగాని, తూకముకొరకై ఉపయోగించుటకు పోతపోసినవిగాగాని తోచుచున్నది. పరిశీలించవలెను. ఏ లోహమైనది కూడ పరిశీలించవలెను.

2. కరిగి పోతపోసి గుండ్రముగాను కొంచెము దొప్పగాను కోసిన రేకుబిళ్ళలు దొరకినవి మొత్తం 9 (చిత్రము 8 మొదటి వరుసలో 3 వ సంఖ్యబొత్తి)

| | బరువు | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 1. | 13¾ తు॥ | 3 అం॥ | 1/8 అంగుళము |
| 2. | 14 ,, | 3 ,, | ,, |
| 3. | 13 ,, | 3 ,, | ,, |
| 4. | 10 ,, | 2¾ ,, | ,, |
| 5. | 8 ,, | 2½ ,, | ,, |
| 6. | 6½ ,, | 2¼ ,, | ,, |
| 7. | 7 ,, | 2 ,, | ,, |



**8. మొదటి వరుస :— లోహపుబిళ్లలు రేకులు, ముద్ద చూడవచ్చును. రెండవ వరుస :—లోహపు ప్రమిదలు, రకరకములవి. మూడవ వరుస :— లోహపు కడ్డీ, సరికిన లోహపు బిళ్లలు, కడియములు.**

| | బరువు | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 8. | 6¼ తు॥ | 2¾ అం॥ | కానీమందపు రేకు |
| 9. | 6 ,, | 2½ ,, | ,, |

ఇవి యెందుకు తయారు చేయబడినవో తెలియుటలేదు. ఏ లోహ మైనదియు పరిశీలించవలెను.

3. 19 తులాలు బరువు కలది; కరగి పోతపోసిన లోహపుబిళ్ళ అర్ధచంద్రాకారము గలది పొడుగు 4 అంగుళాలు, వెడల్పు 2½ అంగుళము (చిత్రము 9 లో 4 సంఖ్య గల రేకు)

4. 16½ తులాలు బరువు కలది; కత్తిరించిన రేకు బిళ్ళ ½ అంగుళము మందము గలది, పొడుగు 4" వెడల్పు 2" (చిత్రము 8 లో 3 వ వరుసలో 3 రేకు)

5. పొడుగుపాటి లోహపు ఖడ్గీ, పొడుగు 6¼ అంగుళము, బరువు 21 తులాలు (ఇది రెండుగా విరిగినది) (చిత్రము 8 లో 3 వరుసలో మొదటిది)

6. కరిగిన లోహపు ముద్ద, తూకం 28 తులాలు (చిత్రము 8, మొదటి వరుసలో 2 వది)

7. రేకుబిళ్ళలు (లోహపువి) గుండ్రటివి దొరకినవి మొత్తం 10. (చిత్రము 8 లో మొదటి వరుసలో 5 వ బొత్తి)

| | బరువు | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 1. | 12½ తు॥ | 5¼ అం॥ | అర్ధణా మందం |
| 2. | 10 ,, | 5¼ ,, | ,, |
| 3. | 10½ ,, | 4¾ ,, | ,, |
| 4. | 14 ,, | 4½ ,, | ,, |
| 5. | 11 ,, | 4½ ,, | ,, |
| 6. | 8 ,, | 4½ ,, | ,, |
| 7. | 12½ ,, | 4 ,, | పైవాటికంటె కొంచెం మందం |
| 8. | 8½ ,, | 3½ ,, | అర్ధణా మందం |
| 9. | 8 ,, | 3½ ,, | ,, |
| 10. | 7 ,, | 5½ ,, అం॥ పొ॥ | అర్ధచంద్రా |
| | ,, | 2¾ ,, ,, వెడల్పు | [కారపురేకు |

ఇందులో నెం. 7 రేకునకు మధ్యగా కాని చుట్టుకొలత గల స్థలములో వలయాకారముగా గాడి కొట్టియున్నది.

8. లోహపు పనిముట్లు దొరికినవి. (చిత్రం 8 లో రెండవ వరుసలో 3 వది)

వేనిదో మూతగా కనపడుచున్నది. మూతపైన శిఖరాకారముగా బొడ్డు గలదు. తూకం 14 తులాలు.



9. మొదటి వరుస—మట్టిపిడతలు, బోలుగా శిఖరాకారముగా నున్నమట్టి పాత్ర. రెండవ వరుస—మట్టిరోలు, మట్టిగొట్టములు, చివరది చక్రాకారముగా నున్నది. మూడవ వరుస—రంధ్రము లున్నట్టి పూసలు, చివరది రంధ్రము గల పూసలు (గాజువికావు, మరేదో తెలియదు).

9. లోహపు భరిణ. మధ్య రంధ్రముగలదు. బరువు 12½ తులాలు (చిత్రము 8 లో రెండవ వరుసలో 2 వది)

10. హారతి యిచ్చు ప్రమిదవలాంటిది. లోహపుది. శిఖరాకారపు బొడ్డు గలది. తూకం 8 తులాలు (చిత్రము రెండవ వరుసలో 1 వది)

11. లోహపు ప్రమిద తూకం 8¾ తులాలు. (చిత్రము 8 రెండవ వరుసలో 4 వది)

12. మట్టిపిడతలు (చిత్రము 9 లో, మొదటి వరుసలో 4, 5, 6)

13. మట్టి ప్రమిదలు 2 (చిత్రము 9 లో మొదటి వరుసలో 2, 3)

14. రంధ్రముగల మట్టి పూసలు, తానికాయంతవి. 3 (చిత్రము 9 లో మూడవ వరుసలో 1, 2, 3)

15. మట్టితో చేసిన శిఖరము. బోలుగా నున్నది. 4" యెత్తు 11" చుట్టుకొలత దిగువభాగంలో కలదు. చిత్రముగా నున్న ఈ శిఖరాకారపు వస్తువు దేనికొరకు చేసినదోగాని విచిత్రముగా నున్నది. (చిత్రము 9 లో, మొదటి వరుసలో 2 వది)

16. మట్టిచక్రము గట్టిగా భరిణవలె నున్నది. 6½" చుట్టుకొలత గలది. చూడ దానికి రెండు మట్టిప్రమిదలు ఒకదానిమీద ఒకటి బోర్లించి మట్టితోనే సీలుచేసినట్లుండును. రెండు ప్రమిదలకు చుట్టు లోతుగా అరవడి కలదు. (చిత్రము 9 లో, రెండవ వరుసలో 6 వది)

17. మట్టిగొట్టములు 2 (చిత్రము 9 లో 2 వ వరుసలో 2, 3)

18. చిన్న పిడతలు 2.

19. లోహపుగాజు 2" మధ్యకొలత గలది. (చిత్రము 8 లో 3 వ వరుసలో 4 వది)

20. పూస, నీలవర్ణం గలది. ½" పొడుగు. మధ్య రంధ్రమున్నది. (చిత్రము 9 లో 3 వ వరుసలో 5 వది)

21. గుండ్రనిపూస, మధ్య రంధ్రమున్నది. (చిత్రము 9 లో 3 వ వరుసలో 5 వది)

22. మట్టిగాజులు, ముక్కలు (చిత్రము 9 లో 2 వ వరుసలో 5 వది)

23. రంధ్రము లేనిపూస (చిత్రము 9 లో 3 వ వరుసలో 4 వది)

కుండలు, కుండపెంకులు, నున్నము, రంగు రంగుల కుండపెంకులు (పూజలు గలవి, లేనివి) కొన్ని కుండపెంకులు సమకూర్చి చూడగా ఒకటి రెండు కుండల సతుకుటకు వీలున్నది. (చిత్రము 7)

24. ఎముకలు, మనిషివి గుఱ్ఱపువి. దంతములు, వెన్నుపూసలు, ఇతర ఎముకలు (చిత్రము నెం. 10) ఇవన్నియు 'రాకాసిగుడి' సమాధిలో దొరకినవి.



10. సమాధిలో దొరికిన గుఱ్ఱపు యెముకలు, మనిషి యెముకలు.



చేజెర్ల కపోతేశ్వరాలయము — దాని ప్రణాలిక



నాగార్జునుడు — టిబెట్ చిత్రకారుని రూపకల్పన

# ఆంధ్రలో వసించిన బౌద్ధమతాచార్యులు

ఆంధ్రదేశమునందు నివసించిన ప్రాచీన బౌద్ధమతాచార్యులలో నాగార్జునుడు ప్రథమ గణ్యుడు. ఇతడు విదర్భలో జన్మించెనని ఒక వాదము కలదు. హ్యూన్‌త్సాంగ్ వ్రాసిన ప్రకారము ఇతడు దక్షిణ కోసల ప్రాంతమున ఒక విహారములో ఉండెడివాడు. ఇతనికి ఏడవ సంవత్సరము యీడున ఒక గండము తప్పెను. వైదిక విద్యను పూర్తిగా సాధించి, కాంచీవద్ద 'తారా' అను దేవత అనుగ్రహముతో సిద్ధి సంపాదించెనని కొందరు చెప్పుదురు; మరికొందరి వాదము ప్రకారము నలందావద్ద 'చండికా' దేవి అనుగ్రహముచే సిద్ధిబడసెనని కలదు. నాగలోకమునకుపోయి అప్పటిలో దొరకకుండాపోయిన ప్రజ్ఞాపారమిత' యను ఒక బౌద్ధ గ్రంథమును అచ్చటనుండి తీసికొనివచ్చెను. బహుశా నాగలోకము సింహళద్వీపము అయియుండవచ్చును. అక్కడనుండి ఒక బౌద్ధ అవశేషముల పేటికనుతెచ్చి దానిపై ఒక గొప్ప స్తూపమును నిర్మించెను; ఇది నాగార్జునకొండపద్దనున్న మహాచైత్యము కావచ్చును. నాగార్జునుడు గతించిన తర్వాత నూరేండ్లకు అతని స్మారకచిహ్నముగా ఆలయములు నిర్మింపబడెను. వైద్యగ్రంథములలో 'సుశ్రుతము' అను గ్రంథమును ఇతడు పరిష్కరించెను. కక్షపుట తంత్రము, ఆరోగ్యమంజరి అను గ్రంథమును స్వయముగ రచించె నందురు. ఇతని నేత్ర చికిత్సావిధానములు చీనాదేశమందు ప్రసిద్ధిగాంచినవి. విషవైద్యములో యితడు చెప్పిన చికిత్సలు బాణమహాకవిచే శ్లాఘింపబడినవి. ఎన్నో వ్యాధులకు ఇతడు నిర్దేశించిన ఔషధముల వివరము ప్రజోపయోగమునకై స్తంభములమీద చెక్కబడినవి. జీవామృతము నొకదానిని కనిపెట్టి దీర్ఘాయుర్దాయవంతుడయ్యెనందురు. అతని రచనలలో రసరత్నాకరమను గొప్ప గ్రంథమందు శ్రీపర్వతమున తన ఉనికినిగూర్చి, పాదరసమును వజ్రములను తాను జయించుటకై చేసిన ప్రయోగములనుగూర్చి వివరించినాడు. తనకంటె పూర్వము 'సకందు'డను వైజ్ఞానికుడుండెడివాడని ఉదాహరించెను. నాగార్జునుడు ఖనిజద్రవ్యగుణ పరిశోధనలో ప్రామాణికుడైనవేత్త; లోహములు పుటముపెట్టి భస్మములు తయారుచేయుట, రసములను మరుగబెట్టి ఘృతములు తయారుచేయుట, ఇతడు కనుగొన్న నూతనమార్గములు. ఇనుమును మార్చేవిధానమును, రసగంధకితమను కృష్ణవర్ణ పదార్థమును తయారుచేయు మార్గమును వర్ణించినవారిలో ఇతడు ప్రప్రథముడు. పర్వతమువద్ద మహావిహారమును నిర్మించుటకు రాజు ద్రవ్యము కావలెనన్నపుడు కొండ రాళ్ళను బంగారముగా మార్చెను. అతని అనేక గ్రంథములలో మనకు 24 రచనలుమాత్రమే దొరకుచున్నవి. అందులో కొన్నిటిని పేర్కొందము: ప్రజ్ఞాపారమితశాస్త్రము, ప్రజ్ఞామూలశాస్త్రటీక, ప్రజ్ఞాప్రదీపశాస్త్రకారిక, మూలమాధ్యమికశాస్త్రము, శూన్యసప్తతి, మధ్యాంతసుగమశాస్త్రము, దశభూమివిభాషాశాస్త్రము, ద్వాదశనికాయశాస్త్రము, వివాద సమానశాస్త్రము, ఉపాయకౌశల్య హృదయశాస్త్రము, విగ్రహవ్యావర్తినీకారిక.

నాగార్జునుని ప్రవచనములలో కొన్నిటిని ఉద్ఘాటించెదము: "ప్రపంచమునకు ఒక వైకల్పికసత్తామాత్రమే కలదుగాని పారమార్థిక సత్తాగాని, పారమార్థిక అసత్తాగాని, లేదు....నిజము ఆలోచించగా వస్తువులందు దేనికిని స్వతః సత్తా లేనేలేదు. కనుక, యీ విశ్వము వివిధ సమావేశముల సముదాయము మాత్రమే అని చెప్పవలెను. ఆ సంబంధముల మూలముననే ప్రపంచము ఒక జలచక్రము వలె పరిభ్రమించుచున్నది....".

అటులే, "ప్రాదుర్భవించుట, నశించుట, వచ్చుట, పోవుట, మున్నగు ప్రాథమికమయిన సంబంధభావనలు పారమార్థికముగా ఎట్టి యథార్థతయులేనివే. మనకు భ్రమలుమాత్రము కల్గించగల్గియున్నవి. ఆ సమావేశముల అంతస్సులో అశాంతి, పీడల బీజములు గూఢముగ ఇమిడియున్నవి; ఈ సంబంధములను సమావేశములను ఆశ్రయించుకొన్నంతకాలము మానవులకు సుఖదుఃఖములను ద్వంద్వముల రాకపోకలు శాశ్వతముగా యాతన కల్గించుచునేయుండును." ఇంకను, "వైకల్పికత్వము ఉండునంతవరకు సత్యత్వము దొరకదు. సత్యమును సాధించుకొనుటకు, వైకల్పికత్వమును సంపూర్తిగా వదలివేయవలయును. అప్పుడు సత్యము అనగా శూన్యత సిద్ధించును." "శూన్యతనే నిర్వాణమందుము; సకల వైరుధ్యములు సమన్వయపరుపగల ఒక నిర్వికల్పసహజావస్థగా అది వెలయును." నాగార్జునుని వైకల్పికతావాదము బహుశః శంకరాచార్యుని మాయావాదమునకు దారితీసియుండవచ్చును, అతని మహాయాన బౌద్ధ ఆచారములు హిందూమతమందలి భక్తిమార్గమునకు పూర్వరంగ మేమో!

నాగార్జునుని రచనలలో మరొక గొప్ప ఖండము 'సుహృల్లేఖ'. ఇది తన మిత్రుడైన రాజుకు ఇతడు వ్రాసిన

ఉత్తరము. క్రీ. శ. 700 ప్రాంతమున భారతదేశమందు యాత్ర కావించిన ఇత్సింగ్ కాలముననే ఈ ఉత్తరము మన దేశములో పిన్నలు పెద్దలు అందరకు వచోవిధేయమై యుండెడిది. అందులో ఇవ్వబడిన సలహా యేమనగా "ద్వివిధమయిన పూర్ణత్వమును సాధించుటకు చతుర్విధ మయిన సత్యమును గుర్తించి అష్టవిధమయిన ధర్మపథ మును స్పష్టముగ గ్రహించుకొనవలెను; అందుకు ప్రాతి పదికగా త్రివిధమయిన ప్రజ్ఞను అభ్యసించి తీరవలెను. అవలోకితేశ్వరునివలె, మనముకూడ శత్రువులు మిత్రులు అని భేదబుద్ధితో చూడరాదు. అట్లు ప్రవర్తించినట్లయితే ఆ తరువాత తప్పక ఎల్లప్పుడు సుఖావతిలో నిలువగల్గు దుము; అందుకు వలయుశక్తి అమితాభుడగు బుద్ధుడు ప్రసాదించును. దానితో ప్రపంచముపయిగూడ ఉత్కృష్ట మయిన నిర్వాణశక్తిని ప్రసరింపజేయుగల్గుదుము." నాగా ర్జునుని కాలమును చారిత్రకులు వివాదగ్రస్తముగ నుంచిరి. క్రీ. శ. 2 వ శతాబ్దము కావచ్చును. జగ్గయ్యపేటలోని శాసనము అయిదవ శతాబ్దికి చెందిన లిపిలోనున్నది, నాగా ర్జునుని శిష్యునియొక్క శిష్యునిగూర్చి ప్రస్తావించినది. నాగార్జునకొండలోని శాసనములందు భదంత ఆనందుడు, ధర్మనంది, చంద్రముఖుడు, నాగుడు మున్నగు ప్రముఖ భిక్షువులపేర్లు వ్రాయబడియున్నవి. నాగార్జునునికి ఆర్య దేవుడు, మరియిరువురు ప్రసిద్ధశిష్యులు నందుడు, నాగుడు అనువారున్నట్లు తోచుచున్నది. కుషాణచక్రవర్తియగు కనిష్కునికి, ఒక శాతవాహన రాజునకు ఇతడు సమ కాలికుడై యుండెననుట నిశ్చయము.

## 2. ఆర్యదేవుడు

ఇతనికే దేవుడని, కనుదేవుడని, నీలనేత్రుడని మూడు పేర్లున్నవి. ఆచార్యులలో ఇతడు 15వవాడు. ఒక మతో న్మాదిచేత వధింపబడెను. చక్కని విద్వాంసుడు, వివిధ దేశముల పర్యటించినవాడు, గొప్ప గ్రంథకర్త; చూళియె, కోసల, పాటలీపుత్రము మున్నగు స్థలములందు తైర్థికులపై ఘనమైన విజయముగాంచి నలందలో ఉన్నతమైన పీఠము నధిష్ఠించెను. తన శాతశాస్త్రమను గ్రంథములో సాంఖ్య వైశేషికవాదములను ఖండించినాడు. ఇతని చిత్తవిశుద్ధి ప్రకరణమందు, గంగానదినిగూర్చి బ్రాహ్మణులలో ఆ కాలమునందు ఉండిన మూఢవిశ్వాసములను పరిహాస మొనర్చినాడు. ఇతనికి ప్రియమైన బోధ అంధకవింద సూత్రాంతమని చెప్పుదురు.

## 3. భావవివేకుడు

ఇత్సింగ్ నిర్ణయించిన ప్రకారము ఇతడు దిఙ్నాగుని కంటెను, ధర్మపాలునికంటెను పూర్వుడు. హ్యూయన్‌త్సాంగ్ ప్రకారమైతే ధర్మపాలునికి సమకాలికుడు. ఇతడు ధాన్య కటకముయొక్క నైఋతిదిశయందు ఒక గుహలో నివ సించెను. అనేక ఉద్గ్రంథములు రచించెను. అందు మహాయానహస్తముక్తాశాస్త్రము, ప్రజ్ఞాదీపశాస్త్రము, సాంఖ్య తర్కజ్వాల అనునవి ప్రసిద్ధములు. ఇతడు వాదనలో గొప్పనేర్పరి. పైకి సాంఖ్యునివలె కన్పట్టుచు నాగార్జునుని బోధలను గూఢముగా వ్యాపింపజేయువాడు.

## 4. దిఙ్నాగుడు

ఇతడు కొంతకాలము వేంగివద్ద నివసించినట్లు తెలియు చున్నది. కాళిదాసునకు సమకాలికుడు; వసుబంధునకు శిష్యుడు. ప్రసిద్ధయోగాచార్యుడు. మహారాష్ట్రము, ఒరిస్సా దేశములలో పర్యటించి అనేక తైర్థికులను తన అభిప్రాయ ముతో ఏకీభవింపజేసెను. ఒరిస్సాలోని ఒక అమాత్యుని కూడ పరివర్తనము పొందునట్లుచేసెను. 16 మహావిహార ములను స్థాపించెను. మతము, తత్త్వశాస్త్రములనుండి తర్కశాస్త్రమును వేరుపరచి నెలకొల్పినవాడు. ప్రమాణ సముచ్చయమను గ్రంథము వేంగివద్ద శిలాస్తూపమును కల్గిన ఒకగుట్టపై వ్రాయింపబడెను. ప్రమాణమును జ్ఞాన హేతువుగా నిర్ధారించిన అభినవ న్యాయశాస్త్రమునందు ఇది మొట్టమొదటి రచన. బీల్ అను చారిత్రకుని ప్రకా రము ఇతడు ఆంధ్రదేశములో సాంఖ్యకారికలను రచిం చిన ఈశ్వరకృష్ణుడను వానినికూడ పరివర్తన మొనర్చెను. ఇతడు 100 గ్రంథములు రచించినట్లు ఇత్సింగ్ చెప్పెను. క్రీ. శ. 600 ప్రాంతమున పరమార్థుడనువానిచే చైనాభాషలోనికి ఇతని గ్రంథములు కొన్ని తర్జుమా కావింపబడినవి.

# దాక్షిణాత్య శిల్పానికి ఒరవడి దిద్దిన ప్రాచీనాంధ్రుల బౌద్ధకళ

శ్రీ పి. ఆర్. శ్రీనివాసన్

(క్యురేటర్, మద్రాసు మ్యూజియం)

సింధునదీ లోయప్రాంతమునందలి నాగరికతను సూచించు నిర్మాణావశేషములలో వాస్తు నిర్మాణమే ముఖ్యాంశము. దీనినిబట్టి క్రీ. పూ. మూడు వేలేండ్లక్రిందట నుచ్ఛముగానుండిన వాస్తు శాస్త్రాభివృద్ధిని గుర్తింపనగును. సింధునదీ ప్రాంతమునందలి నిర్మాణములు తరువాతి చారిత్రక యుగములలో చాలవరకు మత సంబంధము గలిగి వెలసిన ఆలయ నిర్మాణములవలెగాక, ప్రాయశః వసతి కొరకేర్పాటైనట్లు తోచును. కాని పరిశీలించినచో వానియాకృతి, నిర్మాణము, నిష్కృష్టమైన రచనావిభాగము నాటి వాస్తు శాస్త్రాభివృద్ధి యెంతగ నుండెనో వేనోళ్ళ విప్పిచెప్పుచున్నట్లుండును. వీనితో సాటి వచ్చు నిర్మాణము లెచ్చటనూ, నాటి నాగరిక దేశములలో కానరావు.

**నేడు దక్షిణభారతంలో శిల్పకౌశలం చిందులాడుతూ చూపరులకు అబ్బురపాటు కలిగిస్తున్న దేవాలయాల వాస్తుశిల్పానికి ప్రాచీనాంధ్రుల బౌద్ధకళా సంప్రదాయమే ఒరవడిదిద్దిందని శ్రీ శ్రీనివాసన్ ఈవ్యాసంలో ప్రతిభావంతంగా నిరూపించారు. ముఖ్యంగా జగ్గయ్యపేట స్తూపంలోని 'పుణ్యశాల' అకృతియే, అనంతరం దక్షిణదేశంలోని తిరువణ్ణామలై, చిదంబరం, మధుర మున్నగుచోట్లగల ప్రసిద్ధ దేవాలయాల నిర్మాణానికి నమూనాగా ఉపకరించిందన్న అంశం ఆంధ్రులకు గర్వకారణం.**

## సాహిత్యాధారములు

వాటి తరువాత క్రీ. పూ. 300 సం. వరకూ గల మధ్య కాలమున స్థిరమైన కట్టడనిర్మాణ మెట్టిదైనా కలదేమో చెప్పుటకు తగిన ప్రత్యక్షాధారములు మనకీనాడు లేవు. ఏలన నాటి నిర్మాణవిశేషములేమియు, నేడు మనకు నిలిచిలేవు. కాని ఆనాటి మత సాహిత్యము, ముఖ్యముగా నాలయ వస్తువులకు సంబంధించిన శుల్బసూత్రములవంటి గ్రంథములందు మాత్ర మట్టి నిర్మాణముల ప్రశంస కానవచ్చుచున్నది. ఆ గ్రంథములందు చెప్పబడిన నిర్మాణ విధానము చూడగా తరువాతి గృహ నిర్మాణములందును ముఖ్యముగా ఆలయ నిర్మాణములందును పాటింపబడినట్లు స్పష్టముగా విశదము కాగలదు. కాని అప్పటి నిర్మాణ సామగ్రి అంత శాశ్వతమైనది కాదేమో! నేటివరకు నిలవజాలకపోయినది. అయినప్పటికినీ, అశోకుని కాలమునకు తర్వాత వందలకొలది కట్టడములలో పలువిషయముల నాటి నిర్మాణ విధానములోని ముఖ్యాంశము ప్రతిబింబించుచునే వచ్చుచున్నది.

## అలనాటి బౌద్ధ నిర్మాణములు

క్రీ. పూ. 3-వ శతాబ్ది మొదలుకొని క్రీ. శ. నాల్గవ శతాబ్దివరకూ భారతదేశమంతటనూ, సిలోనులోనూ కూడా పెక్కు కట్టడములు నిర్మింపబడినవి. ఆ యుగములో బౌద్ధమే దేశమున ప్రధానమగుటచే నాటి నిర్మాణములన్నియు చాలవరకు బౌద్ధమునకు సంబంధించినవే అయినవి. అట్టి నిర్మాణములు పెక్కులు భారత దేశమున సాంచి, బారహత్, సారనాథ్, తక్షశిల, పడమటి కనుమలు, అమరావతి, నాగార్జునకొండ, మున్నగు ప్రాంతములందును, సిలోనులోని అనూరాధపురమునందున గోచరించుచున్నవి. అవి స్తూపములు, విహారములు, చైత్యాగారములును. వీనిలోని కొన్ని తొలచిన గుహలు; మరికొన్ని నిర్మితములు. నాటి వాస్తు శాస్త్ర చరిత్రను తెలసికొనుటకు ప్రస్తుతము మనకు యీ నిర్మాణ విశేషములే ఆధారము. పరిశీలించినచో నీ కట్టడముల నిర్మాణము వెనుక గర్భితమైన సూత్రములేవో, అన్నిట నొక్కటేయైననూ, స్థలభేద



1. అమరావతి చైత్యశాల

మునూ, స్థానికాచార సంప్రదాయమునూ, పురస్కరించుకొని వాని రూపావిష్కారములయందు మాత్రము విస్పష్టమైన విభేదమేదో గోచరించుచునే యుండును. అందువలననే పలువిధముల ఆరామస్తూపములు వెలసినవి. భిన్నదేశములలో వెలసిన స్తూపాకారములందు వైవిధ్యము గోచరించినను వానిపై చెక్కిన చిన్న చిన్న శిల్పములందు మాత్రము స్థానిక సంప్రదాయములను మాత్రమే సూచించు ఇండ్లు వాకిళ్లు మలుపబడినవి. ఇందుచేత, నీ శిల్ప సముచ్చయ మా యాస్థానిక నిర్మాణ సంప్రదాయములను పరిశీలించుట కమూల్యమైన యాధారముగ సహకరింపగలదు.

## దక్షిణాదికి వొరవడి

ముందు చెప్పినట్లుగనే అంధ్రా పథమున అశోకునకు సన్నిహితకాలమున వెలసిన బౌద్ధ నిర్మాణము లెన్నియో యున్నవి. చెప్పవలయుచో, అమరావతి జగ్గయ్యపేట, గోలి; నాగార్జునకొండ, భట్టిప్రోలు, గుంటుపల్లి, శంకరం, ఘంటసాల, మున్నగునవి ముఖ్యమైనవి. ఈ ప్రాంతములందు స్తూపములలోని వాస్తువునటుంచి, వాటిలో చెక్కబడిన శిల్పములను, ముఖ్యముగా జగ్గయ్యపేట, అమరావతి, నాగార్జునకొండలలో పరిశీలించినచో తరువాతి కాలమున దక్షిణ భారతమున వెలసిన శిల్పసంప్రదాయమున కిది సూచనప్రాయమే మోనని తోచుచున్నది. అందుచేత శిల్పమునందిచ్చుగలవారి కితీరు పరిశోధన ముచ్చటగొలుపవచ్చును. ప్రస్తుతము క్రీస్తుకు రెండు శతాబ్దుల నిటు నడుమ నాంధ్రాపథమున వెలసిన వాస్తువులలోని, ముఖ్య లక్షణములనుమాత్ర మానాటి యాంధ్ర బౌద్ధ వాఙ్మయము నాధారముగాగొని స్థూలముగా ప్రదర్శించుటకు యత్నింతును.

బౌద్ధ స్తూపములు వాని లక్షణములను బట్టి శారీరక స్తూపములు, పారిభోగిక స్తూపములు, ఉద్దేశిక స్తూపములు అని మూడు విధములుగ నుండునన్న విషయము ప్రఖ్యాతమే. శారీరక స్తూపములందు, బుద్ధధాతువులను నిక్షేపింతురు. పారిభోగిక స్తూపములందు బుద్ధునకు సంబంధించిన వస్తువిశేషముల నుంతురు. ఉద్దేశిక స్తూపములు బుద్ధుని యునికిచేత పవిత్రమైన స్థల నిర్మాణములు.

అంధ్రా పథమునందలి పెక్కు స్తూపములలో అమరావతి, భట్టిప్రోలు ప్రాంతములందలివి శారీరక స్తూపములు, అచటి శాసనము లా విషయమును నిర్ధారించుచున్నవి, తక్కినవన్నియు నుద్దేశికస్తూపములే యననగును. పారిభోగిక స్తూపమేదియు నిచ్చట నున్నట్లు తెలియరాలేదు. మనదేశమునందలి స్తూపములను పరిశీలించినచో, దాని విభాగము లిట్టివని చెప్పవచ్చును. అవి: వేదిక, అండము, హర్మిక, దానిపై ఛత్రమో లేక ఛత్రసముచ్చయమో, స్తూపముచుట్టునూ ప్రదక్షిణాపథమును విడచి కట్టిన ప్రాకారము.

అందును ముఖ్యముగా అంధ్రమున గల స్తూపముల ప్రత్యేకత! అకృతియందును తదంతర్హితమైన మతవిశేషమునందును, స్తూపములన్నియు ఒకేతీరుగా తోచినసూ అంధ్రమునందలి, ముఖ్యముగా నాగార్జునునికొండలోని స్తూపమునందలి నిర్మాణలక్షణములు కొన్ని, భారతదేశమందలి యితర స్థలములలోని స్తూపములకన్ననూ, సిలోనులోని స్తూపములకన్ననూ, భిన్నముగ నున్నవి. ఆ విశిష్ట లక్షణములలో మొదటిది—-ఆకులతోకూడిన చక్రపుగుబ్బ అకారముగల పునాదిపద్ధతి. శిఖరమునందలి చక్రమును పోలిన నిర్మాణము, రెండవది, నాలుగువైపులగల ద్వారముల కెదురుగా అండము నానుకొని, నిలపిన ఆయక స్తంభములైదు. ఈ స్తంభములను నిలుపుటకు అండము, ప్రక్కల విస్తరించిన నాలుగు భాగములునూ, ఆయక స్తంభవేదికలునుకూడ కలవు. అంధ్ర బౌద్ధ స్తూపమునందీ యాయక స్తంభములు చాల విశిష్టమైనవి. వీని క్రింది భాగము సలుపలకలుగానుండి, ఆ పై నెనిమిది పలకలై యగ్రము గుండ్రముగ నుండును. దానిపై బౌద్ధ చిహ్నము

లగు పూర్ణకుంభము, చక్రమో, త్రిరత్నమో, స్తూపమో, చెక్కుదురు. దక్షిణదేశమున నాటి స్థపతులకు స్తంభ మండపనిర్మాణముల మీద గల మోజు, తరువాతి కాలపు స్థపతులకును ఉండినది. తత్ఫలితముగా నాటివలె తరువాతనూ స్తంభములతో కట్టిన మండప నిర్మాణములు దేశమున నధికమైనవి.

మరియొక విశేషమేమనగా నూఱు, వేయి, స్తంభములతో మండపనిర్మాణము చేయవలెనని కుతూహలపడి చేసినారు, తిరిగి మన విజయనగరరాజవంశ్య ప్రభువులు.

మూడవది, యిచ్చట స్తూపములలోని ద్వారములకు సాంచిలోవలె, తోరణాలంకార మధికముగా నుండదు. కాని, యిచ్చటి తోరణమునందలి శిల్పములన్నియు నిచ్చటను నిరలంకారముగా చెక్కబడినవి. ఈ తోరణ ద్వారములకు బదులుగా నిచ్చట నెమ్మదిగా కూర్చున్న సింహములు గల సామాన్య స్తంభములు ద్వారమున కటునిటు నాల్గువైపుల నుండును.

## విహారములు

నాల్గవది, స్తూపమున కన్నిప్రక్కల అద్భుతమైన శిల్పములు బుద్ధుని జీవితమును, జాతక కథలను, ప్రపంచించు చుండును. ఈ లక్షణములు కొంత బార్హూతలోనూ, గాంధార స్తూపములలో కొన్నింటనూ, గోచరించును. కాని ఇక నెచ్చటనూ కానరావు. విస్తారమైన అలంకారములతోనూ, విశాలమైన ఆకారముతోనూ పెరిగిన పై స్తూపములేకాక, బొజ్జన్నకొండ, గుంటుపల్లి, ముస్నగు ప్రాంతములలో నాంధ్రమున కొన్ని సామాన్య గుహా స్తూపములుకూడ నున్నవి. ఇందు చాల ప్రాచీనములనదగిన స్తూపలక్షణములు కొన్ని గలవు. ఇవి క్రీస్తుశకము ఒకటవ శతాబ్దినాటివిగ భావింపబడుచున్నవి. నిర్మాణస్తూపమెట్టిదో తెలిసికొనుటకు, అమరావతిలోని, యీ చక్కని చిత్రము—(ఒకటవచిత్రము) చాలును. స్తూపనిర్మాణములను గూర్చిన వివరములు పూర్తిగ లభించినవిగాని, యీ ప్రాంతమునందలి ఆరామవిహారముల నిర్మాణమును గూర్చిన వివరము లేమియు నధికముగ తెలియవచ్చుట లేదు. నాగార్జునుని కొండ ప్రాంతమున త్రవ్వగా పునాదులు కొన్ని విహార సంబంధములుగా తోచిననూ వాని ఊర్ధ్వనిర్మాణ మెట్టిదో యెరుగరాలేదు.

నాటి విహారముయొక్క నిర్మాణపద్ధతి ఇట్టిది. అది యొక దీర్ఘచతురస్రాకారపు నిర్మాణము. మూడువైపుల లోపల ప్రక్కన గదులు కొన్ని, మధ్యనారుబయలు. లోపల ముఖద్వారమును దాటగనే రెండువైపుల రెండర్ధగోళాకారపు కప్పుగల ఆగారములు. అందులో నొకదానియందు, సాధారణముగ విహారవాసులపూజకైన స్తూపముండును. కొన్ని పెద్ద ఆరామములందు శిల్పములను తయారుచేయుటకునూ, సన్యాసులు కాలకృత్యములను తీర్చుకొనుటకునూ, తగిన యేర్పాటులుండెడివి. ఆంధ్రమున నుండిన యీ విహారముల నిర్మాణపద్ధతియే దక్షిణ భారత చరిత్రమున తరువాత పరిణామ వికాసములకు లోనగుచు వచ్చినది.



2. వృక్ష చైత్యము

ఏలన, ఆ ప్రణాళికా సూత్రమే కంచిలోని కైలాసనాథాలయమునను, తంజావూరునందలి యాలయములోనూ, కానవగును. అదియే బహుశః దక్షిణదేశమున నాటుకోటి చెట్టి నమిష్టి కుటుంబముల గృహనిర్మాణమునందును కానవగుచున్నదేమో !

విహారముల యూర్ధ్వ నిర్మాణమును గూర్చిన వివరము లేమియు తెలియరాకపోయినప్పటికినీ, అమరావతిలోని శిల్ప చిత్రము—(రెండవ చిత్రము) బట్టి యీ వృక్షమును చుట్టియున్న నా ఎత్తైన అంతస్థుల మేడవంటిదే విహారమనియు నా రీతియే తన్నిర్మాణ లక్షణ మనియు గుర్తింపవీలగుచున్నది. అందొక్కొక్క అంతస్థునందును, చైత్య వాతాయన—(తమిళమున 'కుడు')—మొకటి చిత్రింపబడినది. సామాన్యుల వసతులను సూచించునట్లుగనే దానికడను, మానవ శిల్పమేదియును లేదు. దీనిని బట్టి యీ విహారము సామాన్యుల కొరకు గాదని తలపవచ్చును.

కాని యది విహారమనుటకు చతురస్రాకారముగ లేక దాని నిర్మాణము గుండ్రముగ నుండుట చేత నది బోధి వృక్షము గల యొక పుణ్య మందిరమనియు, స్థానికులైన సన్యాసుల కప్పుడప్పుడుపయోగపడు చుండెడిదనియు నూహింప వచ్చును. దాని ప్రయోజనమెట్టి దైనను పైరీతి శిల్ప చిత్ర రచనలు మరెచ్చటను లేకుండుటచే, అవిశిష్టరీతి, యాంధ్రా పథమునందలి ప్రత్యేకత యని తలపనగును. ఆ తీరు నిర్మాణము లానాడు దేశమున లేకుండిననూ—(ఆ నాటి కళాకారులు తమ పరిజ్ఞానమున కందని విషయములను తాము చిత్రించెడివారు కాకుండుట చేత సాధ్యము కాదేమో కాని)—అట్లూహింపజాలి రన్నచో నాటి స్థపతుల చాక చక్యము తేటతెల్లము కాగలదు.

## చైత్యములు

ఆంధ్రా పథమున పూర్వము పశ్చిమ కనుమలలోనూ దక్కను మధ్యభూమియందును కార్లే గుహలలోను వలె చైత్యాగారములను కొండలలో తొలచుపద్ధతి లేనట్లే తోచును. పడమటి కనుమలలో నమీపారామ విహార భిక్షుకులకు వసతి కల్పించవలసి వచ్చుటచే పెద్ద పెద్ద చైత్యాగారముల నిర్మాణము కావలసెను. అందుచేతనే అవి పెద్ద పెద్ద యాకారములతో శ్రద్ధగా నలంకారములతో తీర్పబడినవి. సన్యాసులు పూజించుటకు గావలసిన స్తూపముల సంఖ్యకన్నా నధికముగనే నిర్మాణ స్తూపములు ప్రతి బౌద్ధసంఘావాసము కడను నుండుటచేత నట్టి విశాల మైన నిర్మాణము లాంధ్రాపథమున నవసరము కాకపోయి నవి. కాని, నాగార్జునునికొండ, శంకరం, మున్నగు స్థలములలో కొన్ని యెడల మామూలు అర్ధగోళాకారపు కప్పుతో కూడిన గదులుగల చైత్యాగారములను, సున్నము తోడను ఇటుకలతోడను కట్టిన వానిని, సూచించెడి పునా దులు మాత్రము నేడు గోచరించు చున్నవి.



3. అష్టకోణ రాజమందిర శిఖరములు

నాగార్జునకొండలో నీ చైత్యాకారము పూర్వము సిలోను నుండి వచ్చెడి సన్యాసుల కేర్పాటైన సంఘారామము లుండిన ఎత్తైన ప్రదేశమందున్నది. తరువాత కాలమున నర్ధగోళాకారపు కప్పుతో కూడిన యాలయ నిర్మాణముల పరిణామమును గూర్చి మరియొకచోట ప్రస్తావించినాను. ఈ తీరు నిర్మాణము లెన్నియోశైవ, వైష్ణవాలయములు పది, పదునొకండవ శతాబ్దుల నాటివి దక్షిణ కర్ణాటకముతో సహా, దక్షిణ భారతమందంతటనూ చూడనగును.

భారత దేశమందెచ్చటనూ మత సంబంధము లేని పూర్వపు సాధారణ ప్రాసాదముల యవశేషము లేవియూ లేవనుట తెల్లమైన విషయమే. అట్టి పెద్ద నిర్మాణములూ, పర్ణశాలలూ, కుటీరములు మున్నగువానిని గూర్చి మనకు తెలిసిన కొద్దియు, నాటి సాహిత్యమునందును శిల్ప చిత్రము లందునూ వర్ణింప బడిన వివరములను బట్టియే యూహింప నగుచున్నది. ఆంధ్రాపథమునందు కూడ నిట్లే! అట్టి మత సంబంధములేని లౌకిక నిర్మాణములను గూర్చి తెలిసి కొనుట కొక్క అమరావతీ, నాగార్జున కొండ, గోలీలలోని, శిల్పములే యాధారములు.

ఆ స్థలములలోని శిల్పములు అట్టి నిర్మాణములను కొన్నిటిని ప్రదర్శించు చున్నవి. బహుశః అవి నాటి సమ కాలిక నిర్మాణముల నాధారముగ చేసికొని రచింప బడిన వేమో! అందు పెద్ద పెద్ద మేడలూ, డాబాలూ రైలు వేగనుల వంటి పై అంతస్తులు—బాల్కనీలు, స్తంభము లపై నానుకొనిన వసారాలూ, తామరకొలనులతో సుంద రములైన ఉద్యానవనములు ఇంకను నట్టి నిర్మాణముల కనువైన మరికొన్ని నిర్మాణములునూ ఉన్నవి. వానికి ప్రక్కన బ్రహ్మాండములైన ద్వారములూ, అటునిటు శాలలూ, కోష్ఠములూ, కూడ నుండెడివి. సాధారణముగ నా మేడల చుట్టునూ, సున్నము ఇటుకలతో కట్టిన ప్రాకా రములు కూడ నున్నవి. కొన్నిచోట్ల నా ప్రాసాదమునకు తోరణ ద్వారములునూ ఉన్నవి. సామాన్యముగా నా ప్రాసాద ద్వారములకు సమీపమున నున్న బాటపై సాంచీ

లోని అడ్డుచువ్వలుగల తోరణములవలెగాక స్తంభముల మీద నర్ధగోళాకారముగ నొప్పిన తోరణములనేకము లున్నట్లున్నవి. ఆ స్తంభముల యాకారము వానిపై నింద్ర ధనుస్సువలె వంగిన కప్పు, చూడగా నదియే తరువాత కాలమున దక్షిణదేశపు దేవాలయములలోన ప్రపంచింప బడిన ద్వారములుగా పరిణామమందిన దనవచ్చును. మరియొక్క విచిత్రమైన యంశమేమనగా అమరావతిలోని యొకానొక ప్రాచీన శిల్పమునందు ఒక కట్టడమున (మూడవ చిత్రము) నాలుగు వైపుల నెనిమిది పలుకలుగల నాలుగు శిఖరములుండి స్తూపాకారముతో ముగిసిన యొక నిర్మాణ మున్నది. ఈ స్తూపీలు వంపుకప్పుగల ఇండ్ల పైన కూడ నున్నవి.

## పర్ణశాలలు; కుటీరములు

ఇక పర్ణశాలలు, కుటీరములు; అమరావతి, గోలి, నాగార్జునకొండ, మున్నగు స్థలములందలి శిల్పములలో వాని చిత్రణ మతి సహజముగ నున్నది. అమరావతిలో మిత్తవిందక జాతకమునకు సంబంధించిన యొకానొక ఉబ్బెత్తుచిత్రమున (నాలుగవ చిత్రము) నాటి గ్రామమొకటి చాల చక్కగ చిత్రింపబడినది. అందు రెండు రకముల గుడిసెలున్నవి. బహుశః అవి మట్టితో కట్టిన కుటీర ములు కావచ్చును. అందొకటి, అర్ధగోళాకారపు కప్పుతో గుండ్రముగ నున్నది. మరియొకటి ఇంద్రధనుస్సువంటి వంపుగల యొక దీర్ఘచతురస్రాకారపు నిర్మాణము. ఆనాటి శిల్పి లెచ్చటనైనా గ్రామమును సూచించుటకు అట్టి రెండు తీరులైన కుటీరములను మాత్రమే పట్టముగ చిత్రించెడివారు. దీనినిబట్టి నాటి సామాన్య కర్షకుల యావాన మా ప్రాంతములందంతటనూ నట్లే ప్రధానముగ నుండెడివని, స్పష్టముగ చెప్పవచ్చును. దక్షిణ భారతము నందలి దేవాలయ నిర్మాణములలోని మూడు విధానము లలో నీపై రెండు విధానములున్నవనికూడ నిచ్చట చెప్ప వచ్చును. ఇందు గుండ్రని యాలయనిర్మాణ మిప్ప డొక్క కేరళదేశమందే కానవచ్చును. అయిననూ దాని శిఖరము సూచి యాకారమున నుండును. ఇక దీర్ఘచతురస్రాకార ముగ నుండి వేగన్ మూతవలె కప్పుగల నిర్మాణము ప్రధానముగ తరువాత దక్షిణదేశపు దేవాలయ ద్వారము లందు పాటింపబడినవి. విశేష మేమనగా నాటి కుటీర నిర్మాణ విధానమే నేటికి నాంధ్రదేశమున మనము సాధార ణముగ జూడవచ్చును. ఒకవేళ పైకప్పులో భేదమున్న దేమో! అమరావతిలోని యీ శిల్పమున నా గ్రామమును చుట్టి యిటుకలతో కట్టిన కుదిమట్టమైన ప్రాకారమొకటి యున్నది. బహూశః అది నాటి సంప్రదాయమేమో. దొంగల నుండి శత్రువులనుండి రక్షించుకొనుట కది యుపయోగ పడెడిదేమో. ఆ ప్రాకారమునకు వెలుపల చిత్రింపబడిన ఛండాల కుటుంబము చూడగనే వాస్తుశాస్త్ర పరిచయము గలవారికి, ఆ విషయ మధికముగా గల మానసార, కాశ్య పీయ, ఆగమ గ్రంథములు స్మరణమునకు వచ్చును. అందునూ నిట్లే, గ్రామ నిర్మాణమునుగూర్చి చెప్పునప్పుడు ఛండాలురు, మాలాకారులు గ్రామమునకు వెలుపల నుండ వలెనని ఉన్నది. ఇచట నా నిర్మాణము ముందా లేక దానిని చెప్పు గ్రంథము ముందా అని యోచించుట నమం జనమే. ఈ శిల్పములు క్రీ. శ. రెండవ శతాబ్దినాటివి. మరి గ్రంథములలోని విషయమంతకు ప్రాచీనమైనదైనప్పటికీ నిదమిత్థముగా కాలము చెప్పుట కుదురకున్నది.

అరణ్యములలో మహర్షుల నివాసములుకూడా అట్లే గుండ్రముగనూ, దీర్ఘచతురస్రాకారముగను యొప్పి యున్నవి. కాని యీ పర్ణశాలలు మట్టితోనూ; అకుల తోనూకాక పూరితోను చెట్లకొమ్మలతోనూ, ఆకులతోనూ, కట్టినట్లు కన్పించును. గోలిలోని యొకానొక శిలాఫలక



4. మిత్రవిందక కథను దెలుపు శిలాశిల్పము

మున విస్సంతరజాతక కథలో ఒక చక్కని పర్ణశాల అట్టిది కలదు.

## ఆలయములు

ఇక నిప్పుడు నాటి యాలయ నిర్మాణాదిక మెట్లుండె డిదో, పరిశీలించినచో దాని ప్రభావము దక్షిణదేశమునందలి తరువాతి యాలయ నిర్మాణవాస్తువుపై నెట్లు ప్రసరించి నదియు తెలిసికొనవచ్చును. జగ్గయ్యపేట, నాగార్జునుని కొండ, అమరావతి, మున్నగు ప్రాంతములలోని శిలాఫలక ములలో కొన్ని చోట్ల నట్టి యాలయ నిర్మాణము మూడు నాలుగు విధములుగ నున్నది. నాగార్జున కొండలోని శిల్పరీతి యమరావతిలో నంతకు పూర్వమే యుండుటచేత, నమరావతి, జగ్గయ్యపేటల, లోని శిల్పములను గమనించిన మన పరిశీలనము పూర్తికాగలదు.

జగ్గయ్యపేట, అమరావతుల, నిర్మాణకాలమున పెద్ద వ్యత్యాసము కానరాకున్నను వాని వాని శిల్పరీతుల పరిశీలించినప్పుడు జగ్గయ్యపేట శిల్పములే కొంత ప్రాచీ నములేమో యనిపించును. కావున జగ్గయ్యపేటలోని శిల్ప స్వరూపమే దక్షిణ భారతమందలి కళాస్వరూపమునకు ప్రథమోదాహరణ మనవచ్చును. అచ్చట మూడు నాలుగు



5. జగ్గయ్యపేట పుణ్యశాల

శిలాఫలకములున్నవి. కొద్దిగా పైపైన చెక్కినవి ఒక మోస్తరు జాగ్రత్తతోనే కాపాడబడినవి. వీనిలో మన పరిశీల నకు ముఖ్యమైనవి: ఒకటి, ఆలయమువంటి నిర్మాణముగల శిలాఫలకము; రెండు, మకరమును బోలిన జంతువుపై నిలబడి యొక స్తంభమును నానుకొనిన స్త్రీ విగ్రహముకల శిలాఫలకము. ఈ స్త్రీ విగ్రహమే తరువాత విజయనగర కాలముననూ, పిదపనూ, దేవాలయ గోపురములపై తప్పని సరిగా చెక్కబడిన సాలభంజికలకు మార్గదర్శకమయ్యె నేమో యనెడి యత్యూహచేతనేగాని లేకున్న దాని కంత ప్రాముఖ్యమేమీ కానరాదు.

## జగ్గయ్యపేట పుణ్యశాల

కాని ఆలయము చిత్రింపబడిన యా శిలాఫలకము (అయిదవ చిత్రము) మాత్రము మన దేవాలయ వాస్తువును గూర్చిన ప్రాచీన చరిత్రను తెలిసికొనుటకు ముఖ్యమైన యాధారముగ పనిచేయగలదు. ఇందు దేవాలయ వాస్తువు నకు సంబంధించిన ముఖ్యాంశముల ప్రాతిపదిక లున్నవి. అధిష్ఠానము, స్తంభములు, కప్పు, అందులో చాల ముఖ్య మైనవి. అది రెండంతస్తులు కలిగి పెద్ద చైత్యవాతా యనమువంటి యాకృతి నిర్మాణముచేత కప్పబడినది. దాని పునాది, దీర్ఘ చతురస్రాకారమగుటచేత, దాని యుపరి భాగమునూడ నట్లే యున్నది. కాని కప్పుమాత్రము రైలు పెట్టె మూతవలె వంపుగ నున్నది. అట్టి దీర్ఘమైన నిర్మాణ ములను శాలలందురు. ఈ శాలల నిర్మాణమున దక్షిణ దేశములో నివి యత్యంత ప్రాచీనతమమైనవి. ఇట్టివే బార్హుత్ (రెండవ శతాబ్దిలోను, సాంచీ (ఒకటవ శతాబ్ది) లోనూ, కలవు కాని జగ్గయ్యపేటలోని సార్థకనామధేయము గల పుణ్యశాలతో సాటివచ్చునవి కావవి! ఇవి బౌద్ధచిహ్న మైన బుద్ధపాదములపై నిర్మింపబడినది. కాని యిట్టి దీర్ఘ చతురస్రాకారపు నిర్మాణము తరువాతి కాలమున చక్రధారి యగు విష్ణువునకే యుద్దేశింపబడినది. ఆ శాలలోని వైశిష్ట్యమే తరువాత ఏడవ శతాబ్దినుండి నేటిదనుక దక్షిణ దేశమున వెలసిన దేవాలయములలో చాలావరకు పరా కాష్ఠనందుకొన్నవి. ఇట్టి యాకృతిగల శిలానిర్మాణము లలో ప్రాచీనమైనది మహాబలిపురమునందలి భీమరథము. పల్లవుల కింక కొంతకాలము పూర్వమునుండియే పై శాలా నిర్మాణ రీతి, కొన్ని ప్రత్యేకములైన ఆలయములకునూ, మహాబలిపురమునందలి ధర్మరాజరథములోవలె కొన్ని పెద్ద పెద్ద దేవాలయములలోని విమానములమీది యొకటి రెండు అలంకార నిర్మాణములకునూ, ప్రాకియుండునన వచ్చును. క్రమముగా కొంతకాలమున యా శాలా నిర్మాణ

రీతి యాలయ ద్వారమందు మాత్రమే మిగిలి, మరికొంత కాలమునకు పెచ్చుపెరిగి, పెద్దఎత్తున గోపురమై దేవాలయమున కంతటికిని ప్రధానమై, నపష్టమీద భారతీయ సంస్కృతికి దక్షిణదేశమున చిహ్నమై నిలబడినది. ఈ రీతి నిర్మాణములను పెంచి పెద్దచేసి దక్షిణదేశ దేవాలయ వాస్తువును విస్తరించిన విఖ్యాతి విజయనగర రాజులదే అని మరియొకతూరి చెప్పుటలో తప్పులేదు. వారి కాలమునసే రాజులు, మంత్రులు, తిరువణ్ణామలై, మధుర, చిదంబరం, మున్నగు ప్రాంతములలో అట్టి యాకాశగోపురములను కట్టించిరి. అద్భుతమైన యా నిర్మాణాభివృద్ధిని గాంచిన ఆశ్చర్యమగును. అట్టి శాలలలో ప్రాచీనమైనది జగ్గయ్యపేటలోని పుణ్యశాల.

పైచెప్పిన యా శాలానిర్మాణ రీతియే అమరావతి, నాగార్జునకొండలలోని శిలాచిత్రములలోకూడా కాననగును. అట్టివానిలో మునుపు చెప్పిన వృక్షచైత్యము ఒకటి. కాని వీని రీతి చతురస్రాకారము కాక గుండ్రముగ నున్నది. బోధివృక్షముగల యా నిర్మాణ రీతియే చతురస్రముగను, యెనిమిది పలుకలుగను, గల నిర్మాణములలో సైతము గ్రహింపబడినది. దీనినిబట్టి దక్షిణదేశపు దేవాలయములందు పైచెప్పిన తీరులన్నియు నుండినవని గట్టిగ చెప్పుటకు వీలుకలుగుచున్నది. ఈ విషయమే దక్షిణదేశ మండలి సాహిత్యమునందును ముఖ్యముగా సంగమ సాహిత్యమునందునూ ప్రస్తావింపబడినది.

## స్నిగ్ధమధురమైన కౌశలం

ఈ వ్యాసము ముగించులోపల మరియొక ఆలయ నిర్మాణ రీతిని, దాని వికాసమునుగూడ పరిశీలించుట కొంత అవసరమేయగును. అదియొక అండాకారపు నిర్మాణము—(ఆరవ చిత్రము)—అమరావతియందలిది. లోన నొక స్తంభపు టడుగున నాలుగు పలుకలలో నొక పక్కన యలంకార శిల్పముగ స్తూపము. స్నిగ్ధమధురమైన యా పనితనము ఆ నిర్మాణము చూడ నదియొక పుణ్యమందిర మని తోచును. అట్టి యండాకారపు మందిర నిర్మాణములు నాడునూ, తరువాతనూ దేశమున నెన్నియో వెలసినవి. స్తూపి శిఖరముగల యా యండాకారపు నిర్మాణ మిచట పలుచని, గుండ్రని స్తంభములపై యాధారపడియున్నది. అవి కొన్ని చిత్రములు చెక్కిన యధిష్ఠానములపై నిలుపబడియున్నవి. ఈ పద్ధతియే దక్షిణభారత వాస్తు శిల్పమునందు తరువాతికాలమున ప్రపంచింపబడినది. ఈ అండమైన చిన్ని మందిరమున స్తూపము, వృక్షము చెక్కబడుటచేత నీ తీరు తక్కినవానికన్న పుణ్యతమ మైనదని తలపవచ్చును. అందుచేత నాకాలమున నాలయమున కండాకారపు శిఖరములే తయారైనవనిన వింతలేదు. ఈ శిఖరములలోనేగాక ప్రసిద్ధమైన దక్షిణదేశపు దేవాలయములలో వెండి, బంగారములతో చేయబడిన గోరథములందుకూడ నీ తీరు కాననగును. ఇదికాక మరియొక వింత ఏమనిన శ్రీ కంచికామకోటి పీఠాధిపతి పూజించెడి యున్నత విగ్రహపు విమానముకూడ నిట్టి యాకారముకలదే. ఈ తీరు విమానరచన సిద్ధులకు మహాపురుషులకు పూజార్హమగుట



**6. అండాకారముగానున్న మందిరము**
**అమరావతి**

చేత, నంతకు పూర్వమే వైదిక సంప్రదాయము చొప్పున చేయబడిన దీనిని తరువాత బౌద్ధులుకూడ గ్రహించిరి. ఆనాటి ఋషులు సన్యాసులు నివసించెడి ఆవాసములు కూడా చాలవరకు ఆనాడు యీ తీరుననే యుండెడివి. అయితే, దీనికిని పై యావాసములకును భేదమొకటి గలదు. వారి యావాసములు, పర్ణశాలాదికములు; కొమ్మల తోడనూ, రెమ్మలతోడనూ కప్పబడినవి. కాని నాలుగు స్తంభములపై నిలిపిన యీ విమానములు కప్పులేక బోలుగా నుండును. వారణాసిలోని విశ్వనాథ ఆలయ విమానముకూడ నిట్టిదే యనుట. గమనింపదగిన విషయము. నేటికిని యీ విమానమునకేవైపుననూ కప్పులేదు. చిదంబరములోని దేవాలయ విమానముకూడ నిట్టిదే యనవచ్చును. అచట నున్నది యాకాశలింగము. తరువాత కట్టడములు పునర్నిర్మించుటలో నటు నిటు కప్పు వచ్చినదికాని నేటికినీ విమానపు పైభాగమున కప్పు లేకయున్నది. దానిని పరిశీలించిన బహుశః ఇదియు నట్టి నిర్మాణమే యని తోచును.

ఆంధ్రాపథములోని ప్రాచీన బౌద్ధకళా విశేషములైన వాస్తు శిల్పములయందు ప్రదర్శింపబడిన నిర్మాణములు నాటికి పూర్వమెంత కాలమునుండియో దేశమున వ్యవహారముననుండి నాడు ప్రఖ్యాతమైనవని మనము విశ్వసింపవచ్చును. తరువాతికాలమున దక్షిణదేశమున దేవాలయ వాస్తు వభివృద్ధిచెంది యన్ని ముఖముల నా పవిత్ర రూపము లనే పెంపొందించుకొనినది. ఆంధ్రాపథమున నప్పటి సామాన్యుల ఇండ్ల నిర్మాణముల తీరులే నేడు నానాట నా తరగతివారికి నిలచియున్నవి. దీనినిబట్టి సామాన్యముగ దేశమున సామాన్య జనులు సంప్రదాయ బద్ధమైన వానినట్లే, వాని వైశిష్ట్యమునుబట్టియు, సర్వకాల సర్వావస్థలయందును వాని యుపయోగములను బట్టియు ననుసరించుచుందురను విషయము తెల్లముకాగలదు.



పూర్ణకుంభం – ఘంటసాల

# కృష్ణామండలంలో ప్రాగైతిహాసిక యుగం

డాక్టర్ బెండపూడి సుబ్బారావు

రమారమి అయిదు లక్షల సంవత్సరముల క్రితము ఈ భూప్రపంచమున ఆదిమ మానవుల జాడ గోచరించుచున్నది. నాగరికత చరిత్రకు ఆనాడే నాందీప్రస్తావన. మానవచరిత్ర, సంక్షిప్తముగా చెప్పవలెనన్న ప్రకృతి శక్తులనెడి పంజరమున చిక్కుకుని, దాస్యములోనున్న మనిషి, క్రమేపీ, ఆ ప్రకృతి విధానముల నాకళింపు జేసుకుని, వానిని మానవాభ్యుదయమునకు వినియోగించుకొను మానవ శాస్త్రజ్ఞుడుగా మారుట యనవలెను. ఈరీతిగా, ఆదిమ మానవుని నిత్య నైమిత్తిక జీవితమున ఏ క్రొత్త విషయము లభించిననూ—యేదేని క్రొత్త పనిముట్టు కావచ్చునుగాక, నూతనమైన ముడిపదార్థమే యగుగాక, లేదా సరికొత్తది, అపూర్వమైన పద్ధతియేదేని కనుగొనుట యగుగాక, ఏదైననేమి, విరామసమయంలో అతని మేధాశక్తిని వినియోగించుటకు తోడ్పడినదైన జాలును —అది మానవాభ్యుదయమునకు దోహదకారియయినది. మానవ నాగరికతపై మహత్తరమైన ప్రభావము చూపిన ముఖ్య ఘట్టములలో వ్రాతయను నదొకటి. ఈ వ్రాత యనునది కనుగొనుటతో మానవచరిత్రలో నొక యుగము, "ప్రాగైతిహాసికయుగము" సమాప్తమైనది. దీనికినీ, మనము "చరిత్ర"గా గుర్తెరిగిన యుగమునకునూ భేదమేమన ఈ రెంటవదానికి లిఖిత పూర్వకమైన సాక్ష్యములుండుటయే.

ఆంధ్రదేశమున మానవుని చరిత్ర ఈ మండలమునందలి ముఖ్యమైన నదుల లోయలలో నాదిమ కిరాతుడు ఆహారాన్వేషణము ప్రారంభించిన యా పురాతనకాలమున ప్రారంభమైనది. నాటిమానవు డొక విచిత్రమైన జంతువనవలెను; జంతువేగాని జీవశాస్త్రరీత్యా, యెంతో పరిణామము జెందిన జీవి. "చక్కని నాసికలుగాని, అనువైన అరిచేతులుగాని నాటి మన పూర్వీకులకు లేవు." కాని ఆదిమ మానవుని కుండిన యీ లోపము నిజమునకు దైవికమైన యొక రక్ష. అతని యండదండలు రెండు. ఒకటి నిశారుగా నిలువగల శక్తి. రెండవది యితగాని చేబొటనవ్రేలు. తక్కిన వేళ్ళతో దీని నితడు జతపరచగలుగుట మరియొక అద్భుతమైన విషయము. ఇట్టి శక్తివల్లనే మానవుడు తన చేతితో, రకరకముల పనిముట్లు సృష్టించుకొనగలిగినాడు.

ఆ యీ రాతి పనిముట్లు ఆంధ్రదేశమందలి నదీ లోయలలో సమృద్ధిగా నున్నవి. ఈ సాధనములను తయారుచేయుటయే మానవ చరిత్ర కీ మండలమున తొలి పలుకు. ఈ లోయలగుండా ప్రవహించు నదీ జలములు జీవుల నాకర్షించెడివి. ఆ జీవులపై యాధారపడు యీ వేటగాడును అచటనే నివసించెడువాడు.

## పరిశోధనలు

దేశపటముగాని. లేదా ఆంధ్రమండలపు పటమునుగాని, చూచిన నొక విషయము స్పష్టమౌతున్నది. కృష్ణా గోదావరి డెల్టా ప్రాంతముల, వ్యవసాయముతో జీవిక నిర్వహించెడివారు హెచ్చుగా నుండుట. అనాదిగా యీ మండలములు మానవజాతి నాకర్షించినవి. దురదృష్టమేమన, ఆంధ్రదేశపు ప్రాగైతిహాసికయుగమునుగురించి శాస్త్రీయమైన క్షేత్ర పరిశోధన తగినంతగా సాగలేదు. అందువలన యీ విషయము గూర్చిన మన జ్ఞానము సందిగ్ధముగా నున్నది. కాని యిట్టి పరిశోధకులలో నగ్ర తాంబూలము రాబర్ట్ బ్రూస్ ఫుట్ అనునతనిడి. అగుటకు భూతత్వపరిశోధకుడే యయిననూ, ఆయనకు పురాతత్వశాస్త్రముపట్ల ప్రేమ మెండు. మద్రాసు మ్యూజియము నిండ నీయన దక్షిణ భారతము నాలుగు చెరగులనుండి సేకరించిన పురాతత్వ సామగ్రి కొల్లలుగా నున్నది. ఆయన తరువాత, ఎఫ్. జె. రిఛర్డ్స్, ఎల్. ఏ. కామ్మియెడ్ అను నిద్దరు సివిల్ ఉద్యోగులు ఆంధ్రతీరమున సమగ్రమైన యన్వేషణ సాగించిరి. కర్నూలుజిల్లాలో కృష్ణలోయ యెగువ ప్రాంతమునగూడ నీ పరిశోధన సాగినది. ఇటీవలికాలమున, నీ వ్యాసరచయిత గూడ, బళ్ళారిజిల్లాలో, కొంత కృషి జరిపెను. (పూనాలోని దక్కన్ కాలేజి పరిశోధనాసంస్థ తరపున)

| కాలము | | విషయము |
|---|---|---|
| శాతవాహనయుగము |  | కొత్తపనిముట్లు శాతవాహన రోమక నాణెములు |
| ఖననపేటికల కాలము |  | ఇనుప పనిముట్లు ఎర్రని నల్లని కుండలు—ఖనన పేటికలు |
| తామ్రశిలా యుగము |  | చక్కని మట్టిపాత్రలు—రాగి కంచు పనిముట్లు |
| నూతనశిలా యుగము |  | పనితనము గల రాతిగొడ్డళ్లు—వ్యవసాయము, పాడి ప్రారంభమైనకాలము |
| చివరి శిలాయుగము |  | సున్నితమైన రాతిపనిముట్లు |
| మధ్యమ శిలాయుగము |  | చెక్కుడు సాధనములు |
| తొలి శిలాయుగము |  | చేతి గొడ్డళ్ళు |

## కృష్ణామండలమున ఆదిమానవులు

ఆంధ్రదేశపు యీ మొదటి మనిషి యేనాటివాడు? సౌరమానప్రకారము నిర్ణయించిన యీ మన 365¼ రోజుల ఒక సంవత్సరముగా గల కొలబద్ద దీనికి చాలదు. గౌరీ శంఖర శిఖరము కొలుచుటకు సెంటిమీటరు యెంత యుపయోగమో ఇదియుసంతేనని ఒకరు చక్కని యుపమానము నెత్తి చూపినారు. కాని, సుదీర్ఘములైన యీ యుగములలో శీతోష్ణస్థితులుగూడ మారుచుండినవి. ఈ మార్పులే యొకనాటివో కావు. ఎంతలేసి కాలమో పట్టెడిది. పూర్వచారిత్రక పరిశోధకులు వీనికి సాక్ష్యము లెచటనా? యని యన్వేషించుచుందురు. మద్రాసునుంచి కలకత్తా వరకుసూ, తూర్పుకోస్తా వెంబడి ప్రయాణముచేస్తే, రైలు దారికి రెండువైపులా, యెర్రని బొంతరాయి తుప్పలు కనిపిస్తవి. ఇటువంటి రాయి, భూమిమీద యేర్పడుటకు, యెంతకాలమో, కుంభవృష్టిపడి, తర్వాత యింకా కొంత కాలము, వాతావరణము పొడిగానుండి. మరల కడప పోతగా పర్షించిసగాని, పరిస్థితు లనుకూలముగాపని భూతత్వశాస్త్రజ్ఞులు అంటారు. నిజానికి, కేరళ, కొంకణ తీరాలలో నేడుగూడా యీ స్థితి గోచరిస్తోంది. ఈ శాస్త్రియమైన వివరాలు విడిచినా, మనకొకటి స్పష్టముగా తెలుసు. నేడు అటువంటి పరిస్థితులు లేవు. కాని ఒకప్పుడుండిసవి. ఆంధ్రదేశపు పురాచరిత్ర పరిశోధనలో యిదొక ముఖ్యాంశము. ఎందువల్లనంటే, యీ మండలములో ఆదిమ మానవుడు యీ వాతావరణపు మార్పులు చూచాడు అతను వాడిన పనిముట్లు యీ తుప్పలలో దొరుకుతున్నవి.

భారతదేశపు వివిధ భాగములలో జరిపిన పరిశోధనలు ఆధారంగా తీసుకుంటే, కృష్ణా మండలములో మానవ చరిత్రకు సుమారు నాలుగు లక్షల సంవత్సరముల క్రితము నాందీ వాక్యము జరిగినదనవచ్చు.

అర్షశాస్త్రజ్ఞులు మానవ చరిత్రను కొన్ని యుగాలుగా విభజిస్తారు. ఆయా యుగములలో మానవులు ప్రధానముగా యెటువంటి పరికరములు వాడినారో దానినిబట్టి వీటికి నామకరణముచేస్తారు. వీటిలో మొదటిది 'శిలా యుగము'; ఇదిగూడ, ఆది శిలాయుగము, మధ్య శిలా యుగము, తరువాతి శిలాయుగము అని మూడు దశలు. రాతి పనిముట్లు చేతలో, ఒక యుగముకన్న మరొక దానిలో పనితనము యెక్కువగా నుండుటబట్టి యీ పేర్లు. అటుపైన వ్యవసాయమనునది కనుగొన్నారు. ఇదొక విప్లవాత్మకమైన మార్పు తెచ్చినది. దీనితో ప్రకృతిపై మానవునికొక బ్రహ్మాండమైన యధికారమేర్పడినది. వేట జీవితపు ద్రిమ్మరి బ్రతుకు విడిచి, పంటలు పండించుకునేందుకు యేదో ఒక కొంత భూమి యెన్నుకుని స్థిరపడ గలిగినాడు. కాని యీ దశలోగూడ యితగానికి లోహముల వాడకము తెలియదు. అందువలననే దీనిని "కొత్త రాతి యుగ" మనినారు.

మనిషి ఆర్థిక జీవితములో గొప్ప మార్పు తెచ్చిన మొదటి లోహము రాగి. దానితో కలిసి తయారగు కంచు. కాని అంతకు ముందు సాగిన సంధికాలములలో, రాతిని పూర్తిగా విడిచివుచ్చుట సాధ్యముకాలేదు. అందువల్ల దీనిని త్రామ్రశిలాయుగ మనినారు. అనగా, రాగి, రాతి పనిముట్లు వాడుకలో నున్నకాలము. ఇంతలో ఇనుము వచ్చి పడినది. చవుక. దిట్టమైన ముడిపదార్థము. దీనిని "ఇనుప యుగము" అనవచ్చు.

ఆంధ్ర విషయము చూతము. క్రీస్తుకు పూర్వము 200 యేండ్లనాడు, శాతవాహనుల కాలమునకు ముందు, అనగా మొదటి చారిత్రక శకమునకు ముందు యీ పూర్వ చారిత్రక దశలన్నియూ గోచరిస్తున్నవి. కృష్ణలోయలో, ఆంధ్రచరిత్రలో, శాతవాహనయుగమే మొట్టమొదటి ప్రధాన ఘట్టముగదా?

## మొట్టమొదటి పనిముట్లు

ఆది శిలాయుగపు పనిముట్లు మొరటువి. చేతి గొడ్డళ్లూ, చెక్కుడు రాళ్లూ, గోకుడు రాళ్లూసూ. శిలాస్ఫటికముతో తయారయిన యివి నదీగర్భములయందు చిత్తవిత్తుగా నున్నవి. తూర్పు కోస్తావెంబడి, మెట్టప్రాంతాలలోనూ, కర్నూలు జిల్లాలో తట్టునా, కొండచరియలపైన గూడా యివి బొంతరాతిలో కనిపిస్తున్నవి. మొట్టమొదట ప్రకృతి శక్తుల ప్రభావమువల్ల యేర్పడిన యీ బొంతరాయి, నదీ ప్రవాహముల వేగమువల్ల అరిగిన తదుపరి, ఆ స్థితిలో, యీ పనిముట్లు గోచరిస్తున్నవి. ఈ పనిముట్లుకాక, తన అవసరాలు యింకా వుంటే వాటిని కొయ్య పనిముట్లద్వారా తీర్చుకుంటూ, ఆనాటి మానవుడు జంతువుల్ని వేటాడేవాడు. తన స్వరక్షణకుగూడా వీటిని ఉపయోగించేవాడు. ఈనాటి చెంచుజాతివంటి ఆదిమవాసులవలె, రాతిగొడ్డళ్లతో పండ్లు రాల్చుకుంటూ, కొనదేరిన కర్రగునపాలతో, దుంపలూ, వేళ్ళూ తవ్వుకుంటూ నాటి మానవులు జీవించేవారు. ఈ కర్ర గునపాలన్నవాటి వాడిమొనలు, కర్రల మొన కాల్చి తయారుచేసేవారు. ప్రధానంగా వీరు నదీ తీరాల్లో వుండివుండాలి. కాని, గుహలలో నివసించడం గూడా కద్దు. కర్నూల్‌దగ్గఱ బిల్లసుర్గమువద్ద నున్న గుహల్ని అర్షశాస్త్రజ్ఞులు యింకా పరిశోధించాల్సి



శైశవ బోధిసత్త్వుని సమర్పణము.

క్రీ. వె. 11వ శతాబ్దపుది: అచ్చుటచ్చుట బంగారు మలామా చేయబడిన మృణ్మయ శిల్పము (పేగన్, బర్మా)

వుండి. వీనిలో నెట్టి యమూల్యగాథ దాగియున్నదో యెవరికెరుక.

## తరువాతి శిలాయుగపు మనుష్యులు

తరువాతిది మధ్య శిలాయుగము. ఈ కాలములో రాతి పనిముట్లు చిన్నవి. మంచి పనితనము చూపునవి. మరి యొక విశేషము. కొంత కొంత విలువగల శిలలతో తయారైనవి. ఇప్పటి మనిషి, చాకులవంటి, పదునువర గల సాధనాలూ, గోకుడు సాధనాలూ, వీటన్నిటికన్న మొనగల "బూరిన్" అనే వింత పనిముట్లూ చేయుట ప్రారంభించినాడు.

కానయితే, యితగాని జీవితములో ప్రధానమైన మార్పు అట్టే వుండివుండదు.

ఈమధ్యశిలాయుగము తర్వాత వచ్చిన తరువాతి శిలా యుగములో గూడ, నాజూకైన చిన్న చిన్న పనిముట్లు తయారుచేసి వాడే ధోరణి కనిపిస్తుంది. అరంగుళము మొదలు సుమారు రెండంగుళముల వరకూ వుండే చక్కని పనిముట్లు తయారయిన రోజులవి. వీటిని "కురుచ పని ముట్లు" అనేవారు. పశ్చిమ ఆశియాలోనూ, ఆఫ్రికాలోనూ యిట్టి పనిముట్లు, కొయ్యలతో, బొమికతో చేసిన సాధనము లకో తగిలించి వాడినట్లు తెలును. ఈ ఆంధ్ర లోయలలో గూడ అటువంటిదే జరిగియుండవలెను. వేటకాండ్రుగా, జాలరులుగా, యీ మనుష్యులు ఆహారము సంపాదించే వారు. కృష్ణా గోదావరి మండలాలు రెంటిలోనూగూడా యిటువంటి వేటల చిహ్నాలు దొరెకుచున్నవి.

## శిలాయుగపు ఆంధ్రుడు

దీని వెనుకటి ఘట్టములో, మొట్టమొదటి సారిగా వ్యవ సాయ జీవనము మానవ చరిత్రలో కనిపించుచున్నది. శాస్త్ర పరిభాష రీత్యా, నాటి మానవులు శిలాయుగమునకు చెందినవారే. కాని, వ్యవసాయము బతుకుతెరువైనది. అందువలననే వీరిని కొత్త రాతియుగపు మనుష్యులనుట. తమ పొలాలవక్క, కొండ కొమ్ముల మీదగాని, పర్వత పాదములవద్దగాని నివసించువారు. ఇట్టివి కృష్ణలోయ లోనూ, డెల్టా ప్రాంతమందునూ యెక్కువగా కనిపిస్తున్నవి. కాని కృష్ణకి ఉపనది యయిన తుంగభద్ర లోయలో కను పించుచున్న వాటిద్వారా మనకు యీ విషయముగురించి ఎక్కువ తెలుస్తున్నది. వీరు ప్రాజ్ఞులు; ఏలనంటే, తమ పనిముట్లు చేసుకొనుటకు అనువైన రాయి గల ప్రాంత ములలో నివసించెడువారు. ఈ రాయి సమృద్ధిగా వుండే చోట్ల, నల్లని సాలగ్రామపు రాతి చరియలమీదనో, వాని లోనో వుండేవారు. వీరి సాధనాలన్నిటిలోకీ వింతయైన దొకటి ఒకరకపు గొడ్డలి. ఇది ఒకవైపున అర్ధచంద్రపు టుబ్బెత్తు యాకారము. రెండవ వైపున సాదా యాకారము. దీని నొక కర్రకి కట్టెడివారు. ఇది యొక చిన్న చేతి నాగలిగా ఉపయోగించువారు.

నేడుగూడ దేశమున ననేక ప్రాంతములలో, ఎందరో యాదిమ జాతులవారు ఈరకపు వ్యవసాయము సాగించు చునే యున్నారు. ఇక వారి యితర సాధనములు,— గొడ్డళ్ళూ, గునపములూ, ఉలులూ, వడిశెలలూ, పదును రాళ్ళూ, అన్నీ రాతితో చెక్కినవే—ఈప్రాంతములలో గీసిన బొమ్మలు కనిపిస్తున్నవి — బొమ్మలనుటకు వీలులేదు. బొమ్మలవంటి వనవలెను—. వీనినిబట్టి వీరికి పశువులను పెంచుట తెలియుననిపించుచున్నది.

ఈ మానవ నివాసము లేనాటివో, వాని యారంభ మెట్టిదో మనకు తెలియదుకాని సుమారుగా క్రీస్తుకు వేయి సంవత్సరములకు పూర్వము, యీ రకపు మనుష్యులకు, లోహపు పనిముట్లు వాడు మానవులతో సంబంధమేర్పడినది. అసలు ఈ లోహముల వాడుక నెరిగినవారు, ఈ రాతి పనిముట్ల వారిపై నాధిపత్యము సంపాదించిరి.

## లోహయుగము

ఈ సమయమున దక్కను పీఠభూమి మధ్య ప్రాంత మున ప్రవేశించిన యీ కొత్త మనుష్యులకు రాగి, కంచు వాడకము తెలియును. మరియొక విశేషమేమన, వీరు చక్కని రంగువైచిన, చిత్రములతో తీర్చిన మృణ్మయ పాత్రలు చేయుట యెరుగుదురు. ఈ కళగూడ, వీరివెంట వచ్చినది. మొదటికాలపు రాతిపనిముట్ల బదులు, చక్కని, సున్నితమైన, కొత్తరకపు రాతి పనిముట్లుగూడ వీరితో వచ్చినవి. ఇంకనూ వీరికి కొత్తగా అప్పుడప్పుడే మానవజాతి గుర్తెరుగుచున్న రాగియొక్క వాడకము తెలియును. అందువలననే వీరిని తామ్రశిలాయుగమువారని శాస్త్రజ్ఞు లనుట. మిస్టర్ ఫుట్ సేకరించిన పురావస్తు సామగ్రిలో నిట్టి పనిముట్లునూ, అక్కడక్కడ మట్టిపాత్రలునూ దొరి కెనుగాని, యివి బళ్లారి ప్రాంతపువి. ఇట్టి సంస్కృతి తూర్పుదిశగా కృష్ణానది డెల్టావరకును వ్యాపించెనో లేదో మనకు స్పష్టముగా తెలియుటలేదు. కాని, కృష్ణా గోదావరి మండలములలోగూడ నిట్టివి విరివిగా గోచరించుటవలన, ఆంధ్రదేశమునకు కీలకస్థాన మనదగు నీ ప్రాంతమునకు గూడ యీ సంస్కృతి వ్యాపించినదని యనుకొనవచ్చును.

చరిత్ర యనునది ప్రారంభమగుటకు ముందుగానున్న యీ మన ప్రాచీనులలో చివరి వారు యినుపపనిముట్లు

బహుళముగా వ్యాప్తికి తెచ్చిరి. రకరకముల పనిముట్లు, యీ యినుముతో తయారుచేసిరి. చక్కని మట్టిపాత్రలు చేసెడివారు. ఈ కుండల లోపలిభాగము నలుపు; పైన యెరుపో, గోధుమవన్నెయో నుండెడిది. ఇదొక ప్రత్యేకత. ఆవములో యీ పాత్రలను పచ్చి దశలో తలకిందుగానుంచి కాల్చెడివారు. రకరకపు వైడూర్యమువంటి అమూల్యమైన శిలావిశేషములతో చక్కని పూసలు చేసెడివారు. బంగారపు పూసలుగూడ యెరుగుదురు.



అమరావతి శిల్పకౌశలం

## ఖననపేటికలు

కాని అన్నిటికన్న విశిష్టమైనది వీరి సమాధిపద్ధతి. పెద్ద పెద్ద గదులవంటి సమాధులు కట్టువారు. కొన్నిచోట్ల భూమిలోను, మరికొన్నిచోట్ల పైనగాని సమాధులుండెడివి. ఇంతేకాదు. మట్టితో ఖననపేటికలుగూడ వీరు తయారు చేయగలరని తెలియుచున్నది. కడపజిల్లాలో నిట్టి దొకటి ఒక పొట్టేలు రూపపుది దొరికినది. నేడిది మద్రాసు మ్యూజియమున చూడనగును. అసలు శవమును ప్రకృతికి విడిచెడివారు. కొన్ని ప్రత్యేకమైన యస్థులు యీ ఖనన పేటికలలో నుంచువారు. రాతితోచేసిన యీ పెద్దపెద్ద దయ్యపు పేటికలకు తెనుగున 'రాకాసగుళ్లు' అనియెడు గమనించదగ్గపేరు కలదు ప్రపంచమున నింతే. అజ్ఞాన మనునది కప్పుటకు యేదో మాయ, యేదో గాథ యనున దొకటి యుండును. అజ్ఞానులగు ప్రజలు వీటిని "పాండవుల రాళ్లు'. "పాండవుల యిళ్లు" అని యందురు. కన్నడ జిల్లాలలో వీటికి "మోరియార్ మానె" అని పేరున్నది. అనగా మరుగుజ్జుల యిండ్లని యర్థము. ఈ సమాధులలో యెన్ని రకములున్నవో యిందలి వస్తుసామగ్రి యెట్టిదో చెప్పుటకిది యువను గాదు. కాని, క్రీస్తుకు అయిదువందల సంవత్సరములకు పూర్వమివి యాంధ్ర దేశమున నుండె నట్లు చెప్పదగును. ఇవి సాంకేతికముగా చూచిన నెంతో తెనుగుమిరినవని యిదివరకే తెలిపినాను.

కృష్ణా, గోదావరీ లోయలలో, వ్యవసాయ బృందములుగా, ఆంధ్రదేశ చరిత్ర ప్రారంభముకాకముందు నివసించినవారు ఈ ఖనన పేటికల వారు. నేటి యాంధ్రులకు నాగరికత ప్రసాదించిన మొదటి పూర్వీకులు వీరే. ఉత్తర భారతదేశమున గంగానదీ ప్రాంతమున, సాంస్కృతిక విషయములలో జరిగిన చారిత్రాత్మకమైన మార్పుల ప్రభావము—సారస్వతము, కళలు, శిల్పము, మతము—అన్ని రంగములలోనూ గలిగిన పరిణామములు ఆంధ్ర భూమిపై ప్రసరించితీరక తప్పలేదు. ఆంధ్ర మండలము విశాల భారతభూమిలోని ఈ మార్పులకు వైదొలగి యుండ జాలకపోయెను.

ఇంతలో బౌద్ధము వచ్చెను. క్రీ. పూ. 300 యేండ్ల క్రితమో, అంతకు కొంచెము తరువాతనో, ఇది యాంధ్ర భూమికి క్రమముగా ప్రాకెను. కాని, శాతవాహనుల సామ్రాజ్యస్థాపనముతో, దక్షిణభారతమున గల బౌద్ధమత కేంద్రములలో కృష్ణామండల మొకటి యైనది.

# దిగంతాలకు వ్యాపించిన ఆంధ్రశిల్పవైభవం

## శ్రీ పి. ఆర్. రామచంద్రరావు

భారతీయ చరిత్రలో ప్రప్రథమంగా, ఒక నూత్న సాంప్రదాయాన్ని, దాదాపు విదేశ శిల్ప ప్రభావాలు ఏమాత్రం అంటని స్వయం ప్రతిభావిధానాన్ని, ప్రవేశ పెట్టిన ప్రాముఖ్యమూ, అంతేకాక తదనంతరం దాక్షిణాత్య, తూర్పు ఆసియా, శిల్ప రీతులపై అపారమైన ప్రభావం పరపించుకొన్న విశిష్టత్వమూ,—ఇవి ఆంధ్ర శిల్పశైలి విఖ్యాత లక్షణాలు.

పాట్నా, పర్ఖామ్, బేస్‌నగర్ మొదలైన చోట్ల దొరికిన, ఏకొద్ది, వేళ్ళ చెక్కడాలనో, మినహాయిస్తే మౌర్యసామ్రాజ్యం నాటి శిల్పకళ అంతా, పెర్సిపోలిస్ శిల్పకళా జన్యమై, శిల్ప రీతి దిద్దుకొన్నవే! కాకపోతే, పెర్సిపోలిస్, సూసా, శిల్పకళలు కూడా, ఒక సమీచీన మూల ప్రాచ్యశిల్ప విధానంలో నుంచే ఉద్భవించి ఉండవచ్చును. ఆ మౌలిక శిల్ప వారసత్వమే భారతశిల్పానికికూడా, నిస్సంశయంగా సంక్రమించి ఉండవచ్చును. కాని అశోకుని నాటి శిల్పము, తన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని భారత శిల్పచరిత్రలో ముద్రించుకోలేకపోయిందని, ఆతర్వాత శుంగశకంలోకూడా, శిల్పకళ, మౌర్య వారసత్వంతోనే పెంపొందింది. కేవలం శైశవావస్థలోనే మిగిలిపోయి, ఒక వ్యక్తిత్వాన్ని ఏర్పరుచుకోలేకపోయిందనీ మాత్రం విషయ నిరూపణ చేసికోక తప్పదు. తద్రీత్యా బర్హూత్ శిల్పం, ఎన్ని ఆదిమ శిల్పవిన్యాసాల జీర్ణించేసికొన్నా, కేవలం పూర్వపద్ధతికంగానే మిగిలిపోయింది. కాని, సాంచి శిల్పాలలో ప్రబల ఝంఝామారుతంగా విజృంభించిన స్వాతంత్ర వాయువు, బర్హూత్ శిల్పవీథులలో చికిలి సందులను సన్నసన్నగా పూరించుకొంటూ రావటం మాత్రం కనబడుతూనే ఉంటుంది.

సాంచీ శాతవాహన శిల్పసృష్టిలో, సాంచీ స్తూప దిగ్ద్వార శిలావిన్యాసాలలో, భారతీయ శిల్పకళ మహోజ్వల పరిణామమంది పరిపూర్ణ వికాస మందుకొంది. సాంచీ, శిల్ప శాస్త్ర సౌందర్య సర్వస్వానికి కాణాచియై, మహోన్నత వైభవంతో, ప్రతిభా భావితము అయిన ఒక నూత్న ప్రపంచంలో అడుగిడినట్లు అనిపిస్తుంది. ఇచట భారతీయ శిల్పకళ, శిల్పప్రాథమిక సూత్ర నూత్న సమ్మేళనంతో, ఒక కొత్త పరిమాణాన్ని సృష్టించుకొంది. భిత్తికా శిల్ప రచన ఉబ్బెత్తు వంపుల సేకరించుకోటంలో విగ్రహ శిల్ప రచన స్థాయికి సామీప్యం అందుకొంది. అయినా విగ్రహ రచనావిధానంమాత్రం ఇంకా పూర్వపు ఏకీకరణవిధానం లోనే ముద్దకట్టుకొని, దేవతల, ఉపదేవతల రూపాలు వాళ్ల పౌరాణిక సంపర్క స్వరూపాలలోనుంచి వెలివడక పూర్వరీతినే మిగిలిపోయాయి.



మిథునము - నాగార్జునకొండ శిల్పసౌందర్యానికి మచ్చుతునక



చైత్య శిలాఫలకమున మలచిన బుద్ధదేవుని కమనీయమూర్తి - నాగార్జునకొండ

శిల్పకళలో ఈ విప్లవం రావడానికి, బౌద్ధమతమే మూల శక్తి అని సువిదితమే. శిల్పవాస్తు పురోగమనం, బౌద్ధమత పరిణామాల కనుగుణంగా తదాధ్వర్యంక్రిందే జరుగుతూ వచ్చింది. పశ్చిమభారతంలోని, బేడ్సా, కొండేణి, పిత్తల కోరా, అజంతా, నాసిక, కార్లి, ఇత్యాది స్థలాలనున్న ఆంధ్ర చైత్య ఆరామాలలోని, కట్టడాలు, శిల్పం ఒక ప్రశాంత గంభీరస్థాయి నందుకొని అక్కడి చెక్కడపు పని అంతా, ఉన్నత మతాశయాలకే నిశితంగా అంకితమై కనబడు తుంది. బౌద్ధమతము, దృఢమైన స్థావరాన్ని ఏర్పరచుకొని, అంతకుమునుపటి స్థానికనైసర్గిక మతాల, దైవాల, ప్రాప కంగాని అవలంబనగాని అక్కరలేకుండానే నిలదొక్కుకు రాగల స్థాయిని చేజిక్కించుకొంది.

ఇదేకాలంలో, శాతవాహన సామ్రాజ్య పూర్వ దిగ్భా గంలో, ఆంధ్రులు, భవిష్యద్భారత శిల్పస్వభావాన్నంతను మార్చి తీర్చిదిద్దగల ఒక మహోన్నత శిల్పసాంప్ర దాయాన్ని నూతనంగా సృష్టించికొంటూ వచ్చారు. కృష్ణా నదీ మండలంలో భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాలలలో మహోన్నత స్తూపాలు, మణిహారంలా నిర్మింపబడ్డాయి. సాంచీలో ఉజ్జ్వలంగా ప్రారంభమైన స్తూపనిర్మాణ కళ, కృష్ణానది లోయలో, నాగార్జునాచార్యుని ధీప్రభావవిశేషంచేతనే ఏమో! ఇతోధికంగా మహోన్నత దశ నందుకొంది. ఇక్కడ బౌద్ధమతం ఉత్తరదశలోకి అడుగుపెట్టింది. మహాయానం, కేవలం బౌద్ధమతంలోని ఒక శాఖాభేదంగా మిగలకుండా విశిష్టమతంగా పెంపొం దింది. ఒక సర్వోత్కృష్ట ధర్మంగా పెంపొంది, విమోచన పథాన్ని అతివిస్తృతమొనర్చి, దేశకాలపాత్రాతీతంగా సర్వ మానవాత్మలను నిర్వాణపథం పట్టించే తీవ్ర మత దీక్షతో కృషిచేసింది. ఆ సర్వ వ్యాపకత్వంలో చైతన్యంగల ప్రతి జీవినీ తనలో ఆవరించుకోచొచ్చింది. జాతక కథల లోని జన్మపారంపర్యక్రమాభివృద్ధి విశేషం ఈ విజ్ఞానాన్ని వెదజల్లటానికి సకాలంలో ఉపకరించింది. నిరక్షరాస్యులైన జనానీకంలో మతప్రచారం చెయ్యటానికి ఈ కథలు రాతిబొమ్మల్లో రూపందుకొన్నాయి. రాళ్ళే మాట్లాడ జొచ్చాయి.

అప్పుడే, బౌద్ధధర్మం, ఆలయ ఆరామాల నిర్మాణంలో మతపావిత్ర్యతత్వం ప్రతిబింబించేట్టు బౌద్ధవాస్తు శిల్పాన్ని నిరూపించసాగింది. స్తూపనిర్మాణంలో, భూప్రతిష్ఠిత మయిన చక్రంనుంచి స్తూప శిఖర ఛత్రంపరకూ ప్రతిదీ ఒక విశ్వవ్యాప్తభావమును సూచిస్తూ, స్తూపానికి బహి ర్విశ్వంతో కేంద్రస్థ సంబంధాన్ని సూచింపసాగాయి. అంతతో, ఈ స్తూపనిర్మాణమే, వాస్తువిషయికంగా, తదు పరి వచ్చిన అర్ధదేవాలయ నిర్మాణానికికూడా మార్గదర్శక మయింది. స్తూపశిఖరము గుండ్రని రూపం వదిలి గోపుర రూపందాల్చి, విగ్రహప్రతిష్ఠతో గర్భగుడి ఏర్పడి, దేవాల యంగా మారిపోయింది. స్తూపంచుట్టూ ఉన్న కటకటాల అవరణ ప్రదక్షిణపథమూ, దేవాలయం లోతట్టు ప్రాకా రాలుగా మారాయి. స్తూపానికి నాలుగు వైపుల నాలుగు ద్వారాలు, ఆలయప్రాకారంలో గోపుర ముఖద్వారాలుగా తయారయాయి. శాతవాహనుల తర్వాత వచ్చిన పల్లవ రాజులు దాక్షిణాత్య మహోన్నత దేవాలయ నిర్మాణాలకు పూనుకొనేటప్పటికి, బౌద్ధ శిల్పవంశీకులనే తమ అర్ధ దేవాలయ నిర్మాణాలకుకూడా శిల్పాచార్యులగా చేసికోవలసి వచ్చింది. ఆంధ్రుల శిల్పప్రతిభ, సృజనాశక్తి విశేషము, తరతరాలుగా ఆలయనిర్మాణాలకు అంకితమయి దాక్షి ణాత్య ఆలయ నిర్మాణ విగ్రహ నిర్మాణరీతులను మహోత్కృష్ట శిల్పకళాపథాలకు పట్టించినవి. ఈ కళా పారంపర్యములో ప్రథములు కంచిలో పల్లవులు. ఆతర్వాత ఇంకా దక్షిణాన చోళులు, ఈ శిల్పకళను అంతకన్నా మహోన్నత శిఖరాలకు ప్రాకించారు. పశ్చిమంలో, ఆంధ్ర సామ్రాజ్య వారసులైన పశ్చిమ చాళుక్యులు అమరావతి శిల్పప్రతిభను, బాదాము, ఐహోల్, పట్టడకల్లులకు, తీసుకుపోయారు. తత్ఫలితంగా వాళ్లకు సామంతులయిన రాష్ట్రకూటుల ఆధ్వర్యంలో ఎల్లోరా కైలాసాలయాల చెక్క డాలలో మహోన్నత స్థాయినందుకొని, హొయిసలుల ఆధ్వర్యంలో బేలూరు హలెబిడ్, సోమనాథపుర దేవాలయ శిల్పపు సగిషీపనులతో విభ్రమాశ్చర్యాలు కలిగించే అత్యు న్నత స్థాయి నందుకుంది. ఇన్నిచోట్లాకూడా, ఆయా స్థానిక వైవిధ్యాలనన్నిటినీ ప్రచురించుకొంటూ వచ్చినా శిల్పకళా ప్రాథమిక విధానంమాత్రము అమరావతిదే. అమ రావతి శిల్పాలలోని ఉజ్జ్వల సజీవచైతన్యం, ఈ శిల్పా లన్నిటిలోనూ ప్రతిధ్వనిస్తూ తన ప్రభావం వెలువర్చు కొంటూనే ఉంటుంది.

ఏ శిల్పి అయినా ఒక వాస్తుప్రమాణం మూలాధారం గానే విగ్రహనిర్మాణానికి ఉపక్రమిస్తాడు కాబట్టన్నీ, చెక్క డంలో తెచ్చుకొన్న ప్రతి కొత్త మెరుగూకూడా, ఒక పూర్వ స్వరూపానికి మెరుగులు తీర్చిదిద్దటం మాత్రమే అవటం వల్లనూ, నిజానికి దాక్షిణాత్య శిల్పచరిత్రలో, పెద్ద విప్ల వాత్మకమైన మార్పులేవీ కనిపించక, అమరావతి శిల్పం దాక్షిణాత్యశిల్పానికి మూలాధారంగా ఉంటూనేవచ్చింది.

అమరావతి ప్రతిభ, చివరికి నాగార్జునకొండ శిల్పాల ఊపుతో దేదీప్యమానంగా ప్రకాశించి, తూర్పునముద్రాంతర స్థలాలకు తన కాంతిని ప్రసరింపసాగింది. అమరావతి



దోహదక్రియ

సందేశాన్ని, ఆంధ్ర సాంస్కృతిక బేహారులు, ప్రాగ్దేశాలకు వలసలుపోయి మోసుకొని పోయారు. కాలక్రమేణా, ఈ యాత్రలు అటునుంచి ఇటు కూడా సాగజొచ్చాయి. యావద్బౌద్ధమండలంనుంచి, ప్రాక్చక్రమంతటినుంచీ, దేశదేశాల ఆచార్యులు, స్థవిరులు, ఇటు సింహళంనుంచి అటు చీనావరకూ, బౌద్ధయాత్రికులు నాగార్జునకొండకు ప్రయాణమైవచ్చి అక్కడే స్థావరంగా నివాసం ఏర్పరుచుకో సాగారు. ఈ విజ్ఞానపథము కృష్ణాసాగరసంగమంనుంచి నేటి సముద్రపువడ్డపల్లె గూడూరు (ప్టొలెమీ—"కొడ్డూర") నుంచి, పూర్వ మహానగరమైన ఘంటసాల (కంటకశైల) నుంచి, తూర్పు ప్రపంచానికి సాగిపోయింది. ఆ చారిత్రక పథంపట్టిన ప్రథమ యాత్రికులు, బర్మాలోని సాల్వీస్, ఐరావతి, నదీముఖాలలోనుంచి దేశంలోకి ప్రవేశించి, అక్కడినుంచి, థాయిలాండ్ ప్రవేశించి, ఇండొనీషియా దేశమంతటా విస్తరించి, ఇప్పటి ఇండొచైనా (పూర్వపు చంపా, ఫూనాన్, సామ్రాజ్యాలు) అంతటా ఆవరించుకొని, ఒక్కపెట్టున చివరికి చైనా అంతటా వలసలు ఏర్పరుచుకొంటూ దిగంతాలతిక్రమించారు.

తూర్పు ఆసియా శిల్పకళలో, అమరావతి శిల్పప్రతిభ, కల్పనాశక్తుల ప్రభావం కనబడినంతగా, మరేశిల్పకళ ప్రభావమూ మరే దేశకళమీదా చరిత్రంతా వెదికినా కూడా కనబడదు. థాయిలాండ్, చంపా (ఇప్పటి అన్నాం రాష్ట్రం) లోని డొంగ డువాంగ్; రాట్బురి రాష్ట్రంలోని పొంగటూక్ గ్రామం, పాసాక్ నదీలోయలోని శ్రీదేవ్ (శ్రీదేవ గ్రామం)—; జావాలో దక్షిణ విజెంబర్, సెలిబీస్‌లో సికెన్ డెంగ్; సుమిత్రాలో పాలెంబాంగ్, బోర్నియోలో కోట బంగోయెన్; అనూరాధపురం—ఇన్ని ప్రదేశాలబౌద్ధశిల్ప విన్యాసాలలోనూ, అమరావతీ శిల్పము ప్రస్ఫుటంగా మూర్తి కట్టు కొంటూనే వస్తుంది.

ఇంతయినా, పురాతత్వ పరిశోధనలు బాల్యదశలోనే ఉండటం కారణంగా ఆంధ్ర శిల్పప్రతిభా ప్రభావాలకు తగినన్ని గాఢమైన సాక్ష్యాలు, దృష్టాంతరాలు, ఇంకా నిగూఢంగానే మిగిలి పోయాయి. ఆంధ్రలోయలో ఒకప్పుడు ఒక మహోత్కృష్టమైన సాంస్కృతి వెలసిందనీ, తత్ప్రభావము తూర్పు ఆసియా దేశాలన్నిటిమీదా, అద్భుతంగా ప్రసరించిందనీ తెలివిడి ఇనుమడించిన కొద్దీ, పరిశోధన కృషి, ఇంకా తీవ్రంగా సాగగలదని నేను ఆశిస్తున్నాను. అమరావతీ శిలలను కర్నల్ మెకంజీ, విస్మృతి గర్భం నుంచి వెలికి తీసిన తర్వాత, జరిగిన పరిశోధన కృషి అతి స్వల్పము. హుయాన్‌ట్సాంగ్ చెప్పిన విషయాలను, పరిశోధించి తేల్చుకోవలసిన అంశాలు చాలా మిగిలి

పోయేఉన్నాయి. భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటసాల లోని గొప్పగొప్ప స్తూపాలలో ఇంకా చాలా పరిశోధించి సేకరించవలసి వుంది. ఇన్ని మహాబౌద్ధ స్తూపాలు ఈ ఒక్క కృష్ణాలోయ ప్రాంతంలోనే కట్టారంటే కేవలం ఉత్త పుణ్యానికే ఇక్కడ ఏర్పడి ఉండవు. ఏవో మహత్తరమైన చారిత్రక కారణాలు కూడా ఉండి ఉండాలి. ఆంధ్ర చరిత్రను మళ్ళీ రచించుకోటంలో, కేవలం శాసనాలు ఉటంకించుకొంటే చాలదు. శిల్పకళా స్మృతి చిహ్నలను కూడా అర్థంచేసుకొని విశదీకరించ వలసి వుంటుంది. చరిత్ర నిరూపణము సర్వతోముఖంగా జరగాలి తప్ప, ఏ ఒకటో అరో ఆధారంగా తీసికొని, సిద్ధాంతాలు స్థాపించ సాగితే అవిగురికి బెత్తెడెడంగా పోకతప్పదు. ఉదాహరణకు నేనొక ప్రశ్న అడుగుతాను. కొందరు చరిత్రకారులు, శాత వాహనులు అమరావతి మండలంనుంచే ఉప్పవించా రంటారు. మరి అల్లాగే అయినట్లయితే వాళ్ళు తమతమ ఉత్తమ శిల్పనిర్మాణా లన్నిటినీ సామ్రాజ్య కైవారం అంచు లనే, సాంచీనుంచి కార్లీవరకు, ఈ మహాశిల్పాలయాలను నిర్మించుకొంటూ ఎందుకు ప్రారంభించారు? కృష్ణా లోయలో శిల్పఖండాల సృష్టి చివరిదాకా ఆగి తర్వాత వచ్చిన ఆంధ్ర శిల్పుల కాలందాకా ఎందుకు ఆగవలసి వచ్చింది? కేవలం ఆశిల్పాలను బట్టి నాకుతోచిందే ధైర్యం చేసి సూచిస్తాను. తమ సామ్రాజ్య వైభవ అపరసంధ్యా కాలంలోనే శాతవాహనులు గోదావరీ నదీప్రాంతం వదిలి, కృష్ణానదీ తీరం చేరు కొన్నా రని నా అభిప్రాయము.

గౌతముని భవనముసకు ఆనందపరవశమైన జనసమూహము—ఎనిమిదవ శతాబ్దపు జావాశిల్పం



# ఇక్ష్వాకురాజుల పుట్టుపూర్వోత్తరాలు

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

ఇక్ష్వాకురాజుల పుట్టుపూర్వోత్తరాలను గురించి, బౌద్ధమతాచార్యుడైన నాగార్జునుని కాలనిర్ణయంగురించి, ప్రసిద్ధ భాషాపరిశోధకులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు లోగడ రచించిన రెండు వ్యాసములను వాటి విషయ గౌరవాన్ని పురస్కరించుకొని యిక్కడ పొందుపరచినాము. వాటిలో ఇక్ష్వాకులను గురించిన వ్యాసము ప్రభవ సం. పుష్యమాస "భారతి" నుంచి, నాగార్జునుని వ్యాసం తారణ పుష్యమాస "భారతి" నుంచి పునర్ముద్రించబడినది.—

పరమపురుషుఁ డగు శ్రీరామచంద్రమూర్తి యిక్ష్వాకువంశ్యుఁడు. ఆయన కృతయుగమునాఁటివాఁడు. పురాణములందు కలియుగరాజవంశవర్ణనలలో నిక్ష్వాకు వంశ్యులగు రాజు లిర్వదితొమ్మండ్రు రాజ్యమేలిన తర్వాత ౧౫౩౦ యేండ్లితరరాజులు రాజ్య మేలునట్లును, నటుతర్వాత నంధ్ర రాజులు నన్నూట యిఱువదియేండ్లు రాజ్యమేలునట్లును గలదు. సాతవాహనులపాలనము క్రీస్తుకు పూర్వము నూటయేఁబదియేండ్ల కారంభమై క్రీస్తుకు తర్వాత మున్నూటేండ్లవఱక నుండినట్లు పరిశోధకులు నిర్ణయించుచున్నారు. పురాణోక్తి సత్యమేయగునేని యిప్పటికించుమించుగా మూఁడువేల యైదువందల యేండ్లకుఁ బూర్వమున్నవా రగుదురా యిక్ష్వాకు రాజులు! శ్రీరాములవారు కోసలాధీశ్వరులు. ఈ కలియుగపు టిక్ష్వాకురాజులు గూడఁ గోసలాధీశ్వరులగుదు రనుకొనవచ్చును. ఇది పురాణగాథ.

కొన్ని యేండ్లకు ముందు కృష్ణామండల మందలి జగ్గయ్యపేటదగ్గఱ కొండమీఁదనున్న బౌద్ధస్తూపమును దొరతనమువారు త్రవ్వించిరి. దానిలో నిక్ష్వాకువంశ్యులగు రాజుల శాసనములు గొన్ని దొరకినవి. పరిశోధకులు లిపిరీతిని బట్టి వానిని క్రీ. తర్వాత మూఁడవ శతాబ్ది వానినిగా నూహించిరి. అందు పురుషదత్తుఁడను నిక్ష్వాకు రాజుపేరు గలదు. కడచిన వత్సరమున శ్రీశైలప్రత్యంత పర్వతమగు సిద్ధనాగార్జునుని కొండదగ్గఱ బౌద్ధస్తూపముల దొరతనమువారు త్రవ్వించిరి. అందు ఇర్వదింటికిఁ బైఁగా నిక్ష్వాకురాజుల శాసనములు దొరకినవట! అవి యింకను బ్రకటితములు గాలేదు. వానిలోని విశేషవిషయము లింక మీఁద వెలువడవలెను. ఇది శాసనాది చరిత్ర సాధన పరిశోధన విషయము.

ఇప్పుడే క్రొత్తగా మైసూరు దొరతనమువారు ధర్మామృతమని యొక కర్ణాట గ్రంథమును బ్రకటించిరి. అది జైన గ్రంథము. శక. ౧౦౪౭ నాఁడు నయసేనాచార్యుఁడు దాని రచియించెను. దానికి మూల మేదో ప్రాకృతమున నుండి యుండును. ఆగ్రంథము నేకాదశాశ్వాసమున నిక్ష్వాకులకును, నంధ్రదేశమునకును సంబంధించినకథ గలదు. అదియిది :—

వాసుపూజ్య
పురము రాజధానిగా నిక్ష్వాకువంశపవిత్రుఁడగు యశోధర మహారాజు రాజ్యమేలుచుండెను. ఆతనికి అనంతవీర్యుఁడు, శ్రీధరుఁడు, ప్రియబలుఁడు నని మువ్వురుకొడుకు లుండిరి యశోధరుఁడు దిగ్విజయయాత్ర వెడలెను. దక్షిణదిక్కున మాళవ, మగధ, కర్ణాటగౌల్ల (?) కరహాటగౌళ, లాట, చోళ, చేర, పాండ్య, కళింగదేశముల జయించి కప్పములఁగొని, వేంగీదేశమునకువచ్చి, యాదేశపు సౌభాగ్యమునకు మెచ్చి యశోధరుఁడు తా నక్కడనే నెలకొన నుత్సహించెను. తన ప్రాభవమునకుఁ దగినంత గొప్పగా నా దేశమందు ప్రతిపాలపురమని యొక రాజధానిని నిర్మించి యందు వసించెను. మహోన్నతముగా రాజ్యమేలెను. వార్ధకమున నాతఁడు రాజ్య భారమును బుత్రులపైఁ బెట్టి, తానడవి కేఁగి, జినేంద్రసేవతోఁ గాలము గడపఁదలఁచెను. కొడుకులఁ బిలిచి యడిగెను. వారు తమకు రాజ్యము వలదనియు, జినేంద్రదీక్షగొని యరణ్యములందుఁ దప మాచరించుచుందుమనియుఁదెలిపిరి. ఎట్టకేలకు మూఁడవ కుమారుఁడగు ప్రియబలునకు రాజ్య మప్పగించి, యశోధరుఁడు పెద్దకొమాళ్లిర్వురతో రాజ్యము వీడి, విశ్వసేనాచార్యునికడ జినదీక్ష గొని, గురునిర్దేశము చొప్పున జటాశిఖరమను



జగ్గయ్యపేట బుద్ధప్రతిమ — ప్రతిమ క్రింద శాసనము ఇది.



యక్షి - జగ్గయ్యపేట

పర్వతము పైఁడి కరిగి తపము నల్పెను. యశోధరభట్టారకుఁడును, ననంతవీర్య మునిపుంగవుఁడును, నందు అష్టకర్మల నొనర్చి పరమశ్రీ మనః ప్రియులై నిర్వాణము నందిరి. అకలంకుఁడని పేరందిన శ్రీధరాచార్యుఁడు అగిరిపై నుగ్రతపస్సు చేయుచుండెను. ప్రతిపాలపురమున ప్రియబలుఁడు రాజ్యమేలుచుండెను. ఒకనాఁ డాతఁడు వనవిహారమునకుఁ బోయి పాముకాటుచే మృతిఁ బొందెను. అతనికిఁ బుత్త్రసంతతి లేదయ్యెను. ఇంద్రప్రభుఁడనుమంత్రి యారాజు మృతివార్త నెవ్వరికిఁ దెలియనీయక, రాజు వనక్రీడచే బడలికఁజెంది యంతఃపురమున నుండెనని వెల్లడించి, గుప్తముగా నౌర్ధ్వదైహిక కర్మల నొనర్చెను. తనకుమారుని రాజ్యరక్షకై నియోగించి, యాయింద్రప్రభుఁడు పరిమితపరివారముతో బయల్వెడలి, కొన్ని ప్రయాణములమీదఁ ఋషినివాసపర్వతమును జేరెను; పరివారము నక్కడి ప్రత్యంతపర్వతమున విడియించెను; అక్కడి జినభవనములఁ బూజించెను. పర్వత మధిరోహించి శ్రీధరాచార్యుని దర్శించి, నమస్కరించి, యిట్లు విన్నవించెను: 'మునీంద్రా! మీరీగిరిపై నెలకొని యుండుట నెఱిఁగి వేంగిదేశప్రజలు పలువురు మీచరణసేవ నభిలషించి యిక్కడికి వచ్చి, పర్వత పాదమున విడిసి యున్నారు. వృద్ధులు పలువురు పర్వత మధిరోహింపఁ జాలకున్నారు. మీరక్కడికి విజయంచేసి వారి నాశీర్వదించి యుద్ధరింపుఁడు." ఈ మాయపుమాటల నెఱుఁగక శ్రీధరాచార్యుఁడందుల కంగీకరించి దిగివచ్చెను. వారెల్లరు నామునీంద్రునిఁ గపటమున నే ప్రతిపాలపురమునకుఁ దోడ్కొనివచ్చి, యచ్చట ప్రియబలమరణవార్త నెఱిఁగించి, సంతతి లేకపోవుటచే వంశచ్ఛేదమగుటఁ దెలిపి, సంతానముగలుగువరకయినను సంసారమును, రాజ్యమును నంగీకరింపవలసినదిగా నిర్బంధించి వేఁడిరి. ఎట్టకేల కాతఁ డంగీకరించెను. కొన్నాళ్ల కాతని కొకకొడుకుగల్గెను. అబాలునికి శ్రీధరుఁడు తనతండ్రి యగు యశోధరుని పేరుపెట్టెను. పట్టముగట్టెను. చెఱలోనుండి విడుదలఁ బొందినవాఁడువోలె నాతడంతట సంసారమునసుండి విముక్తుఁడై మరల ఋషినివాసపర్వతమునకుఁ బోయి, జినదీక్షగొని, ద్వాదశవిధ వ్రతముల నొనర్చి, నిర్వాణశ్రీసమేతుఁడై నెగడెను.

శ్రీధరాచార్యుఁడు తడవుకాలము వసించి, తపస్సుచేసి సిద్ధిపొందుటచే ఋషినివాసపర్వతమునకు శ్రీపర్వతమని పేరయ్యెను. అపర్వతమునకు దక్షిణభాగమున నొకమఱ్ఱి క్రిందనుండి ముక్తిని గనుగొనుటచే నా చోటికి సిద్ధవటమని పేరయ్యెను. శ్రీధరాచార్యునకు జ్ఞానపూజ చేయవలయునని చతుర్విధదేవనికాయములు గూడినస్థలమునకు అమరావతి యని పేరయ్యెను. శ్రీధరముని తపస్సు చేయుచు నర్జున వృక్షముక్రింద నుండఁగా ఖేచరులు మల్లికాపుష్పములచేఁ బూజించిరిగాన యాస్థలమునకు మల్లికార్జున మని పేరయ్యెను. ఇంద్రప్రభుఁ డామునిని గపటముగ వేఁడుకొనుచు వృద్ధులు వసించిరని తెలిపిన పట్టునకు వృద్ధగిరి యని పేరయ్యెను. శ్రీధరాచార్యునికుమారునిఁ జెలికాండ్రు ముండియ సుతుఁడా! (ముండితసుతుఁడు) యని కేరడము లాడుటచే నావంశమునకు ముండియవంశమనియుఁ దర్వాతఁ బేరయ్యెను.

ఇట్టి యిక్ష్వాకువంశపు రాజులపరంపరలో ధనదుఁడను యొక రాజుజనించెను. అతఁడు ప్రతిపాలపురము రాజధానిగా వేంగిదేశమెల్ల నేలుచుండెను. ఆదేశమునసంఘ శ్రీయను యొక బౌద్ధుడుండెను. అతనిపుత్త్రి కమలశ్రీయని పేరుగలది మిక్కిలి సౌందర్యవతి. ధనదుఁడామెను ప్రేమించి వివాహమాడెను. కమలశ్రీ నెట్టకేల కాతఁడు జైనమతమునకుఁద్రిప్పుకొనెను. తన మామ యగు సంఘశ్రీనిగూడ నాతఁడు జైనమతమునకుఁద్రిప్పుకొన యత్నించెను. సంఘశ్రీయంగీకరింపఁడయ్యెను. ఒకనాఁడు జినదీక్షితులైసిద్ధిని బొందిన చారణ ఋషు లంతరిక్షమునఁ బోవుచుండఁగా ధనదుఁడు వారిని సంఘశ్రీకిఁ జూపి జైనమతమున నమ్మిక పుట్టించెను. సంఘశ్రీ యానమ్మకమున జైనమతమునఁ జేరెను. ఒకనాఁ డాసంఘశ్రీకి బౌద్ధమతగురువగు బుద్ధశ్రీ యరుదెంచి బోధించి మరల నాతని బౌద్ధమతమునకుఁ ద్రిప్పెను. ధనదరాజుమరల నాతని జినమతమునకుఁ ద్రిప్పుకోజూచెను గాని లాభము లేదయ్యెను. ధనదరా జొకనాఁడు నిండుసభలో మామ నిట్లడిగెను: "నీ వా నాఁడు చారణఋషు లంతరిక్షమునఁ బోవుచుండుటను జూచితివిగదా: మరల జైనమతము విడిచితివేల ?" సంఘశ్రీ—"నేనుజూడలేదు." అనెను. అసృతమాడిన యాసంఘశ్రీపైఁ గోపించి యక్కడిపుర దేవతలు వచ్చి వాని రెండు గన్నులను బెఱికి వేసిరి. ఇట్లు సంఘశ్రీ యపమానితుఁడై, దుఃఖితుఁడై, కొన్నాళ్లకుఁ జనిపోయెను. అతఁడు నరక మందెను. వాని వంశము వారేడుతరములదాఁకఁ బుట్టుగ్రుడ్డివాండ్రయిరి. బహుకుటుంబముగల యాసంఘశ్రీవంశమువారేడుతరములదాఁక నట్లు గ్రుడ్డివా రగుటచే నాదేశమునకంధకదేశమని పేరయ్యెను. ధనదమహారాజట్లు గొన్నాళ్లురాజ్యమేలి, తన పుత్త్రుఁడగు నింద్రగుప్తునికిఁ బట్టముగట్టి తాను దపోవనమున కరిగెను.[1]

పయికథలో వాస్తవవిషయము లేవి కాఁదగునో పరిశీలింతము.



యక్షి - జగ్గయ్యపేట

౧. వేఁగిదేశ మిప్పుడు వేఁగినాఁడుగాఁ దలఁపఁబడు నంధ్రదేశైకభాగమే కాక పూర్వ మొకప్పుడు నేఁటి కృష్ణా గుంటూరు గోదావరిమండలములు వ్యాపించిన దేశమంతటికిని బేరుగా నుండె ననుట కాధారములు పెక్కులు గలవు. కావున నిందు వేంగిదేశపద మంధ్రదేశపద పర్యాయముగా నుండుట సంగతమే.

౨. ఇందుఁ బేర్కొనఁబడిన ప్రతిపాలపురము భట్టిప్రోలు గావచ్చును. ధనదమహారాజు కథాకల్పితుఁడు గాకపోవచ్చును. అతఁడు రాజ్యమేలి యుండవచ్చును. వెలనాఁటి చోడులకు రాజధానియైనధనదుపురము (నేఁడు చందవోలు) అతనిపేర వెలసినదిగావచ్చును. ధనదుపురము త్రిలోచన పల్లవునిచేఁ జోడరాజుల కొసఁగఁబడినట్లు శాసనములందు

1. నే నీ ధర్మామృతకథ నీయేడు 20-10-27 బళ్లారి ఆంధ్ర సాహిత్యపరిషత్సభలో 'ఆంధ్రభాషావతార' మను వ్యాసమున వ్రాసి చదివించితిని. దాని నిందుఁ జేర్చితిని. ఇటీవల నీ కథను కర్ణాటపండితసహాయమున నించుక విరివిగాఁ దెలుఁగున వ్రాసి యిచ్చుటకుఁ గోరఁగా శ్రీ వేలటూరి రమణయ్యపంతులుగా రట్లు వ్రాసియిచ్చిరి.

గలదు. త్రిలోచనపల్లవుఁడును, గరికాలుడును, నమకాలమువారు గాన యాపురము మిక్కిలి ప్రాచీనమే యగును. భట్టిప్రోలి కది చేరువనేకలదు. దివిసీమ యను పేరు నేఁడు పేర్కొనఁబడుచున్న కృష్ణానముద్రమధ్య ద్వీపము పూర్వము ధనదునిచేఁ గల్పింపఁబడిన దని గణపేశ్వరపు శాసనమునఁ గలదు: "ద్వీపంపురైత ద్ధనదేన నృష్టమ్" అని. ధనదుఁడు కల్పించెననఁగా నాతఁ డాద్వీపమును మనుష్యనివాసార్హముగాఁ గావించెనని యర్థమగును. గణపేశ్వర శాసనమునఁ బేర్కొనఁబడిన ధనదుఁడు ధనదపురాధిపతి యగును. క్రీస్తుకుఁ బూర్వము మూఁడవ శతాబ్ది నాఁడు కట్టఁబడినదయి యుండవచ్చునని తలఁపఁబడుచున్న భట్టిప్రోలిస్తూపము[1] నట్టడుగునఁ గల శాసనములలో 'కుబేరకుఁ'డని రాజు పేరు గలదు. ధనద కుబేరక పదముల యర్థసంగతి యాలోచింపఁ దగినది. తెలుఁగు దేశపు వైశ్యులకు 'కోమట్లు' అని పేరు గలదు. వారు కుబేర, ధనద వంశ్యులని వ్యవహారముగలదు. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు 'కోమటి' పదము 'గోమటీశ్వరుఁ' డను జైనదేవతపేర నేర్పడినదని, భట్టిప్రోలిస్తూపపు కుబేరునకు వీరికి సంబంధము గలదని—రాజ నరేంద్ర సంచికలో వ్రాసినట్లు స్మరించుచున్నాను. ఈవిషయమును బ్రబలపఱుపఁగల సాధనములను వేఱొకతూరి వెల్లడింతును.

3. బుద్ధదేవునకు 'శాక్యసింహుఁ' డని పేరు గలదు. ఆయన యిక్ష్వాకువంశమువాఁడు గావచ్చును. ఇక్ష్వాకులు శాక్యులనుటకు సాధకముగా లింగాభట్టీయ మను నామలింగాను శాసనవ్యాఖ్యానమున నీశ్లోకము గలదు:

శ్లో. శాకవృక్ష ప్రతిచ్ఛన్నం
వానం యస్మాత్ప్రచక్రిరే,
తస్మా దిక్ష్వాకువంశ్యా స్తే
శాక్యా ఇతి నమీరితాః.[2]

చంపాపట్టణము బహు ప్రాచీనమయినది. అది యంగదేశపు రాజధాని. శ్రీమద్రామాయణకాలమున నది రోమపాదుని రాజధానిగా నుండెను. ఆకాలమున దానికి 'మాలిని' యని పేరట. భారతకాలమున నది కర్ణుని రాజధానిగా నుండెను. అప్పుడు చంపానగర మనియే దాని పేరు. పంద్రెండవ జైనతీర్థంకరుఁ డగు వానుపూజ్యముని క్రీస్తుకుపూర్వము అయిదవ శతాబ్దిలోనే, అంత కింకను బూర్వమునసో చంపా పట్టణమునసే జనించి యక్కడనే నిర్వాణమందెను. క్రీస్తుకు పూర్వము అయిదవశతాబ్దిలోఁ గట్టఁబడిన వానుపూజ్యమునిదేవళము చంపాపట్టణమున శిథిలమై నేఁటికిని గలదు. జినమతప్రతిష్ఠాపకుఁడగు మహావీరాచార్యుఁ డాచంపాపట్టణమునఁ జాతుర్మాస్య వ్రతమును జరపెనట! చంపా చరిత్రమునుగూర్చి మత్స్యపురాణమునఁ జూడదగును. వానుపూజ్య తీర్థంకరుఁడు క్రీ.పూ. అయిదవ శతాబ్దిలోనే, యంతకుంబూర్వమో ఉన్నవాఁడు గాన, వేంగిదేశమున కిక్ష్వాకుల రాకకూడ నాకాలముననే యనఁగా, క్రీ.పూ. అయిదవ శతాబ్దిలోనే అంతకు బూర్వమో జరిగినదగును.

౪. భట్టిప్రోలిస్తూప మిక్ష్వాకురాజులచే నెలకొల్పఁబడినది గావచ్చును. అది బుద్ధదేవుని యనంతర మల్పకాలముననే వెలయింపఁబడి యుండును. అందు సాక్షాద్బుద్ధదేవుని యస్థిశకలము గలదుగదా! జగ్గయ్యపేటస్తూపమున నిక్ష్వాకురాజులశాసనము లున్నవిగావున నది వారిచేతనే వెలయింపఁబడిన దగును. ఇప్పుడు క్రొత్తగా దొరకిన సిద్ధనాగార్జునునికొండస్తూపములలో నిక్ష్వాకులశాసనములే యనేకము లగపడుటచే నవికూడా నిక్ష్వాకులచే వెలయింపఁబడినవే యగును. ఆస్తూపములుగూడ ధాతుగర్భములని తెలియవచ్చుచున్నవి. ధాతుగర్భమనఁగా బుద్ధదేవునివెంద్రుకలో, అస్థులో పెట్టికట్టినది. అమరావతీస్తూపముగూడ నిక్ష్వాకులచేత వెలయింపఁబడినదే కాఁదగును. ఇట్లనుటకు సాధనము:—అమరావతీ స్తూపమున రాజవిగ్రహములును, రాజచిత్రములును పెక్కులు గలవు. అవి యాస్తూపమును గట్టించిన వారివి గావచ్చును. జగ్గయ్యపేట స్తూపమునఁ గూడ నొక రాజచిత్రము గలదు. అమరావతీ స్తూపరాజరూపములును, జగ్గయ్యపేట స్తూపరాజరూపమును నొకే తీరున నున్నవి. ఉష్ణీషబంధము, కంఠహారము, కర్ణాభరణములు, నడికట్టు మొదలగునవి సమానరీతితో నున్నవి. మహనీయమగు రాజవిగ్రహమొకటి యమరావతీస్తూపమున దొరకినది. దాని తల, చేతులు విఱిగిపోయినవి. అందు

1. భట్టిప్రోలిస్తూపమున సాక్షాద్బుద్ధదేవుని యస్థిశకలము నొక చిన్నమణికరండమునందుంచి, దాని ననర్ఘమైన స్ఫటిక కరండమునం దుంచి స్వర్ణపుష్పములతో, రత్నములతో, స్వర్ణముద్రికలతో నర్చించి, పూరించి, (స్ఫటికకరండములు మూఁడున్నవి గాని యస్థిశకలముమాత్ర మొక్కదానిలోనే కలదు.) దానిని గొప్ప శిలాకరండములలో నుంచి భట్టిప్రోలి స్తూపము నడుగున నెలకొల్పి దానిపై స్తూపముగట్టిరి. బుద్ధదేవుని యస్థిశకలము వంగదేశపు బౌద్ధుల దేవళమునకు రోనాల్డ్షేప్రభువు కాలమున నొసఁగఁబడినది. తక్కిన యమూల్య వస్తువులు మద్రాసు మ్యూజియమునఁ గలవు. చెన్నపురికివచ్చు నాంధ్రులెల్లరు వీనిని దప్పక దర్శింతురుగాక! అక్కడనే యతిసుందరములైన యమరావతీస్తూప శిల్ప చిత్రములును గలవు.

2. శ్రీ కొత్తపల్లి సూర్యరావుగారీశ్లోకమును నాకు దెలిపిరి.

('గౌతమినమ' అని) శిథిలములయిన యక్షరములు గలవు. అట్టి *విగ్రహములు మఱికొన్నింటికడఁ గూడ నక్షరము లున్నవి. అవి యెల్లఁ బునఃపరిశోధితములు గావలెను. అమరావతీ జగ్గయ్యపేట స్తూపములందుఁ గల రాజ విగ్రహము లిక్ష్వాకురాజులవి గావచ్చును. జగ్గయ్యపేట స్తూప మిక్ష్వాకులు గట్టించినదే యగును గాన యందలి రాజరూప మిక్ష్వాకురాజుదే యగును. అమరావతి స్తూప మునఁగూడ నట్టిరూపములే కలవు గాన యదిగూడ వారు గట్టించినదే కావచ్చును. అమరావతీ స్తూపమునఁగూడ నిక్ష్వాకుశాసనము గలదు. ఆంధ్రదేశపు స్తూపములెల్ల నిక్ష్వాకులచే వెలయింపఁబడినవే యగునేమో యని నా సంశయము. ఇది భావిపరిశోధనములవలనఁ దేలవలసి యున్నది.

౫. జైనకావ్యముగాన ధర్మామృతమున 'ధనదుని' వృత్తాంతమున కాధిక్యమును, బ్రాముఖ్యమును గల్పింపఁ బడినది. సంఘశ్రీ వంశమువారినిబట్టియే వేంగిదేశమునకు 'అంధక'దేశమని పేరేర్పడిన దనుటచే నావంశము వారెం తేని ప్రాముఖ్య మందినవారయి యుండవలెనుగదా! జైనుఁడగు ధనదునికంటె బౌద్ధుఁడగు సంఘశ్రీకే వేంగి దేశమునఁ బ్రాముఖ్య మీ కథనుబట్టి కాననగును. సంఘశ్రీ పరంపరవారే యీ స్తూపములఁ గట్టించినవారుగాఁ దగు దురు. తెలుఁగుదేశమున జినాలయములును గలవు. ధనద వంశమువారు వానిని గట్టించియుందురు. అమరావతి, గోలి, నాగార్జునునికొండ స్తూపములవరుననే (కృష్ణానది దక్షిణపుదరిని) ములుగోటి (నత్తెనపల్లి తాలూకా)లో జినేశ్వ రాలయమును గలదు. అక్కడ గొప్ప దిబ్బలు గలవని 'లోకల్‌రికార్డు'లో నున్నది. అది 'జైనబస్తి' యగు నేమో! 'జినేశ్వరాలయ' మున్నట్లుగా నాదిబ్బమీఁద శాసనమున్నది. త్రవ్వించినఁగాని తత్త్వము తెలియదు.

౬. 'అంధ' పదము బహువచనమున దేశిభాషలో 'అంధర్,' 'అంధరు' అనియుండి (కర్ణాటాంధ్రభాషాభేద మానాఁటి కేర్పడలేదు.) దానిమీఁద ఆంధ్రపదము పుట్టి యుండవచ్చును. 'ఆంధ్ర' పదము నిన్న నేఁడు పుట్టినది. ప్రాచీనకాలమున 'అంధ్ర' పదమే కాని 'ఆంధ్ర' పదము లేనేలేదు. పన్నెండవ తీర్థంకరుఁడును, మహావీరునికంటెఁ బూర్వుఁడునునగు వాసుపూజ్యుని కాలమునకుఁ గొంచెము తర్వాత (క్రీ. పూ. ౫ శతాబ్ది) జరిగినదిగానుండుటచే నీ



బుద్ధదేవుని ధాతుక శిథిలములుగల స్ఫటికవేదిక, స్వస్తికాచిహ్నములు, సువర్ణ పుష్పములుకూడ చూడనగును. (భట్టిప్రోలు)

కథావృత్తాంతమునుబట్టి దేశమునకుఁ బేరువచ్చుటయు సంగతము గావచ్చును. దేశముపేరు దేశము నేలిన రాజుల కును దర్వాత నేర్పడియుండవచ్చును. ఈ విషయము సాతవాహనులనుగూర్చి వ్రాయుచో వివరింతును. ఐతరేయ బ్రాహ్మణగాథకు నీ కథకు సమన్వయము గలదేమో కనుఁ గొనవలెను. అంధ్రులు, బౌద్ధులు నయిన సంఘశ్రీ వంశమువారిమీఁది కోపముచే ధర్మామృతకథాకారు లీ యంధతను వారికిఁ గల్పించి దానిఁబట్టి తత్పూర్వమున నుండియున్న దేశనామమునకు వ్యుత్పత్తిని బొందించి యుండవచ్చును.

౭. శ్రీశైల మల్లికార్జునాదినామములు శ్రీధరాచార్యాదుల మూలమున వచ్చినవనుటను గల్పితముగాఁ జెప్పఁ జాలము. మల్లినాథ, మల్లిషేణ, మల్లీశ్వరాది నామములు జైనులకును బ్రఖ్యాతముగాఁ గలవు. కావున మల్లికార్జున నామము తొలుత జైనులదయినను గావచ్చును. శైవు లాస్థలము నాక్రమించుకొని యాపేళ్లను దమపరముగాఁ జేసికొనియుండవచ్చును. అమరావతి బౌద్ధక్షేత్రమగుట ప్రఖ్యాతమే. శైవక్షేత్రమగుటయుఁ బ్రఖ్యాతము. పూర్వము జైనక్షేత్రముగూడ నయియుండవచ్చును. ఒక మతము వారికిఁ బుణ్యక్షేత్రముగా నున్నస్థలమునే, ప్రాభవమేర్పడి నప్పుడు, తదితర మతములవారును తమకును క్షేత్ర

* ఈ విగ్రహములను నేనును, మన్మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారును గలసి పరిశీలించితిమి. ఇంక నెన్నో యపూర్వవిషయములు తెలుఁగుదేశపు స్తూపములనుగూర్చి వెల్లడికావలసియున్నవి. ఆయా స్తూపముల చిత్రములును, శాసనములును ఆంధ్రులకెల్ల రకు నందుబాటులో నుండవలెను. వానిలోని యపూర్వవిషయములు బరిశోధించుటకును, వెల్లడించు టకును దదేకతానులై తంటాలుపడుచున్న శ్రీ సోమశేఖరశర్మగారి కాంధ్రులు తోడ్పడు టావశ్యకము.

మునుగాఁ జేసికొనుట గలదు. అప్పుడమరావతిలో నమరేశ్వ రాలయము గొప్పదగు నొకకట్టడమును గప్పిపుచ్చి దాని మీఁదఁ గట్టఁబడియున్నది. అడుగుననున్న యాగొప్ప కట్టడము నల్దుప్రక్కలను, మీఁదను బూర్ణముగా మూసి వేయఁబడియున్నది. అడుగుననున్న యాకట్టడము జైన వసతియగునేమో! జైనుల నడఁగార్చి శైవులక్కడ వ్యాపించియుండవచ్చును. జైనవసతిని గప్పిపుచ్చి దాని మీఁద శివాలయమును శైవులు ప్రతిష్ఠించియుండవచ్చును. శ్రీశైలపాదమగు త్రిపురాంతక పర్వతమునకు తరుణాచల మని, కుమారాచలమని పేరు. ఇది శ్రీశైలమునకుఁ దూర్పుద్వారము. సిద్ధవటముగూడ శ్రీశైలపాదమే. దానికి దక్షిణద్వారమని పేరు. అలంపురి బాల బ్రహ్మేశ్వరమునకు పశ్చిమద్వారమని పేరు. కృష్ణాతీరమునఁ గల మాహేశ్వర క్షేత్రమునకు ఉత్తరద్వారమని పేరు. ఈ నాల్గు ద్వారము లకు నడుమఁగల పర్వతారణ్యమయప్రదేశమునకెల్ల శ్రీ శైలమనియే పేరు. ప్రధానములయిన పై చతుర్ద్వారములే కాక మఱినాల్గు ఉపద్వారములును గలవు. నేఁటి సిద్ధ నాగార్జునికొండ యాశాన్యోపద్వారము. పయికథలోఁ గల వృద్ధగిరి సిద్ధనాగార్జునుని కొండయగునేమో! అక్కడ జినాలయములు గలవని కలదు. శ్రీశైలమున నొకపట్టు తరుణాచలనామము గలదగుటచే వృద్ధాచలముగూడ నందు వేఱొక పట్టుగాఁ బేరంది యుండదగును.

ఠ. సంఘశ్రీ రచితముగా బుద్ధస్తుతిశ్లోక మొకటి కవీంద్రవచస సముచ్చయములో నుదాహరింపఁబడి యున్నది. అది ధర్మామృతకథలోఁ జెప్పఁబడిన సంఘశ్రీ రచించినదియయినను గావచ్చును.

ఇందు 'ముండియ' వంశమని సంఘశ్రీ వంశమునకుఁ బేరున్నది. దానిఁగూర్చి సాతవాహనులఁగూర్చి వ్రాయుచో వ్రాయుదును.

ద్రవిడదేశమునను ఆంధ్రదేశమునను వర్తిల్లిన చోళ రాజులు ఇక్ష్వాకువంశ్యులుగా శాసనములందుఁ గాన వచ్చును. చంపాపురమునుండి వేంగిదేశమునకు క్రీస్తుకు పూర్వము ౫ వ శతాబ్దిలో వచ్చి నెలకొన్న యిక్ష్వాకురాజుల కును వారికిని సంబంధముండవచ్చును. వేంగినుండియే వారు నెల్లూరు, కడపమండలములకును, చోళదేశమున కును వ్యాపించియుండవచ్చును. ఆంధ్రదేశ మిక్ష్వాకుల నాటనుండియుఁ బ్రఖ్యాతి గన్నదని యా ధర్మామృతకథ స్పష్టముగాఁ జెప్పుచున్నది. ఈ కథ సర్వథా విశ్వాస్యమే యని నా తలఁపు. ఏతద్గ్రంథకర్త సన్నయకుఁ దర్వాత నూఱేండ్లలోపున నున్నవాఁడు; ప్రాచీనుఁడు.

* * *

# నాగార్జునుని కాల నిర్ణయం

ఆచార్యనాగార్జునుఁడు బౌద్ధమతమున 'మధ్యమక' సిద్ధాంతమును వెలయించినవాఁడు. అతని 'మధ్య మకకారికల' ననుసరించి మధ్యమకావతార మను గ్రంథము నాఱవశతాబ్దిలో రచించిన చంద్రకీర్త్యాచార్యుఁడు తన గ్రంథమున నాగార్జునాచార్యుని ధర్మతత్త్వ నిర్ణయము ప్రమాణమగుట యెట్లని శంకించుకొని కొంత వింతవిషయము వెల్లడించినాఁడు. దీని నింతవఱకు చరిత్రపరిశోధకులు గుర్తించినట్లు నా కెఱుకపడలేదు. కారణ మాగ్రంథము చైనా టిబెట్టు భాషలలో నుండుటయే. ఈనడుమ శ్రీ అయ్యా స్వామి శాస్త్రిగారు దానిని సంస్కృతీకరించి కొంత ప్రక టించుటచే దానిని నేను గుర్తింపఁగల్గితిని. మధ్యమ కావతారము షష్ఠప్రకరణమున—

"జానాతి ధర్మం న మహాగభీరం
యథాగమేనాపి నయేన చాన్యైః
తథార్యనాగార్జునశాస్త్రనీత్యా
యథావ్యవస్థం మత ముచ్యతే హి."

వ్యాఖ్యా :—యథా బోధిసత్త్వః ప్రజ్ఞాపారమితాయాం చరన్ యథాతత్త్వం ధర్మాణామాత్మతాం పశ్యతి, తథార్య నాగార్జునే నావిపరీత మాగమంజ్ఞాత్వా యుక్త్యాగమాభ్యాం ధర్మాణా మాత్మభావో యథాభూతో నిస్స్వభావలక్షణ కస్స్పష్టం దేశితః. తస్మాత్ యథైవ నాగార్జునపాదాః యుక్త్యాగమాభ్యాం ధర్మాణాం తత్త్వ ముపాదిశన్—తథా మయా తదుపదిష్టం మతం యథావ్యవస్థ ముచ్యతే. అథ తావత్ కథం తస్య నాగార్జునస్య అవిపరీతాగమ నిర్ణయః స్యాత్-ఇతి. యథోక్త మార్యలంకావతారే—
దక్షిణాపథవేదల్యాం భిక్షుః శ్రీమాన్ మహాయశః,
నాగాహ్వయ స్స నామ్నాతు సదసత్పక్షదారకః.
ప్రకాశ్య లోకే మద్యానం మహాయానమనుత్తరమ్,
ఆసాద్య భూమిం ముదితాం యాస్యతేసౌసుఖావతీమ్.

ఆర్యద్వాదశసహస్ర మహామేఘేప్యుక్తమ్—

లిచ్ఛవీకుమారోయం సర్వసత్త్వానాం దర్శనే నన్దక ఇత్యానన్దః. నిర్వాణాచ్చతుశ్శతేషు వర్షేషు వ్యతీతేషు నాగా హ్వయో భిక్షుర్భూత్వా మద్దేశనాం విస్తరేణ ప్రకాశ్య అను పూర్వేణ సువిశుద్ధ ప్రభాభూమి నామకలోకధాతౌ తథాగతః అర్హన్ సమ్యక్ సంబుద్ధః జ్ఞానాకరప్రభాభిధో భవిష్యతి. అతోస్యావిపరీతాగమనిర్ణయఃసిద్ధః"

దీని సారము :—

"బోధిసత్త్వుఁడు (అనఁగా బుద్ధుఁడు) ప్రజ్ఞాపారమిత భూమికలోఁ జరించుచుండువాఁడుగాన ధర్మస్వరూపమును

గుర్తింపఁగలఁడు. అట్లే యార్యనాగార్జునుఁడు గూడ నవిపరీతముగా ధర్మతత్వమును గ్రహింపఁగలఁడు. నాగార్జునుఁడు యుక్త్యాగమములచే ధర్మతత్వమును నిరూపించెను. దానినే నేను వివరింతును. (అని చంద్రకీర్తి అన్నది) కాని బుద్ధునికిఁబోలె నాగార్జునునికి నవిపరీతాగమనిర్ణయ మెట్లు కుదురును అని యాక్షేపమేని, దానికి సమాధాయకముగా నాగమ మున్నది. ఆర్యలంకావతార సూత్రము నందు (ఇది బుద్ధుని యుపదేశమే) ఇట్లున్నది :

దక్షిణాపథదేహళియందు (వేదళి యని లంకావతార సూత్రమున మున్నది. ఇది జపానులో ముద్రితము. దక్షిణాపథవేదళి యను నది యాంధ్రదేశమున నేటి యేగ్రామమగునో గుర్తింపఁగాకున్నది. అది నాగార్జున కొండకు సమీపప్రదేశముననే యుండఁబోలును.) నాగార్జునుఁడని భిక్షువు వెలయును. అతఁడు మహాయాన మనుపేర నా (బుద్ధుని) మార్గమును నెలకొల్పి సుఖావతీ భూమికను బొందఁగలఁడు,

మఱియు బుద్ధోపదేశమే యగు 'ద్వాదశసహస్ర మహామేఘ' మను గ్రంథమున నిట్లున్నది.

లిచ్ఛవి కుమారుఁడు సర్వసత్త్వములకు దర్శనమాత్రచే నానందజనకుఁ డగుటచే నానందుఁ డనఁబరగినవాఁడు. నిర్వాణము చెందినపిదప నాల్గువందల యేండ్లకు నాగార్జునుఁ డను భిక్షువై వెలసి నాయుపదేశమును విస్తరముగాఁ బ్రకాశింపఁజేసి సువిశుద్ధ ప్రభాభూమి యను లోకమున సమ్యక్సంబుద్ధుఁడై జ్ఞానాకరప్రభుఁ డను పేర వెలయును.

కాన అతనికి సవిపరీతాగమనిర్ణయము సిద్ధమయ్యెను" అని.

పైగ్రంథమునుబట్టి చూడఁగా, నాగార్జునుఁడు క్రీస్తుకుఁ బూర్వము ప్రథమశతాబ్దిలో నుండినవాఁడగును. లేక క్రీస్తుతర్వాత ప్రథమశతాబ్దివాఁడేని కావచ్చును. లంకావతారసూత్ర మన్న గ్రంథము క్రీస్తుతర్వాత రెండవ శతాబ్దిలోని దందురు. కాన నాగార్జునుఁడు దానికి బూర్వ మున్న వాఁడు కాఁదగును.

పంచఖండాత్మకమై నిత్యనాథసిద్ధునిచే రచితమయిన రసరత్నాకర మన్న వైద్యగ్రంథములో నొక ఖండమున శ్రీశైలవర్ణన మద్భుతముగా నున్నది. ఆ గ్రంథమున వాదఖండాదులలోఁ బెక్కుచోట్ల "పురా నాగార్జునోదితమ్"



నాగార్జునుడు - నలంద

ఇత్యాదివిధముల నాగార్జునాచార్య ప్రశంస కలదు. దీనిని బట్టికూడ నాగార్జునుఁ డతి ప్రాచీనుఁ డని, శ్రీశైలప్రాంతవాసి యని తెలియును. నాగార్జునుని గ్రంథములలో 'కక్షపుటతంత్ర' మను గ్రంథమునఁగూడఁ బెక్కుచోట్ల నాతని సిద్ధపురుషత్వము గోచరించును. ఇది ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. నాగార్జునుని బౌద్ధ, రసవాద వైద్యశాస్త్ర గ్రంథములు పెక్కు లింక సముద్రితములే. టిబెట్టు చైనా దేశములలో నాతని బౌద్ధగ్రంథము లున్నవి. వైద్య *గ్రంథ మొకటి ముద్రితమయినది.*



ప్రస్తుతం బ్రిటిష్ మ్యూజియంలోవున్న అమరావతి శిల్పం—కుడిప్రక్కన మాయాదేవి స్వప్నం; ఎడమప్రక్కన ఆస్వప్నం గురించి వివరణ; దిగువన కుడిప్రక్కన శాక్యుల యక్షునికి శిశువుని బహూకరిస్తున్న దృశ్యం.

# ఇక్ష్వాకుల నాణెములు

డాక్టర్ డి. సి. సర్కార్

(ఎపిగ్రాఫిస్ట్, ఉదకమండలము)

ఇక్ష్వాకులు క్రీ. శ. మూడవ శతాబ్దిలో కృష్ణా-గుంటూరు మండలమును పరిపాలించుచుండినట్లు తెలియ వచ్చుచున్నది. వారు పూర్వము దక్షిణాపథము నేలిన శాతవాహనుల క్రింద సామంతులైయుండి వారి పతనానంతర మా శతాబ్ది తొలి పాదమున ప్రభుత్వమునకు వచ్చినట్లూహింపబడుచున్నది.

కృష్ణాజిల్లా నందిగామ తాలూకా జగ్గయ్యపేట సమీపమునను, గుంటూరుజిల్లా పల్నాటి తాలూకా నాగార్జునుని కొండ, గురజాల ప్రాంతములందును; సత్తెనపల్లి తాలూకా అమరావతికడను లభించిన నాటి శాసనములనుబట్టి యైక్ష్వాక చక్రవర్తులు నలుగురు మాత్రమే నేటి మన యెరుక కందినారు. ఈ శాసనముల పాఠము లీ క్రింది గ్రంథములలో పూర్వము ప్రకటింపబడినవి.

ఇండియన్ అంటిక్వరీ XI Vol. Pp. 257 ff.
ఎపిగ్రాఫికా ఇండికా XX Vol. Pp. 1 ff.
ఎపిగ్రాఫికా ఇండికా XXI Vol. Pp. 61 ff.
ఎపిగ్రాఫికా ఇండికా XXVI Vol. Pp. 123 ff.
ఏన్యువల్ రిపోర్టు ఆఫ్ సౌతిండియన్ ఎపిగ్రాఫీ 1937-30; No. 529.

★

★

జగ్గయ్యపేటలోని మహాచైత్యము

ఈ నలుగురు చక్రవర్తులు వీరు:

(1) శాంతమూల I (క్రీ. శ. 225-40) (2) అతని కుమారుడు వీరపురిసదత్త (క్రీ. శ. 240-65) (3) అతని

భోగం



సుతుఁడంచున్ బతియంచు బాంధవుఁడఁటంచున్ మోహవిభ్రాంతిసం
గతులై దుస్తరశోకవార్ధిఁ బడి చీకాకైన యో జీవసం
తతులారా ! కలిపాశబద్ధులగు నార్తప్రాణులారా ! జను
ర్మృతిసంపీడితులార ! సత్యపథమున్ మీరెల్లరాలింపుఁడీ !



త్యాగం

కుమారుడు ఎహువుల శాంతమూల II (క్రీ.శ. 265-275) (4) అతని కనిష్ఠసోదరుడు రులుపురి సదత్త (క్రీ. శ. 275-85). జగ్గయ్యపేటలో దొరికిన యిక్ష్వాకుల శాసనములు వీరపురిసదత్తుని యిరువదియవ పరిపాలనా సంవత్సరము నాటివి! అందు బుద్ధదేవుని మహాచైత్య మొకటి యచట కలదని ప్రశంసయున్నది. నాగార్జుననికొండ లోయలోని విజయపురి యీ యిక్ష్వాకుల రాజధాని!

ఈ వంశమును తొలగించి మూడవ శతాబ్ది తుదిభాగమున కంచి పరిపాలకుడగు పల్లవ సింహవర్మ, యీ ప్రాంతముల నాక్రమించుకొన్నట్లు తెలియుచున్నది. గుంటూరు జిల్లా పల్నాటి తాలూకా రెంటచింతల గ్రామము కడ పల్లవ నరసింహవర్మ వేయించిన శిలా స్తంభశాసన మొకటి లభించినది. ఆంధ్రా పథమని పిలుపబడుచుండిన నేటి కృష్ణా-గుంటూరు మండలముల నాడు అమరావతికి సమీపమందలి ధాన్యకటకమునుండి పల్లవ మహారాజు శివస్కందవర్మయొక్క రాజప్రతినిధి, యేలుచుండెను. ఆ కాలము నాల్గవ శతాబ్ది ప్రారంభము. ఆ శివస్కందవర్మ అశ్వమేధాది వైదికకర్మ లనేకము గావించినవాడు. బహుశః యీతడు సింహవర్మ కుమారుడేమో!

## నాగార్జున కొండలో దొరికిన నాణెములు

ఇక్ష్వాకుల పరిపాలనా కాలమున నేటి కృష్ణా-గుంటూరు మండలమున నుండిన నాణెముల విషయ మిపుడు కంతగా మనకు తెలియరాలేదు. ఇక్ష్వాకుల ప్రత్యేక నాణెము లేవియు నేటివరకును ప్రకటితము కాలేదు. ఇటీవల ఇక్ష్వాకుల రాజధానియైన విజయపురి ప్రాంతములందు డాక్టర్ ఆర్. సుబ్రహ్మణ్యం (భారతప్రభుత్వ పురావస్తు తత్త్వ పరిశోధనశాఖోద్యోగి)గారు త్రవ్వకపు పరిశోధనలలో నాటి నాణెములకు సంబంధించిన వింత విషయము లనేకము బయట పడినవి. ఆ నాణెము లానాడు విజయపురి ప్రాంతము లందు వ్యవహారమున నుండినవనుట నిస్సందేహము. అవి యిక్ష్వాకులే వేయించిరనుటకు గూడ నవకాశము లేకపోలేదు. ఈ నాణెములనుగూర్చిన వివరములు నాగార్జుననికొండ త్రవ్వకములపై డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు ప్రకటించుచున్న నివేదికయందును, ఇండియన్ ఎపిగ్రాఫీ సాంవత్సరిక నివేదికలయందును కొంత తెలియబడుచున్నది.

## ఉజ్జయిని చిహ్నాలు

ఇప్పటివరకు నాగార్జునకొండ ప్రాంతములలో లభించిన నాణెములు నలుబది. అందొకటి రాగిది. మిగిలినవి సీసపువి. వానిపై వెనుకవైపు ఉజ్జయినీ చిహ్నములు ముద్రింపబడినవి. కాని వానిలో కొన్నిటి ముందువైపు చిత్రింపబడిన చిహ్నము లిదివరకు కెచ్చటను కానరాలేదు. ఆ నాణెములన్నియు బండగా నున్నవి. చాలవరకు చెడినవి కూడా! ఆ రాగినాణెము మాత్రము (సంఖ్య 40) శాతవాహన సామ్రాట్టగు యజ్ఞశాతకర్ణి వేయించినాడన్న పోటిన్ లోహ మిశ్రపునాణెముల (Potin issue)తో పోల్పదగి యున్నది. ఆ శాతవాహన నాణెమును రాప్సన్‌దొర బ్రిటిష్ మ్యూజియములోని హిందూదేశపు నాణెములనుగూర్చిన కేటలాగులో ప్రకటించినారు (ప్లేటు VII; నెం. 166). ఆ పోలిక దాని కట్లుండుటచేత నా రాగినాణెము శాతవాహనులదా, ఇక్ష్వాకులదా అను సందేహము కలుగుచున్నది.

నాగార్జునకొండలో లభించిన యొక సీసపు నాణెము (సంఖ్య 27)న ముందుభాగమున కుడివైపున నొక జింక తల యున్నది. వెనుకవైపు మరియెనిమిది సీసపు నాణెములపైకూడ (సంఖ్యలు 1, 2, 4 నుండి 9 వరకు) నిద్దరు వ్యక్తు లెడమవైపునకు గుఱ్ఱపుస్వారిచేయుచున్నారో యని తోచునట్లు బండగా ముద్రింపబడినది. మరియొక సీసపు నాణెము (సంఖ్య 3)న నేనుగుపంక్తి యాకారము గల ముద్రయున్నది. మరియెనిమిది నాణెములపై (సంఖ్యలు 16 నుండి 23 వరకు) కుడివైపునకున్నట్లు ఏనుగు ముద్ర యున్నది. వానినిగూర్చిన యితర గాథ లేమియు తెలియరాలేదు.

నాగార్జునకొండలో లభించిన నాణెము లన్నిటిలోను వింత విశేషము గలవి యారు (సంఖ్య పదినుండి పదిహేను వరకు). వాని పైభాగమున కుడివైపున ఏనుగు ముద్ర యున్నది. ఈ నాణెములమీద నేవో యక్షరము లలుముకొని యేదో గాథను స్ఫురింపజేయుచున్నవా యన్నట్లున్నవి. ఒక నాణెము (సంఖ్య పదకొండు) మీద సిరి—వీర అని కొంత స్పష్టముగనే యున్నది. ఇది ఇక్ష్వాకు రాజగు వీరపురిసదత్తునకు సంబంధించినదేమో నని యనుమానము. ఆ యక్షరముల లిపికూడ దానిని సమర్థించుచున్నవి.

ఆ నాణెములు సీసపువగుటచేతను, వాని వెనుకవైపు ఉజ్జయినీ చిహ్నము లుండుటచేతను, వానికిని శాతవాహనుల నాణెములకును సన్నిహిత సంబంధము గలదేమో యనిపించును. వారికి వీరు తొలుత సామంతులేగదా!

# నాగార్జున నామధేయులు వ్యాసులవలె అనేకులా?

శ్రీ ఎం. వి. నరసింహస్వామి

రసవాదము లేదా ధాతువాదమనగా సీసము, ఇనుము, రాగి మొదలగు నీచధాతువులను బంగారముగా పరిణమింపజేయుట.

హిందూదేశమందు రసవాద ప్రాదుర్భావము చాల ప్రాచీనకాలమందే ఎరిగియున్నట్లూహించుటకు అనేకములగు అవకాశములు కలవు.

పాశ్చాత్య దేశములందు మొట్టమొదట ఈజిప్తుదేశములో రసవాదము ప్రారంభించినట్లు క్రీ. పె. మూడవ శతాబ్ది యందు రచితమైన నియోప్లేటోనిస్టుల గ్రంథములవలన మనకు స్పష్టముగా తెలియుచున్నది. నియోప్లేటోనిస్టుల దర్శనములలో రసవాదము తత్వశాస్త్రముతో మేళవింపబడినట్లు కానవచ్చును. వారి రసవాద పరిజ్ఞానమునకు హిందూ రసవాదము ప్రభవస్థానమైనట్లు మనమూహించవచ్చును.

ఏలయన, నియోప్లేటోనిస్టుల కాలములో వారు నివసించియుండిన అలగ్జాండ్రియా నగరమునకును హిందూదేశమునకును మధ్య తత్వశాస్త్రజ్ఞాన వినిమయము మెండుగా జరిగినది. అందువలన క్రీస్తుశకపు ప్రారంభమునాటికో లేదా అంతకు ముందుగనే రసవాదము హిందూదేశములో ప్రచారములో నున్నట్లూహించవచ్చును.

ఈ యూహకు చేయూతనిచ్చు కొన్ని జనశ్రుతులను ఏడవ శతాబ్దియందు హిందూదేశ పర్యటనమునుగావించిన బౌద్ధసన్యాసియగు యువాన్‌చ్వాంగు సేకరించి తన పర్యటన చరిత్రలో వెలిబుచ్చినాడు. అందు నాగార్జునుడను నొక తాంత్రిక శాస్త్రసిద్ధుడు తన సమకాలీనుడగు నొక శాతవాహన చక్రవర్తి యొక్క కోశాగారమును తన రసవాద సిద్ధి ప్రభావమున బంగారముతో నింపినట్లు చెప్పబడినది. ఇంతేగాక, కథాసరిత్సాగరములో :—

> తస్య నాగార్జునోనామ బోధిసత్వాంశసంభవః
> దయాలు ర్దానశీలశ్చ మంత్రీ విజ్ఞానవానభూత్
> యః సర్వౌషధయుక్తిజ్ఞః చక్రే సిద్ధరసాయనం
> ఆత్మానంచరాజానం విజరం చిరజీవితమ్.—

(కథారత్న - ఏడు)



★

సాంగ్రామిక రథము

అమరావతి

శిల్ప సౌందర్యం.

★

అనే పఙ్క్తులలో ప్రశంసించిన బౌద్ధమతనాగార్జునుడు శాతవాహన సార్వభౌముని మంత్రియే యని చెప్పబడి యున్నది. ఇచ్చట తాంత్రిక, బౌద్ధ నాగార్జునుల తాదాత్మ్యము మనకే అవగతమగుచున్నది.

ఈ శాతవాహనుడు శాతవాహనచక్రవర్తుల శ్రేణిలో నెవరో వివరముగా తెలియదు. ఈ తాంత్రిక శాస్త్ర వేత్తయగు నాగార్జునుడు, మాధ్యమిక సూత్రకారుడును, మహాయాన బౌద్ధమత ప్రచారకుడునునగు నాగార్జునుని కన్న భిన్నుడనియే తోచును. బౌద్ధ నాగార్జునుడు కనిష్క చక్రవర్తి (క్రీ. వె. మొదటి శతాబ్ది) కి సమకాలీనుడనియు, శాతవాహన చక్రవర్తికి సుహృల్లేఖయను మాధ్యమిక సందేశోపబృంహిత మైన నీతినుపదేశించు గ్రంథమునొక దానిని సమర్పించె ననియు, చరిత్రకారులు చెప్పుదురు. అందువలన క్రీ. వె. మొదటి లేదా రెండవ శతాబ్దియందిద్దరు నాగార్జును లున్నట్లు తెలియవచ్చుచున్నవి. తాంత్రిక నాగార్జునునకు సిద్ధనాగార్జునుడను పేరుగలదు. తరువాతి కాలములో బౌద్ధమత ప్రచారకులు సిద్ధపదమును తమ నామముల ముందుంచుకొనుచుండినను క్రీ. వె. మొదటి రెండు శతాబ్దుల కాలములో సిద్ధపదము బౌద్ధమత ప్రచారకుల నామముతో మేళవించుట యాచారముగా నుండినట్లు లేదు. అందుచేత సుహృల్లేఖ రచయితయగు నాగార్జునుడు, తాంత్రిక శాస్త్రమున సిద్ధిని పొందిన నాగార్జునుడు కాజాలడు. ఆంధ్ర దేశమందలి నల్లమల శ్రేణికి చెందిన శ్రీ పర్వత ప్రాంతమున బౌద్ధ విహారమును స్థాపించి, మహాయాన బౌద్ధమును బహుళ ప్రచారములోనికి తెచ్చిన నాగార్జునుడు, శాతవాహన చక్రవర్తికి సుహృల్లేఖను వ్రాసిన యాతడే.

ప్రసిద్ధ నలందా విశ్వవిద్యాలయాధ్యక్షుడుగా మరియొక బౌద్ధ మతగురువగు నాగార్జునుడు చరిత్రలో మనకంట బడుచున్నాడు. నలందా విశ్వవిద్యాలయ స్థాపన క్రీ. వె. నాల్గవ శతాబ్దమునకు పూర్వము జరుగలేదనుటకు స్పష్టమైన చారిత్రకాధారములు గలవు. నలందా విశ్వవిద్యాలయమందు తక్కిన శాస్త్రములతో బాటు రసాయన విద్య, ధాతువాదము శిష్యులకు నేర్పబడుచుండెను. దీని వలన నాల్గవ శతాబ్దమునందే రసాయన విద్య, ధాతువాద శాస్త్రము వీని అభ్యాసము ఉచ్ఛస్థితిలో నున్నట్లు మన మూహించ వచ్చును.

తాంత్రిక శాస్త్ర పారంగతుడగు రెండవ శతాబ్దపు సిద్ధ నాగార్జునుడు గాని, నలందా విశ్వవిద్యాలయాధ్యక్షుడుగాని ధాతువాద శాస్త్ర విషయము నధికరించి వ్రాసిన గ్రంథము లేవియును మనకు నేడు దృగ్గోచరము కాలేదు. జన శ్రుతులు, పురాణగాథలు తప్ప వీరి విషయమై నిశ్చిత జ్ఞానము మనకందు బాటులో లేదు. ఈ జనశ్రుతులను మనము విశ్వసించినట్లైన క్రీ. వె. మొదటి రెండు శతాబ్దు లందు హిందూదేశమందు ధాతువాదాభ్యసనము బహుళ ముగా నుండెడిదని మనమూహించ వచ్చును. ఈ విజ్ఞాన వికాసమే పై జెప్పిన నియోప్లేటోనిస్టుల ధాతువాద విజ్ఞా నమునకు ప్రభవ స్థానముగా నుండనోపు.

ధాతువాద శాస్త్రము క్రీ.వె. నాలుగు అయిదు శతాబ్దముల లోనే హిందూదేశము నందు ప్రబలి యున్నట్లు దామోదర గుప్తుని కుట్టనీ మతమను గ్రంథము నాధారముగా గొని చూపవచ్చును.

## కుట్టనీ మతము—ధాతువాదము.

ఈ దిగువ శ్లోకము వారాణసీ నగర వర్ణన సందర్భమున కానగును.

శూలభృతోధ్యానస్థాః। పదవేదినుయత్ర ధాతువాదిత్వమ్।
సురతేష్వబలాక్రమణం, దానచ్ఛేదో మదచ్యుతౌ
కరిణామ్।

కుట్టనీ మతము. శ్లో. 12.

అర్థము :—ధ్యానస్థాః = ధ్యాన నిమగ్నులైన సన్యాసులే, శూలభృతః = శూలమును ధరించువారలు, నగరవాసు లెవరును, శూలభృతులు = శూలనొప్పిచే బాధపడువారు కారు. ధాతువాదిత్వమ్, ధాతువుల( = సంస్కృతమందు క్రియాబోధకములగు శబ్దముల) గురించి వాదన, పద వేదిను = వ్యాకరణ మెరిగినవారలందే. ధాతువాదిత్వం = రసవాదచర్చపౌరులలో నెక్కడను గానరాదు. అబలా క్రమణం = అబలల (స్త్రీల) పైబడుట. సురతము = సంభోగ క్రీడలందే. అబలాక్రమణం = బలహీనులపై దౌష్ట్యము పౌరుల గుణము కాదు. దానచ్ఛేదః = దానము లేకపోవుట కరిణాం = ఏనుగుల యొక్క, మదచ్యుతౌ = మత్తుదిగి పోవుటలోననే అనగా దానచ్ఛేదము = ఈవి లేకుండుట పౌరులందు కానము.

ఈ శ్లోకమందు అబలా క్రమణము, దాన భంగము, శూలభరణము మొదలగు అవాంఛనీయ గుణములతో పాటు ధాతువాదము నిందకు పాత్రమైనది. అనగా దామోదర గుప్తుని కాలమునాటికి ధాతువాదము కేవల కపటముగా మారినది. ఇట్టి పరిణామమును పొందుటకు ధాతువాదము పుట్టి మూడు నాలుగు వందలేండ్లైనను కడచియుండవలెను

దామోదరగుప్తుడు కాశ్మీరదేశపు రాజైన జయాపీడుని మంత్రి. జయాపీడుని రాజ్యకాలము క్రీ. వె. 779-813

(See Introduction to Rājatarangini by Stein) అనగా దామోదరగుప్తుడు జీవించినకాలము ఎనిమిదవ శతాబ్దపు చివర. దీనికి పూర్వము నాలుగు వందలేండ్లైనను ధాతువాదము ప్రచారములో నుండవలెననిన అది క్రీ. వె. ఏ నాల్గవ శతాబ్దియందైనను ఉప్పవించియుండవలెను. అనగా నలాందా విశ్వవిద్యాలయ ప్రారంభకాలమున ధాతు వాదము ప్రచారములో నుండెడిదనవచ్చును.

## తంత్రశాస్త్రము

హిందూదేశమందు ధాతువాదస్వర్ణయుగము తంత్ర శాస్త్రములతో సది పొత్తుగలసిన కాలములో ప్రారంభించిన దని చెప్పవచ్చును. తంత్ర శాస్త్రములన్నియు శైవమత ప్రాధాన్యములు. ఈ శాస్త్రముల యుపాస్యదేవతలు శివుడు, శక్తి. వీటి ముఖ్యోద్దేశము జీవాత్మలకు శివసాయుజ్యమును చేకూర్చుట. దీనికి ఉపాయము తంత్ర విధానోక్తమైన ఉపాసన. ఉపాసన నిర్విఘ్నముగా కొనసాగుటకు దేహ మక్షతముగా నుండవలెను. దీనికి సాధనము రససిద్ధి. అనగా పాదరసమును రసాయనిక తంత్ర ప్రక్రియలచే రసాయనముగా మార్చుట. రసాయనమనగా ముదిమి, మరణము లేకుండ చేయునది యని అర్థము. ధాతు వాదము తంత్ర శాస్త్రమునకు అంగమైనను అందలి ప్రధాన విషయము కాదు.

"సచ రస శాస్త్రం ధాతువాదార్థమేవేతి మంతవ్యం ।
దేహద్వారా ముక్తిరేవ పరమ ప్రయోజనత్వాత్ ।"
(సర్వ దర్శన సంగ్రహము : రసేశ్వర దర్శనము)

రసవాదము కేవలము బంగారము చేయుటకొరకే కాదు. దేహమును అజరామరముగజేసి దానిద్వారా ముక్తిని బడయుట, రసశాస్త్రపు ముఖ్యలక్ష్యము.

రసవాదమునకు తంత్రశాస్త్రముతో పొత్తు గలిగిన కాలము నుండియు నది బహుళ ప్రచారములోనికి వచ్చినది.

## తాంత్రిక యుగము

ఈ తాంత్రిక యుగము తొమ్మిదవ శతాబ్ది మొదలుకొని పద్నాల్గవ శతాబ్దివరకు వ్యాపించినది. ఇందు శైవమతస్థులే కాక, బౌద్ధమతానుయాయులు కూడ ప్రసిద్ధ పురుషులైన వారలు కలరు. ఈ యుగమందు గ్రంథములు అనేక ములుగా వెలువడినవి. ముద్రితాముద్రిత గ్రంథ రూప ములలో నేటికిని మన కందుబాటులో నున్న రసాయన శాస్త్ర గ్రంథములనేకములు గలవు.

తాంత్రిక యుగమునందు అనగా తొమ్మిది-పద్నాలు శతాబ్దముల మధ్య, రసవాదమును, దానితోపాటు రసాయన



అజంతా

శాస్త్రమును వృద్ధి పొందించినవారలలో గోవింద భిక్షువు, సోమదేవుడు, నాగార్జునుడు, రామచంద్రుడు, స్వచ్ఛంద భైరవుడు పేరుగన్నవారు. వీరిలో నాగార్జునుడని పేరు మరల మనకు తారసిల్లుచున్నది. తాంత్రిక యుగపునాటి నాగార్జునుని పేరు మాధవాచార్యుని సర్వదర్శన సంగ్రహ మందు కానరాదు. నాగార్జునునకు కనీసము నాలుగు వందల యేండ్లు పూర్వమున జీవించిన గోవింద భిక్షుని నామము, అతని రసహృదయమను గ్రంథమునుండి ఉదా హరించిన శ్లోకములు మాధవాచార్యుని గ్రంథమం దగపడు చున్నవి. నాగార్జునుడు తన రసరత్నాకరమను గ్రంథ ములో తనకు పూర్వముండిన రసాయన శాస్త్రవిదుల పెక్కు మందిని పేర్కొనినాడు. అందు గోవిందభిక్షువు ఒకడు. అందువలన గోవిందభిక్షువు తాంత్రికయుగ ప్రారంభమున జీవించిన ట్లూహించవచ్చును. మాధవాచార్యులు పద్నాల్గవ శతాబ్దమున తన సర్వదర్శన సంగ్రహములో గోవిందభిక్షుని గోవింద భగవత్పాదులని పేర్కొనినాడు. భగవత్ అను పూజ్యతను తెలియజేయు విశేషణము ఋషుల నామముల ముందు చేర్చుటకద్దు. సమకాలీనులకు భగవత్ శబ్దమును వాడుట సంప్రదాయము కాదు. మాధవాచార్యుని కాలము నాటికి గోవిందుని నామము పూజ్యతా స్థానము నలంక రించినది. అందుచే మాధవాచార్యులకన్న గోవిందుడు నాలుగైదు వందల యేండ్లు ప్రాచీనుడై యుండవలయును. కనుక గోవిందుడు తొమ్మిది లేదా పదియవ శతాబ్దికి చెందినట్లు మన మూహించవచ్చును. శంకరాచార్యుల

గురువగు భగవత్పాదు లితడేయని యొక జనశ్రుతి ప్రచారములో నున్నది. రసహృదయమందు మంగళ శ్లోకమున, పర్యవసానమున బుద్ధుని నామగ్రహణము కద్దు. దీనివలన రసహృదయకారుని బౌద్ధమతాభినివేశము వెల్లడియగుచున్నది. హిందూమతోద్ధారకుడగు శంకరుడు బౌద్ధమతానుయాయియగు గురువు నాశ్రయించినాడనుట సయుక్తికము కాదు. అదికాక రసహృదయములో మనకు తారసిల్లు రసాయనిక జ్ఞానము శంకరునికాలపు రసాయనిక జ్ఞానముకన్న చాల అర్వాచీనమైనది.

## రసరత్నాకరము -

తాంత్రికయుగమందు రసశాస్త్రపారంగతులయిన వారలలో నాగార్జునుడు నాయకమణి. తనకు పూర్వము యీ శాస్త్రమందు వ్యాసంగముచేసినవారల యనుభవమును క్రోడీకరించి రసాయనశాస్త్ర మహాగ్రంథము లనేకములు రచించెను. అందు రసరత్నాకరమను నది నాటి రసాయనిక జ్ఞానమంతటికిని మణిదర్పణము. ఇందు రాసాయనిక ప్రక్రియలు, వాటి నిర్వహణమున కుపకరించు, వాలుకాయంత్రము, డోలాయంత్రము, బాష్పయంత్రము మొదలగు తాపనసాధనములు, స్ఫటికీకరణము, ద్రవములను అధిపవించుట—బట్టీ పెట్టుట—వేడిచేయునపుడు ధూపముగా మారుఘనద్రవ్యములను ఊర్ధ్వపాతనయంత్రములో సేకరించుట, మొదలగు ద్రవ్యశోధన కుపకరించు ప్రక్రియలు, రాసాయనిక ద్రవ్యములగు ధాతుభస్మముల, రసపర్పటి మొదలగు రసయోగికములను తయారు చేయుట, ఖనిజములనుండి ధాతువుల సాధించుట కుపయోగించు ప్రక్రియలు, యీ విషయములన్నియు విశదముగా వర్ణింపబడినవి.

ఈ గ్రంథములో నాగార్జునుడొక చోట పార్వతి నిట్లు నంబోధించినాడు. "ద్వాదశానిచవర్షాణి మహాక్లేశోకృతో మయా యది తుష్టాసిమే దేవి సర్వదా భక్తవత్సలే, దుర్లభం త్రిములోకేషు రసబిద్ధం దదస్వమే"—దీని యర్థము "నేను పన్నెండేళ్లు కఠోరపరిశ్రమచేసితిని. అందువలననో దేవీ! నీవు సంతుష్టురాలవేయయినచో మూడు లోకములందు దుర్లభమైన రససిద్ధిని నాకు ప్రసాదింపుము."

ఆ రోజులలో పన్నెండేండ్లు శ్రమించుటకు తగిన రసవాద జ్ఞానము, రసాయనశాస్త్రజ్ఞానము విస్తరించియుండిన, నాటి జ్ఞానమెంత పరిపాకదశలోనుండెనో మన మూహించవచ్చును. అట్టి జ్ఞాననిధియగు నాగార్జునుడు ఇంకొకచోట రసశాస్త్రజ్ఞానౌన్నత్యము నిట్లుగ్గడించెను.

"రసాయనశాస్త్రము ప్రచారములో నున్నంతకాలము, దేశములో అకలి, రోగబాధ, దారిద్ర్యము మనుజుల పీడించనేరవు."

రసాయనశాస్త్ర ప్రవర్తకుడు విశ్వస్రష్టకు ప్రతిస్రష్టగా నాచరించుచున్న నేడు ఈ మాట లెంతయు సార్థకములు.

తాంత్రికయుగపు నాగార్జునుడు పద్నాల్గవ శతాబ్దము వాడని తెలుపు ప్రత్యక్షప్రమాణము లేవియును లేనప్పటికిని అతని గ్రంథములందగపడు శాస్త్రజ్ఞానపరిపాకదశ, గోవిందభిక్షుని యాతడు పేర్కొనుట, గోవిందభిక్షునికన్న యాతని యర్వాచీనతను తెలియచేయును. అదిగాక మాధవాచార్యుని సర్వదర్శన సంగ్రహములో గోవింద భిక్షువుని పేరున్నట్లు నాగార్జునుని పేరు కానరాదు. అందుచేత నీ నాగార్జునుడు మాధవాచార్యులకన్న యర్వాచీనుడని తోచును. ఈ ఉపపత్తులన్నియు కూర్చి సమాలోచించి నచో యీ తాంత్రికయుగ నాగార్జునుడు పద్నాల్గవ శతాబ్దపు చివరనో పదిహేనవ శతాబ్దపు ప్రారంభముననో జీవించి యున్నట్లు తోచును.

మొత్తముమీద నాగార్జున నామము బౌద్ధమహాయాన తత్త్వశాస్త్రములో తాంత్రికశాస్త్రములో రసవాదశాస్త్రములో రసాయనశాస్త్రములో మహాప్రఖ్యాతిని గాంచిన నామము. పురాణకర్తలందరును వ్యాసనామముచే వ్యవహరింపబడు నట్లు తత్వశాస్త్ర, తాంత్రికశాస్త్ర, రసవాదశాస్త్ర కర్తలలో మహత్వమును గడించినవారెల్ల నాగార్జున నామధేయులుగనే పరిగణింపబడుట గణనీయమైన విషయము.



# రసవిద్య వెలయించిన సిద్ధనాగార్జునుడు

ఆచార్య విస్సా అప్పారావు

నేడు రసాయనశాస్త్రమని వాడుకలోనున్న శాస్త్రమునకు యీ రసవిద్యయే మూలము. అతి ప్రాచీనకాలము నుండి ఈ రసవిద్య మనదేశమందు ప్రబలియుండెను. ఈ విద్య శ్రీరామచంద్రులవారు దండకారణ్యమందుండి నప్పుడు కాలనాథుడను ఋషివద్ద నేర్చుకొని రామరాజీయము, రసేంద్రమను రెండు గ్రంథముల రచించిరని యీ విద్యలో ఉత్తీర్ణులైన సిద్ధులు సంప్రదాయకముగ చెప్పుకొనెడి విషయము. ఈ రెండు పుస్తకములయొక్క శిథిలఖండములు నేడున్నవి. "అర్కప్రకాశ" మను చిన్నగ్రంథమును రావణుడు వ్రాసెనని ప్రసిద్ధి. అనేక వ్యాధుల కిందు చికిత్స చెప్పబడినది. రసాయనములతో వైద్యము చెప్పబడినది. ఒక ఖనిజ అమ్లమును (mineral acid) తయారుచేసి వాడినట్లున్నది. క్రీస్తుకు పూర్వము అయిదవ శతాబ్దివాడగు పంతంజలి మహర్షి 'లోహశాస్త్రము'ను రచించెను. హిరోడోటస్ హిందూదేశమునందలి యోగులు పాదరసముతోచేసిన మందులను తిని వందల కొలది ఏండ్లు జీవించియుందురని వ్రాసియున్నాడు. మాధ్యమిక బౌద్ధప్రవర్తకుడగు ఆచార్య నాగార్జునుడు కొన్ని వందల ఏండ్లు జీవించెనని, రససిద్ధి పొందినవాడని చెప్పబడుచున్నది. క్రీస్తు తరువాత ఏడవశతాబ్దిలో ప్రసిద్ధి

కేశవపన దీక్ష. (క్రీస్తుశకం 250 ప్రాంతపు శిల్పం—జావా)



గాంచిన సిద్ధనాగార్జునుడు 'రసవైశేషిక' మను గ్రంథము నకు కర్త; గొప్ప రసవిద్యాప్రవీణుడు. రెండవ శతాబ్ది యందు వెలసిన ఆచార్య నాగార్జునుడు రసవిద్యయందు పేరుపొందిన గొప్పసిద్ధుడనీ, రసవిద్యకు ప్రథమాచార్యు డనీ, రసవాదశాస్త్రమును కల్పించినవాడనీ చెప్పుదురు. చైనాదేశమందలి రసవైద్యము హిందూదేశమునుండి గ్రహించినట్లు కనిపించును. "స్యూహా"లోని ముప్పది నాల్గవ పుస్తకములో (క్రీ. త. 589—618) నాగార్జునుడు "లూంగ్ షూ" అని చెప్పబడినాడు ("లూంగ్" అనగా నాగము-పాము; "షూ" అనగా చెట్టు—అర్జున వృక్షము). అందీ లూంగ్ షూ అనేక ఔషధయోగములకు కర్తయని యున్నది.

## ప్రాచీనాంధ్రమున వైద్యము

మన పూర్వులు వైద్యమును నాలుగు విధములుగా చెప్పిరి. ఒకటి: రసమును, ఇతర లోహములను ఉపయో గించునది, రెండవది: మూలికావైద్యము, మూడవది: మంత్రములను రక్షలను ఉపయోగించునది, నాల్గవది: శస్త్రవైద్యము. మొదటి రసవిద్య దివ్యమైనదనీ, యోగు లచే అభ్యసింపబడినదనీ, రెండవది, మూడవది మనుష్య సంబంధమైనవనీ, నాల్గవది క్రూరమైనదనీ వారి మతము.

రసవిద్య ప్రయోగముచేత కనుగొన్నదిగా గాక మనుష్య ప్రజ్ఞకు మీరినదై ఈశ్వరప్రేరితమై వెల్లడిచేయబడినట్లు తోచును. ఈ విద్యారహస్యము చాలవరకు మాటుపడి నది. రహస్యముగా యోగులచేత నభ్యసింపబడినట్లు కన్పించును.

రసవిద్యనుగురించిన గ్రంథములు పెక్కులక్కడక్కడ చెదిరియున్నవానిని సేకరించి అందలి వివిధవిషయము లను అనుపూర్వికముగా సక్రమముగా విభజించి, అనంద ర్భములను, తప్పులను సరిదిద్ది, సంపుటీకరించి 'రసజల నిధి' యను గ్రంథమును రసాచార్య కవిరాజ భూదేవ ముఖర్జీ, (బెంగాలు ఆయుర్వేద విద్యాలయములోని ప్రధా నాచార్యుడు,) 1926 లో మొదటి సంపుటమును ప్రచు రించెను. ఈ సంపుటమందు ఒక పాదరసమునకు ఎట్లు వివిధ సంస్కారములను చేసి దానిని సేవించవలెనో, ముఖ్యముగా వజ్రకాయమును పొంది మునలితనమును మృత్యువును ఎట్లు ప్రతిఘటించనగునో, రసమును భస్మము చేసి దానితో ఎట్లు రాగి మొదలైన లోహములను బంగారముగా, వెండిగా మార్చవచ్చునో స్పష్టముగా చెప్పబడినది.

## రసవిద్య

ఈ ముఖర్జీగారు ఒక యోగిని కలసికొనుట తటస్థిం చినదని, ఆయన దయవలన రసవాద గ్రంథములందలి విషయములను సమన్వయించుకొని అర్థముచేసికొను రహస్యమును తెలిసికొంటినని వ్రాసియున్నారు. ఆ యోగి నిత్యధర్మజీవితమున కెంత కావలెనో అంతే బంగారము చేసికొనుచుండవలెనని చెప్పెనని, ముఖర్జీగారికి బంగార మును చేసి ప్రత్యక్షముగా చూపించెనని వ్రాసిరి. ఏ భస్మము నుపయోగించి బంగారమును చేసిరో దానిని చేయువిధమంతయు యీ గ్రంథమందు వివరించితినని, అందు వివరించిన రీతిని ఒక రసశాలను నిర్మించి, ఉప కరణములను, ధాతువులను, మూలికాదులను సేకరించి ఆ ప్రయోగములు చేయుటకు తగిన వసతులు కల్పింప బడినచో తానా పనియందు నిమగ్నుడై రససంస్కారము లను చేసి ఫలితములను పొందగలనను ధైర్యముకలదని వ్రాసియున్నారు.

రసజలనిధి ప్రథమ సంపుటమునుండి రసవిద్యను గురించిన విషయములను యీ క్రింద సంగ్రహించు చున్నాను.

1. ఆచార్య లక్షణము :—రసకర్మదక్షుడు, సదయుడు, తంత్రజ్ఞుడు, తేజస్వి, జ్ఞాని, శివసాధకుడు, భక్తుడు, జితేంద్రియుడు, సర్వజీవహితుడునై ఆచార్యు డుత్తమ పురుషుడుగా ఉండవలెను.

2. శిష్యలక్షణము :—నిరహంకారి, సత్యవాది, దృఢ వ్రతుడు, మేధావియై యుండవలెను.

## రసజలనిధి విషయ వివరణము

3. రసశాలా నిర్మాణము :—దేవాలయముగల నగర మందు విపులము, రమ్యమునైన వనమందు, సర్వౌషధులు గల చోట రసశాల నిర్మింపవలెను. బహుద్వార గవాక్షము లుండవలెను. నిర్మల నీరములు దగ్గర గలచోట, ప్రశాం తముగా, ఏకాంతముగా రసక్రియ నల్పుటకు వీలుగా శాలను నిర్మించవలెను. సూర్యరశ్మి బాగా తగులుచోట స్ఫటికముపంటి రాతితో తూర్పు భాగమున రసమంట పమును నిర్మించవలెను. సర్వరసములను (ధాతువులు) నిలువ చేయుటకై ఏర్పాటు చేయవలెను. మండప మధ్య మందు ఒక వేదికపై రసలింగమును ప్రతిష్ఠించి యథా శాస్త్రముగా నిత్యపూజ నలుపవలెను.

4. ఒకటిన్నర కొలముల (తులముల) బంగారు రేకులను. మూడు రెట్లు బరువుగల రసముతో ఒక రూముసేపు ఒక

శాక అమ్లరసముతో మర్దించి, నిమ్మకాయలో పాదిగి, గంజిలో డోలా యంత్రములో ఉడక బెట్టవలెను. అట్లు తయారైన రసలింగమును ఉత్సాహముతో మంటప మధ్యమున ప్రతిష్టించి పూజించినచో అసామాన్యమగు ఫలము కలుగును. దర్శనము చేత పుణ్యము కలుగును. స్పర్శ వలన ఫలసిద్ధి యగును, పూజించిన ముక్తి కలుగును.

తరువాత శ్రీదేవిని మంత్రరాజమగు అఘోరమంత్రముతో పూజించవలెను. రసాంకుశ మంత్రముతో కూడ దేవీ పూజచేయ వలెను.

5. రసశాలా వివరణము :—పహ్నికర్మ, వేపణకర్మ, శస్త్రకర్మ, వేధకర్మ మొదలైనవి నియమితమగు దిక్కులలో విన్యరుప వలెను.

6. శాలోపకరణములు :— వివిధోపకరణములు, యంత్రములు, మూసలు, పుటములు, వాని వివరణములు చెప్పబడినవి.

7. శిష్యోపనయనము చేయు విధము :— ఆచార్యుడు భార్యా సమేతుడై ఉపనయన కర్మసాగించ వలెనని, శిష్యుడు అఘోర, రసాంకుశ మంత్రములను లక్షసార్లు పునశ్చరణ చేయవలెనని, వివరింపబడినది.

రససిద్ధికి భగవత్కృప ముఖ్యము :—గురుని చేత ఉపనీతుడై రాజాదరణము ప్రజాదరణము కలిగి, ధన వంతుడై, రసౌషధ కోవిదుడై నానాకర్మపరాఙ్ముఖుడైన వానికిగాని సిద్ధిలేదు.

**రస మహిమ** —ముక్తి పొందుటకు ప్రాణాయామము, వాసనానోపసము, జితేంద్రియత్వము మార్గములు. ఇవి సుస్థిరమగు దేహమున గాని సాధ్యములు కావు.

రసము, గాలి యీ రెంటిచేత శరీరము స్థిరముగ నిలుప గలదు. మూర్ఛావస్థలో రసము వ్యాధులను పోగొట్టును. మృతరసము దేహారోగ్యమును కాపాడును. రసము వాయువు బంధింపబడినచో ఖేచరత్వమబ్బును. "బద్ధః ఖేచరతా మీదత్తే రసోవాయుశ్చనాన్యథా" ఇంకొక రీతిని సాధ్యము కాదు. పాదలేపనముతో నాకాశమున నెగురుట, నీటి మీదనడచుట దీనికి సంబంధించినవే! ఈ యాకాశ గమనమున కుపయోగించే రసము నల్లని రంగుగల రసేంద్రమను కృష్ణరసము.

**పంచ రసములు** :—రసము-ఎరుపు రంగు కలది; రసేంద్రము—నలుపు రంగు కలది; సూత—పసుపు రంగు కలది; పాదరసము—తెల్లనిది; మిశ్రకము—నెమిలి పింఛపురంగు గలది.

**ఉపరసములు** :—ముఖ్యమైనవి ఎనిమిది—(1) గంధకము (2) హరితాళము (orpiment) (3) కాసీసము (green vitriol) అన్నభేది (4) శిలాజిత్ (bitumen) (5) కంకుష్ఠమి (6) మణులు (7) రజవర్త (8) గైరికము·

**8. సంస్కారములు** :—రసదోషములను తొలగించుటకై పద్దెనిమిది సంస్కారములు, ఒక్కొక్క సంస్కారములో వివిధ క్రియలు విపులముగా చెప్పబడినవి. శోధనం, గ్రాసనం, మూర్ఛనం, మారణం, భస్మీకరణం, యీ సంస్కారములలో ముఖ్యములు. గ్రాసన సంస్కారములో రసము, బంగారము అభ్రకము, గంధకము మొదలైన లోహాదులను ఎట్లు మ్రింగివేయునో, మ్రింగిన తరువాత రసము యొక్క బరువులో చెప్పతగిన మార్పు ఎట్లుండదో చెప్పబడినది. ఇది వింత విషయము.

**మృత సంజీవనీ ఘుటిక** :—

కాంతాభ్రకతా ప్యసత్వానాం వజ్రహేమ్నోరసస్యచ।
సప్తాహ మమ్లవిష్టానం గోలకో లేపతే స్వహమ్॥
గోజిహ్వావాయసీ పథ్యా నిర్గుండీ మధుసైంధవమ్।
స్విన్నే భూధరయంత్రేపశ్చాత్ కఠిన తాంగతే॥
యవచిన్నా పలాశాజ్ఞరాజికార్పాసతణ్డులైః।
అపరితాసర్పిపాయామ్ మూషాయాం ఖదిరాగ్నినా॥
టబ్కణం శ్వేతకాంచంచ దత్వాదత్వా విశోషతే।
మూషయాం విద్యోగేన సమాంశం హేమజారయేత్॥
సంవత్సరం ముఖధృతా మృత సంజీవనీ మతా।
గుటికా శస్త్రస్తంభంచ కురుతే హరతే జరామ్॥

కాంతం, అభ్రకం, స్వర్ణమాక్షికం (Sulphide of Iron or Copper) హీరకం—వజ్రం, బంగారం, రసం-భస్మము, గంజిలో వీనిని ఒక వారము మర్దనచేసి ముద్ద కట్టించవలెను. దానిపైన గోజిహ్వ, కాకమాచి, హరీతకి·



ప్రసాదిక తన యజమానురాలి పాదాలకు పారాణి పూస్తున్న దృశ్యం.



స్నానమాడు బోధిసత్త్వుడు. (రెండవ శతాబ్ది శిల్పం—అమరావతి)

నిర్గుణ్డీ, మధువు, సైంధవములతోచేసిన లేపనమును పూయ వలెను. భూధర యంత్రమందు వేడిచేయవలెను. మూస లోపలి భాగమున, బార్లీ, చింతపండు, పలాశకట్టె బూడిద, విభీతకి, రాజిక, పత్తిగింజలు, తండులీయకములతోచేసిన లేపనమును పూయవలెను. వేడిచేయుచున్నంతకాలము అప్పుడప్పుడు క్రమేణ పటిక, తెల్లగాజు చూర్ణములను మూసలోనికి వేయుచుండవలెను. ఇట్లు పదిహేను దిన ములుచేసినచో, గుటిక తడిలేనిదై యుండును (dries). ఈ మృతసంజీవనీ గుటికను ఒక సంవత్సరకాలము నోట నుంచికొనినచో మృత్యోన్ముఖుడైన జీవించును. వానిది వజ్రదేహమగును. శత్రువుల శస్త్రముల భయముండదు. ముసలితనము తొలగిపోవును.

రంజనమ్ :—(పదిహేడవ సంస్కారము) తైలము మూలమున ఇతర పద్ధతులవలన రసమునకు ఎరుపు రంగువచ్చునట్లు చేయవచ్చును. అట్టి రసము కదలక నిలుచును. అగ్నిపైనుంచిన విరిగిపోదు. ఇట్టి రసముతో లోహములను కబళించునట్లు చేయవచ్చును.

## స్పర్శమణి (Philosopher's stone)

ఎరుపురంగు వచ్చిన రసమును, మసి, ఇటుకపొడి, పెరుగు, నిర్గుండి, గంజిలో కలిపి వేంచేసి ఊర్ధ్వపతనము (Sublimation) కావింపవలెను. రసములో $\frac{1}{4}$ బరువు గల బంగారుముద్దనుగాని, వెండిముద్దనుగాని రసము మ్రింగునట్లు చేయవలెను. ఇట్లు నాలుగుసార్లు చేయ వలెను. అది నాలుగు పొరలు గల గుడ్డలోనుండి పిగి నచో రసము ఆముద్దలను పూర్తిగా జీర్ణించుకొన్నట్లు భావింపవలెను. ఈ రసమున కింకను అనేక కర్మలు చెప్ప బడినవి. జలకచ్ఛప, స్థలకచ్ఛప యంత్రములు మొద లగు సాధనలతో మూడెనిరోజులు రసముకంటె ఎనిమిది రెట్లు బరువైన బంగారమునుగాని, వెండినిగాని ఉపయో గించి కర్మసాగించవలెను. అట్లు తయారైన రసమును దివ్యౌషధములతో ఘనీభవింపచేసినచో, అది ఇష్టసిద్ధులను చేకూర్చునదగును.

ఉపయోగించిన బంగారుగాని, వెండిగాని రసముతో సమానభాగమైనచో తయారైన రసమును శతభేది యందురు. అది నూరురెట్లు బరువైన లోహమును బంగా రముగాగాని, వెండిగాగాని చేయును. రెట్టింపు బంగార మును వెండినిగాని ఉపయోగించినచో సహస్రభేది, నాల్గు రెట్లకు లక్షభేది, ఎనిమిది రెట్లకు కోటిభేదియగును. పద హారుగాని, ముప్పదిరెండు రెట్లుగాని బంగారము నుపయో గించినచో స్పర్శమణిగా రసముమారును. స్పర్శమాత్ర మున లోహములు బంగారుగా మారును. ఇట్లే వెండిగా కూడ మారును.

**వేధన భేదములు :**— లోహములను బంగారుగా మార్చుటలో భేదములు కలవు.

**లేప వేధనం :**—ఇది సాధారణ పుత సాధనద్వారా జరుగును.

**క్షేప వేధనం :**— లోహమును కరిగించి అందులో రస మును పడవేయుట చేతనగును.

**కుంత వేధనం :**— తయారైన రసములో చిన్నభాగ మును పట్టుకారుతో పట్టుపట్టి లోహము కరుగుచుండగా దానిపై నుంచుట.

**ధూమ వేధనం :**—లోహము నగ్నిపైనిడి, తయారు చేసిన రసమును జల్లగా పొగజిమ్మిన తత్క్షణమే లోహము బంగారుగా మారును.

**శబ్ద వేధనం :**—తయారైన రసమును పుక్కిట నిడి కొని చిన్నలోహపుముక్కమీద ఉఫ్‌మని ఊది వెచ్చబెట్టి నచో, బుస్సుమను శబ్దముతో లోహము బంగారముగా మారును.

**స్పర్శ వేధనము :**—స్పర్శమణితో అంటుటచేత బంగారుగా మారుట (16, 32 రెట్ల బరువుగల లోహ ములు, నవరత్నములు మొదలగు బీజములతో ఘనీభవిం చిన రసముతో అంటవలెను).

వేధనమొనర్చబడిన లోహములను ఒకపక్షము (పద్నాల్గు దినాలు) భూమిలో పాతిపెట్టి తరువాత తీసి విక్ర యించవలెను. ఇట్టి వేధనవిద్య నేర్చినవానిని దుఃఖతరన్ అందురు. (ఇతడు దుఃఖములను తరింపజేయుగలుగును గాన !).

*  *  *

కేవలము రసమును మాత్రమేగాక, రసము గంధక మును కలిపి ఉపయోగించి తగరమును వెండిగా మార్చుట, హరితాళమునుమాత్ర ముపయోగించి రాగి రేకును బంగారముగా మార్చుటకూడ రసజలనిధి రెండవ సంపుటములో వివరింపబడినది. హరితాళమును శతభేదిగా మార్చునట్టి యోగముకూడ నందు వర్ణింపబడినది.

*  *  *

**తీక్షణ లోహము :**—(Steel) రసజలనిధియొక్క ఆరు విధములైన ఉక్కులు నాల్గవ సంపుటములో వివ రింపబడినవి.

1. **ఖర :**—లోహముపైన పొగర లేకుండును—విరుగ గొట్టినచోట పాదరసమువలె మెఱయును.



**2.** సారలోహము:—పైభాగమున పోగర లుంతును. పుల్లటి శాకరసముతో తోమినచో పైభాగము పర్వతశిఖరాకారము గల సన్నని గీతలతో గూడిన ఆకారములు గోచరించును.

**3.** హ్రస్వల లోహము : - నలుపు పసుపు కలిసిన రంగు కలది. దీని పైభాగమున పోగర పక్షిముక్కుల ఆకారము కలదిగా ఉండును.

## లోహ పరిశీలన

**4.** తరపట్ట లోహము :— లోహ పరిశ్రమలో మేలితరహాకి చెందినవారు మాత్రమే దీనిని తయారుచేయగలరు. ఇది నున్నగాను, నల్లగానూ, మెరయుచుండును. అతి సన్నని పోగరకలదై యుండును. చిన్న చిన్న దొప్పల ఆకారము కలదిగా దీని తయారీ ఉండును. **ఇది తుప్పు పట్టదు (does not rust).** ఎండ, వాన, గాలి ఎన్నాళ్లు సోకినా తుప్పు పట్టదు. దీనితోనే బహుశః ఢిల్లీలోనున్న సుప్రసిద్ధ పురాతన లోహ స్తంభము చేయబడి యుండును. కోనార్కలోని సూర్యాలయ మంటపి లోహ స్తంభములు, విష్ణుపూర్‌లోని ఫిరంగులు యీ ఉక్కుతోనే చేసియుండ వచ్చును. ఇట్టి ఉక్కును చేయగలిగిన కార్మికులు **1880** ప్రాంతముల వరకూ నుండిరి. నేడు ఎచ్చటను యీ విద్య నేర్చినవారు కానరారు !

**5.** వజ్రలోహము :— దీని పైభాగమున గల పోగర రేఖలు మెరుపు వజ్రతీగలవలె లోతుగాను నిడివిగాను, వంకరగాను ఉండును. ఇది మెరయునట్టి నలుపురంగుగా ఉండును.

**6.** కాలలోహము :— చాలా బరువుగా **(blue-black)** నక్కని నీలవర్ణము కలదై యుండును. పైభాగము మెఱయుచుండును. గాజువలె ప్రతిఫలించును. ఇంకొక లోహపు ముక్కతో ఎంత కొట్టినను ఇది బ్రద్దలుకాదు.

.....

**పద్మపాణి బోధిసత్వుడు.**
**(6 వ శతాబ్ది భిత్తికా చిత్రం-అజంతా)**

ఈ వివరములవలన లోహపరిశ్రమలోను, ధాతుకర్మ యందును మన పూర్వులు చాల తెలిసినవారని చెప్ప వచ్చును. ఇట్టి విద్యలు మరుగుపడి యున్నవి. 1925 నవంబరు నాల్గవ తేదీన ఫార్వర్డు (Forward) అను కలకత్తాలోని పత్రిక హైదరాబాదులోని అనేక అముద్రిత తాళపత్ర గ్రంథములనుగూర్చి వ్రాయుచు కొద్ది వివరము లను వెల్లడించినది:—బంగారు చేయు యోగములు, ఖనిజములను కనిపెట్టు యంత్రములు, (prospecting devices). రాయలసీమలోనుండి సేకరించిన కొన్ని అపూర్వమగు రసవాదగ్రంథములు శ్రీ గొల్లాపిన్ని వానుదేవ శాస్త్రిగారు యీమధ్యనే తెచ్చి నాకిచ్చిరి. వానిగురించిన పరిశోధన త్వరలోనే సాగగలదని తలచుచున్నాను.

*　　*　　*

## నవనాథచరిత్ర - నాగార్జునుడు

గౌరన రచించిన నవనాథచరిత్రలో నాగార్జును డను సిద్ధుని పూర్వగాథ యొకటి కలదు. అతడొక రాజపుత్రుడు. వేటకు బోయి విధివశమున పామై యుండునట్లు శపింప బడి, అర్జునవృక్షములోని తొర్రలో పాముదూపమున దాగి యుండి, మీననాథసిద్ధుని యనుగ్రహమున మానవాకృతిని బొంది అతనికి శిష్యుడై నాగార్జునుడను పేరుగాంచెను. అణిమాదిసిద్ధులనియు మీననాథు డీతని కనుగ్రహించెను. తరువాత ఆత్రేయుడను శిష్యునకు రసవాద సార శాస్త్రము లను తెలిపి, యాంధ్రదేశమున తిరుగుమని పంపి, తాను మీననాథునివద్దకు బోయి అతనిని సేవించుచుండెను. నాగార్జునుని శిష్యుడు శ్రీశైలమును చేరి గర్వితుడై శ్రీశైలమునంతను బంగారుకొండగా మార్చదలచి కార్యము నకు పూనెను. అది తెలిసి విష్ణువు మాయావేషమున వచ్చి అతని వుక్కటనున్న మృతసంజీవినీఘుటికను పైకి తీయించి, చక్రప్రయోగము చేసి వధించెను. ఆ ఘుటిక నోటనుండగా కత్తితో మెడమీద కొట్టినను ఖంగుమని తూలి పోయినదిగాని వ్రేటు పడలేదు. కొండనంతను బంగారము చేసిన ప్రజలు ఎవరికి కావలసినది వారు త్రవ్వుకొని పోయి సేనల పోగుచేసికొందురనియు, దేశమునందంతటను అరా జకము ప్రబలుననియు, ధర్మము తొలగుననియు, మర్యాద నిర్మూలమగుననియు, భూమి నెఱితప్పుననియు తలచి విష్ణుమూర్తి లోకహితముకొఱకై అతనిని సంహరించె నని కథ.

ఈ సందర్భములో బంగారు చేయువిధానము కొంత వర్ణింపబడినది. దాని నీ క్రింద ఉపహరించుచున్నాను:—

రసము లైదును నుప - రసము లెన్మిదియు
బసడులు మందులు - బాషాణములును
గలుపంబులును జాల - గా నమకూర్చి
పలయు మంత్రౌషధా - వళులకు బలియు
జేసి మనోజయు - సిద్ధి బెంపొంది
యాసీనుడై లులా - యాజిన రచిత
గురుభస్త్రికల నిప్ప - గ్రోవులు నలిపి
సరములు బొందుగా - సంధించి భక్తి
గురునాథు దలచిత - ద్గురువు భజించి
పరభైరవాది దై - వములను మ్రొక్కి
నేర్చిన మందు ల - న్నియు వైచి యగ్ని
గూర్చి పుటంబు గ్ర - క్కున బెట్టినపుడు
వెననూదువారును - వినుపకరసము
పసడులు గలిపి పా - ల్పడ నూదువార
లనువొందగా మాన - లపరించువారు
మెనసిగ్నకమ్మ ఱుబుటం - బులు బెట్టువారు
కలయంగ నూరిన - కనకంబు డివిసి
యెలమిమై బెనుబ్రోవు - లిడ్డెడివారు
నై సంభ్రమింపుచు..................

*　　*　　*

## నాగార్జునకొండలో లభించిన రసాయనిక సాధనములు

1953 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ రజతోత్సవ సందర్భ మున జరిపిన చారిత్రక ప్రదర్శనములో, నాగార్జుని కొండవద్ద జరుపుచున్న త్రవ్వకములలో లభించిన వస్తువు లను కొన్నిటిని తెచ్చి చూపిరి. అందు పెద్ద పింగాణీ కుప్పెలు (blacks) బక యంత్రములు (Retorts) కలవు. పింగాణీకుప్పెలో రాయివలె గట్టిపడిపోయిన పదార్థము మెండుగా నుండెను. అందొక గరిటకూడ బిగుసుకొని పోయి యుండెను, ఈ రసాయనిక సాధనములవలన నాగార్జునునికొండ ప్రాంతమున రసశాస్త్రవేత్తలు, రస సిద్ధులు కొంపదు స్థావరము కల్పించుకొని యుండియుందు రని చెప్పవచ్చును. ఇవి ఏకాలమునాటివో చెప్పజాలము. ఇవి సిద్ధనాగార్జునాచార్యుని కాలమునకు తరువాతివి మాత్రమైయుండవు. ఏమన నాటికి నాగార్జునునికొండ ప్రాముఖ్యము తగ్గిపోయెను. ఈ పింగాణీకుప్పెలలోని పదార్థమును దొలిచితీసి (drill) రసాయనశాస్త్రపద్ధతి నది యెట్టిదో తెలిసికొనుట చాలా అవసరము.



మూగపక్ష జాతకము. (2 వ శతాబ్ది శిల్పం—అమరావతి)



బుద్ధభగవానుడు; భిత్తికా చిత్రం—(జపాను, 10-వశతాబ్దం)



కేశఖండనం. బంగారు మలామాతో నిగనిలాడే మృణ్మయ శిల్పం—(బర్మా, 11వ శతాబ్దం).



బోధిసత్త్వుడు
(ఫొండుకిస్తాన్ శిల్పం; ప్రస్తుతం
పారిస్‌లో వున్నది.)



ఇటుకలతో రూపొందించిన బోధిసత్వుని ప్రతిమ—(బర్మా, 11-వ శతాబ్దం)



తథాగతుని శిలావిగ్రహం—(చైనా, 5, 6 శతాబ్దాలు)



విరాగి బుద్ధుడు—లాక్షా రచిత ప్రతిమ—(చైనా, 15-వ శతాబ్దం)



# ఉన్నతకళావాహినికి ఊటపట్టుగా వెలసిన సిద్ధార్థుని జీవితం

కృష్ణచైతన్య

మతాచారాల లక్ష్యం మానవుడికి దేవునితో ఒకవిధంగా పొత్తుకుదిర్చి దానితో అతని ప్రాపంచిక జీవనానికి సమస్థాయిని సమకూర్చుచు ప్రయోజనవంతంగా చేయుటం. అయితే, మత విశ్వాసాలరంగంలో కూడ ఆ సమస్థాయి అనేది మానవుడికి అయత్నంగా సులభంగా ప్రాప్తించటం లేదు. ప్రాచ్యదేశాలలోను, పాశ్చాత్యదేశాలలోను గూడ పవిత్రజీవు లెందరో ఈ శరీర జన్యమైన వాంఛలపట్ల కఠోర నియమా లవలంబించవలసి వచ్చింది. ఆరిజన్ అనే ఆయన తన పుంస్త్వాన్ని నివర్తించేందుకై బీజ ఖండనము కూడ చేసికొనెను. క్రైస్తవ జాతులలో మధ్య యుగంలో లలితకళారంగమందు మానవుల నగ్నరూప చిత్రము నిషేధించబడింది. అయినప్పటికీ పునరుత్తేజన యుగంలో ఏర్పడిన మానసిక స్వాస్థ్యానికి మానవసేవా పారమ్యవాదుల రసోన్మాదము ఒకటే హేతువు అని చెప్పడం సబబుకాదు. మతతత్త్వములుచేసిన సేవను అన్యాయదృష్టితో త్రోసిపుచ్చినట్లగును. కొంతవరకైనా అస్సిసీ ప్రాంతమువాడైన ఫ్రాన్సిస్ అను సిద్ధునియొక్క ఉదారమైన ప్రజాహితాభిలాషగూడ పునరుత్తేజన యుగంలో సంభవించిన గొప్ప మార్పుకి ప్రబల హేతువే అని చెప్పవలెను. బైబిలులోని స్తోత్ర రచయితవలెనే, ఫ్రాన్సిస్ కూడ తన భగవదారాధనలో కొండల్ని, లోయల్ని, నదుల్ని, అడవుల్ని కలిసి గానము చేయుమని పిలచె నను విషయం గుర్తుంచుకోదగ్గది.

పైన చెప్పిన అంశాలు కళామర్మంలో అప్రస్తుతాలు కానేరవు. లలితకళలు ప్రకృతినుండే ఉద్భవించాయి, ప్రకృతిమయములే అయివున్నాయి అనే సత్యం వీనినుండి ప్రకటమగుచున్నది. ఎంతటి ఉన్నతాశయాలైనా, యెంత ఉత్కృష్టమయిన మతతత్త్వబోధలైనా భౌతికరూపంలో పొదగనిదే, ప్రజలకు తమ కళాత్మక సందేశాలను అంద జేయజాలవు.

**స్తూపానికి వందనమాచరిస్తున్న మత్తేభాలు — ఈ అమరావతి శిల్పం ప్రస్తుతం బ్రిటిష్ మ్యూజియంలో నున్నది.**

ఐరోపాఖండంలో మతవిశ్వాసాల వ్యాప్తియందు కలిగిన ఎగుడు దిగుడుల లాటివే, బౌద్ధమతములోకూడా కాన వస్తాయి. లెక్కలేని బౌద్ధవిహారాల నిశ్శబ్దతను చీల్చుకొంటూ

"ఎటు చూచినా జగత్తు దుఃఖమయమే,
మానవునిలో సళించక నిలిచే దేదీ లేదు,
వస్తువులలో శాశ్వతమైన పరమార్థం శూన్యం"

అనే విషాద గీతి ప్రతిధ్వనిస్తూనే యున్నది.

అయినప్పటికీ, ఒక అంశం గమనించవచ్చు: ప్రజా బాహుళ్యానికి బుద్ధుడు ప్రపంచ నిరాకరణముకంటె ప్రశాంతి సందేశాన్నే అందించాడనేది. తనమూలముగా మొదట్లో సంభవించిన క్షోభాన్ని తరువాత తానుగూడ గుర్తించి ప్రపంచగతిలో ఇమిడియున్న నానా మార్గాలతో సమాధాన పడడానికి అవశముగా లోనైనాడు. తన కుమారుడైన రాహులుని భిక్షు మార్గములోనికి చేర్చుకొన్న తర్వాతను, ఆతర్వాత వారసుడైన సందుడుగూడ రాజ్యపట్టాభిషేకం మధ్యలోంచి లేచివచ్చి తన్మయావస్థస్థితిలోపడి వెడలి పోయినప్పుడు, బుద్ధుని తండ్రి, వృద్ధుడు అగు శుద్ధోదన మహారాజు బుద్ధుని గూర్చి మృదువుగా వెలువరించిన అనమ్మతి స్మరణీయము. "ఈ ప్రపంచాన్ని ప్రభువు పరిత్యజించి వెళ్ళినపుడు దుఃఖమునకు పరిమితిలేదు; సందుడు వెళ్ళినపుడును అలాగే అయినది; రాహులుడు వెళ్ళినపుడు చెప్పనే అక్కరలేదు; పుత్రవాత్సల్య మనునది చర్మం, మాంసం, సరాలు, మేదస్సు మొదలైన సమస్త ధాతువులను క్షోభపెట్టి నమిలివేస్తుంది. ప్రభూ, ఒక్క ప్రార్థన! ఇకనైన ఆ మహామహులు లోకములో యే పుత్రునికిగూడ వాని తల్లిదండ్రుల అనుమతి లేకుండా భిక్షు కోటిలో చేరే అవకాశము ఈయకుండునట్లు నిబంధనము అనుగ్రహింపుము" అని. ప్రాణి సహజమైన ఈ ఆవేదన-ఇదికూడా పవిత్రమైనదే—బుద్ధుని హృదయమునకు వ్యక్తమయినది; అంగీకరించినాడు.

అజంతా గుహల్లో చిత్రకళ, దయామయుడు వాత్సల్య పూరితుడు అయిన బుద్ధుని ఆశయములే తనకు ప్రాణములగుటచే, నశ్వరవస్తుజాలాన్నికూడా నాశమెరుగని అంద చందాలతో ఒక క్రొత్తలోకంలోకి కొనిపోవునట్లుండును. రంగులతోను, రూపసౌష్ఠవముతోను దర్శనీయతను పుణికి పుచ్చుకొనేశక్తి యీ కళకు కలదు. సృష్టిసౌందర్యాన్ని చిత్రంగా ఊహించి చూపగల్గిన ప్రతిభ ఒకటి, వృక్షజాలంలోను జంతుకోటిలోను పరస్పరసహకారాన్ని భావించుకో గల్గిన విశ్వజీవసౌభ్రాతృత్వముతోసహా, ఈ కళలో గుప్తపరుపబడినది. ఉదాహరణకు: ఒక మోదుగచెట్టు, నిండుగా పూచిన పుష్పరాశి, అంటి మెలివేసికొని ఎగ ప్రాకిన ఒక లేతతీగ, వీనిపై మకరందము త్రాగుటకై పరుపులెత్తే చీమలబారు!

విశిష్టమైన పరిణామాలతో నిండిన సిద్ధార్థుని జీవితమే చిత్రకళకు జీవముపోసే ఎడతెగని జలవంటిదై వెలసినది. ఒక్క పురుషాంతరములో మానవచరిత్రలోని సృష్టి పరిణామక్రమమంతా క్లుప్తపరుపబడియున్నది: మాతృస్తన్యము త్రాగుచున్న ఒక పసికందు, ఆటలలో మైమరచిన ఒక బాలకుడు, వినోదములలో పొద్దుపుచ్చుచున్న ఒక జవ్వనుడు, తరువాత సర్వేంద్రియములను ఆవరించే జుగుప్స, ఆపై సురక్షితమైన గృహజీవనమునుండి పరాఙ్ముఖమై వెడలిపోవుట, ఆత్మనుగూర్చి కలిగే మీమాంసలమథన, ఆ తరువాత ఒక్కసారిగా ప్రబోధము ప్రకాశించుట, దానితో మానవకూటములోనికి మరలివచ్చి చేసే ప్రచారము. కావుననే, ప్రతిచిత్రకారుని కుంచె ప్రతి శిల్పియుత్తి విసుగు విరామాలులేకుండా ఈ కథల్నే పునరుద్ఘాటనచేస్తూ ఉండడంలో ఆశ్చర్యమేమున్నది? అలా చెయ్యడంలో వేలకొలది సంవత్సరాలు ఆసియాఖండమంతటను, దక్షిణమహాసముద్రములోని ద్వీపద్వీపాంతరములందునను వ్యాపించే బౌద్ధ మతబోధలోని శాంతి సందేశానికి తోడునీడలై (ఆ కుంచెయు, సుత్తియు) మెలగడంలో వింతయేమున్నది?

ఈ బౌద్ధమతచిత్రకళను తొలుతగా గ్రహించినది బహుశా ఆఫ్ఘనిస్థానదేశము. పశ్చిమ ఆసియా ప్రాంతముపై పర్విన అలెగ్జాండరు విజయయాత్రాప్రవాహము కొత్తకళా సంప్రదాయములను పుష్టిగా పండించగల్గినటువంటి గ్రీసుదేశపు కళామర్యాదలనే విలువగల ఒండ్రుమట్టిని పరచి ఉంచింది. సెల్యూసిడ్స్ పరిపాలనలో నేటి "బాల్క్" రాజధానిగా చేసికొని వెలసిన గ్రీకోబాక్ట్రియన్ రాజ్యము, నేడు పెషావరు అని పిలుపబడే పురుషపురం రాజధానిగా చేసికొని కుషాణులు పరిపాలించిన అప్పటి గాంధార రాజ్యముతో సాంస్కృతిక సంబంధాలు విశేషంగా పెట్టుకొనినది. భారతదేశానికి, గ్రీకులమధ్య ప్రాచ్యదేశాలకు మధ్య నిరంతరంగా రాకపోకలు యేర్పడసాగిన ఆ సమయంలోనే విజృంభించుచూఉన్న బౌద్ధమతం ఆనాటి చిత్రకళకు జీవగఱ్ఱ అయినది; గ్రీసుదేశంలో రూపొందింపబడిన ఆకృతులు దానికి భౌతికోపాధిని కల్పించేందుకు ప్రాతిపదికలయినవి. ఇట్లేర్పడిన గాంధారశిల్పం కుషాణ సామ్రాజ్యపరిధులతోనే ఆగిపోలేదు. భారత-బాక్ట్రియన్ కళ అనదగిన యీశిల్పానికిచెందే ప్రప్రథమ కళాఖండము, 1833 వ సంవత్సరంలో డాక్టరు గెరార్డ్‌గారిచే కాబూల్ వద్ద ఒక శిథిలస్తూపంనుండి సంగ్రహింపబడిన వలయాకృతి బుద్ధవిగ్రహం.



లంబినీ వనమందలి సాలవృక్షశాఖను చేతపట్టుకొని, నిలబడివున్న బుద్ధ జనని మాయాదేవి. దక్షిణపార్శ్వంనుంచి శిశువు ఆవిర్భవించడం చూడవచ్చు. ఇది క్రీస్తు శకం రెండవశతాబ్ధపునాటి గాంధారశిల్పం. ఇదే భావానికి, టిబెట్, బర్మా మున్నగు దేశాల చిత్రకారులుకూడ అభిన్నరీతుల రూపకల్పన చేశారు.

బౌద్ధమతముయొక్క సర్వతోముఖప్రాభవంలో చిత్రలేఖనంకూడా పాలుగొన్నది. అజంతా సంప్రదాయానికి చెందిన కొన్ని చిత్తరువులు ధర్మచక్రాసనములో కూర్చొన్న బుద్ధుడు, పైన యెగురుచున్న అప్సరసలు కల్గినవి, 'బామియన్'వద్ద నిటారుగాఉండే గుట్టలగుహలలో గోడల మీదను పైకప్పులమీదను వ్రాయబడియున్నవి. అచ్చటనే రెండు మహోన్నతమయిన బుద్ధవిగ్రహములు, షుమారు **110** అడుగుల ఎత్తు ఒకటి, **160** అడుగులు మించిన ఎత్తు మరొకటి, కలిగి ప్రతిష్ఠించబడియున్నవి. పెషావరు నుండి బాల్కుకు పోవుమార్గమధ్యంలో ఉన్న యీ 'బామియన్', కనిష్కుని సామ్రాజ్యానికి నడిబొడ్డున, యిటు భారతదేశంలోని నగాన్ని, అటు సిధియన్‌ప్రాంతంలోని నగాన్ని కలిపినిలిపే యిరుసులాగా ఉంటూ, బేహారులకు హిందూకుష్‌పర్వతశ్రేణి ఎక్కివచ్చిన శ్రమతీర్చుకు నేందుకు అనువయిన మజిలీగా ఉపయోగించేది. ఈ ధనికవర్తకుల ఆదరముతోనే యేర్పడి, బామియన్‌వద్ద హ్యూన్‌త్సాంగ్ అనే చీనాయాత్రికునికి స్వాగతమొసగిన ఆర్యసేన, ఆర్యదాసప్రభృతి బౌద్ధబోధకులతోను అతడు చూచిన వేలకొలది భిక్షువులతోను డజన్లకొలది విహారాలు వెలసి యుండెడివి.

బుద్ధుడు నిర్వాణముచెందిన తరువాత, అతడు తనను దేవునిగా కొలువరాదని స్పష్టముగా శాసించిపోయినప్పటికిని, బౌద్ధమతంలో దేవతాసంఘము వెలిసింది. ఆసియా ఖండమంతటను వ్యాపించిన బౌద్ధకళను అవగాహనచేసుకొనేందుకు, ముఖ్యంగా యీ దేవతాసంఘాన్నిగురించి కొంచెమైనా పరిచయంకల్గి ఉండటం అవసరం. ఈ దేవతావర్గానికి అధినేతృత్వం వహించిన కూటములో ధ్యానిబుద్ధులు ఉంటారు—వైరోచనుడు, అమితాభుడు, అమోఘసిద్ధి, రత్నసంభవుడు, అక్షోభ్యుడు అనువారు—వీరు అప్రాకృతమయిన వ్యక్తులు. ఎట్టి మాలిన్యములు అంటనివారు. అనంతమయిన శక్తిశరీరము కల్గిన దివ్యులు. తరువాత తరగతిలో దయాళువయిన అవలోకితేశ్వరుడు, (ఇతనికే లోకేశ్వరుడనికూడ పేరు కలదు) అతని యర్ధాంగి అయిన 'తారా', వారి అనుయాయులు, ప్రసన్నవదనుడయిన అశోకకాంతుడు, భీషణాకృతిగల హయగ్రీవుడు మొదలయినవారు ఉందురు. వీరితో దాదాపు సమానమయిన అంతస్తునందు, నిర్వాణసంధాయకమయిన ప్రజ్ఞకు ప్రతీకమయిన 'బోధిసత్త్వమంజుశ్రీ'యు, అతనికే స్త్రీమూర్తి అయిఉన్న 'ప్రజ్ఞాపారమిత'యు ఉందురు.

టిబెట్, నేపాల్ దేశాలలో యీ దేవీదేవగణం, 'టంకా'లు 'ప్రభ'లు అని పిలువబడే పటములమీద చిత్రించబడుతారు, లేదా, తాళపత్రగ్రంథాలలో ఉల్లేఖించబడిన చిన్న బొమ్మలలోకూడా కనబడటం కద్దు. ఈ దేవతాగణమంతటినీ, భక్తులకు ధ్యానసాధనలలో ఆలంబనంగా పనికివచ్చే 'మండలం' అనే పటంలో చిత్రిస్తారు. ఈ పటం అంతా వలయాకారమో చదరమాకారమో కల చిన్న గడులుగా విభజింపబడి ప్రతి గడిలోనూ ఒక్కొక్క దేవతను కల్గిఉంటుంది. టిబెట్, నేపాల్ దేశాలు రెండూ బౌద్ధదేవతాగణముల మూర్తులతో అద్భుతమైన కంచులోహపు శిల్పాన్ని సృష్టించినవి.

టిబెట్, నేపాల్ దేశాలద్వారా బౌద్ధకళ చైనాకు పయనించినది. నేపాల్‌దేశంలో, యాత్రాసాహసానికి మార్కోపోలోలాటివాడు అని పేరుపొందిన 'అనికో' అనునాతడు **13**వ శతాబ్దంలో కుబ్లైఖాన్ ఆస్థానమందు రాష్ట్రియ వస్తూత్పత్తి నియామకుడుగా పనిచేసెను. అతడు మంగోలియా చక్రవర్తికి కావలసిన చిత్తరువులను, మూర్తులను యెన్నిటినో తయారుచేసెను. అతని ప్రియ శిష్యుడైన 'యియూయాన్,' అతనినుండి శిల్పకళ నభ్యసించి తయారుచేసిన బౌద్ధ కళాఖండాలు షాంఘై, పెకింగ్ మున్నగు స్థలములలోని ప్రఖ్యాత విహారాలలో నెలకొల్పబడినవి. సముద్రమార్గమునగూడ బౌద్ధకళలు దూరదేశములకు వ్యాపించినది.

గుణవర్మ అను ఒక రాజపుత్రుడు, కాశ్మీరదేశమునుండి వెడలి, సుమత్రాదీవిలో చిరకాలము మంత్రిత్వం వహించి చీనాకుపోయి, 'కాంటన్'లో జాతక కథల చిత్తరువుల రూపముల ప్రదర్శించెనని తెలియుచున్నది. అనేకములైన పురాతన చిత్రపటములు పశ్చిమప్రాంతములనుండే బయటపడినవి. **1906-9** సంవత్సరములలో ఆరెల్‌స్టైన్ అనే ఆయన కంసూరాష్ట్రంలో టున్‌హ్వాంగ్ అను ప్రదేశమందు ఒక మతసంస్థయొక్క గోడలనుండి ఎన్నో రంగు చిత్రపటాలను వెలువరించినాడు. మిరాన్‌వద్ద ఒక శిథిలీభూతమయిన దేవాలయంలో 'వెస్సంతర జాతక' కథను ప్రదర్శించే కుడ్యశిల్పం కలదు. ఇది భార్‌హుట్ సంప్రదాయాన్ని గుర్తుతెస్తుంది. 'దండన్‌ఉలిక్'లోని కుడ్యశిల్పాల్లో కనుపించే పద్మసరస్సులోని వనదేవతను చూడగా, భారతదేశములో కన్పట్టు యక్షిణి ప్రతిమను మాతృకగా తీసికొని చీనాదేశపు ప్రకృతి సౌందర్యముతో సమన్వయపరచినట్లు తోచును.

జపాను దేశానికి బౌద్ధమతం క్రీ. శ. **552**లో చేరినది. జపాను చక్రవర్తి 'కిమ్మెయి' వద్దకు కొరియాలోని కుదర సంస్థానాధిపతి పంపిన సిఫారసు ఉత్తరములో ఇట్లున్నది: "లోకములోని సకలమతబోధలకన్న మేలైన అద్భుత

మతము యిది....కొరియాదేశానికి యిది సుదూరమందు ఉన్న భారతదేశమునుండి వచ్చినది. ఈ రెండు దేశముల మధ్యలో ఉండే యావత్ప్రజానీకము యిప్పుడు యీ మతావలంబకులుగా నయినారు.'' ఈ ఉత్తరము వచ్చి చేరిన సంవత్సరమందు జన్మించిన రాజకుమారుడే 'ఉమయడో' అను యువరాజు—ఇతనికి ప్రజలలో 'షాటోకు' (ధర్మ సిద్ధుడు) అనే బిరుదము, మరణానంతరము, వ్యాపింపజేయ బడింది. నాగార్జునుని శిష్యుడై ఈ షోటోకు 'సద్ధర్మ పుండరీక సూత్ర'మను గ్రంథానికి వ్యాఖ్యానము రచించెను. ఇతడు తన వెనుకతరముల ప్రజానీకానికి అందిచ్చిన అమూల్యమగు బహుమతులు 'నారా' ప్రాంతంలోని హొరియూజివద్ద స్థాపించిన కళాశాల, దేవాలయము అయి యున్నవి.

'కొండో' (అనగా బంగారు సావిడి)లోని చల్లని అంతర్భాగంలోనికి బయటి మిట్టెండనుండి అడుగిడగానే, మీకు ఒక చిత్రమైన భ్రమకలుగును. హటాత్తుగా వేలకొలది మైళ్ళు దాటిపోయి అజంతా శిల్పసౌందర్య సన్నిధిలో చేరుకొంటిమా యనిపించును. ఇచ్చటి కుడ్య శిల్పములు, షొటుకు కాలమునకు తర్వాత 8-వ శతాబ్దిలో చిత్రింపబడినవై, ఖోటాన్‌లోని చిత్రములకన్నను కూడా ఎక్కువ సన్నిహితంగా అజంతా శిల్పాన్ని పోలియున్నాయి.

చుట్టును సముద్రముచే ఆవరింపబడి, వివిధ వృక్షజాలంతో నిండిన అడవులచే కప్పబడియున్న సిలోను ద్వీపమునకు, అశోకుడు, క్రీ. పూ. మూడవ శతాబ్దిలో అతి మనోహరములైన రెండు బహుమానములను పంపించెను—అవి మహేంద్రుడు, సంఘమిత్రుడు అను తన బిడ్డలును, బోధివృక్షముయొక్క కొమ్మ ఒకటియు. మహావంశము ప్రకారము అనూరాధపురమందు క్రీ. పూ. మొదటి శతాబ్దంలో 'దుత్తగమిని' అనే మహారాజుచేత నిర్మింపబడిన 'రువన్‌వాలీ' అనే స్మారక నిర్మాణములో అవశేషములను గుప్తపరచియుంచిన గదిలో ''వెస్సంతర జాతక'' కథల చిత్తరువులు అలంకరింపబడియుండెను. అయితే, అవి యిప్పుడు నష్టమైనవి. కాని, కాశ్యపుడనే రాజుయొక్క ఆజ్ఞచే 5వ శతాబ్దంలో 'సిగెరియా' దుర్గము శిఖరము మీద యున్న తన ప్రాసాదమునకు పోవు మార్గము ఇరు ప్రక్కల ఉండు గోడలపై చెక్కబడిన కుడ్యశిల్పములు మాత్రము నిలచియున్నవి.

ఈ కుడ్య శిల్పములలో మతసంబంధమైన భావన మృగ్యము. ఇవి బహుశా రాజాంతఃపురంలోని కామినుల యొక్క మూర్తులు అయి యుండవచ్చును. దీనిని బట్టి కళాసంప్రదాయములు ఒక స్థలమునుండి ఇంకొక స్థలము


ధర్మచక్రం - ఘంటసాల



ఊరేగింపుగా వెళ్తున్న యిద్దరు ఉపాసకులు—ప్రస్తుతం ఢిల్లీలోవున్న ఈ గాంధార శిల్పం క్రీస్తుశకం రెండు మూడు శతాబ్దాల నాటిది. గూటిలో భద్రపరచబడినట్లుగా ఉపాసకుల ప్రతిమలను చెక్కడం దీనిలోని విశేషం.

సకు వ్యాపించుటలో ఎట్టి పరిణామములు పొందునదీ దృష్టాంతముగా చూడవచ్చును. మొదటలో మతాచార ముల ఊహతో భావింపబడిన చిత్రకళాశైలి సముద్ర యానము చేసి మతసిద్ధాంతములను వ్యాపింప జేయటంలో తోడ్పడి, తరువాత కొంతకాలానికి మతసంబంధములేని ఐహిక, ప్రాకృత చరిత్రలకు రూపకల్పన చేయుటలో విని యుక్తమైనది.

జాతక కథలలో చెప్పబడినట్లు అనేక వర్తక నౌకలు గంగానది గుండా సముద్రములోనికి ప్రయాణము చేసి అరకాన్ తీరమునకు, ఇండో-చైనాకు, ఇండొనీషియన్ దీవులకు వెళ్ళేవి. బర్మాదేశమునకు భారతీయ మతబోధ కుల వెంట భారతీయ చిత్రకారులు కూడావెళ్ళి యుండిరి. 'తలైంగ్' దేశములో ప్రాంతీయ చిత్రకారులతో భారతీయ చిత్రకారులకు మంచి సహకారము ఉండినది. పాగన్ ప్రభు వైన అనావర్తుడు థాటన్‌ను జయించినపుడు ఈ "భారత-తలైంగ్" సమన్వయముతో కలిగిన చిత్రకళ "పాగన్"ను కూడ ఆక్రమించి జయించె నన వచ్చును.

'పాగన్' లో దేవాలయములందు గోడలపై నున్న చిత్తరువులలో బుద్ధులు, బోధి సత్వులు, జాతకకథలు, ముఖ్యమైన ఇతివృత్తములుగా నున్నవి. ఇండో-చైనా దేశములో బౌద్ధమతము మెల్లగా స్థావరమేర్పరచు కొన్నది. 5వ శతాబ్దంలో 'ఫ్యూనాన్' అనగా దక్షిణ కంబోడియా రాజ్యము సంఘభారుడు, మంద్రుడు అను ఇద్దరు బౌద్ధ భిక్షువులను చైనాదేశమునకు పంపినట్లు గ్రంథములలో కలదు. వారి చక్రవర్తి ఆదేశము ప్రకారము బౌద్ధమత గ్రంథములను చైనాభాషలోనికి అనువదించిరి. కంబోడియా దేశపు భారతీయ సంస్కృతికి విశిష్టమైన వ్యక్తీకరణము 'అంకోర్ వాట్' అయి ఉన్నప్పటికిని, ఆదేశపు చిత్రకళా మర్యాదలను రూపొందించటంలో బౌద్ధమతము కూడ బాగాపని చేసింది.

జావాద్వీపములో బౌద్ధమే ప్రధానమైన మతము. జావాను ఫాహియాన్ దర్శించినాడు. 5వ శతాబ్దములో గుణవర్మ అచట బోధించినాడు. సుమత్రదీవిలో ఒక కొండ యావత్తు బౌద్ధస్తూపంగా మలచబడినది. 'శ్రీవిజయ' అను స్థలమునకు చెందిన నౌకావర్తక ప్రధానరాజ్యమునకు అధిపతులై, మహాయాన మతావలంబకులైన రాజులచే యిది నిర్మింపబడి 'బోరబోదుర్' అనే పేరుతో ప్రఖ్యాతి చెందినది. దానిలో కింద అంతస్థులనుండి పై అంతస్థులకు ఎక్కుచున్నప్పుడు చిత్రపరంపర అత్యంత వైరళ్యము పొందును. ఇది ఒక సాంకేతిక నిరూపణము. దీనితో బౌద్ధ కళ ఆ మతమందలి లోకోత్తరమయిన అతీతభావనా నిర్వహణముతో సమన్వయమొందినదని చెప్పవచ్చును. ఒక్క మాటలో చెప్పవలెనన్న, ఈ కళలో, శూన్యతవైపు ఆత్మ ప్రయాణించును అనవచ్చును. కాని, విరళవిరళములైన అత్యున్నతస్థాయిభూమికలో తప్ప దిగువ అంతస్థులలో ప్రాకృతము, ఐహికము అయిన రూపముల సాంగత్యము దానికి గ్రాహ్యమే అయిఉండును. అందువలననే గతించిన మహాత్ముల చరిత్రలను శిలలమీద చిత్రవర్ణములతో నిరూపించి, అందుండి అపూర్వమైన ధైర్యమును, ఆనంద మును కొనిరాగల్గిన శక్తి ఈ కళలో యిమిడియున్నది.





జ్వాలా స్తంభరూపంలో బుద్ధభగవానుని ఆరాధిస్తున్న బౌద్ధభిక్షువులు. అమరావతిలో లభించిన ఈ శిల్ప విశేషాన్ని మద్రాసు ప్రభుత్వం 1885లో బ్రిటిష్ మ్యూజియానికి బహూకరించింది.



మహాభినిష్క్రమణం

# యశోధర

కరుణశ్రీ

[అర్ధరాత్రి అంధకారంలో శాక్యరాజ్యశ్రీనీ. శ్రీమతినీ, చిరంజీవినీ పరిత్యజించి శోకమయమైన లోకాన్ని సముద్ధరించడం కోసం కరుణానిధి గౌతముడు కదలిపోయినాడు. కరుణామయి యశోధర అరుణరేఖల్లో తన అనురాగమూర్తిని వెతుక్కుంటున్నది.]

విచ్చెడు తమ్మిపూలు నులి వెచ్చని తేనెలతోడ స్వాగతం
బిచ్చుచునుండె; గుండె కదలించెడి ఈ మలయానిలమ్ములో
ఎచ్చటి కేగినావు హృదయేశ్వర! ఈ అరుణోదయమ్ముతో
ముచ్చటలాడు నీ నయనముల్ పయనమ్ముల కిచ్చగించెనా!

అద్దమరేయి నిర్దయుడవై చనినాడ విదేమి స్వామి! నన్
నిద్దుర మేలుకొల్పి "తరుణీ! నవ మానవ భాగ్యరేఖలన్
దిద్దుట కేగుచుంటి" నని తెల్పిన వాకిలి కడ్డువచ్చి "పో
వ"ద్దని యందునా! హృదయవల్లభ! అంతటి మూర్ఖురాలనా!!

నాథుడవంచు నమ్మికొనినాను దయామయ! నిన్ను; నా మనో
నాథుడ వీ క్రియన్ భువననాథుడు వౌట యెరుంగ; ఈ వనీ
వీథి ప్రబుద్ధమౌ మురళివే యనుకొంటినిగాని, ఆ త్రయీ
వీథి ప్రబుద్ధమౌ ప్రణవవీణవు నీవని యెంచనైతినే!

మంగళమూర్తి నీవొక సమస్యవు; నిన్ను గ్రహింపలేని ము
గ్ధాంగన యీ యశోధర; దిగంతము లేలు దృగంతముల్ కళా
రంగము లయ్యె నా ప్రణయరాగిణి కంచు దలంచినాను; నా
మంగళసూత్రమే "భువన మంగళసూత్ర" మటం చెరుంగనే!!

ఇలు విడి పోయినారు హృదయేశ్వర! పూరుషులౌట మీరు; నే
నిలు విడి వచ్చినన్ బ్రతుకనిచ్చునె లోకము నన్ను; సృష్టి యం
దలి ప్రతి రేణువున్ పదపదమ్మున కడ్డము వచ్చి నిల్చి శా
క్యుల కులగౌరవాని కిది కూడ దటంచును హెచ్చరింపదే!

తెలియనిదాని, నా ప్రణయదేవు పదమ్ములు దప్ప లోకమే
తెయనిదాని, క్రొవ్వలపు తియ్యని శయ్య పయిన్ శరీరమే
తెలియనిదాని, నన్ను విడదీసెను నా పతినుండి భాగ్యముల్
తెలతెల వారుచుండ దురదృష్టము చిట్టెపురాతి గుండెతో.

ఆ చిరునవ్వు చిందు అరుణార్ద్రకపోలము; లా దయారస
శ్రీ చెలు వొందు నేత్ర సరసీజము; లా హృదయానురాగముల్
దాచిన స్నిగ్ధసుందర సుధామధురాధర మాశ తీరగా
చూచెదనా! అభాగ్యపు యశోధర కంతటి భాగ్య మున్నదా!



అభయ ముద్ర



ధ్యాన ముద్ర



భూమిస్పర్శ ముద్ర



ధర్మచక్ర ముద్ర

చక్కనివాడు; కుందనపు చాయ తనుద్యుతివాడు; తళుక్కుమేల్
చెక్కులవాడు; సౌహృదము చిందు కనుంగవవాడు; చూడుమో
చుక్కల రాజ! నా ప్రణయ సుందర మోహనమూర్తి ఒక్కడై
ఎక్కడ నుండెనో! మది నొకించుక నన్ స్మరియించు చుండెనో!

లోకము కోసమై బ్రతుకులో బడబాగ్ని భరించు 'ప్రేమ ర
త్నాకరు'డమ్మ నా ప్రణయదైవము; పొంగులు వారు గుండెతో
నా కను గప్పిపోయె విపినాలకు, చక్కని చుక్కలార! మీ
రాకస మెక్కి, నల్గడల నారసి నాథుని జాడ దెల్పరే!!

నాథుని త్యాగపూర్ణ కరుణాధుని వెన్నెల వెల్లువై, ప్రజా
వీథుల పొంగులెత్తి, ప్రభవించునులే సుఖశాంతి సస్యముల్;
అధునిక ప్రపంచము దయామయు బోధలలో యశోధరా
గాథలు బాధలున్ మరచి కాంచునులే అపవర్గ మార్గముల్!

నాటి కళావసంత కలనల్ గహనమ్ముల పాలొనర్చి, యే
నాటి దురంతదుర్విధియొ నన్ తెరచాటుకు నెట్టి బాటలో
నాటెను ముండ్ల తీవెలిటు; నాయికనైసను కాకయున్న నీ
నాటకమందు నేనొక అనామక భూమిక గాకపోనులే!

లోకాలు వెలిగించు రాకాసుధాకరు,
నింటిలో బంధింప నెంచు టెట్లు!
జగతి కత్యుజ్జ్వల ప్రగతి చూపెడి ధ్రువ
జ్యోతిని, దాచుకోచూచు టెట్లు!
విశ్వజనీనమౌ నైశ్వర్యమును, మేడ
గోడలలో నిల్పుకొనుట యెట్లు!
సర్వంకషంబైన జ్ఞానవారాశిని
పైటకొంగున మాటుపరచు టెట్లు!

భువనబంధుని మణిమయ భవనమందు
పవలు రాత్రులు నిర్బంధపరచు టెట్లు!
ప్రేమమయు నిన్ను నా బాహుసీమలందు
పట్టుకొని చుట్టుకొని నిలబెట్టు టెట్లు!

ఆ కాననము వైపు పోకు నా హృదయేశ!
కోడెత్రాచులు బుసకొట్టునేమొ—
ఆ కొండపై కెక్కబోకు నా ప్రియతమా!
శైథిల్యమున కాలు జారునేమొ—
ఆ యేటిలో స్నానమాడకు నా నాథ!
సుడిగుండములు తొంగిచూచునేమొ—
ఆ కుశాంకురముల నంటకు నా స్వామి!
చిన్నారి మునివేళ్లు చీలునేమొ—

నా మనోవల్లభా! వాని నమలబోకు
పచ్చిదుంపలు దంతముల్ నొచ్చునేమొ—
నా ప్రభూ! చుట్టుకోకుమా నారబట్ట
అందములు చిందు నెమ్మేను కందునేమొ!!



# ప్రాకృత శాసనాలలో తెలుగు నుడికారం

భారతదేశపు దక్కను ప్రాంతములందు వలెనే, తెలుగు దేశమునందు లభించిన ప్రాచీన శాసనములు సైతము ప్రాకృత భాషలోనే లిఖితములైనవి. క్రీ. పూ. 3-వ శతాబ్దియందలి అశోకుని శాసనములు వీనిలో తొట్టతొలుతవి. కళింగదేశమునందలి జవుగడయందును, ఆంధ్రదేశమున యర్రగుడి, రాజులమందగిరుల యందును, రామేశ్వరం, బ్రహ్మగిరి, మాస్కి, కొప్పల్, జతింగ, సిద్ధపురములందును ఈ శాసనములు కనుకొనబడినవి. ప్రజాసామాన్యమున ధర్మప్రచారము చేయుటయే యీ శాసనముల పరమోద్దేశము. ఇవి యన్నియు బ్రాహ్మీలిపిలో నున్నవి. ఆ బ్రాహ్మీమాతృకనుండి పరిణతిజెందిన నేటి వివిధ లిపులతో పోల్చినచో, నీ బ్రాహ్మీలిపి అతి సరళమని చెప్పవచ్చును. దీనికి తోడుగ శాసనములయందలి భాష అతి సరళము, హృదయరంజకము. ద్రాక్షాపాకపు శైలితో, విషయగంభీరతతో, ఉదాత్తములగు నీ శాసనములు ఉత్తమ సాహిత్యపు మచ్చుతునకలుగ సైతము పఠనార్హములు.

నేడు మనకు లభించుచున్న ప్రాకృత శాసనములు, అశోకుని కాలమునుండి, క్రీ. వె. 3-వ శతాబ్దివరకు జరిగిన కాలవ్యవధికి చెందినవి. ఆంధ్రదేశమున బౌద్ధ యుగ మత్యుచ్ఛస్థితిలో నున్న యుగమది. ఆనాటి ఆంధ్ర పాలకుల మాతృభాష ప్రాకృతము. అంతేగాక, బౌద్ధమత ధర్మములుకూడ ప్రాకృత భాషలోనే ఆనాడు ప్రవచింపబడినవి. అందుచే ప్రాకృతపు తొలిరూపమగు పాలీభాష క్రమముగ నొక స్థిరరూపమొంది సారస్వత భాషగ పరిణమించినది. నేటి గుంటూరు, కృష్ణాజిల్లాలలో ఆనాడు బౌద్ధమత కేంద్రములుండెడివి. అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, నాగార్జునకొండలు ఇట్టివే. వీనియందే అత్యధిక సంఖ్యాకములగు ప్రాకృత శాసనములు మనకు లభించినవి. ఆంధ్రదేశమును ఆనాడు పాలించిన వివిధ రాజవంశముల ముఖ్య పట్టణములు కూడ నీ ప్రాంతముననే నిర్మింపబడినటుల తెలియుచున్నది.

ఆంధ్రుల ప్రప్రథమ ముఖ్యపట్టణము సైతము కృష్ణానది ఒడ్డుననే నిర్మితమైనటుల గన్పట్టుచున్నది. (శ్రీ కోరాడ

కె. మహాదేవ శాస్త్రి

రామకృష్ణయ్యగారిచే పరిష్కరింపబడి, 1940 లో మద్రాసు విశ్వవిద్యాలయముచే ప్రకటితమగు) కోదండరామకవి విరచితమగు శ్రీకాకుళ మహాత్మ్య మను గ్రంథమున, నీ ముఖ్యనగర నిర్మాణమును గురించిన గాథ యొకటి కలదు. నిశుంభుడను దైత్యుని వధించి ఆంధ్రవల్లభుడను రాజు యీ ప్రాంతమును పాలించె నని ఆ గ్రంథమున గలదు. ఈ నిశుంభుడు దండకారణ్యమందలి ఈ ప్రాంతమునకు అధిపతియగు ఆదిమజాతి (నాగ) వీరుడు కావచ్చును. ఇతనిని జయించిన ఆంధ్రవల్లభుడే క్రమముగా దేవుడుగ పరిగణింపబడి, ఆంధ్ర విష్ణువను పేరుతో నేడును శ్రీకాకుళమున నర్చింపబడుచున్నాడు. పూర్వపు శ్రీకాకుళము నదీగర్భమున లీనమైపోవుటచే, పరిసర ప్రాంతమునకు ఆంధ్ర రాజధాని తరలింపబడియుండును. క్రీ. వె. 3-వ శతాబ్దివరకు నుచ్ఛస్థితిలో నున్న ధాన్యకటకమే ఈ రెండవ రాజధాని కావచ్చును.

మనకు లభించిన ప్రాకృత శాసనములలో, భట్టిప్రోలు నందలి బౌద్ధపేటికా శాసనము (ఎ. ఇం. ii 323-329) లందు కన్పట్టు అక్షరములు అతిపురాతన బ్రాహ్మీలిపికి చెందినవి. ఇవి క్రీ. పూ. 3-వ శతాబ్దివని చరిత్రకారులు నిర్ణయించిరి. బుద్ధావశేషముల భద్రపరచుట కుద్దేశితములగు పేటికలను దానముచేయుట ఈ శాసనములందలి విషయము. వీనిలో నొక శాసనమున కుబేరకుడను రాజు పేరు కలదు. అశోకుని శాసనముల లిపివలెనే ఈ శాసనముల లిపియు నున్నది. ఐనను వేరెచ్చటను గన్పట్టని కొన్ని ప్రత్యేకతలుకూడ ఈ శాసనలిపిలో నున్నవి. అందువలననే, దక్షిణభారతమున ఆయాస్థానిక సాంప్రదాయముల ననుసరించి, బ్రాహ్మీలిపి వేరు వేరు విధముల రూపొందినదనియు, మౌర్య యుగమునకు కొన్ని శతాబ్దముల పూర్వముననే, వ్రాయుట అనునది దక్షిణభారతమున కలదనియు, బూలర్ అభిప్రాయపడినాడు.

ప్రాకృతశాసనములలో సత్యధిక భాగము—అనగా దాదాపు 180—అమరావతి స్తూపశిథిలములలో లభించినవి. మొదట లభించిన 120 శాసనములను క్రమబద్ధమొనర్చి, లూడర్సు అను పరిశోధకు డొక పట్టికను తయారు చేసెను (ఎ. ఇం. X అనుబంధము). తరువాత వీనిని బర్గెస్ అను పండితుడు చాలవరకు పరిష్కరించి, ప్రచురించెను (ఆర్కెలాజికల్ సర్వే ఆఫ్ సదరన్ ఇండియా నం. 2). రెండవ తడవ లభించిన 58 శాసనములను రామప్రసాదచందా పరిష్కరించి ప్రచురించెను. (ఎ. ఇం. XV 258-275). దాతలనేకులు, మహాచైత్యమున స్తంభములు, పట్టకములు, ఫలకములు మొదలగునవి దాన

మొనర్చుటయే యీ శాసనముల సర్వసామాన్య విషయము. రామప్రసాదచందా యీ విషయమును గురించి వ్రాయుచు యిటులనినాడు;—" అమరావతీ స్తూపమందలి యీదానశాసనములకు ఒక ఐతిహాసిక ప్రత్యేకత కలదు. ఈ మహానిర్మాణపు క్రమక్రమాభివృద్ధిలోని వివిధఘట్టముల నీ శాసన లిపి పరిణామము సూచించి విశదమొనర్చుచున్నది. కాలక్రమముగ శిల్పకళలో వచ్చినమార్పులతో యీ లిపి పరిణామమును జోడించి పరిశీలించు పరిశోధకులు, క్రీ. పూ. రెండవ శతాబ్దినుండి క్రీ. వె. 3 వ శతాబ్ది వరకు, అనగా దాదాపు 4, 5 శతాబ్దములకాలపు మహాచైత్యపుచరిత్రను పునర్నిర్మింపవచ్చును. అమరావతి శాసనములలో కొన్ని క్రీ. పూ. 2వ శతాబ్దివిగాని, లేక క్రీ. శ. 1 లేక 2 శతాబ్దములవిగాని అయివుండవచ్చును.

క్రీ. శ. 2 శతాబ్దివాడగు వాసిష్ఠీపుత్రపులుమావి పరిపాలనాకాలమున లిఖింపబడిన శాసనమొకటి అమరావతీ శాసనములందు కలదు. ఆ శాసన పాఠమూలము తెనుగు అనువాదముతోకూడ నీ దిగువ నీయబడినది :—

1. సిద్ధం రాఞో వాసిఠీపుతస సామిసిరి పులుమావిస సవచర....పెండసుతరియానామ్. కహూతర గాహపతిస ఇసిలస సజాతుకస. [సమా]....
2. నగనికస భయాయ చస నకానికాయ సపుతకస మహాచేతియే చేతికియానామ్ నికస పరిగహే అపరదారే ధమ చకమ్ దేధమ్మమ్ ఠాపితా.

" వాసిష్ఠీ పుత్రుడగు రాజశ్రీ పులుమావి సంవత్సరములు....చైత్యకీయుల వశమందున్న మహాచైత్యమునకు పెండసుతరీయు లిరువురును, కహూతరగృహపతియు సభ్రాతృకుడు, సపుత్రుడునగు పూరీ గృహపతి కుమారుడు ఋషిలుడు తన భార్యయగు నాగానికతో సహా పశ్చిమద్వారమున ధర్మచక్రమును స్థాపింపజేసిరి.

పులుమావి పరిపాలనాకాలమున, లేదా రెండవ శతాబ్ది మధ్యకాలప్రాంతమున నీ అమరావతీ స్తూపమునకు అదనంగా కొన్ని మార్పులు, చేర్పులు జరిగినటుల యీ శాసనములవలన ద్యోతకమగుచున్నదని బర్గెస్ అభిప్రాయము. ఒకానొక శాతవాహన రాజునకు నాగార్జును డతిసన్నిహితుడను ప్రవాదమొకటికలదని చైనీయ, భారతీయ గ్రంథములందు గలదను విషయమిట గమనార్హము. ఆ శాతవాహన రాజు వాసిష్ఠీపుత్రపులుమావియేయని రా. ప్ర. చందా అభిప్రాయము. ధాన్యకటకమందలి మహాచైత్యమునకు నాగార్జునుడొక శిలాప్రాకారమును గట్టించెనని టిబెటుసం



**అమరావతి స్తూపంలోని ఒక స్తంభంపై**
**ఆంధ్ర శిల్పులు ప్రదర్శించిన కళాకౌశలం**

దొక ప్రవాదము గలదు. "నాగార్జును దొనగిన ఈ ప్రోత్సాహమువలననే ఆంధ్రుల శ్రద్ధాభక్తులు పునరుజ్జీవితములై ఆ మహాచైత్యవైభవమును పునరుద్ధరించుటకు వారు పూనుకొనిరి. అట్టివారిలో ఒక చర్మకారుడు సైతముకలడని మనకు ఈ శాసనములవలన తెలియుచున్నది. ఇచ్చటి శిల్పములలో క్రీ. శ. 2 వ శతాబ్దినాటి శిల్పము లత్యుత్తములు. అనాటి ఆంధ్రుల భక్తికి, కళాభినివెశమునకు అవి ప్రత్యక్షసాక్ష్యములు.

అసాధారణ దీర్ఘకాలము ఆంధ్ర శాతవాహనులు దక్షిణాపథమును పాలించిరికాని, తెలుగునాట వారిశాసనములు మరి మూడు మాత్రమె యింతవరకు లభించినవి. (1) చినయందలి గౌతమీపుత్ర శాతకర్ణిదగు బౌద్ధమత శిలాశాసనము (ఎ. ఇం I 95) (2) అదోని (మేకాదోని) సిరిపులుమావిశాసనము (ఈ పులుమావి వాసిష్ఠీపుత్ర పులుమావియని గుర్తింపబడినది.) (3) కొడవలిలోని చండశాతి శిలాశాసనము (ఎ. ఇం. XVIII 316). ఒకానొక గృహపతి ఒక చెరువును త్రవ్వించుట తెల్పునది అదోని శాసనము. మూలపాఠపు అనువాద మిది: "శిశిరఋతు ద్వితీయ మాస ప్రథమపక్ష ప్రథమ దినమున శాతవాహన రాజగు సిరిపులిమావి పరిపాలనకాలపు యెనిమిదవ సంవత్సరమున, ఖంతనాగపాలితమగు శాతవాహనాహారమున కుమారదత్తునిదగు వేపూరక గ్రామమున వసించు గృహపతిచే ఈ తటాకము త్రవ్వింపబడినది" తెనుగుభాషా చరిత్రయందీ శాసనమునకు ప్రముఖస్థానము గలదు. ప్రప్రథమముగ తెలుగుదే అని నిస్సంశయముగా చెప్పనగు 'వేపూరక' అను పద మీ శాసనమున కాన్పించుచున్నది. వేము (వేమ్బు) అను దానికి 'ఊరు' కలుపుటచే నీ పేరేర్పడినది. ఒక పదము విశేషణముగా ప్రయోగింపబడినపుడు అపదాంతమందలి సరళహల్లు పరుష మగుట తెలుగు నందు సహజము.

ఉదా :— పాంబు - పాము ; పాపరేడు
ఇరుంబు—ఇనుము ; ఇనుపకమ్మి.

శాసనములను బట్టి చూడ, శాతవాహనుల తర్వాత ఇక్ష్వాకులు, పల్లవులు, బృహత్ఫలాయనులు, సాలంకాయనులు, ఆనందులు అను రాజకుటుంబములవారు పాలించినటుల దేలుచున్నది. పురాణములలో దెల్పబడిన శ్రీ పర్వతీయులే ఇక్ష్వాకులని నిర్ధారింపబడినది. ఈ రాజవంశమునకు చెందిన శాసనము లనేకములు నాగార్జున కొండవద్ద కనబడినవి. (వేగెల్ ప్రచురణ ఎ. ఇం. XX 1-37) వాసిష్ఠీ పుత్ర శ్రీ శాంతమూల, మాఢారి పుత్ర వీర పురుషదత్త, అతని తర్వాత రాజైన అతని కుమారుడు విహువల శాంతమూల అను ముగ్గురి పేర్లీ శాసనములలో గలవు. వీరిలో మొదటివాడగు శాంతమూలుడు బ్రాహ్మణ మతానుయాయి, అశ్వమేధ, వాచపేయ, అగ్నిష్టోమ, అగ్నిహోత్రములను యజ్ఞములచేసిన వాడనియు ఈ శాసనము లందు చెప్పబడినది. అతని కుమారుడు వీరపురుషదత్తుడు. నాగార్జున కొండయందలి బౌద్ధ నిర్మాణములలో ననేకము లితని పరిపాలనా కాలమునకే నిర్మింపబడినవి. ఈతని మేనత్తయు, పూగియవంశజుడగు మహాతలవార వాసిష్ఠీ పుత్రఖంతశిరి భార్యయునగు చాంతశిరిచే నిర్మింపబడినదే నాగార్జున కొండయందలి మహాచైత్యము. కాని నాగార్జున కొండయందలి నిర్మాణములలో రాజగు వీరపురుషదత్తు డేమియు శ్రద్ధవహించినటుల కన్పట్టదు. నిర్మాణము లన్నియు, బౌద్ధమతానక్తులగు రాణుల, రాజకుమారికల, వితరణ సహాయమున మాత్రమే కట్టింపబడినవి. కుటుంబములో నెవరికి వారు, వారి యిచ్ఛవచ్చిన మతము ననుసరించు స్వాతంత్ర్య మానాడుండెడిదని తోచుచున్నది.

బౌద్ధమతమునకు సంబంధించిన ఇట్టి శాసనములు మరిరెండు కలవు. ఇవి క్రీ. పూ. రెండవ శతాబ్దిలోనివి. అవి (1) ధరణికోటలోని స్తంభశాసనము (ఎ. ఇం. XXIV 256-260); (2) అల్లూరు శాసనము (కె. గోపాలాచారి రచితమగు Early History of the Andhra Country పే. 89). ధాన్యకటకమందలి మహావిహారపు తూర్పుద్వారముపద్ద నున్న ధర్మచక్ర ధ్వజస్థాపనను గురించినది మొదటి శాసనము. ఈ మహావిహారము పూర్వశైలేయుల స్వాధీనమున నున్నటుల అందు చెప్పబడినది. పూర్వ శైలేయ, అపర శైలేయ అనునవి మహా సాంఘిక సాంప్రదాయపు ద్వివిధ శాఖలు. ఇట్టివే యగు బహుసుత్తీయ (బహుశ్రుతీయ), అయిరహంఘ (ఆర్యసంఘ) మహసానక(మహీశానక) అను శాఖలనుగురించిన ప్రసక్తి కూడ నాగార్జునకొండ శాసనము లందు గలదు. పుబ్బసేలియుల (పూర్వశైలీయుల) కొనగిన అనేక దానముల ప్రసక్తి అల్లూరు దానశాసనమున గలదు. ఒక విహారము, నానా గ్రామములలో భూములు, ఆవులు, ఎద్దులబండ్లు, సేవకులు, ఒక వేయి పురాణ కహాపణములు దానముగా నొనగబడినటుల యిందున్నది.

ఇక్ష్వాకులతరువాత ఆంధ్రమున బౌద్ధమతము క్షీణించ మొదలిడినది. బుద్ధునికి చైత్యములను గట్టించుటకు బదులు, ఇటనుండి బ్రాహ్మణులకు, దేవాలయములకు, భూముల దాన మొసగుట శాసనములందు సర్వసామాన్య విషయముగ పరిణమించినది.

ఇక పల్లవులకాలపు ప్రాకృతశాసనముల విషయము:—



భోధిసత్త్వుని దివ్యమూర్తి. (క్రీ. శ. 7 వ శతాబ్ది భిత్తికా చిత్రం—బాగ్)

**1.** యువమహారాజ శివస్కంధవర్మ వగు మైదవోలు శాసనములందు, ఆంధ్రాపథమందలి విరిపర గ్రామవాసులగు ఇరువురు బ్రాహ్మణులకు దానమొసగిన వివరము కలదు.

[అంధాపథీయ గామో విరిపరం....సంపదాతే] రాజ పరిపాలన కాలపు 10 వ యేట గ్రీష్మర్తువున ప్రథమ పక్షమున అరవనాటీ దాన మొసగబడినది.

**2.** ప్రస్తుతము బ్రిటిషు మ్యూజియంలో నున్న చారుదేవి శాసనములు (ఎ. ఇం. **VIII–143**) దాలూర గ్రామమందలి కూలి-మహాతారక దేవాలయమందలి నారాయణ దేవుని ప్రీత్యర్థం, అతుకు డనువాడు దున్నుటకై యొసగబడిన, రాజతటాకము క్రింద పాడుపల యగు భూమిని గురించిన శాసనమిది.

**3.** హిరాహడగల్లిలోని శివస్కంధవర్మ శాసనము. (ఎ. ఇం. **I–2**) చిల్లరెకకొడుంక భోజకులును, అపిత్తి గ్రామవాసులునగు కొందరు బ్రాహ్మణులకు పూర్వ మహారాజు (బహుశః అతని తండ్రి) ఇచ్చిన దానమును ధ్రువీకరించుచు నొసగినదీ శాసనము. ఈ చిల్లరికె అనునది శాతవాహని రట్టమున గలదని యందు చెప్పబడినది.

బృహత్పలాయనుల కాలపు ఒకేఒక శాసనము కలదు. అదే కొండముది శాసనము. (ఎ. ఇం. **315**) రాజగు జయవర్మ, కుదూరమను నగరమున మకాములోనున్నపుడు, పాంటూర యను గ్రామమును యెనిమిదిమంది బ్రాహ్మణుల కొసగుచు, కుదూరయందలి రాజోద్యోగికి ఉత్తరువొసగినటుల యీ శాసనమున కలదు. రాజపరిపాలనాకాలము 10 వ సంవత్సరమున, హేమంత ఋతువున, ప్రథమపక్షమున, ప్రథమదినమున ఈ శాసనము రాగిరేకులపై లిఖింపజేయబడినది.

శాసనకాలము పైన నుదాహృతములగు నన్నిశాసనములందును, ఋతువు, పక్షపు క్రమసంఖ్యలలో మాత్రమే లెక్కింపబడినవి. కాని దేవవర్మ ఎల్లోరా శాసనమున, దామోదరవర్మ మట్టిపాడుశాసనమున ఋతువునకు బదులు మాస నామమీయబడినది. ఆ తరువాత శాసనములందన్నిటిలోను ఈ మార్పే అనుసరింపబడినది. ఋతు, పక్షముల గణనము ఆ కాలపు ప్రత్యేక లక్షణముగ మనము పరిగణింపవచ్చును. ప్రాచీనకాలమున, గ్రీష్మ, వర్ష, హేమంతములను మూడు ఋతువులు మాత్రమే పరిగణింపబడినవని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్రాతలవలన తెలియుచున్నది. (ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము పే. **20**)

సాలంకాయన వంశజుడగు దేవవర్మ యొసగినది ఎల్లోరాశాసనము. ఒక బ్రాహ్మణునికి **20** నివర్తనముల భూమియు, స్వోపయోగమున కొక నివేశన స్థలమును, సేవకుల కొక నివేశనస్థలమును దానమొసగిన వివరమీ శాసనమున గలదు. చిత్రరథస్వామి భక్తుడుగ ఈ రాజు పేర్కొనబడినాడు. సాలంకాయనులు సూర్యోపాసకులు.

ఆనందవంశజుల ముఖ్యనగరమగు కందరపురమున నుండి దామోదరవర్మ యను రాజు కొందరు బ్రాహ్మణులకు భూదాన మొసగిన విషయమును తెలియజేయునది మట్టిపాడు శాసనము. ఈ రాజు బుద్ధోపాసకుడనియు (సమ్యక్‌సంబుద్ధ) గోసహస్ర, హిరణ్యగర్భదానముల నొనరించినవాడనియు నందు పేర్కొనబడినాడు. ఆనందవంశజుల, సాలంకాయనుల తక్కిన శాసనములన్నియు సంస్కృతముననే యున్నవి.

బృహత్పలాయన, సాలంకాయన, ఆనంద వంశజులగు రాజు లొసగిన పైమూడు శాసనములందును సంస్కృత భాషాప్రభావము స్పష్టముగా గోచరించుచున్నది. కొండముది శాసన పాఠమున మహేశ్వర, బృహత్పలాయన అను రెండు సంస్కృత పదము లుపయోగింపబడినవి.

ఎల్లోరా శాసనమున ప్రార్థనా శ్లోకములు రెండు సంస్కృతభాషలో కలవు. ఇక దామోదరవర్మ యొక్క మట్టిపాడు శాసనమునకు వచ్చు నరికి, ఆ శాసనము సంస్కృత మిశ్రమమగు ప్రాకృతములో వ్రాయబడుట గాననగును. ప్రతిగ్రహీతల పేర్లును, వారి గోత్రములును అందు ప్రాకృతభాషలో నీయబడినవి. ఇవియేగాక, సంవచ్ఛరం, అజ్జనస్య మొదలగు ప్రాకృత పదములు కూడ కనబడు చున్నవి. ప్రాకృతమును తొలగించి రాజభాష పదవిని సంస్కృత మాక్రమించిన పరిణామక్రమము ఈ శాసనమువలన విదితమగు చున్నది. ఇక క్రీ. శ. 4 వ శతాబ్దము నుండి సంస్కృతమే శాసనభాషగా వాడబడినది. ఈ కాలపు నాటివారే విష్ణుకుండినులు. క్రీ. శ. 7 వ శతాబ్దినాటికి గాని తెలుగుభాష నిలద్రొక్కుకొనలేక పోయెను ఈ తెలుగు భాషను తొలిసారిగా శాసనములందు వాడిన కీర్తి ప్రతిష్టలు రేనాటి చోళులకు, తూర్పు చాళుక్యులకును లభించినవి.

# బుద్ధుని పిమ్మట బౌద్ధమతం

శ్రీ దుర్గా సదాశివేశ్వర ప్రసాద్

స్థిరధర్మోజ్జ్వలమూలమున్ సుకృత విస్తీర్ణాల వాలంబు న
త్కరుణానీరము ధీకళావితత శాఖం బచ్ఛనచ్ఛాయ భా
సురమున్ నష్టదపల్లవంబు సుయశస్సూనంబునున్ సత్ఫలో
త్కరమాశావివృతంబు బుద్ధసురవృక్షంబెందు మేలందుతన్.

## నమోతస్సభగవత సమ్మాసంబుద్ధస్స

**బు**ద్ధుడు లోకోత్తర పురుషుడు. లోకమున కా పురుషోత్తము డందించిన సందేశమమోఘము. నాటికి నేటికి నేనాటికి దాని తెన్నులు తిన్ననివే! అవి శుభపములే. ఆ మహాపురుషుని జీవితకాలముననే యా సిద్ధాంతములను వ్యాప్తినొందసాగినవి; ప్రచారమునకు భిక్షుసంఘము లేర్పడినవి. పల్లె-పల్లెకు, వాడ-వాడకు నా సందేశముల భిక్షువులందించిరి. బాధలతో పరితపించు జీవలోకమునకు సేవలొనరించి వాని నుద్ధరించుటలో వీరు చూపినదీక్ష లనన్యదృశములు. తమ మోక్షము, ప్రాపంచిక బంధవిముక్తికోసము, తమకు తాముగా కోరి-కోరి దరిద్రమును, కష్టములను వరించిన యీ భిక్షుకులయెడ సానుభూతికలిగి వారికి ప్రజలాహారాదికములు, నాశ్రయము లిచ్చి యాదరించుచుండిరి. కొందరు గృహస్థులు మణిత్రయమును శరణుబొంది యుపాసకులగుచుండిరి. ఈ తీరున బుద్ధానుయాయులందరు నేకార్థమతులై వ్యవహరించుచుండిరి.

కాగా సామరస్యముతో సుఖసంపన్నమైన కుటుంబముగా నుండెను బౌద్ధసంఘము, బుద్ధునికాలమున. బుద్ధుని నిర్వాణానంతర మీతీరుసాగినదికాదు. బౌద్ధసంఘములో మతభేదములంకురించినవి. ఇట్లొక శతాబ్ది జరిగినది. రాను-రాను భేదములు బలిసినవి.

## ఆ విభేదములు

బుద్ధుని జీవితకాలమున నామహావ్యక్తి ప్రభావము జనసంఘము నెంతో యుత్తేజించుట నిజమే. కాని యా పిమ్మట ప్రజలకందభినివేశము సన్నగిల్లినది. బౌద్ధభిక్షువుల నాదరించుటకు, మణిత్రయ (బుద్ధంశరణంగచ్ఛామి, ధర్మంశరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి) నుచ్చరించుటకు, పంచశీలముల బాలించుటకు మించి యుపా



**బుద్ధుడు - మిశ్రలోహం, 5 వ శతాబ్ది.**
**సుల్తాన్‌గంజ్, ఇండియా.**

నకులకు మరేదిలేదు. జనసామాన్యము నుత్తేజించుటకివేవీ చాలలేవు. తాత్త్వికసిద్ధాంతములు జనసామాన్యమునకు దురవగాహములే గదా! కనుక జనసామాన్యము త్తేజితమై యిది నాది యని యభిమానింపబడిన తీరుగా బౌద్ధమును సంస్కరింపదలచిరి కొందరు. జాతక కథలు, అవదానకథలతో స్వార్థత్యాగము—భూతసేవలను ప్రోత్సహించి మతమును జనసమ్మతముగాఁ జేయుదుమనిరి. సంస్కరణవాదులు. పూర్వాచార్యప్రియు లనూచానముగా నున్న నియమనిష్ఠల నదలింపరాదని సంస్కరణములకు విముఖులైరి. వీరు నిష్ఠుర_
షించిరి. ఈ సంస్కరణవిముఖులను థేరులు, స్థవిరులు, శ్రమణకులందురు. సంస్కరణవాదులను మహాసాంఘిక వాదులందురు.

ఈ విభేదాలకు కారణాలను వినయపిటకములో సంప్రదాయ వృత్తాంతాలిట్లుగా వివరించుచున్నవి. "దశవినయ నియమపాలనము విషయములో కొంత యౌదార్యముఁ జూపవలెనని విజ్ఞానభిక్షువులు కొందరు కోరిరి." ఈ విషయమున వసుమిత్రుడు మొదలైన వారిట్లు తెలుపుచున్నారు.

"అర్హత్త్వమత్యధికమైన స్థానమని స్థవిరుల భావము. విజ్ఞానభిక్షువులది యొప్పరు; అత్యున్నత స్థానమున కది నడిమింటిదే! అర్హత్త్వము వాంఛనీయమే కాని యదే ధ్యేయము కాదు; బుద్ధత్వమే సర్వోన్నతము, అదేధ్యేయమని విజ్ఞానులందురు!

ఈ శాఖలవారిట్లు వివరించుచుండగా జనసామాన్యమునగూడ నీ విషయమున నాసక్తి లేకెత్తినది. వారిపుడు కేవలము భిక్షుల నుపాసించుటతోనూ, శరణత్రయమును చిలుక పలుకులుగా నుచ్చరించుటతోనూ, తృప్తిగొనరైరి. ఆ మతముతో తన్మయులు గాగోరుచుండిరి. సమాజమున గలిగిన యీ చైతన్యము, భావసంచలనము, భిక్షువులు గమనించిరి. తమ మతము చైతన్యవంతముగా నుండవలెనంటే, గృహస్థులనుండి నిరంతర సహాయ మవసరమని, అందుకోసము బుద్ధుడు, ఆయన ధర్మములయెడల భక్తి, ప్రపత్తులను జూపు సామాన్య సమాజమవసరమని, యట్టి దొకటి వెలయింపవలెనని గుర్తించిరి. జనసామాన్యము నుత్తేజించుటకు జాతకకథ అవదానకథల వాఙ్మయమును వెలయించిరి. సంస్కరణవాదులు. ఈ వాఙ్మయము పారమితసిద్ధాంతాల-(సర్వోత్తమనీతుల)కు ప్రాభవము గూర్చెను. బౌద్ధోపాసకులు వీని నాశ్రయించియుండవలెనని నియమమూ నేర్చిరి. వీనిని గృహస్థులేకాదు, ఏ యైనా నాచరించవచ్చును. జీవి యీ పారమితగుణాల శిఖరముల నెప్పుడధిరోహించునో యప్పుడే యా జీవి బుద్ధుడగును.

## మహాసాంఘిక సిద్ధాంతాల పరివర్తనము

మహాసాంఘిక సిద్ధాంతాలు క్రమముగా మరికొంత మార్పులొందినవి. ఈ మార్పులు మహాయానమునకు దారితీసినవి. వీరు జనసామాన్యమున భక్తిప్రపత్తుల నెలకొల్పి యుత్తేజించుటకు బోధిసత్త్వ సంప్రదాయమును వెలయించిరి.

## బోధిసత్త్వసంప్రదాయము

బోధిసత్త్వుడగుటకు జీవిబోధి (జ్ఞానము) చిత్తమును పరిపుష్టమొనర్చుకోవలెను. తుది దాక పరిశ్రమించి తాను బోధి (జ్ఞానము) బొందితీరెదనని శపథముగొనవలెను. జీవుల సేవకోసము తన సర్వస్వమునర్పించి వారి క్లేశముల బాపి వారికి నిర్వాణమును జేర్పవలెను.

ఈ తీరున బోధిచిత్తమును పరిపుష్టమొనర్చి కొన్ని వందల పరిపూర్ణత సిద్ధించువరకు జన్మ—జన్మల వరుసగా **పారమితల** నభ్యసించుచుండవలెను. అనేక జన్మల నుండి యిట్టి శీలముల నేకరించు కొన్నవాడు—బోధిసత్త్వుడు. బోధిసత్త్వుడు గృహస్థుడుగావచ్చు, భిక్షువూ గావచ్చును.

మహా సాంఘిక సిద్ధాంతములలోని మార్పులను గూర్చి ముఖ్యముగా రెండు రచనలెరిగించుచున్నవి. ఒకటి కథావత్తు, రెండవది శాఖల చరిత్ర దెలుపు గ్రంథము. ఇది వసుమిత్రుని రచన. ఆ మార్పులు:—

బుద్ధుడు:—బుద్ధులు లోకోత్తరులు (ఐహికాతీతులు), సర్వ ధర్మ వినిర్ముక్తులు (అశౌచములంటనివారు), అనంత రూపకాయము (శరీరము) ప్రభావము (శక్తి) ఆయుష్యము (దీర్ఘ జీవితము)గలవారు. నిద్రగాని,స్వప్నముగాని, లేకుండా ఉందువారు; సదా సమాధిలో నుండగలరు. బుద్ధులొకే సమయాన నన్ని లోకధాతువుల (ప్రపంచముల) లోను కనుపించగలరు.

బోధిసత్త్వులు:—బోధిసత్త్వులు వారిచివరి జన్మలో జీవి సామాన్యమైనతీరుగా మాతృగర్భానపెరిగి యన్నిజీవులలాగే పుట్టరు. వారు పూర్ణ పరిజ్ఞానము (పూర్వ జన్మ జ్ఞానము)తో మాతృగర్భమున బ్రవేశింతురు. ఏతీరు కామము గాని వ్యాపాదము (ద్వేషము) గాని వారిదరి జేరనీయరు. వారు హీన (అపర) జీవుల జన్మ లెత్తుదురు. అనేక రకాల దీన జీవుల మేలుకోసరమట. బౌద్ధేతరులైన గురువుల దగ్గర నిష్ఠురవ్రతము లనేక మభ్యసింతురు. దుస్తర కార్యాలెన్నో



మేష శకటమున బుద్ధుడు—హీనయానపు సంకేతమిది, గాంధార శిల్పం - 2 వ శతాబ్దిది

నిర్వహింతురు. ఇంకా ప్రకృతి విరుద్ధములైన యద్భుతములనూ వారొనర్తురు.

**అర్హత్త్వము:**—అర్హతులు బుద్ధులు పొందినంత విపులముగ వివరముగా జ్ఞానముబడయరు. కనుక వీరు సకల సంయోజనము (అజ్ఞానపాశముల)లనుండి విముక్తులు కారు. వీరర్హత్త్వమునుండి (1)యనాగామి, (2)సకదాగామి (3)సోతాపన్న, దశలకు జారవచ్చు. అంతకు తక్కువ దశలకురారు. మరణకాలాన దానాలు చేయుచూ, చైత్యాలను పూజించుచూ, ప్రసన్నచిత్తు (కుశలచిత్తు) లగుదురు. గృహస్థులు దీక్షబొందకనే యర్హత్త్వమందు కొన్ని యుదాహరణము లున్నవి. అరుదుగానేయైనా మావిలోని గర్భమూ సర్హత్త్వమంది సందుకు నిదర్శనమున్నది.

**శూన్యత - తథాగతత:**—అంధక, ఔత్తరాహులకును. వేదులకును ఈ విషయమున కొంత మత భేదమున్నది, అయితే మహాయానము ప్రసరించిన పిమ్మట నది వ్యక్తముగాలేదు.

ఈ తీరుగా మార్పులొందిన మహా సాంఘిక సిద్ధాంతాలు మహాయానము వంకకు మ్రొగ్గినవి. ఈ పై చూపిన సిద్ధాంతాలు మహాయానపువిగా దలపవచ్చు. అంటే మహాసాంఘిక సిద్ధాంతాలనుండే మహాయానము వికసించిన దనవచ్చు.

**1. తిరిగిరాని దశ-జనన మరణముల తరించిన దశ**

**2. నిర్వాణమునధిగమించుటకు పూర్వము జన్మించు దశ**

**3. జనన మరణ ప్రవాహమున బడి యుండు దశ**

## హీనయాన మహాయానములు

ఇటుపై బౌద్ధ సమాజమున హీనయాన, మహాయాన శాఖలు ప్రభవించినవి. తొల్లిటి పాలీ పిటకాలలో నీయానముల ప్రస్తావనలగపడవు. ఈ యానములకు పర్యాయ పదములూ నున్నవి. హీనయానమునకు: శ్రావకయానము, ప్రత్యేక బుద్ధయానము; మహాయానమునకు, బుద్ధయానము తథాగతయానము, బోధిసత్త్వయానము. హీనయాన, మహాయానములను పేరులు గలుగుటకు కారణములను మహాయాన గ్రంథములు ఇట్లు తెలుపు చున్నవి.

సామాన్య కుశలత గల వారు ధర్మమును మతమును శ్రద్ధగా విని, యాచరించి, పూర్ణత నొందుటకు బుద్ధుడు చూపిన మార్గము హీనయానము. ఇది శ్రావకుల కోసము మాత్రమే. పురుషోత్తము లింకొకరి సహాయమక్కర లేకనే తమ ముక్తిని తామే సాధించి దాని నితరులూ బొందుటకు దారి జూపుచూ సహాయము చేయు వారికోసమైనది మహాయానము.

దీని సారము:—మహాయానము బుద్ధులను వెలయించును; హీనయానము పరిపూర్ణార్హతులను వెలయించును. సిద్ధార్థుడు పొందిన యత్యున్నత మైన బోధిసత్త్వము బొందుట కైన మార్గము గాన మహాయానము, దానికంటె తక్కువైన యర్హత్త్వము బొందుటకైన మార్గము గాన హీనయానము.

అసంగుడింకొక తీరు వివరణ మిచ్చెను. సూత్రాలంకారములో నిట్లు వివరించెను.

ఇతరులుకూడ ముక్తిని సాధించనిదే తాము మాత్రమే ముక్తి నొందనభిలషించరు మహాయానులు. తమ కార్యమంతా నిర్వహించిన పిమ్మటనే తాము బోధినొందుటకూ ఆ లక్ష్యమును సకల జీవులూ ప్రాపించునట్లొనర్చుటలో తమ జీవితముల గూడ నొడ్డుటకూ వారు దృఢవ్రతులు. శ్రావకయానులో, తమ ముక్తినే ముందుగా చూచుకొందురు. ఈ తీరు స్వార్థమగును. కాన నిది హీనయాన మనబడినది.

శుద్ధోదనమహారాజు సిద్ధార్థుని విలువిద్యాకౌశలము తిలకించుట—జావా శిలా ప్రతిమ



ఈ యానములకు తాత్త్విక వివరణములను మహాయాన గ్రంథము లిట్లు చెప్పుచున్నవి.

సత్యానుభూతికి రెండావరణములు: ఒకటి, దోష(క్లేశము) వరణము; రెండవది, జ్ఞేయావరణము. నైతిక నియమాల పాలించుటవల్లను తీవ్ర - తీవ్రధ్యానముల నవలంభించుట వల్లను, క్లేశావరణము తొలగించుకొనవచ్చు. హీనయానులు క్లేశావరణము మాత్రము తొలగించుకోగలరు. క్లేశావరణము తొలగించుకొంటే, పుద్గలశూన్యతం వ్యక్తిత్వశూన్యత మాత్రమే తెలియును. జ్ఞేయావరణము కూడా తొలగించుకొంటేగాని పుద్గల శూన్యతతోపాటు ధర్మశూన్యత (సకల ప్రాపంచిక పదార్థముల యస్తిత్వపు మిథ్య)కూడ తెలియబడదు. ఈ రెండావరణములను తొలగించుకొన్ననే సత్య సంపన్నము. మహాయానులే రెండావరణముల తొలగించుకొనగలరు. సత్యమును సంపన్నించిననే బుద్ధు లగుదురు. ఇట్టి యుత్తమ లక్ష్యములుగలవారగుట మహాయాను లనదగుదురు.

ఈ మహాయానమునకు ప్రతిభగలిగించి ప్రబలించిన వాడు నాగార్జునాచార్యుడు. ఆర్యదేవుడు, మైత్రేయనాథుడు, అసంగులవంటి యుద్దండ పండితులు, తార్కికులు, దీని నెంతో ప్రోదిచేసిరి. దాని కొక తత్త్వపుష్టి నిచ్చిరి. ప్రజ్ఞాపారమిత ఈ శాఖవారికి ప్రమాణ గ్రంథము. బుద్ధునకు వీరు దేవత్వము గల్పించిరి. బుద్ధుడు విశ్వవ్యాపి, సృష్టి యందలి ప్రాణి మాత్రము సంపల్లక్రిమికీటాదులాదిగా మనుష్యులదాకగల సకల జీవులలోను ప్రచ్ఛన్నుడై యుండి, జ్ఞానము గలిగించుచూ, ప్రాణులలో జ్ఞానమును బరిపుష్ట మొనర్చుచూ, నిశితముగా కృషిచేయుచున్నాడు—అని కారండవవ్యూహ మను గ్రంథము చెప్పును. బౌద్ధము నీ తీరున భక్తి పరముగావించిరి. నిర్వాణమునకు నిర్వచనము జెప్పయత్నించిరి. బుద్ధుడు నిర్వాణము లక్ష్యమనెను. జీవకోటికంతా యది లభ్యముగావలె ననెను. కాని దాని నిర్వచనమేమో తెలుపలేదు. నిర్వచింపగోరగా మౌనమూనెను. దానికే కాదు. అంపరాని విషయాలన్నిటా నిట్లే యొనర్చెను. ఇట్టి విషయములలో బుద్ధుడేగాదు, ఔపనిషదికుల తీరూ నింతే. నాగార్జును డిట్లు నిర్వచించెను. 'అస్తినాస్తి తదుభయానుభయ వినిర్ముక్త స్వరూపమ్'. ఉన్నది, లేనిది, ఆ రెండింటినుండీ యూ రెండూ కాని వానినుండీ విడువబడిన దాని రూపము. అదే శూన్యమనెను. అశ్వఘోషుడో యిట్లని నిర్వచించెను :—

"దీప మారిపోయిన స్థితివంటిది నిర్వాణము."

మహాయానము జనసమ్మతమై యుజ్వలముగా నుండెను. ఔత్తరాహులగుస్థవిరవాదుల యొక శాఖకూడ జనసమ్మత



బెంగాల్‌లోని బుద్ధ ప్రతిమ.

మొంద యత్నించుచుండెను. కాగా తమ ప్రధాన సూత్రాలకూ సరిపడకున్నా, నూతన దర్శన ప్రభావమున కాశాఖ తలయొగ్గెను.

## అశోక బౌద్ధము

ఇంతలో నశోకచక్రవర్తి శాంతి దౌత్యమును సంకల్పించి నిర్వహింపసాగెను. దానితో, బౌద్ధమున మరొక ఘట్ట మారంభమైనది. అశోక శాసనములలో బోధిసత్త్వ సంప్రదాయ ప్రస్తావనసుగాని పారమితులను మాటగాని కను

పించవు. బుద్ధుడు దేవుడుగానూ చెప్పబడలేదు. కాని చైత్యాలలో బుద్ధారాధన కనుపించును. అశోకుడీ విషయము లలక్షించినాడనలేము. ప్రాపంచిక విషయ వైముఖ్య మొకవంక, అసూయ, కోపము, సోమరితనము, మొదలైన వాని విశృంఖల వృత్తి మరొకవంక, అశోకున కెదురై యుండెను. వీనిని సమన్వయించి సరిదిద్దుట అశోకున కొక సమస్య; ఈ రెండతిచారములకూ నడిమింటి దారి ననుసరించినాడశోకుడు. అయితే భిక్షుక జీవనముకంటె ఉపాసక జీవనమునే యశోకుడభిమానించెను. వైరాగ్యమును నిరుత్సాహపరచెను. కాగా బౌద్ధుల దృక్పథములో కొంత మార్పు కలిగెను. సన్యాసమునకు విముఖముగా నొక యుద్యమము సాగెను.

ఈ యుద్యమము కారణముగా బౌద్ధము ప్రజాజీవితమునకు దూరముగాక పల్లెలు-పట్టణముల చేరువ జేరెను. మతము ప్రజానీకమునకందెను. నియమాల నైష్ఠుర్యము, స్వార్థత్యాగముతో నధిగమింపబడినది. ఇందువల్ల సామాన్య జనునకు కలిగిన లాభాలు: విశ్వాసము, భక్తి, చైత్యము నిర్మింపవలెననే, బుద్ధుని ప్రతిమ ప్రతిష్ఠింపవలెననే ప్రతి వ్యక్తి యుబలాట పడసాగెను. పూలతోనూ, పూజాద్రవ్యాలతోను బుద్ధ ప్రతిమను మనసార బూజించి భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లి ధన్యోస్మియని సామాన్య జనుడు గూడ నంబరపడుచుండెను. భిక్షుకులు తమ యతిజీవితమును మఠాలలో సాగించుచున్నా జనసామాన్యము బుద్ధు నర్చించుటలో నందడగొనుచుండిరి. ప్రజలా దేవ-దేవున కను దినము ప్రణమిల్లుచుండిరి.

బుద్ధుడపుడు వారికి మునికాడు. దేవాధిదేవుడు. మహా స్మారకల నిర్మించుచు నా మహనీయుని జీవిత కథల శిల్పముల నతిలోకసుందరముగా వెలయించి, వానితో స్మారకముల నలంకరించుచుండిరి. ఈ శిల్పములు తెల్ల నాపరాతి మీద సుబ్బెత్తుగా మలచబడినవి. వీని జూచి నంతనే వివిధ భావపరంపరలుప్పతిల్లి తన్మయమొనర్చును. బౌద్ధ మీ తీరున శిల్పకళోపాసకులైన సిద్ధహస్తులను వెలయించినది. ఆ శిల్పకళాఖండములు నాటికీ నేటికీ నేనాటికీ ప్రస్తుతింపదగియేయున్నవి. ఈ శిల్పసంపద కంద్రి పెన్నిధి. ఇవి క్రీ. పూ. రెండవ శతాబ్ది దరిదాపులవి.

ఈ తీరున జనులకు నిత్యసన్నిహితమై ప్రవర్తిల్లిన బౌద్ధమునే జనబౌద్ధ (జనసమ్మతమైన బౌద్ధము) మందాము. ఈ సంప్రదాయములో నొక విశేషమున్నది. ప్రాచీన హీనయాన సూత్రాలిం దొదిగియున్నవి; కాని శ్రద్ధాపూజలూ చోటుగొన్నవి. దీనిని కొంతవరకు మహాయానమనవచ్చు. ఇంకా యిట్లననూవచ్చు, "దీని బాహ్యరూపము మహాయానము కాగా, జీవమేమో హీనయానము."



—జగ్గయ్యపేట

## వికారము

ఇంతదాక బౌద్ధేతిహాస మజ్జ్వలముగా సాగినది. నైతిక పటిష్ఠత గలిగి జగజ్జేగీయమానముగా వెలిగినది. హీనయానమేగాని, మహాయానమేగాని నైతిక సూత్రముల పఠ్యమును గొంచపరచలేదు. నిర్దుష్టముగా వాని బాలించవలెనని నదేశని విధించినవి. శీలమే యీ మతమునకు జీవము. కరుణ దీనికుగ్గుతోబెట్టిన విద్య. ఇట్లు నిర్మలము, నౌదార్యవిలసితమునైన యీ మతమునకే యిటుపై దాగులంటుకొన్నవి. కాలమహిమ! జనుల యభిరుచులు వంకరదిరిగినవి. అంతకంతకు తేలిక తేలిక మనుగడల కెదురెదురుచూచుట సమాజమునకు సహజము. కాగా నీ మతపు నైతికసూత్రములు నిష్ఠురములుగా దోచినవి జనులకు. అంతేగాక బోధిసత్త్వమునుగురించి ప్రతిపాద



—అమరావతి

నలూ భరమనిపించసాగినవి. బోధిసత్త్వము సుగమముగా దోచలేదు. బహు జన్మల బహు ప్రయాసతో సాధనజేసిన గాని యది ప్రాప్తించునదిగాదు. అందుచే నీ మతముపై ప్రజ కాదరము సన్నగిల్లునట్లుండెను. ప్రజలచాపలమును పరిహరింపగల శక్తిసంపన్నులు లేరైరి. ఈ విషమునకు విరుగుడు చూపువారు కఱవైరి. కొల్లుముంచుకొని వచ్చు ప్రజాచాపలవారిపూరమునకు సేతువుగా నిలిచి నిరోధించి యా నీరమును నైతికక్షేత్రములకు మలపి సుఫలమును సాధించు కుశలు రౌదపరైరి. ప్రజల నాకర్షించుటే యుపలక్షించిరి, నాటి పండితులుగూడ.

అనంగు, ఉద్దండపండితుడే. అట్టివాడుగూడ వక్రమార్గము చూపెను. ఈయన కాలము క్రీ. శ. మూడు నాలుగు శతాబ్దులు, కావచ్చు. కొందరు అయిదవ శతాబ్దిగా దలచుచున్నారు. ఈయన సిద్ధాంతములు కలుషము లనకఁ దప్పదు. ఇవి తంత్ర సాంప్రదాయికములు. బౌద్ధమున తంత్ర సంప్రదాయము వజ్రభూతినుండి చేరినదని కొందరందురు. కాని శాంతిదేవుని గ్రంథాలలోనే యీ ప్రస్తావనలున్నవి. కాన నంతకు పూర్వమే చేరియుండు ననవలెను. మహాయానమునకు భాష్యముగానే యనంగుడు తన పాండిత్యపు కర్షమున నీ సిద్ధాంతముల బ్రతిపాదించెను. మహాయానమును ప్రచారము చేయుటలో నా యా యాచార్యులు తమ తమ భావముల ననుసరించి వేరువే రహస్యములు తెలుపసాగిరి. అందుచే మహాయానమునుండి యనేక యానములు వెలసినవి.

అనంగుని సిద్ధాంతాలు గుహ్యసమాజ తంత్రమున కెక్కినవి. ఈ సిద్ధాంతాలకు బీజములు మంజుశ్రీ మూల కల్పమునందే యున్నవట. ఈ కల్పము క్రీ. శ. ఒకటి, రెండు శతాబ్దులది.

ఈ సందర్భమున తంత్రములగూర్చి యించుక. తంత్రములుగూడ ప్రాచీనతమములేనని యొక వాదమున్నది. అవి యార్షములే ననువారూ నున్నారు. వానిలోనూ మహిమాఢ్యములైన విషయములున్నవట. జస్టిస్‌వుడ్రాఫ్ మహాశయులే వానిని ప్రశంసించిరి. కారణాంతరమున వానిలోని విషయము గూఢార్థములతో సాంకేతికములతో గూర్చబడినదందురు. కనుక నవి ద్వ్యర్థులు. పైకి తోపింపజేయు నర్థ మొకటిగాను, అందు గర్భితమై గూఢముగానుండు నర్థ మింకొకటిగాను నుండునట. ఆ గర్భితమైనదే నిజమైన యర్థమట. దీనిని సంధ్యభాష యందురు. అంటే జ్ఞాన దృష్టితో నాలోచించిన జ్ఞానము, అజ్ఞానముతో నాలోచించిన అవినీతి దోపజేయునట. ఇది యింక చాలు.

## గుహ్యసమాజ తంత్రము

ఇంక గుహ్యసమాజ తంత్రమునుగురించి తెలిసికొందము. బోధిత్వము పొందుట కిది సులువు, సూటియైన బాట జూపెను. అన్ని సుఖాలు ననుభవించుచునే బోధిని బొందవచ్చుననెను. "శారీరక కార్శ్యమువల్లగాని, ఇంద్రియ దమనమువల్లగాని మోక్షమొదవదు. క్లిష్టము, క్లేశపరీతములైన విధానాలవల్ల పూర్ణత సిద్ధించదు. కోరికలన్నిటినీ

కొల్లగా ననుభవించిననే యది లభించును" అని యీ తంత్రసిద్ధాంతములు. ఈ తంత్రము బౌద్ధమున శక్తితత్వ మును చొప్పించినది. దేవీశక్తిరూపము స్త్రీయట. యోగ సమాధిద్వారా మోక్ష మొందుటకు ముఖ్యముగా నిది యవసరమట. తాంత్రికమత చరిత్రయం దిదొక ముఖ్య ఘట్టము. బుద్ధుడు జీవహింసను, మద్య మాంసముల సేవించుటను నిషేధింపగా నీ తంత్రమేమో వానినే సమర్థించుచున్నది. మాంసాశనమేగాదు, నరమాంసభక్షణమూ నొప్పునది. ఇంతేనా! సామాజిక నియమాలనన్నిటినీ నిరాదరింపుమనెను. "నీవు స్వేచ్ఛగా జతువుల బలియియ్యి, నీ యిచ్చవచ్చినవేదైనా చెయ్యి, ఇవొకరిదనే మాటేమి మాట? నీకేది కావలెననుకొంటె అదెవరిదేగాని నీవనుభవించు. నీ కిష్టమైన స్త్రీ ననుభవించు. నీవు యోగివి. సమాజ మసంపూర్ణుల తోడిది; ఆ యసంపూర్ణులకోనమైన సమాజ నియమాలు యోగులకు చెల్లవు." అని ఆ సిద్ధాంతాల తీరట్టివి. ఇంకా నిది జనసామాన్యము నాకర్షించుటకు మంత్రాలు, ముద్రలు, మండలాలనూ తెలిపిరి. ఇవి జనులు వారి యాప్సితాల సాధించుకొనుటకు సాధనము లనిరి.

ఇది ఇట్లుండగా నీకాలముననే యుత్కళమున నింద్రభూతి పాలించుచుండెను. ఇతడు మహాసుఖవాదము లేవనెత్తెను. వజ్రయానమను శాఖను నెలకొల్పెను. ఇది శీలముతో మోక్షమునొందుట కున్నతాదర్శములతో నొక తెన్ను చూపుతూ, మరొకపంక సామాన్యులకోనమని నీతిబాహ్యములైన విషయాలతో వేరొక దారి చూపెను. ఆ వివరాలించుక :

బుద్ధత్వము—నిర్వాణత్వము—బొందినవాని మనస్సు బోధిచిత్తము. ఆ స్థితి నందుకోగానే బోధిత్వమూర్ధ్వలోకాల కెగురదలచును. కామలోకాలలో బోధిసత్వునకు వాంఛ లుండును. రూపలోకాలలో బోధిసత్వుడు రూపముతో నుండును. అరూపలోకంలో నతనికి రూపము నశించును. రూపలోకాలలో సర్వోన్నతమైన యా చివర లోకములో నమితాభబుద్ధుడు దివ్యతేజముతో ప్రకాశించుచుండును. ఆ తేజ మనన్యము. ఆ లోకమునకు పైగా సుమేరు శిఖర ముండును. బోధిచిత్తుడిందు చేరగానే శూన్యమున ప్రవేశించి దానిలో లీనుడగును. ఇంకొక చోట మహాసుఖవాదము తథాగతజ్ఞానమని నిర్వచించెను. ఇంకా నిట్లనెను : అది సంవేద్యము;అనుభవముతో దెలియదగినది. స్వభావజము, నైసర్గికము, నిత్యముగాని యనిత్యముగాని కానిది. ఈ యానందము రాగము కాదు. కాన దీని జనులకే యర్పింపవలెను. అందుచే ప్రాపంచిక భోగాలన్నిటినీ వారిచే నడ్డులేక ననుభవింపనీయవలెను.



—అమరావతి.

వీరు బోధిచిత్తుని పురుషునిగాను, ఆ శూన్యము (నైరాత్మను) స్త్రీగాను చెప్పెదురు.

"స్త్రీని యాలింగనము జేసి పురుషుడెట్టి సుఖానందమందునో యట్టి సుఖానందము ననుభవించును, శూన్యము నాలింగించిన బోధిచిత్తుడు" అని వీరి సిద్ధాంతము. అనాటి పండితులూ, పామరులూ దీని నామోదించిరి. పండితులలో ఇది సర్వులకూ దెలియునట్లు చెప్పిన యుపమ.



బుద్ధపరినిర్వాణ సమయమున పరిచరించు ఆసందుడు.
(సింహళముసందలి పొలొనారుపయందు కొండపై చెక్కబడింది. 12 వ శతాబ్దిది).

అతీంద్రియమైన యా యవస్థనందరకూ దెలియ చెప్పుట కింతకంటె తగిన యుపమానము కుదురదని తలచి యది నీతిబాహ్యముగానున్నా సహించిరి, ఆమోదించిరి. పామరులో, వాని యర్థము నున్నదున్న పాళముగానే తీసికొని, ఆచరింపనూసాగిరి.

## జ్ఞానసిద్ధిగ్రంథము

ఇంద్రభూతి జ్ఞానసిద్ధి యను పుస్తకము రచించెను. జ్ఞానమువల్లనే నిర్వాణము సిద్ధించునని యందు నిర్వచించెను. అన్ని విధానాలలోనూ వజ్రయాన పంథ మేలైనదన్నాడు. సర్వతథాగతజ్ఞానానికి వజ్రయాన పంథాకూ లేశమైనా తేడా లేదన్నాడు. సర్వతథాగతజ్ఞానమంటే ధ్యానబుద్ధ పంచకజ్ఞానమట. ఇంకా తత్త్వనిర్దేశమును గురించి చెప్పుటలో వజ్రయానము సకల తంత్రముల సారము, దాని దెలియలేకపోతే సంసారనిమగ్నులై యుంటారు. ముద్రాదులతోగాని, పాండిత్యముతోగాని, మరేతీరునేగాని, నిర్వాణము (మోక్షము) సిద్ధించదు. జ్ఞానమే నిర్వాణమునకు ప్రధాన సాధనము. ఇందు తెలిపిన జ్ఞానమార్గముననే బోధిత్వ సిద్ధియగును. ఇట్టి జ్ఞాని మాంసము తిన్నా త్రాగి తలబోసికొన్నా, వ్యభిచరించినా, మరే నీతినియమాల నుల్లంఘించినా, పాపిగాడు. అదిట్లు సమర్థింపబడినది.

కర్మణావిపన్నై సత్వాః కల్పకోటి శతాన్యపి
పచ్యంతి నరకే ఘోరే తేనయోగీ విముచ్యతే.

(జీవులు కర్మవల్లనే నరకములో సుదీర్ఘకాలం బాధ పొందుచున్నవి. యోగి వాని వట్టుల జిక్కడు) ఇట్టి జ్ఞానము గురునదుపదేశమున లభించునట, ఆ గురు లక్షణాలూ చెప్పబడినవి. ఈ జ్ఞానమే తథాగతజ్ఞానమట. ఇదే వజ్రయానమూ నన్నాడు. వజ్రజ్ఞానము అయిదు రకాలట. ఈ అయిదు రకాల జ్ఞానమునూ యోగి ధరించి తాను శూన్యదేవత ననియు, నట్లే యితరులూ శూన్యమనియు భావించి, పూజలు మొదలైన యుడయాళము లేవీ లేక, నింక దేనిని పూజింపక, తనను దానే పూజించుకోవలె. అట్టి యోగి యేదైనా తినవచ్చు. దేనినైనా ఏ స్త్రీ-పతిత-చండాల-బ్రాహ్మణ-కన్యలనైనా సరే భోగింపవచ్చు, అని చెప్పెను. దీని కిది సమర్థనమట :—" మనస్సే విధంగా మలినపడకుండునో ఆ విధంగా చెయ్యి " ఇంకా " స్వానుభవముతో తెలిసికొన్న తత్త్వపు స్వభావమే ప్రశస్తము "

" యథాచిత్తం సంప్రదుష్యేత్, తథాకార్యం సుశోభనం "

" స్వయంవేద్య స్వభావం యత్తత్త్వరత్న మనుత్తరం "

ఇంకొక చోట విగ్రహముల బూజించుటను నిరసించెను. కొయ్య, రాయి మొదలైన వానితో జేసిన విగ్రహము ముందర మోకరిల్ల నక్కరలేదు. తన దేహాననే సకల దేవతలున్నారు. ఉపాసకుడు తన దేహమునే ధ్యానమున నర్చింపవలెను. తథాగతజ్ఞానము రూపము లేనిది. కాగా దాని కొక రూపమిచ్చి యారాధించుటా అనెను. ఈ సిద్ధాంతాలు సహజయానపువిగా కొందరు తలచుచున్నారు.

ఈ వజ్రయానమే రహస్యమంత్రమను పేర టిబెట్టులో ప్రచారమునకు వచ్చెను. గురుపద్మసంభవుడా దేశమున దీని ప్రవేశపెట్టెనట. ఇతడు భారత దేశము నుండి టిబెట్టునకు పోయి యచట 'లామా' పీఠమును స్థాపించెను. అతడే యా పీఠమునకు మొదటి ' లామా '; ఇతడు శాంతిరక్షితునకు బావమరది (సోదరి భర్త).

## లక్ష్మీంకరదేవి - సహజయానము

ఉద్యానదేశప్రభ్విగా వ్యవహరించినది లక్ష్మీంకరదేవి. ఈమె సహజయానమును ప్రవచించినది. ఈ యానము క్రీ. శ. ఏడువందల ఇరువై తొమ్మిది ప్రాంతముల వెలసెనట. ఇది వజ్రయానమందొక యుపశాఖ. వజ్రయానప్రవర్తకుడు ఇంద్రభూతికీమె సోదరియని కొందరు, కుమార్తెయని మరి కొందరు తలచు చున్నారు. ఈమత సిద్ధాంతసారము:

శ్రమించనక్కరలేదు, మోక్షముకోనము దేవులాడనక్కరలేదు, జంజాటము పని లేదు, ఆహారపానీయాదుల విధి నిషేధాలనవే లేవు. సత్యమును తెలిసికొంటే ఉపాసకు డిచ్చవచ్చినట్లా చరించవచ్చు. ఇట్లిది వజ్రయానమునకు ప్రతిబింబముగా నున్నది. వజ్రయానమునుండి యీ తీరునే కాలచక్రయానము మున్నగుయానములెన్నో తలనిక్కినవి.

## ప్రజ్ఞోపాయ నిశ్చయసిద్ధి

అనంగవజ్రుడీ పేరుతో నొక పుస్తకము వ్రాసినాడు, ఇంద్రభూతి విరచితమైన ''జ్ఞానసిద్ధి'' సారమన దగియున్నది. అనంగవజ్రుడు క్రీ. శ. పదవ శతాబ్దివాడు; ఇతడేలనో బౌద్ధమును వీడి నాథపంథలో చేరినాడు. నాథపంథ జైనమందలి తంత్రశాఖ. ఈ నాథపంథ సిద్ధాంతాలు వజ్రయాన-సహజయానముల బోలినవే. ప్రజ్ఞా ఉపాయముల సమ్మేళనమున మోక్షమొందుతెన్ను జూపునిది. ప్రజ్ఞా ఉపాయము లేమిటో నిర్వచించినది. అద్వయత్వసంయోగ భావనచే గాని మోక్షములభింపదు. ప్రజ్ఞాపారమితత్వము లేనిది జీవికి మోక్షము సిద్ధించదు. ఆ ప్రజ్ఞాపారమితత్వము స్త్రీలందరిలో నున్నది. కాన స్త్రీల నుచ్చనీచ భేదములేక వావివరుసలు లేక భోగించి యోగించి మోక్షసిద్ధినొందదగును; ఐతే యోగిబోధిసత్త్వుడు సరియైన గురూపదేశము



బుద్ధపరినిర్వాణమునకు దుఃఖితులగు ఉపాసకులు - అజంతాలోని 26వ గుహ యందు చెక్కబడిన శిల్పమున నొక భాగము - క్రీ. శ. 6వ శతాబ్దిది.

బొంది యుండవలెను. అట్టి వాడేస్త్రీని భోగించినా పాప మొందడు—అని. ఆ వచనాలు వినండి :

> సంభోగార్థ మిదం సర్వం త్రైధాతుః కామశేషతః
> నిర్మితం వజ్రనాథేన సాధకానాం హితాయచ

సాధకుల మేలు కొనరమున్ను భోగించుట కొనరమున్ను వజ్రనాధుడు త్రిధాతువుల కామశేషమునుండి యిదంతా నిర్మించినాడు. మనస్సు చలింపనీక ధ్యానబుద్ధితో నీ్రవతము నాచరింపవలెను. మనస్సు చలించెనా మోక్షసిద్ధి లేశమూ లేదు అని చెప్పెను.

## పర్యవేక్షణము

బౌద్ధమతమున తంత్రసంప్రదాయములీ తీరున నల్లి బిల్లిగా నల్లుకొన్నవి. ఉదారము,సుత్కృష్ట శీలసంపన్నము నైన బౌద్ధమతపు మానసుర్యాదలను మంటబెట్టినవివి. అపయశము నాపాదించినవి. ఇట్టి కలుషముల వల్ల సమాజములో స్వైరవిహారము అవ్యవస్థితి యలముకొనుట సహజము. అట్టి దుస్థితివల్ల సమాజము దురపిల్లియే కాలక్రమాన నీయానములను సమాజ మేవగించు కొనియుండును. అందువల్లనే నైతిక సూత్రముల నాదరించి, విధించిన వైదికమతాదుల పంకకు సమాజము మరలమ్రొగ్గినది. తాంత్రిక బీజములు తావుగొనుచు నిర్వీర్యమగుచున్న బౌద్ధమును కుమారిలుడు, ఆదిశంకరులు నిరసించిరి. అందలి సారభూత సిద్ధాంతముల కొన్నిటి దమవిగా రూపిచ్చిరి. అటుతరువాత పౌరాణికులు యీ తంత్ర బౌద్ధమును చూపియే బౌద్ధమును గురించి యపప్రచారము గావించిరి. రాక్షసుల కపమార్గముపదేశించి వారి స్త్రీల శీలము శిథిలపరచుటకు బుద్ధుడవతరించినా డని కథ కల్పించిరి. ఇది ఘోరాపచారము. బుద్ధుని మహాప్రతిభ, నిర్మల జీవిత ప్రభావము దిరస్కరింపలేరైరి. ఆ పురుషోత్తమత్వము నొప్పుకొనక తప్పలేదు. కాగా నాయసను విష్ణ్వవతారముగా చెప్పిరి. కాని ఆ మతములో దూరిన పంకరబాటల నా మహనీయుని లక్ష్యములుగా ప్రచారము చేయుటకీ కథనల్లుట యవివేకము! సందర్భ శుద్ధి లేని వంచనము!! మహాపాపము!!!

ఈ వామాచారమునకు బౌద్ధము మాత్రమే పాల్పడెనా ? నాటి మతాలన్నీ యీ యడుసులో దొరలినవే! చూడండిః బాలాపూజ, కుమారీపూజ, మాతంగి తుడుపులు నేటికీ మన సమాజమందం దగపడునే గాదా! ఈ దురాచారములు జుగుప్సాకరములేగా! యీ తీరు దుస్సంప్రదాయము లన్ని మతములనూ ప్రబలినవి. సారబలముకంటె సంఖ్యా బలమునే నాటి మతప్రచారకు లభిలషించిరేమో! నాటి పరిస్థితులెట్టివో! అవసరములేమో! వీనిని తంత్రసంప్రదాయమని సామాన్యముగా వ్యవహరింతురు. ఈ తాంత్రిక సంప్రదాయము లిట్లు క్రీ. శ. మూడవ శతాబ్దిలో వెలయింపబడుట నిజమే. కాని యవి యప్పుడే వ్యాప్తినొందలేకపోయినవి. అసూచానముగా శీలాది నియమములతో సుశిక్షితమైన బౌద్ధమన స్తత్వమీ సంప్రదాయముల స్వీకరింప సిద్ధపడలేదు. అందుచే నది వెలసిన కాలాన దానికి నెలవు దొరకకుండెను. అయితే కొందరీ విషయకముగా వాఙ్మయము సృజించిరి. ఇట్లది క్రీ. శ. ఏడవ శతాబ్ది నడుమ దాక పుస్తకాలలో నజ్ఞాతవాన మొనర్చవలసినదాయెను. ఏడవ శతాబ్దిలో ఎనభైనలుగురు సిద్ధులు దీనిని వ్యాప్తినొందింప దలపెట్టిరి. సమ్మోహనీయములైన పాటలు, నుపదేశపరంపరలతో బహుళప్రచార మొనర్చిరి. జనసామాన్యమును సమ్మోహపరచి యాకర్షించిరి. అంతటి నుండి యీ సంప్రదాయము వ్యాప్తనొందినది. వజ్రయానము టిబెట్టు, నేపాలములకు ప్రాకెను. తాంత్రిక గ్రంథాలు టిబెట్టు భాష కనువదింపబడినవి. కొన్ని తంత్రాలు చీనాకూ చేరినవి. కొన్నితంత్రాల యనువాదాలు చీనా త్రిపిటకములందూ చోటుగొన్నవి.

ఈ తంత్రములు సూత్రకాలమునుండీ కలవని, ఆ యాదితంత్రము లీతీరుగా నీతి బాహ్యములుగా లేవని, శ్రీ స్వామి శంకరానందుల వారంటున్నారు. "నాడు తురేని యనులతళ్లకు తట్టుకోలేనివారు తమ యసూచాస



—అజంతా.

సంస్కృతినంతా సంకేతములలోనికి మార్చిరి. అవే ముద్రాదులు. ఇవి వైదికసంప్రదాయముల సంకేతములతో ప్రదర్శించుట తప్ప మరేమీకాదు." అని స్వామివారందురు. ఆ సంకేతములకు శ్రీ స్వామివారు అన్వయములూ తెలిపిరి. తంత్రములలోనూ ఈ సంప్రదాయమును వామాచారమనే యందురు. అయితే యీ వామాచారము తొలిగా తంత్రముల నాశ్రయించియుండెనేమో! తంత్రముల తీరు వెనుకనే తెలిపితిని. తంత్రము లుదయించుకాలమున దేశమే పరిస్థితులనుండెనో యీ బౌద్ధమున తంత్రసంప్రదాయము పెట్టిన కాలమునా దేశమట్టి పరిస్థితులనేయున్నది. నాడు తురేనియు లొకరే దేశమున దిగిరి; యీ కాలాననే యవన, శక, కుషాణ, హూణాది విదేశీయగణము లెన్నో యీ దేశమున చొరబారినవి. వారి దేశీయ పరిస్థితుల కపరిచితులు; వాని యందాదరము లేకపోగా తిరస్కారభావమూ గలవారు. వారి యభిరుచులైహికములు; ఇంద్రియతృప్తి నభిలషించునవి. అట్టివారికి అధ్యాత్మమని, శీలపాలనమని బోధించిన పొందునా? పొసగునా? అవి వారి నాకర్షింపగలవా? కాగా వారినీ సమాజమున లీనముగా గూడ దీయుటెట్లు? ఇదొక బృహత్సమస్య. అందుకొనము భారతీయాధ్యాత్మిక ప్రతిపాదనములను, విదేశీయాభిరుచులను మేళవించి రూపొందించిన సంప్రదాయము లీవామాచారములనవచ్చు. విదేశీయులు వెగటొంది విముఖులుగాకుండ పైచూపులకు వారి యభిరుచుల జిందించు సర్థముల దెలుపుచునే లోలోపల ససూచానమైన యార్షసంస్కృతిని దెలిపెడి యర్థముల నొదిగించి తెలివితేటలతో తంత్ర వాఙ్మయ రచయితలు తమ రచనలు నిర్వహించి రనవచ్చును.

> కరుణౌకాలూనెడు సహింసెస్థిరమునగుత!
> సపని సదేశాంతి, యదెదాంతి, యదియొ నీతి
> స్వరము మొదలైనవో పునర్జన్మకె; యింక
> రూపులేని నిర్వాణమే ప్రాపుమనకు.

## అంతఃపురమునను స్న సిద్ధార్థుడు



# గౌతమ బుద్ధుని ఆత్మోత్సర్జనం

వైద్యశాస్త్రి

*సుభాషితం సత్యపథ ప్రకాశనం*
*కరోత్య నాలోక పదే సుదీపవత్*
*సదోపకారా దత యేవ వల్లభం*
*వివేకచర్యాసు మహాత్మనామపి.*

—అవదానకల్పలతా

సత్యమార్గమును దెలుపు సుభాషితములు, మానవుని అజ్ఞానమను అంధకార మార్గమునందు ప్రకాశవంత మగు దీపసమానములు. మహాత్ములకు కూడ యుక్తాయుక్త వివేచనమందు యెల్లపుడు, ఉపయోగపడుటవలన, వారలకు ప్రీతిని కలుగజేయునవగుచున్నవి.

మానవసమాజమునసే గాక, జంతుజాలమునందును సత్యాహింసలను, శాంతి సౌఖ్యములను ప్రతిపాదించి, లోక కల్యాణమునకై కృషిచేసిన కరుణాసముద్రుడు, ఉదారచరితుడు, జగత్కుటుంబియైన బుద్ధభగవానుడు భారతీయులకేగాక సర్వప్రపంచవాసులకు, ఆరాధనీయుడు. ఈయన ప్రబోధమువలన ప్రపంచ మానవకోటియందే నవ చైతన్యము కలిగినది.

ఆయన బోధించిన సత్యాహింసల ప్రాముఖ్యమును మనము గుర్తించి, కారుణ్య, పరోపకార, సహజీవన సిద్ధాంతముల ననుష్ఠించి, నేటి హింసా క్రౌర్యవిధ్వంసక శక్తులకు స్వస్తి జెప్పిన, శాంతి సౌఖ్యములతో ప్రజలు వర్ధిల్లగలరు. ఆత్మప్రబోధము నందుటకై ఆయన బోధలేగాక, చర్యలు కూడా మనకు మార్గదర్శకములై, వెలుగుబాటను నడిపించగలవు.

బుద్ధభగవానుని ధర్మోద్బోధములను విశదపరిచే శిలా శిల్పములనేకములు, నేడు మన ఆంధ్రదేశమునందు మిగిలియున్న ప్రాచీన బౌద్ధ స్తూపములందు లభించుచున్నవి. బుద్ధభగవానుని కరుణామయమైన జీవిత గాథలనే, ఆనాటి శిల్పకారులు, శిలాఫలకములపై గండరించి నేటికిని, మనకు ఆ మహనీయుని త్యాగమహిమను తెలియజెప్పుచున్నారు.

జరామరణములు, వ్యాధులు, మానవులను ఆదికాలము నుండియుకూడ బాధపెట్టుచునే వున్నవి. వీనినుండి విముక్తికై మానవుడును యేనాటినుండియో యెడతెగని ప్రయత్నము చేయుచునేవున్నాడు. కాని ఇంతవరకును ఈ ఘోరమైన, క్రూరమైన బాధలనుండి విముక్తులైనవారు ఎవరును కనపడుటలేదు. ఇంతవరకు వాని బాధ తప్పక పోగా, వానిని ప్రకోపపరిచే మానసిక దోషములు, దుష్ట శక్తులు, రానురాను ప్రజ్వరిల్లుతున్నట్లు ప్రపంచ పరిస్థితులే వేనోళ్ళ చాటుతున్నవి.

మానవుడు ఆదివ్యాధులకు పాల్గాక, ఆరోగ్యవంతుడై చిరంజీవియై మనవలయుననన్నను, లోకకల్యాణము చేకూర వలెనన్నను, మరిమానవులలో కుదుర్కొనియున్న మానసిక దోషములు నమసిపోవలయును గదా! మరి ఈ మానసిక దోషములైన, రజోగుణతమోగుణ విశిష్టములైన, ఈర్ష్యాద్వేషములు పోవలయుననన్నచో మానవుడు అందుకు తగిన సాధనముల నన్వేషించి, యనుష్ఠించి, సుభాషితముల నాలకించి, మహాత్ముల ననుసరించి, కారుణ్యము, పరోపకారము, సత్యము, శాంతి, అహింస, ఇవి ముందుగా తనలో ప్రవర్ధిల్లునట్లు పాటుపడవలసియున్నాడు.

బుద్ధభగవానుడు లోకకల్యాణమును కాంక్షించి యెట్టి ధర్మోద్బోధములను చేసినాడో, యెంతటి ఆత్మత్యాగమును చేసినాడో, తెలిసికొనినచో, కఠినహృదయుడుకూడ కరిగిపోయి, వినమ్రభావంతో ఆయనమార్గము ననుసరించుటకు ప్రేరేపింపబడగలడు. శాంతిసౌఖ్యములతోను, వర్ధిల్లగలడు.

త్రికాలాబాధితమైన పరమసత్యమునుకూడా, సామాన్యుడు తెలుసుకొనుటకు కొంత వ్యవధి కావలయును. అది ఛాందసపు శాస్త్రీయపద్ధతుల ననుసరించియు, విశదీకరింపబడిననేగాని, కొందరు విద్యాధికుల మనుకొనువారును, విధేయులై వినుకొనజాలరు.

బుద్ధభగవానుని జాతకకథలు కొన్ని తనివిదీర చదివి, మనసమొనర్చుకొన్న మీదటను, శిలాఫలకములపై చిత్రింపబడిన కొన్ని గాథలను కనువిందుగా చూచి కలలుగన్న మీదటను, వైద్యశాస్త్రగ్రంథములలో శాస్త్రీయ విషయములుగా వైద్యశాస్త్రజ్ఞులు చెప్పిన కొన్ని ధర్మసూక్ష్మములు అరకొరగా మనకు అర్థమగుచున్నట్లు తోచగలవు. యెందువల్లనైతేనేమి, వైద్యుని వైద్యత్వమునకుగాని, రోగిబాధా నివారణమునకుగాని యాథిగా తృప్తిని గొలుపని కొన్ని చికిత్సారహస్యములు, యెందుకు నిష్ఫలముగా

వ్యర్థమగుచున్నవో, విజ్ఞానతృష్ణకలవారు విపులీకరించు కొని 'ఆత్మావలోదనమువల్ల' వివేకించుకొనగలుగుదురు.

నేటి ప్లాస్టికుసర్జరీ, బ్లడ్‌బ్యాంకులు క్రొత్తగావెలసి, వైద్యుల వైదుష్యమును, సర్జనుల కర్మకౌశలమును, శాస్త్రజ్ఞులప్రతిభను విశదీకరించుచు, ఆతురుల ఆర్తిని అనేక రీతుల ఆదుకొనుచున్న విషయము లోకవిదితమే కదా! ఇందుల కెంతయు మనము తృప్తిపడి గర్వింపతగినదే! కాని నేడు ఈ కర్మకలాపమంతయు శాస్త్రీయమను యేదో ఒక పద్ధతి ననుసరించి, లౌకికమగు కర్మకాండగా జరుగుచున్నదేగాని, ఇందు పారలౌకికమైనట్టిగాని, ఆత్మోపలబ్ధిని కలిగించునట్టిగాని, ఉత్కృష్టధర్మకార్యముగా మాత్రము ఆచరింపబడుటలేదు. దాతకును, ప్రతిగ్రహీతకును అవసరముగా అలవడవలసిన సాత్వికగుణభూయిష్టమైన అహింసాతత్త్వముగాని, నైతికజీవితముగాని అవగతమై ఆచరణీయము కాకపోవడముచేత, ఈ దానములన్నియు ఒక లాంఛనప్రాయముగా జరుగుతూ, యాదృచ్ఛికముగా ఫలప్రదమౌతున్నవేగాని, సర్వేసర్వత్రా నూటికినూరుపాళ్లు గుణకరములుగా ఉండడములేదు.

క్షేమేంద్రుడు బోధిసత్వావదానకల్పలతలో చెప్పిన శిబిసుభాషితావదాన కథ, బౌద్ధ జాతక కథలలో చెప్పిన, నాగార్జునకొండ శిల్పములలో చిత్రింపబడిన, సర్వందదావదాన్న కథ, కపోత జాతకకథ, అహింసా ధర్మసూక్ష్మమును తెలియజెపుటలో వైద్యశాస్త్రజ్ఞుల ఉత్కృష్ట విషయ పరిజ్ఞానమునకు పనికి వచ్చేవిగా నాకు తోచినవి.

మల్లజనుల నివాసస్థానమైన కుశపురి యందు ఒక భిక్షువు ఈ సుభాషితమును వినిపించెను. బుద్ధభగవానుడు భిక్షుగణము యొక్క కుశలము నపేక్షించి, తనపూర్వజన్మవృత్తాంతమును జెప్పుచు, శివవతీపురమునందు శిబి యనురాజు సర్వజనబాంధవుడై దయతో ప్రజలను పాలించుచుండగా ఆ రాజ్యమందు సమస్తమైన ప్రజలు స్వర్గసుఖము ననుభవించుచుండిరి. ఈ వింతను జూచి ఇంద్రుడు రాజును పరీక్షింప దలచి, రాక్షసరూపమున రాజున కెదురుగా నిలిచి, అనిత్యములైన ఈ సంసార సుఖములు చంచలములైన మెరుపుల వంటివి సుమా! ప్రణయముతో నున్నవారు ప్రళయకాలమున, పరిణామమునే పొందగలరని జెప్పుచు, రాజును అధిక్షేపించెను. వెంటనే రాజు, మహానుభావా! మనశ్శాంతిని కలుగ జేయ



అమరావతిలోని పాలరాతి శిల్పము—
రెండవ శతాబ్దిది.

రాజకుమారుడు సిద్ధార్థుడు, కపిలవస్తు నగరమును వీడి అశ్వారూఢుడై పోవుట. సింహాసనాసీనుడగు సిద్ధార్థుని, ప్రక్కనే యున్న కంటకమును యిందు కనవగును.

గల మీ సుభాషితములను వినగోరుచున్నాను. నేను మీకు విధేయుడను; సుభాషితముల బోధింపుమని కోరెను. ఇంద్రుడు, "ఓ రాజా! ఫలరహితమైన బోధలవలన నేమి ప్రయోజనము. నేను ఆకలిచేతను, దప్పికచేతను బాధపడు తున్నాను. కడుపు మండు తున్నది. నాలుక ఎండు తున్నది. నిష్ఫలమైన నీ గురుగౌరవము నాకోరిక కాదు. అర్తుడనైన నాక్షుత్పిపాసా నివారణమే నాకు కావలసినది" యనెను. "ఆకలిదప్పుల బాధచే నేనేదియో చెప్పుదును. అసలు విషయము మరతును; నా బాధనీకు తెలియదు. మధురములైన, రసోచితములైన సుభాషితములైనను మానవుని బాధల నణచ జాలవు. సుభాషితములు తృప్తిగా నున్నవారికే సుఖప్రదములగును. సంగీతము విన్నంత వరకు, కావ్యము చదివినంత వరకు, శ్రమగాని, రాజసేవ గాని చేసినంత వరకు ఫలప్రదములు. నీటిని ఈదినంత వరకు, దాటగలము. తదుపరి యేమియు ఫలములేదు— నీ శరీరము నుంచి వెడలిన వేడిరక్తము, మాంసము నా కిప్పుడు తృప్తిహేతువులు. అహింసా వ్రతనియమముకల నీ నుండి నా కిప్పుడివి దుర్లభములు. అహింసా వ్రతనియమము లేని వేరొకని సమీపించి యాచించ గలను. నీ వద్ద నేనేమి చేయుదును. ఆటలు గాని, పాటలు గాని, ఏ చర్యలైనను తుల్యాహారవిహారములు గలవాని యందు శోభించును. విరుద్ధప్రకృతులు గల మనయందు శోభించవు."

ఈ విధముగా చెప్పుచున్న రాక్షసునితో, రాజీ విధముగా సాదరముతో పలికెను. నా శరీరమునుండి వెడలిన వెచ్చని రక్తమాంసములు నీ కిచ్చెదను. వీనిని స్వీకరించి తృప్తిని బడసి, నాకు నిర్వాణము నొసగుము. నీ మాటలు నాకు మార్గదర్శకములు."

అంతట రాక్షసుడీ విధముగా పలికెను. "ఓయి బుద్ధి మంతుడా! నే జెప్పబోవు ధర్మములను చక్కగా విని నీచే వాగ్దత్తమైనదానిని త్వరగా నిమ్ము."

రాక్షసవాక్యములు వినుచున్న రాజు అతి సంతోషముతో అతనికొరకై తన దేహమును పొడిచికొని, రక్తమును, మాంసమును, దానముగా నిచ్చెను. యేవిధమైన వికారము గాని బాధనుగాని చెందక స్వదేహమునుండి రక్తమాంసముల తీసియిచ్చిన రాజునుగాంచి రాక్షసులందరు విస్మితులైరి. రాక్షసరూపముననున్న ఇంద్రుడు సగౌరవముగా నిట్లనెను. "మర్మవిచ్ఛేదకరమైన ఈ కృత్యమువలన నీ శరీరమునందు విషాదరూపమైన బాధకలుగలేదా?" రాజీ విధముగా ఇంద్రునకు బదులుజెప్పెను. "పరోపకార విషయమున నా శరీరమునం దెట్టి బాధయు జనింపదు. సత్త్వగుణప్రధాన ముగా, అహింసాతత్త్వముతో సత్యమునకై నే జేయు త్యాగమున వ్యథపొందజాలను. శరీరమున వ్రణమును కాదు. యథాస్థితినే పొందగలను."*

తథాగతునిచే చెప్పబడిన ఈ పూర్వజన్మ వృత్తాంతము విని, భిక్షువులందరు విస్మయమునొంది, అతనిని ప్రశంసించిరి.

ఇహపరసుఖములందు సుభాషితములు వెలుగు బాటను జూపుచున్నవి. సంవాదముచేత సుభాషితామృత రసము పరాకాష్ఠను పొందుచున్నది—సర్వజ్ఞుడైనప్పటికి సుభాషితముల విషయమున యాచనీయుడగుచున్నాడు. అందువలన సత్పురుషులకు సుభాషితములు ప్రీతిని కలుగ జేయును.

ఈ పయి కథ త్యాగజీవితముయొక్క పరాకాష్ఠనేగాక, ఆతురునకు అవసరమైన రక్తమాంసముల యొక్కదాన వైశిష్ట్యముతోపాటు, సామ్యగుణ ధర్మముల ఆవశ్యకతను కూడా తెలుపుచున్నది.

తుల్యాహార విహారములు, సత్త్వగుణము, పరోపకార చింతనము ఇవి మానవ ప్రకృతులలో ఒకేరీతిగా పని చేయునప్పుడే, రక్తమాంస దానములు సత్ఫలితమునీయ గలవు. హింసా క్రౌర్యములు పనిచేయు తత్త్వమునుండి, రక్తమాంస దానక్రియలే జరుగవు. జరిగినను అవి ఫల ప్రదము గానేరవు. సామ్యగుణ ధర్మములు లేని రక్తము గల వానినుండి రక్తము తీసుకొనుట, మాంసము గలవాని నుండి మాంసము గొనుట, అనర్థహేతువే కాగలదు. విరుద్ధాహార విహారములు, విరుద్ధగుణములు, ప్రకృతులు గల వ్యక్తినుండి దానము చేయబడు, రక్త మాంస దానములు విపరీత గుణమునే కలిగించగలవు. "వృద్ధిస్సమానై స్సర్వేషాం విపరీతై ర్విపర్యయః" అను వైద్యశాస్త్ర సూత్రము

---

* ఈ సందర్భమున గల శ్లోకాలు ఇవి:—

"ఏతదాకర్ణ్య నృపతిః ప్రహర్షోత్ఫుల్లలోచనః
దదౌ స్వదేహ ముత్కృత్య తస్మై మాంసం సశోణితం
ఉత్కృత్యోత్కృత్య దదతః స్వమాంసాని మహీపతేః
నిర్వికారేణ సత్త్వేన విస్మితోఽభూత్ నిశాచరః
స దత్వా సర్వగాత్రేభ్యః పిశితం పిశితాశనే
ప్రణిధానం వ్యధాత్ సర్వసత్త్వసంతారణేనృపః
శత స్సం వ్రణయాదూచే రక్షోరూపః పురందరః
అపిశే మర్మవిచ్ఛేదే విషాదజనవీ వ్యథా
పృష్టప్రిదశరాజేన రాజరాజ స్తమబ్రవీత్
నవిషాదో స్తి మే దేహే పరోపకరణీకృతే
వ్యథాయాం నిర్వికారోఽహం యది సత్వేన తేనమే
నిర్వ్రణస్వస్థ మేవాస్తు పూర్వరూప మిదం వపుః"

—అవదానకల్పలతా.

ఇక్కడ అన్వయమగును. భౌతికమైన కేవల రక్త మాంసగుణ ధర్మ సామ్యమేగాక, మానసిక ప్రవృత్తులు కూడా సమానముగా నుండిననేగాని సత్ఫలితము కలుగ నేరదు.

చరకమహర్షి ఇట్లు చెప్పుచున్నాడు :

" అదఖల్వేకం ప్రాణ వర్ధనానా ముత్కృష్టతమం
తత్ర అహింసా ప్రాణినాం ప్రాణవర్ధనానా
ముత్కృష్టతమం—ఇత్యాయుర్వేదవి
దోమన్యంతే " (చరక.సూ)

" యద్యప్యన్నం ప్రాణవర్ధనం, తథాప్య హింసైవోత్కృష్టా, అహింసయాహి, ధర్మజననాత్,
తయాఆయుర్వర్ధనం భవతి "

ప్రాణమును వృద్ధినొందించువానిలో జీవకోటిని హింసింపకుండుట ఒక్కటియే ఉత్కృష్టతమమైనదనియు, ఇట్టి అహింసాతత్త్వము సత్వమధురస్వభావ ప్రేరితమైన, అనగా ప్రేమమయమైన ఆత్మనుండియే జనింపగలదనియు వ్యథను సహింపనోపదనియు, ప్రాణములనుగూడ నిలుపగలదనియు తెలియుచున్నది—ఆత్మపరముగా బాధను కూడ తెలియనీయక సమ్మోహినిగాకూడ పనిచేయగలదు.

స్థూలదృష్టికి కానరాకుండా దేహమునం దతిసూక్ష్మరూపమునన్నుటువంటి జీవుడు ప్రేమమయస్వరూపుడైనప్పుడు, ఆదేహియొక్క అవయవ నిర్మాణమునందలి సప్తధాతువులు, వాటికి హేతువైన, ధాతుకణసముదాయము, అన్నీ ప్రేమమయమై తత్స్వరూపమందు తనివంది, సత్యదయోపకారచింతనమున సమస్తమును చరించగలవు. ఈ పరమార్థము నెరిగినవారే, ఈ అహింసా ప్రభావము నెరుగగలరు. ఇతరుల కిది కట్టుకథగానే ఉండగలదు.

బుద్ధభగవానుడు అపాదమస్తకము అణువు అణువున, అంతరాంతరమున ప్రేమమయుడు గావుననే, జంతువులనుసైతము వశపరుచుకోగలిగినాడు—నలగిరి పాదాక్రాంతమైనది.

మానవులమగు మనమే ఇంకను ఈర్ష్యాసూయలను విడనాడజాలక, రోగగ్రస్తులమయి అధివ్యాధులతో అలమటించిపోతున్నాము—బుద్ధభగవానుని బోధలు మనల ప్రబుద్ధులనొనర్చుగాక !

## తక్తిబాహివద్దనున్న విహారపు దృశ్యం



# తథాగతుని దంతధాతు చరిత్ర

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

కళింగము ప్రాచీనకాలమునుండి బౌద్ధమతమును అభిమానించి, అవలంబించిన దేశము. కళింగప్రస్తావము అనేక బౌద్ధగ్రంథములలో వచ్చును. 'సుత్తపిటకము'లోని 'దీఘ', 'మజ్ఝిమ', 'సంయుత్త', 'అంగుత్తర'; 'ఖుద్దక' నికాయములలో ఒకటియైన 'దీఘ' నికాయమున కళింగవనమును, సముద్రతీర ప్రదేశమునకు రాజధానియైన దంతపురమును పేర్కొనబడినవి. బౌద్ధులలో పరంపరగా వచ్చుచుండిన గాథలవలన భారతదేశమునందలి అత్యంత ప్రాచీనసగరములలో దంతపుర మొకటియని తెలియవచ్చుచున్నది. మహాగోవిందునిచే నిర్మితమయిన అరు నగరములలోను కాళింగుల దంతపుర మొకటి యని 'మహాగోవింద సుత్తాంతము'నందలి ఈ క్రింది శ్లోకములు తెలుపుచున్నవి:

దంతపురం కాలింగానం అస్సకానంచ పోతనం
మాహిస్సతీ అవంతీనం సోవీరానఞ్చ రోరుకం
మిథిలాచ విదేహానం చంపా అంగేసు నాపితా
బారాణసీ చ కాశీనం ఏతే గోవింద మాపితా.

'మహావస్తు'లోకూడ ఈ శ్లోకములు కలవు. ఇది లోకోత్తరవాద' సంప్రదాయమునకు చెందినదై నప్పటికి ఇప్పటికిని ఇది పేరుకు 'హీనయాన' గ్రంథముగనే పరిగణింపబడుచున్నది. ఇది అనేక మహిమలు చూపిన బుద్ధభగవానుని జీవితచరిత్ర. ఈ గ్రంథములో చెప్పిన అనేక సంఘటనలును, మహిమలును కళింగములోని దంతపురమునందు జరిగినవే. 'కలింగబోధి', 'కుల్లకలింగ', 'కుంభకార', 'కురుధమ్మ' జాతక కథలు కళింగమునకు సంబంధించినవి. 'కలింగరాష్ట్రమున దంతపురమునందు కాలింగుడు రాజ్యముచేయుచుండగా' ('కలింగరట్ఠే దంతపురనగరే కాలింగే రజ్జం కారంతే') అని పూర్వోక్త జాతకములలోని కథ ప్రారంభమగును.

జైన వాఙ్మయమునగూడ దంతపురప్రస్తావము కలదు. ఇది క్షత్రియులలో చాల గొప్పవాడయిన దంతవక్త్రుని రాజధాని. ఇతనినిగురించిన ఒక చిత్రమైన కథ యున్నది. ఒకానొకప్పుడు గర్భిణిగా నుండిన దంతవక్త్రుని భార్య తనకు పూర్తిగా దంతముతో ఒక నగరును కట్టించిపెట్టుమని తన భర్తను వేడుకొనెను. దంతవక్త్రుడు తన పట్టమహిషికోరికను నెరవేర్చుటకు ఉద్దేశించి తన రాజ్యములో దొరకు దంతమంతయు సేకరింపవలసినదని తన భృత్యులకాజ్ఞ యిచ్చును. దురదృష్టవశమున గర్భిణిగానుండిన ధనమిత్రుడను ఆ నగరవాసియైన వర్తకుని భార్యకుకూడ అట్టి కోరికయే కలుగును. ధనమిత్రుడు అతని స్నేహితుడైన దృఢమిత్రుని సహాయముతో తన భార్యకోరిక నెరవేర్చదలచి రాజాజ్ఞను ధిక్కరించి దంత మెక్కడెక్కడ దొరికినను దానిని కొనిసేకరించును. అందుమీదట కుపితుడై దంతవక్త్రుడు మరణదండన విధింపగా ధనమిత్రుడందుకు సంసిద్ధుడగును. అతని స్నేహితుడు దృఢమిత్రుడు అతనిని వలదని వారించి అతనికి బదులుగా వధ్యస్థానము నెక్కును. ఒకరిని వలదని యొకరు మిత్రులిరువురును హతులగుటకు వివాదపడుచుండగా వారి మైత్ర్యనుబంధమునకు కడుంగడు సలరి మనసు కరిగి దంతవక్త్రు డా యుభయులను క్షమించి విడిచిపెట్టును.

మహాభారతమున దంతవక్త్రు డొకడు వచ్చునుకాని అతడు కారూషదేశాధిపతి. కారూషము కాశీ, వత్సదేశములకు దక్షిణముగా, చేది, మగధలకు మధ్యనున్న దేశము. హరివంశము తరచుగా కాలింగుని, కారూషదేశాధిపతి దంతవక్త్రుని కలిపి పేర్కొనుచుండును. దంతవక్త్రుడు కృష్ణుని పరమశత్రువు. తుదకాతనిని కృష్ణుడే సంహరించును. ఇందువల్లనే కావచ్చును. మహాభారతము దక్షిణదేశప్రతులలో కృష్ణుడు కాళింగులను, దంతవక్త్రుని పరిమార్చినట్లు చెప్పబడినది. భాగవతమున 'కలింగేశోదంతవక్రః' అని దంతవక్త్రుడు కళింగాధిపతి యనియే చెప్పియున్నది. మహాభారతము ఉద్యోగపర్వమునందలి శ్లోకముల ననుసరించి చూడగా కళింగదేశమునకు 'దంతకురము' రాజధాని యని తెలియగలదు. దంతకురమే దంతపురము కావచ్చును. దీనివలన దంతపురము బౌద్ధయుగమునకు పూర్వమునుండియే—మహాభారత కాలము నుండి—యున్నట్లు నిశ్చయింపవచ్చును.

దంతపుర మెచ్చటి దను విషయమున చరిత్రపరిశోధకులలో భేదాభిప్రాయము కలదు. కొందరిది గంజాము జిల్లాలోని కళింగపట్టణ మనిరి కాని యది సరికాదు. మరి కొందరు ప్రాచ్యపరిశోధకపండితులు పూరీ జగన్నాథమే



భిక్షువులచే పరివేష్టితుడైన బోధిసత్త్వుని మంగళ రూపాన్ని చైనా చిత్రకారుడు సిల్కుపై చిత్రించాడు. సుకుమారమైన రేఖలలో మధురభావం చిత్రించబడిన ఈ ఆలేఖ్యం 10 వ శతాబ్దం నాటిది.

పూర్వపు దంతపురమని తలంచిరి. ఇదికూడ సరికా దనియే తోచుచున్నది. ఇది గంజాము జిల్లాలోని శ్రీకాకుళము రైలు స్టేషనుకు పదిమైళ్ళ దూరములో దంతవరపుకోట అనబడు పాడుపడిన స్థలమే ప్రాచీన దంతపురమైయుండునని నేటి కళింగదేశ చరిత్రపరిశోధకు లందురు. ఇది యిప్పు డొక పెద్ద దిబ్బ. దీని నిపుడు దంతవక్త్రునికోట యని వ్యవహరించుచున్నారు. ప్రాచీన కళింగ గాంగ శాసనములలో పూర్వ గాంగవంశజులకు దంతపురము రాజధానిగ చెప్పబడినది. ఈ దంతపురమును, బౌద్ధగాథలలోని దంతపురమును ఒక్కటగునో కాదో నిశ్చయముగ చెప్పలేము. మొత్తముమీద దంతపురము అత్యంత ప్రాచీన నగరములలో ఒకటనియు, అది ప్రాచీన కాలమున కళింగమునకు రాజధాని యనియు చెప్పుటకు సందేహములేదు. బుద్ధుని పూర్వజన్మలను వివరించు జాతక కథల్లనాటికే యుండుటవలన ఈ దంతపురము బౌద్ధయుగమునకు పూర్వమునుండి యుండె ననవచ్చును.

దంతపురమునకు బుద్ధుని దంతగాథకు ఎక్కువ సంబంధము కలదు. బుద్ధ దంతమువలననే దానికి దంతపుర మను పేరు కలిగెనేమో యన్న సందేహము కలుగును. కాని అది బౌద్ధయుగమునకు పూర్వమునుండి యున్న నగరమగుటచేత అట్టి సందేహమున కవకాశము లేదు.

'దలదావంస', 'దాట్ఠాధాతువంస'ములు బుద్ధుని దంతగాథనుగురించి తెలుపు ప్రధాన గ్రంథములు. ప్రాచీన సింహళదేశీయుల 'ఏలు' భాషలో రచింపబడిన 'దలదావంస'ము యొక్క పాలీభాషానువాదమే, 'దాట్ఠాధాతువంస'ము. 'దలదావంస'కర్త ఎవ్వరో తెలియదు. ఇది క్రీస్తుశకము 310 ప్రాంతమున రచియింపబడినట్లు ప్రాచ్య పరిశోధక పండితులు నిర్ణయించియున్నారు. దీనిని 'ధమ్మకిత్తిథేరు' డను బౌద్ధాచార్యుడు క్రీస్తుశకము పదుమూడవ శతాబ్దమున పాలీభాషలోనికి 'దాట్ఠాధాతువంస' (దంష్ట్రాధాతు వంశ) మను పేర అనువదించియున్నాడు. ప్రాచీన సింహళదేశ చరిత్రలలో ఇది యొకటి; మిగిలినవి రెండును 'మహావంస', 'దీపవంస'ములు. 'దాట్ఠాధాతువంస'మునకు 'దంతధాతువంస'మని నామాంతరము. ఇది బుద్ధుని వామ దంష్ట్రాధాతు చరిత్రమును తెలుపును.

ఈ దంతధాతు చరిత్రము మనకు ప్రసక్తించినంత వరకు ఇందు తెలుపబడుచున్నది. బుద్ధుడు 'కుసినార' సమీపమున మల్లరాజ్యమునందలి 'ఉపవత్తన'మునందు వైశాఖ పౌర్ణమాసినాడు మహాపరినిర్వాణము నొందెను. బుద్ధుని శరీరము దహనమైన పిదప గొప్ప వర్షము కురిసి బూడిద అంతయు కొట్టుకొనిపోయినది; కపాలము, అక్షక ధాతువులు రెండు, దంతధాతువులు నాలుగు—మొత్తము బుద్ధధాతువులు ఏడు మిగిలినవి. 'అక్షక', 'వామదంష్ట్రా' ధాతువులు పోను మిగిలినవానికొరకు ఎనమండ్రు రాజులు పోరాడుకొనగా వానిని ద్రోణుడను బ్రాహ్మణోత్తముడు ఎనిమిది భాగములు చేసి ఎనమండ్రు రాజులకు పంచి యిచ్చెను. 'ఖేమ' నామధారియైన ముని యొకడు చితి నుండి బుద్ధుని ఎడమ కోరపంటిని (వామదంష్ట్రా ధాతువు) తీసికొని వెళ్ళి కళింగనగరమునకు రాజధానియైన దంతపురము నేలుచుండిన బ్రహ్మదత్తుడను రాజున కిచ్చెను. అతడు 'సువర్ణ ఖచితాలంబ ముక్తాజాల శోభిత'మును, 'నానా రత్న పరిశోభిత'మును, 'తరుణాదిత్య సన్నిభ'మును, 'స్వర్గాపవర్గయాన'మును, 'ప్రసాదాతిశయావహ'మును అయిన ఒక ధాతుపీఠము చేయించి ఆ దంతధాతువు నందుంచి భక్తితత్పరుడై రేయింబవళులు పూజించి కొంతకాలమునకు నిర్యాణము నొందెను. ఇతని వంశమున కొంతకాలమునకు 'గుహసీవు'డు అను భూవరుడు జనించి కళింగాధిపతి యయ్యెను. ఇతడు మొదట జైనుడై తరువాత బుద్ధుని దంతధాతు మహిమలు నిదర్శనముగ చూచి బౌద్ధుడై బుద్ధధాతు పూజయందు నిమగ్నుడయ్యెను. బౌద్ధుడైన పిదప బౌద్ధేతరుల నందరిని తన రాజ్యమునుండి వెళ్ళగొట్టెను. కళింగరాజ్య బహిష్కృతులయినవారు పాటలీపుత్రమున కరిగి రాజాధిరాజయిన జంబూద్వీపాధిపతి పండు (ప్రాయికముగా పాండు అని యుండవలెనేమో) భూవరునితో 'గుహసీవు'ని మీదను, అత డారాధించు దంతముమీదను ఉన్నవి లేనివి ఏవేవో నిందలు మోపిచెప్పి అతనిపై దండెత్త ప్రేరేపించిరి. అప్పు డతడు కళింగమునకు వెళ్ళి 'గుహసీవు'ని బుద్ధధాతువుతో గూడ పాటలీపుత్రమునకు తీసికొని రావలసినదని 'చిత్తయాను'డను సామంత భూపతిని బంపెను. 'చిత్తయాను'డు తన రాకకు కారణమును 'గుహసీవు'ని కెరిగింప అతడు 'చిత్తయాను'నికి దంత మహిమలు తెలియజెప్పి కొన్ని మహిమల నతనికి చూపించెను. అంతట 'చిత్తయాను'డు బుద్ధమతావలంబి యయ్యెను. అతడు 'గుహసీవు'ని బుద్ధ ధాతువుతోగూడ పాటలీపుత్రమునకు తీసికొని వెళ్ళెను. అక్కడి బౌద్ధేతరమతానుయాయులు పురికొల్పగా పండు మహిపతి బుద్ధదంత మహిమను పలువిధముల నిశితముగా పరీక్షించి యథార్థముగ అది మహామహిమాన్విత మైనదని మనసార విశ్వసించి బౌద్ధము నవలంబించి బుద్ధధాతువు నారాధించుచుండెను. 'గుహసీవు'డు బుద్ధ దంతముతోపాటు పాటలీపుత్రముననే కొంతకాల ముండ



తపఃక్లేశ శిథిలత సర్వాంగుడు తథాగతుడు.
గాంధార శిల్పం, 2-4 వ శతాబ్దులది.

పోయెను. ఇట్లుండ 'క్షీరధార' నరేంద్రుడు గొప్ప సేనతో పాటలీపుత్రముపై దండెత్తి రాగా పండు నరేంద్రుడు అతనిని సైన్యనమేతుడై యుద్ధరంగమున నెదుర్కొని భయంకర యుద్ధమున నాతని వధించి విజయలక్ష్మిని చేకొనెను. తన సామ్రాజ్యమున మరల శాంతిని స్థాపించిన వెనుక పండునృపతి 'గుహసీవు'ని బుద్ధదంతముతోగూడ నగౌర ముగా కళింగదేశమునకు వంపివేసెను. బుద్ధుని దంత ధాతు మహిమలు దేశదేశముల విఖ్యాతమయినవి. ఆ సుగత దంతధాతువును ఆరాధించుటకై ఉజ్జయినీ రాజ కుమారుడైన దంతకుమారుడు కళింగదేశమునకు వచ్చెను. 'గుహసీవ' నరేంద్రుడు వాత్సల్యముతో స్వాగతము చెప్పి అతని నాదరించి అతని సుగుణములను, యోగ్యతను తెలిసికొని అతనికి తన కూతురు హేమమాల నిచ్చి పెండ్లి చేసెను.

ఇట్లుండగా రణనిహతుడైన 'క్షీరధార' ధరావరుని కుమారులును, మేనల్లురును బుద్ధదంతమును బలిమిమై గొనిపోవ దలచి గొప్ప సైన్యముతో కళింగముపై దండెత్తి వచ్చి దంతపుర నమీపమున నున్న మలయవనమును చేరి దంతము నిచ్చినను నరే, మాతో యుద్ధము చేసినను నరే యని 'గుహసీవు'నికి వార్త నంపిరి. అప్పు డతడు దంతకుమారుని తనచెంతకు పిలిచి అతనితో 'నా బొందిలో ప్రాణములుండగా నే నీ సుగత దశనధాతువును ఈయను; నేను వారిని జయింపలేక పోయినచో బ్రాహ్మణవేషము ధరించి ఈ ధాతువును లంకకు తీసికొని వెళ్ళుము. లంకాధి పతి మహాసేనుడు నాకు మిత్రుడు; తథాగత దంతధాతువు నతడు భక్తితో పూజించు'నని రహస్యముగా చెప్పి యుద్ధ మున కరిగెను. ఆ యుద్ధమున అతడు నిహతుడయ్యెను.

ఈ విషాదవార్త తెలిసిన వెంటనే దంతకుమారుడును, హేమమాలయు దంతధాతువుతో గూడిన రత్నమయ కరండమును తీసికొని నరభసముగ దక్షిణదేశమును చేరి దేవతాప్రభావమున నిండుగా ప్రవహించుచున్న మహానదిని దాటి యిసుకరాసి మధ్యమున దాని నుంచిరి ('నర భన ముపగత్వా దక్షినం చాయదేనం। అవిచలిత నభావో ఇద్ధియా దేవతానం। నది మతిమహతిం సో ఉత్తరిత్వాన పుణ్ణం। నిదహిదనన ధాతుం వాలుకారాని మజ్ఝే'). తిరిగి పురమున గూఢ వేషముతో సంచరించి మరల శీఘ్రముగా వచ్చి దంత ధాతువును పూజించి ఎప్పటి యట్ల దానిని వాలుకాస్తూపగర్భముననుంచి దంతకుమారుడును హేమ మాలయు చెంత నుండిన పొదలో దాకొని యుండిరి. అప్పుడు ఆకాశసంచారియైన 'థేరు' డొకడు వాలుకారాశి స్తూపమునుండి వినిర్గత మగుచున్న వివిధ కిరణజాల మును చూచి యచటికి వచ్చి యా సుగత ధాతువునకు ప్రణమిల్లి దానిని పూజించెను. ఇది చూచి యాదంపతు లతనికడకు వచ్చి జరిగిన దంతయు చెప్పిరి. ఎన్ని కష్ట ములు వచ్చినను, ఎన్ని దుఃఖములు నంప్రాప్తమయినను ఈ ధాతువును సింహళము చేర్చవలసినదని వారి కుద్బో ధించి ఆ 'థేరు'డు వెళ్లిపోయెను. అటు తరువాత 'పండుభా'రాధిదుడైన, నాగరాజు తన నగరమునుండి నదియొద్దకు వచ్చి దంతప్రభావమును గాంచి మాయావియై ధాతుయుక్త రత్నమయకరండమును మ్రింగి వేసెను. మరల దంతకుమార, హేమమాలలు పూర్వపు 'థేరు'ని స్మరింపగా అతడు దివ్యచక్షుః ప్రభావమున జరిగిన దంతయు తెలిసికొని విహగపతి రూపముదాల్చి నాగరాజును బట్టుకొని యాదంతయుక్త కరండమును గొని వచ్చి, దానిని పూర్వరూపమును విడిచిపెట్టి ఆ దంపతుల కిచ్చిపోయెను. ఆ దంత ధాతువును తీసికొని వారు శీఘ్రకాలముననే 'తంబలిత్తి' రేవు పట్టణమును చేరి సింహళమునకు పోవు తలంపుతో లంకకు పోవు ఓడ యుండగా దాని నెక్కిరి. సముద్రప్రయాణము చేయునప్పుడు కూడ నాగరాజు మరల దంత ధాతువును నంపాదింపవలెనని ఎన్నో మాయలు పన్నెను కాని వారు పూర్వపు 'థేరు'ని సాయమున దంత మును భద్రముగ తీసికొని చివరకు సింహళము చేరుకొనిరి.

ఇంతవరకే మనకు ప్రసక్తించిన కథ. దంత కుమార, హేమమాలలు ఓడ నెక్కిన పట్టణము 'తంబలిత్తి' (తామ్రలిప్తి-ఇప్పటి తమ్లూక్) అని పరిశోధక పండితుల అభిప్రాయము. ఇది కళింగదేశమున కుత్తరదిశగా మిద్న పూరు జల్లాలో నున్నది. దంతగాథలో దంతకుమార, హేమమాలలు దంతపురమునుండి దక్షిణదేశమునకు వచ్చి గొప్ప నదిని దాటి, పిదప 'తంబలిత్తి' రేవు పట్టణమున సింహళము వెళ్లుటకు ఓడ నెక్కినట్లు స్పష్టముగ చెప్ప బడుటవలన 'తంబలిత్తి' తామ్రలిప్తి యగుటకు అవ కాశము లేదు. 'దాఠాధాతు వంస'పు మరొకప్రతిలో నున్నది కాబోలు మహావంశమును ఇంగ్లీషులోని కనువ దించిన జార్జి టర్నరు పండితుడు దీనిని 'తాలమిత' ('తాలమితా') యని పేర్కొని యున్నాడు. ఈ 'తాలమిత' ఒక గొప్పనది సమీపమున సముద్రపు టొడ్డున నుండ వలెను. ఇది గోదావరి, కృష్ణజిల్లాలలోని రేవుపట్టణమే కావలెను. వారు దాటిన గొప్పనది గోదావరియో, కృష్ణయో యై యుండును.

ఈ దంతగాథ వ్యాప్తిలోనుండినది ఒక్క సింహళ దేశమునందును, సింహళదేశ వాఙ్మయమునందును మాత్రమే కాదు; ఇది సియాము (శ్యామ) దేశ బౌద్ధవాఙ్మ

యమునందును కలదు. సియాముభాషలో 'ఫ్రా పత్ హొమ్' ('Phra Pat 'hom') అని యొక గ్రంథమున్నది. ఇది బలిద్వీపవు పాళిగ్రంథమునకు శ్యామ భాషానువాదము. దీనిలో సియాము (Siam) దేశమునకు సంబంధించిన బౌద్ధాదివిషయములు కలవు. దీనిలో బుద్ధుని దంతధాతుగాథకూడ ఉన్నది. సియాము దేశీయులు ఈ గాథయంతయు తమ దేశమునకు సంబంధించినదేయని, తమ దేశమున జరిగినదేయని నమ్ముదురు. దీనిలో వివరింపబడిన గాథ, పూర్వోక్తమైనది అంతయు ఒక్కటే; కళింగము పేరు మాత్రము రాదు కాని దంతపురి 'తొంతబురి' అను పేరుతోను, దంతకుమారుడు 'తొంత కుమార్' అను పేరుతోను, హేమమాల 'హేమాచల' యను పేరుతోను ఇందు వ్యవహరింపబడిరి. 'తొంతపురి'ని పాలించుచుండిన రాజు సింఘరాజ (సింహరాజ). ఇతని రాజ్యములో బుద్ధ దంతధాతువుగల ఒక సుప్రసిద్ధ చైత్యముండెను. ఈ దంతధాతువు నిమిత్తము యుద్ధములు జరుగును. కథ యంతయు ఇంచుమించుగా ఇదివరకు

## మహాస్తూపపు తూర్పు ద్వారము, సాంచి



చెప్పబడినదే; కాని ఇందు దంతమును తీసికొనిపోవలెనని వచ్చినవారి, సింహరాజుమీద యుద్ధమునకు వచ్చినవారి పేర్లు పూర్తిగా మారిపోయినవి. ఇంకను కొద్దిపాటి తేడాలు అందందు కలవు. మొత్తముమీద కథ అంతయు ఒకటే; ఇందు దంతకుమారుడు సింహరాజు తనయుడయినాడు. హేమాచల దంతకుమారుని సోదరియైనది. వీరుభయులును దంతమును సింహళమునకు తీసికొనిపోయిన గాథయే ఇం దభివర్ణితమైనది. 'తొంతకుమార్', 'హేమాచల'లు తండ్రి యుద్ధములో చనిపోయెనను వార్త తెలియగనే అతని యాజ్ఞ ననుసరించి కర్షకవేషధారులై దంతధాతువును రహస్యముగా తమ దుస్తులలో దాచి సముద్రతీరమునకు పారిపోయి యచ్చట లంకకు వెళ్లుటకు సిద్ధముగానున్న ఓడ నెక్కుదురు. ఇందు వా రోడనెక్కినరేవు పట్టణము పేరు లేదు. మూడు నెలలు సముద్రముమీద ప్రయాణముచేసిన తరువాత భయంకరమైన తుపాను వచ్చి ఓడ బ్రద్దలగును. తొంతకుమార్, హేమాచలలు తక్క మిగిలినవా రందరు మునిగిపోవుదురు. వారు మాత్రము దంతధాతువును పదిలముగ భద్రపరచి ఎట్టెట్లో కొబ్బరి దుంగలమీద ఈదుకొని వజ్రవాలుకలకడ (Diamond Sands) ఒడ్డుచేరుకొనిరి. దంతధాతువు పోవునని భయపడి వా రక్కడ గోయి త్రవ్వి దానిలో ఆ ధాతువును కప్పిపెట్టి కందమూలఫలములు తినుచు అక్కడ మూడు దినములు ఎవ్వరికిని తెలియరాకుండ ఉండిరి.

ఓడ బ్రద్దలయిపోయినప్పుడు 'బరోమ్మథెత్ థేరో' అను ముని మేరుపర్వతపు దిగువపంక్తులలో ఒకటియైన 'అన్నకనో' కొండమీద నివసించుచుండెను. ఆ ముని భక్తి ధ్యానధారణాది ప్రభావమున ఆకసమున కెగిరిపోయి యట సంచరించుచుండగా వజ్రవాలుకల (వజ్రపుటిసుకతిన్నెల)నుండి పైకి ప్రసరించుచుండిన దేదీప్యమానమైన కిరణజాల మాతని దృష్టిని ఆకర్షించినది. అప్పు డతడు క్రిందికి దిగివచ్చి రహస్యముగా దాగియున్న దంతకుమారుని, అతని సోదరిని బయటికి పిలువగా వారు వచ్చి తమ విషాదగాథను అతని కెరిగించిరి. అది విన్నంతనే యతడు నాగరాజు రాజ్యములోనికి బోవలయునను తలంపు కలిగెను. థేరుడు ఆ రాజ్యమును ప్రవేశించినంతనే నాగరాజు దిక్చక్రము దాటిపోయెను. కాని యందలి ప్రజలను నాగరాజును తీసికొనిరావలసినదని నిర్బంధించెను. థేరుడు నాగరాజు రాజ్యములోనికి వెళ్లుటకును, నాగరాజును తీసికొనిరావలసినదని అందలి ప్రజలను నిర్బంధించుటకును కారణ మిదియై యుండును. ఆ నాగరాజు రాజకుమారీకుమారులకు తెలియకుండ ఆ దంతధాతువును అపహరించియుండును. 'థేరు'డు నాగరాజు దంతము నిచ్చు

వరకు అతనిని విడిచిపెట్టలేదు. దానిని తీసికొని ఆ ముని వజ్రాల యిసుకతిన్నెలకడ కరిగి రాజకుమారునికి, రాజకుమార్తెకు దాని నిచ్చివేసి, అక్కడికి లంకకు వెళ్లు ఓడ మూడుదినములలో వచ్చు ననియు, దానిమీద వారు లంకకు వెళ్లవచ్చు ననియు, దారిలో ఏదయినను ఉపద్రవము సంభవించినచో తన్ను తలచుకొనవలసిన దనియు చెప్పి వెళ్లిపోయెను. ఆ ముని చెప్పినట్లే ఓడ వచ్చినది. ఒడ్డున జెండా యెత్తినవెంటనే ఓడదగ్గర నుంచి ఒకపడవ తీరమునకు వచ్చి రాజకుమారుని, రాజకుమార్తెను ఎక్కించుకొనిపోయెను.

కొద్ది దినములు మాత్రమే సముద్ర ప్రయాణము సాగిన తరువాత దంతమును తిరిగి అపహరింపదలచి నాగరాజు తన మాయాప్రభావమున భయంకరమైన తుపానును కలిగించెను. నౌకాధిపతి దేవతల నావాహన చేసినను తుపాను తగ్గలేదు; కార్యము లేకపోయినది. దేవతావాహన చేసినను తుఫాను తగ్గకపోవుటకు రాజకుమారియు, రాజకుమారుడును కారణమని తలచి నౌకాధిపతి వా రిరువురిని సముద్రములో బడద్రోయనుండగా వారు 'థేర'ని తలచుకొనిరి. అంతట ఆ ముని గరుడరూపమును దాల్చి నాగమాయను రూపు మాపెను. అంతటితో తుపాను పోయినది. నౌకాధిపతియు, అతని అనుచరులును ఆ మునిని పూజించిరి. 'థేర' డంతట వెళ్ళిపోయెను. తరువాత ఓడ సురక్షితముగా లంక చేరెను. ఇది సియాము గ్రంథమువలన తెలియవచ్చు 'దశనధాతు' విషయము.

'దాఠాధాతువంశ' ములోకంటె సియాము గ్రంథమున కొన్ని ఎక్కువ విషయము లున్నవి. మొత్తముమీద దంతపురమునుండి బయలుదేరిన దంతకుమార, హేమమాలలు దక్షిణదిశగా ప్రయాణము చేయుటయు, వా రెక్కిన ఓడ కొద్ది దినములు ప్రయాణము చేసినంతట వజ్రాల యిసుక తిన్నెల సమీపమున బ్రద్దలగుటయు, వారు అక్కడ ఒడ్డునకు చేరుటయు సంభవించినది. వజ్రపు టిసుక తిన్నె లనునవి కృష్ణానదీ తీరమున అమరావతీ సమీపమున నున్నవి. అమరావతి కెదురుగా కృష్ణజిల్లాలోని గనిఆతుకూరు వజ్రపు గనులకు ప్రాచీనకాలమునుండియు ప్రసిద్ధి.* ఈ కారణముననే హైదరాబాదు నిజాముల్ ముల్క్ ఉత్తర సర్కారులను తూర్పు ఇండియా వర్తక సంఘము (కుంఫిణి) వారికిచ్చినపుడు వజ్రములు దొరకునను ఆశచేత గనిఆతుకూరు ప్రాంతమును మినహాయించి దానిని ప్రత్యేకముగ తన క్రింద నుంచుకొనెను. కృష్ణ కుత్తరపు టొడ్డున నుండు గనిఆతుకూరు ప్రాంతమే కాక దానికి దక్షిణపు టొడ్డున అమరావతీ ప్రాంతముకూడ వజ్రముల కాకరమని చెప్పుదురు! ఈకారణముననే దానికి వజ్రాల యిసుక తిన్నెయని, వజ్రాల దిన్నెయని పేరు. గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకాలో కృష్ణయొడ్డున గల కొంత ప్రదేశమునకు నేటికిని 'వైరం దిన్నె' యని జన వ్యవహారము కలదు. సియాము గ్రంథమునందలి వజ్రవాలుకలు (Daimond sands) ఈ 'వైరం దిన్నె'యే. వైరమనునది వజ్రపదభవము. ఇప్పటికిని ఆ ప్రాంతమున ప్రభుత్వపురాతత్వ శాఖవారు అక్కడ త్రవ్వి పరిశోధించినచో బౌద్ధావశేషము లేవైన బయలుపడి బౌద్ధాంధ్రచరిత్ర మరికొంత తెలియునేమో.

దంతకుమార, హేమమాలలు కృష్ణానదీతీరమునకు రాగతమేమి యను సందేహము కలుగవచ్చును. ప్రాచీన

* కల్నల్ కాలిన్ మెకంజీ కుంఫిణీ పరిపాలనమున తొలుదొల్త గుంటూరుజిల్లాకు వచ్చినది వజ్రాలగనులున్న స్థలములను గుర్తించుటకే. అతడు ఈ వజ్రఖనిజ క్షేత్రము అమరావతి కుత్తరదిశగా ఎనిమిది మైళ్ళవరకు వ్యాపించియున్నట్లు మ్యాప్‌మీద సూచించినాడు.

బుద్ధుడు - మిశ్రలోహం. గుప్తయుగము'
4 వ శతాబ్దిది - థానేశ్వర్ ఖేరా



కాలములో కళింగమునకును సింహళమునకును సముద్రముమీదుగా రాకపోక లుండెను. అట్లే బౌద్ధభిక్షువులు సింహళమునుండి కృష్ణాతీరమునకును, కృష్ణాతీరమునుండి సింహళమునకును వచ్చుచు పోవుచు నుండి రనుటకు నాగార్జునుని కొండలో దొరికిన ఇక్ష్వాకుభూవరుల శాసనములే ప్రమాణము. దంతకుమార, హేమమాలలు దంతపురమునుండి సింహళమునకు బయలుదేరినది క్రీస్తుశకము మొదటి శతాబ్దములలో అని పరిశోధక పండితులు నిర్ధారించియున్నారు. ఆ కాలములో ఓడలు సముద్రమునుండి ఎగువ నాగార్జునునికొండ వరకు పోవుచుండినట్లు పురాతత్త్వశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అందువలన సింహళమునకు పోవు వర్తకపుటోడ వరకు ఎగుమతి దిగుమతుల నిమిత్తము కాని, బౌద్ధస్థలములకు వెళ్ళు ప్రయాణికులను అక్కడ దిగబెట్టుటకుకాని కృష్ణానదిలో ఎగువకు వచ్చినను వచ్చియుండవచ్చును; అక్కడ తుపానువలన బ్రద్దలైయుండవచ్చును; లేదా కృష్ణానదీ ముఖద్వారమున అది బ్రద్దలు కాగా వా రెట్టిటో వజ్రాలదిన్నెను చేరినను చేరియుండవచ్చును. ఎట్లయినను దంతకుమార, హేమమాలలు వజ్రాలదిన్నె చేరి రనుట యథార్థముగ తోచుచున్నది.

కథలో వజ్రవాలుకలకడకు నాగరాజు వచ్చినట్లు చెప్పబడినది. ఆ ప్రాంత మంతయు నాగదేశము. నాగార్జునాచార్యులవారు నాగలోకమునుండి 'ధారిణి' లను తెచ్చి సుధాన్యకటచైత్యముకడ పాదుకొల్పెనని చీనాదేశపు గ్రంథములు నుడువుచున్నవి. బుద్ధధర్మము నవలంబించిన మొదటివారిలో నాగు లొకరు. తెలుగుదేశములో నాగపూజ అధికము. తెలుగులో నాగవాసమన్న పదము నాగులను బట్టియే వచ్చినదేమో. తెలుగుదేశములో నాగప్రతిష్ఠ లెక్కువ. కృష్ణాతీరమున నివసించుచుండినవారిలో నాగజాతివారు ఒకరు కావచ్చును. ఇక్ష్వాకులనాటి నాగార్జునుని కొండ శాసనములుకూడ ఈ యూహను బలపరచుచున్నవి.

1



అమరావతి

దంతధాతువునుగురించిన సింహళదేశ గాథలో మొదట వారు ఓడనెక్కినట్లు లేకపోయినను దక్షిణదేశమునకు వచ్చినట్లును, అక్కడ నిండుగా ప్రవహించుచుండిన గొప్ప నదిని దాటినట్లును, ఆ నదీపులినతలమున దంతధాతువును పదిలపరచినట్లును ఉన్నది. ఆ గాథలోని మహానది కృష్ణయే. దంతకుమార, హేమమాలలు 'తాలమిత' రేవు పట్టణమున ఓడ నెక్కుట రెండవ తడవయని యూహింపవలసియున్నది. 'తాలమిత' యన్నది కృష్ణానదీతీరము నందలి తలగడదీవియో, ఇప్పుడు తెలియరాని మరియొక రేవుపట్టణమో భావిపరిశోధనవలన తేలవలెను. పైకి భిన్నముగా నుండినట్లు కన్పించుచున్నను మొత్తముమీద స్థూలదృష్టిని చూచినచో రెండు గాథలును స్వల్ప వ్యత్యాసముతో ఒకదాని కొకటి సరిపోవుచున్నవి.

వజ్రపు టిసుక తిన్నెలకడ ఓడ బ్రద్దలగుట మొదలైన విషయములు కొన్ని సింహళదేశపు దంతధాతుగాథలో లేకపోవుట, ఎక్కడో చాలదూరమున నున్న సియాముదేశ గ్రంథములో కానవచ్చుట విచిత్రముగ కనిపింపకపోదు. ఇంతమాత్రమున సియాము గ్రంథములోని దంతగాథా విషయము విశ్వాసపాత్రమైనది కాదని నిర్ణయింపగూడదు. సియాము గ్రంథమునకు మాతృక బలిద్వీప పాలీగ్రంథము. జావాద్వీపముదగ్గరదే బలిద్వీపము. క్రీస్తుశకము ప్రాథమిక శతాబ్దములలో కళింగమునకు జావాద్వీపమునకు రాకపోకలెక్కువగా జరుగుచుండినవి. కళింగమునుండి ఒకప్పుడు 20,000ల జనము జావాద్వీపమున కరిగినట్లు ఆ ద్వీపములో వాడుకలో నుండిన గాథలవలన తెలియుచున్నది. ఈ కాళింగులద్వారా కళింగదేశ దంతగాథ జావా, బలిద్వీపములకు పోయియుండవచ్చును; బలిద్వీపములో ఇది పాలీభాషలో గ్రంథస్థమయినది. జావా, బలిద్వీపములకును, సియాముదేశమునకును రాకపోకలు హెచ్చుగా నుండుటవలన ఈ బలిద్వీపపు పాలీగ్రంథము సియాముదేశమునకు వెళ్ళియుండును. అందువలన సియాము గ్రంథములో సింహళ దంతధాతువంశములో లేని విషయములుకూడ నుండుట తటస్థించినది.

అదియును గాక, తెలంగాణా నుండి దిగువ బర్మాకు వెళ్లి అక్కడ స్థిరపడిపోయిన తలైంగులు కొందరు క్రీస్తుశకము మొదటి శతాబ్దములలో సియాముదేశమున కరిగియచ్చట స్థిరపడినట్లు కొందరు చరిత్రకారులు చెప్ప

చున్నారు. మనుప్రజల యొక్క లేదా వారిలోని సంపన్నుల యొక్క ఆదిమ నివాస్థలము ప్రాయికముగా తెలంగానాలోని ఏదో కొంత భాగమై యుండవచ్చు ననియు, అక్కడినుండి వచ్చి వారు దిగువ బర్మాలో వలసలు స్థాపించి, పిదప క్రీస్తు శకము తొలిశతాబ్దములలో సియాములో స్థిరపడి పోయి రనియు డాక్టరు కాళిదాస్ నాగ్ పండితుడు చెప్పుచున్నాడు. తెలుగు దేశములోని విఖ్యాతకులములలో మనుకుల మొకటి యని ప్రాచీన శాసనములు తెలుపు చున్నవి. వీర బలంజ సమయము వారును (బలిజలు), రెడ్లును మను కులమునకు చెందినవారే—మనుకులజులే. బర్మా, సియా ములలోని మనుప్రజలు (Mons) శ్రీ కాళిదాస్ నాగ్ చెప్పినట్లు తెలుగుదేశమునుండి వెళ్లిన మనుకులజులే కావచ్చును. వీరిద్వారా కూడ ఈ దంతగాథ సియాము దేశమునకు వెళ్లియుండవచ్చును. వీరివల్ల కృష్ణానదీ తీర మున వజ్రాల దిన్నె దగ్గర ఓడ బ్రద్దలగుట మొదలగు విషయములు సియాము దేశీయులకు తెలిసినను తెలిసి యుండవచ్చును.

## సందర్భ గ్రంథములు :

కళింగ సంచిక.
Journal of the Asiatic Society of Bengal.
Epigraphia Indica.
Indian Antiquary.
'Datthadhātuvamsa' Ed. tr. by Bimala Charan Law
'Mahāvamsa' Tr. by George Turner.
Histories of Ceylon.
Jātaka Stories by Cowell.
Gleanings in Buddhism, or translations of passages from the Siamese 'Phra Pat hom" by Lieut-Col. J. Low.
Tree and Serpent Worship by Fergusson.
India and South-east Asia (Central Government publication).
A dictionary of Pali proper names.
A dictionary of the Pali language.
Asiatic Researches

వెస్సంతర జాతకం. దేశబహిష్కృతుడై, సతీసమేతముగ, వృషభశకటమునెక్కిపోవు వెస్సంతరుడు.



# సకల మతస్థులకు కలకాలంగా యాత్రాస్థలమైన జగ్గయ్యపేట

ఇప్పటికి సుమారు **180** సంవత్సరముల క్రిందట కమ్మ ప్రభువులైన శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారు, వందలకొలది శివకేశవాలయములను కట్టించి, అనేక మహాస్థలములలో తమపేరిట స్వర్ణధ్వజస్తంభములు ప్రతిష్ఠ చేయించి, మూడు పర్యాయములు స్వర్ణరజతములతో తులాభారము తూగి, హిరణ్యగర్భ మహాక్రతువుచేసి, ఆ ధనము యావత్తు ప్రజలకు పంచిపెట్టించినారు. అమరావతిలో అమరేశ్వరస్వామికి అనేక గొప్ప ప్రాకార మంటపాది స్థిరమైన నిర్మాణములు చేయించినారు. బంగారు కలశములు యెత్తించినారు. మంగళగిరి దేవస్థానములో కంచి పెద్ద గోపురముతో సమానమైనగోపురం కట్టించినారు. తమ తండ్రిగారి పేరిట జగ్గయ్యపేట, తల్లిగారి పేరిట అచ్చమ్మపేట అనే బస్తీలుచాలా ద్రవ్యం వ్యయంచేసి కట్టించినారు. స్వయంగా కాశీ, రామేశ్వరం, శ్రీశైలం మొదలైన దివ్యయాత్రలు చేసినారు. ఇంకా ఆయన చేసిన పుణ్యకార్యములను వివరించ సలవికాదు. వీరు **34** సంవత్సరములు ప్రభుత్వం చేసి **1816** సం. ఆగష్టునెలలో పరలోకగతులయినారు.

వేంకటాద్రినాయుడుగారు, జగ్గయ్యపేటను కట్టించిన విషయం ఒక కవీశ్వరుడు ఇలా పద్యం చెప్పినాడు.

సీ॥ తత దానధర్మాన్నపంబౌచు లక్ష్మిచే
ఘనతరంబైన జగ్గయ్యపేట
తన తండ్రిపేరట దనరార గట్టించి
తల్లిపేరట మహదానధర్మ
సదనమైనట్టి అచ్చమ్మపేటను
వేడ్కగట్టించి నిజనామకలితముగను
ఘనత రాజాపేటయను మన్నెసుల్తాను
పేటయు నాయనిపేట యనగ
పట్టణంబులు గట్టించి ప్రబలజేసె
నాలుగాశ్రమ ధర్మముల్ నడిపి యంత
స్వర్ణగోవుల నిర్మించి సద్ద్విజాళి
కవి యొసంగెను శ్రీ వేంకటాద్రివిభుడు.

వేంకటాద్రినాయుడుగారు జగ్గయ్యపేట పట్టణము కట్టించుటకుముందు, ఇక్కడ బేతవోలనే గ్రామం కలదని, దానినే తీర్చిదిద్ది, వేంకటాద్రినాయుడుగారు తమ తండ్రిగారిపేరిట జగ్గయ్యపేటగా పేరు మార్చినారని సర్కారువారి రికార్డులనుబట్టితెలియుచున్నది. పూర్వము ఈ చుట్టుపట్టుల దొంగల భయము యెక్కువగా నుండెడిదట! అందుచేత దీనిని దొంగల బేతవోలని పిలిచేవారు. **1932** వరకు, సర్కారువారి లెఖలలోకూడ జగ్గయ్యపేట అని వ్రాస్తూ, బ్రాకెట్లలో బేతవోలు అని వాడినట్లుకూడా కనబడుతున్నది---ఇప్పటికీ జగ్గయ్యపేట కాపురస్థులైన కొందరు షావుకారులవద్ద గల ప్రాత దస్తావేజులలో బేతవోలనే పేరు ఈ గ్రామానికి కనుపడుతున్నది.

ఈ పయివిషయములన్నీ గ్రంథస్థములయిన, నిజమైన విషయములేగాని, ఇవంతా యిటీవలి చరిత్రే!

ఈ పట్టణాన్నిగురించి ప్రాచీన చరిత్ర, ప్రాభవోపేతమైనది చాలా వున్నది. ఇప్పటి జగ్గయ్యపేట గ్రామానికి తూర్పునవుండే "ధనంబోడు" అనే ప్రాచీన శిథిలాన్ని, రోజూ చూచే ఈ దిబ్బయొక్క ప్రాచీన చరిత్ర, వైభవము, సరిగా తెలుసుకొన్నవాళ్ళు వేళ్ళలెఖమీదనే వుంటారంటే ఆశ్చర్యములేదు; ఈ కనపడే దిబ్బ యిప్పటికి **(2000)** రెండువేల ఏండ్లనాటి పూర్వచరిత్రను చెప్పగలిగిన ఒక మహాచైత్యమని చెబితే చాలామంది ఆశ్చర్యపడుతారు. జగ్గయ్యపేట నివాసులుగానున్న కొన్ని కుటుంబాల పేర్లు యేలా వచ్చినదీ యెరిగినవారుకూడా చాలా తక్కువమందే వుంటారు,

**1882** లో, బ్రిటిష్ప్రభుత్వపు కొలువునందు ఉద్యోగిగానున్న జానుబర్గిసు (**Jas Burgess**) దొర జగ్గయ్యపేట ధనంబోడనే దిబ్బమీదగల ప్రాచీన శిథిల బౌద్ధస్తూపమునుగూర్చి ఒక గ్రంథం వ్రాసినాడు. ఈ బర్గిసుదొర ఇండియాలో పురాతత్వశాస్త్ర పండితుడుగా వుండి అమరావతి, జగ్గయ్యపేటలందు గల బౌద్ధస్తూపాలలోని విశేషాలనుగూర్చి **1882, 1887** లో విషయవిస్తృతమైన గ్రంథాలను రచించి, మనకు మహోపకారమును చేసియున్నారు—రీ (**Rea**) అనే మరొక దొర ఘంటశాల, గుడివాడ, భట్టిప్రోలు స్తూపాలనుగూర్చి ఒక ఉద్గ్రంథమును రచించియున్నాడు—వీరి గ్రంథములవల్లనే అయా



బుద్ధుని జీవితవిషయముల దెలుపు శిల్ప దృశ్యములు —సారనాథ్.

స్థలములందలి స్తూపనిర్మాణ విశేషములను, అందు లభించిన అనర్ఘశిల్పకళాసంపదను, మనము యీనాడు సవిస్తరంగా తెలుసుకోగలుగుతున్నాము. ఆ గ్రంథము లిపుడు కావలెనన్నవారికి దొరకడము లేదు. ప్రభుత్వమువారు వీనిని తిరిగి ప్రచురించుట యెంతైనా అవసరము. బర్గెస్ యీ క్రిందివిధంగా వ్రాశారు :

అమరావతికి వాయువ్యంగా ముప్పై మైళ్ళ దూరంలోను, కృష్ణా, పాలేరు సంగమస్థానానికి ఉత్తరంగా నాలుగుమైళ్ల దూరంలోనూ బేతవోలు అనే నగరం వర్ధిల్లుతూ వుండేది. ఈ నగరాన్నే అనాటి పాలకులలో ఒకరు పునర్నిర్మించి జగ్గయ్యపేట అని నామకరణం చేశారు. జగ్గయ్యపేటకు తూర్పుగా ఒక మైలు దూరంలోపల అట్టే ఎత్తులేని కొండ ఒకటుంది. దీనినే ఆ నగరవాస్తవ్యులు ధనబోడు అని పిలుస్తూవుండేవారు. కొండకు వాయవ్యభాగంలో ఇటుకరాతి గుట్ట వుండేది. ఈ గుట్టను త్రవ్వి అందులోని ఇటుక లూడబెరకడం పట్టణ ప్రజలకు కొన్ని సంవత్సరాలుగా అలవాటు. ఇలాకావడంలో ఒక సారి శిల్పాలతోకూడుకొన్న ఫలకాలు కొన్ని వారికి దొరకడం తటస్థించింది. కొంచెం బుద్ధికుశలత గలిగిన స్థానిక ఉద్యోగి ఆ శిలాఫలకాలను స్వాధీనపరచుకొని ప్రభుత్వానికొక నివేదిక నంపాడు. ఆ సంవత్సరంలో ఫిబ్రవరి 1882 సం॥ నేను ఆప్రాంతాన్ని సందర్శించడం జరిగింది. పైచెప్పిన కొండమీద చిన్ని చిన్ని స్తూపాలు, యింకా ఇతర భవనాలు పెక్కు యిదివరలో వుండినట్లుగా నాకు అవగాహనైంది. ఇవి చాలా పురాతన కాలంనాటివిగా వుండి వుండాలి. అయితే యిటుకరాళ్ళకోసం చాలా సంవత్సరాలుగా ఈ శిథిలాలను త్రవ్వడం అవిచ్ఛిన్నంగా జరిగిపోయింది కాబట్టి, ఒకే ఒక స్తూపానికి సంబంధించిన చిహ్నాలు తప్ప మిగతా స్తూపాల ఛాయలేవీ స్పష్టంగా కనబడటంలేదు. ఇలా అస్పష్టంగా కనపడే శిథిలాలకు నైరుతిమూలగా గోపురం, వలయాకారంలో వుండే అడ్డగోడకూడా పోయిన స్తూపం ఒకటి కానవచ్చింది. దీంట్లో వుండే భరిణగూడా లేదు. అప్పటిపాలకులు ఈ స్తూపంలోను, ఇతర స్తూపాలలోను వుండే యిటుకలను యితర పనికివచ్చే సామగ్రి యావత్తూ భవన నిర్మాణానికుపయోగించుకొనే వారనడానికి యెట్టి సందేహమూ లేదు. స్తూపానికి తూర్పుముఖంగా వున్న అయిదు స్తంభాలలో ఒకదాని భాగం కొంతవరకు, కొండ దిగువన శతాబ్దం క్రిందట కట్టబడ్డ చిన్న భవనంలో కనబడింది. స్తూపశిథిలాలలో వున్న స్తంభాలమీద యే లిపి అయితే కన్పడుతోందో అదేమాదిరి లిపి దేవాలయంలో వున్న స్తంభశేషం మీదగూడా కన్పడుతోంది.

ఈ గుట్ట చుట్టూ త్రవ్వించి చుస్తే 31½అ.ల వ్యాసంతో వుంది. అమరావతిలో యే రకమైన రాళ్లువాడారో అట్లాంటి రాళ్లే స్తూప పై భాగంలో కప్పబడి వున్నాయి. ఈ రాళ్లన్నిటిని కృష్ణ ఒడ్డున కాల్చి నట్లుగా కన్పడుతోంది. అమరావతిలో వాడిన రాళ్లు గూడా ఈ ప్రదేశాన్నించే తెప్పించి వుంటారనడానికి సందేహంలేదు. స్తూపానికి చుట్టూ ప్రదక్షిణం చేయడానికి దారి విడువబడి వుంది. ఈ దారి వెడల్పు 10½ అడుగులు. ఈ దారికి 3½ అడుగుల ఎత్తులో స్తూపానికి అడుగుభాగాన వున్నరాళ్లు ఘట్టుకు చెక్కు చెదరకుండానే వున్నాయి. అయితే దీనిని కాపాడుతూ వుండే అడ్డగోడ పటుకు అంతర్ధానమైంది. కలికంలోకి గూడా ముక్కలేనట్లుగా ఒక రాయిగూడా కన్పడలేదు. స్తూపం యొక్క రూపురేఖలు అట్టే చెదరక పూర్వం అడ్డగోడను పడగొట్టి, వినియోగించుకొని వుండవచ్చు. ఆ అడ్డంకి తొలగడంతోడనే స్తూపంమీదకు దండయాత్ర జరిగింది. సాధారణంగా స్తూపపై భాగం అంతాకూడా రాళ్లతో పేర్చబడి వుంటుంది. అలాగే ఇక్కడ కూడా జరిగి వుండాలి. ముందు ఆ రాళ్ల నన్నింటిని లాగి వేసిన తర్వాత స్తూపం యొక్క గోపురం కూలిపోయి ప్రదక్షిణప్రదేశాన్ని, స్తూపం అడుగు భాగాన వున్న రాళ్లని బయటకు లాగడానికి వీలులేకుండా చేసివుంటుంది. అందువల్లనే ఇవైనా సురక్షితంగా వుండడం జరిగింది. స్తూపానికి బయట వైపున కట్టబడ్డ అడ్డగోడకు వుండే స్తంభాల పునాది మాత్రం ప్రదక్షిణ మార్గానికి అవలివైపున, అంచులకి సమీపంలో కన్పడింది.

..................................................................

**అజంతా గుహ వెలుపలి దృశ్యం**



స్తూపానికి ఆగ్నేయభాగంలో 170 అడుగుల పొడవు 120 అడుగుల వెడల్పు గల విస్తీర్ణంలో స్తంభాల యొక్క అడుగుభాగాలు కనుపించాయి. ఇవి భూమిపైకి లేవలేదు. స్తంభానికి స్తంభానికి మధ్యదూరం 11 అడుగులు. ఈ విస్తీర్ణానికి నైఋతిగా ఇరువైపుల అట్టేఎత్తు లేకుండా రాళ్లు పేర్చబడివున్నాయి. ఈ విస్తీర్ణం, స్తంభాలు చూపు కూడా స్తూపంమీదకు లేదు. స్తూపం యొక్క తూర్పు భాగాన్ని చూస్తున్నట్లుగా వుంటుంది. ఈ స్తంభాల మీద డాబాలాంటి ఆచ్ఛాదన వుండివుండేవని వీటిని చూడడం తోటే నాకుతోచింది. అలావున్నప్పుడు ఇదొక చావడిలాగ వినియోగపడ్తుంది. ఇలాంటి కట్టడాలు సిలోనులో చాలా కన్పడ్తాయి. ఇదొక మంటపంలాగా ఉపయోగపడేదనడానికి సందేహంలేదు. స్తూపం చూడడానికి వచ్చేవారికి ఆశ్రయంగా వుండేదన్న మాట!

ఇక స్తూపం యొక్క స్వభావం ఎలాంటిదో చూద్దాం. స్తూపానికి పై భాగం రాళ్లతో కప్పివుండేదని పైనవివరించాను. ఈ రాళ్లకి లోపలిభాగంలో రెండేసి అడుగుల మందాన మట్టిపొరలు కనిపిస్తాయి. ఒకపొరకు మరొకపొరకు మధ్యగా సందివ్వకుండా పెద్ద ఇటుకరాళ్లను తాపడంచేశారు. ఈ విధంగా చేయడంవల్ల నీరులోనకు ఇంకి స్తూపం యొక్క బయటి తాపడాన్ని పాడు చేయకుండా వుంటుంది. బుద్ధుని యొక్క అవశేషం స్తూపంలో ఎక్కడో లోతుగా పెట్టినట్లు లేదు. గోపురం యొక్క పునాదియందే కొంత భాగంలో మట్టిని తొల్చినట్లుగా వుంది. అవశేషం వుంచిన భరిణను వాచే రాతిని పగులగొట్టిన ముక్క పై భాగంలో దొరికింది. ఇది కాకుండా మొదటిపొరకు క్రిందగా వున్నపొరలోని రాళ్లు చెక్కు చెదరకుండా వున్నాయి.

స్తూపంయొక్క పునాదికి చుట్టూతావున్న రాళ్లు 3' 6" మొదలు 3' 9" ల వెడల్పులోవున్నాయి. వీటిమీద శిల్పాలేమీలేవు. కొన్నిచోట్ల నలుచదురపు స్తంభాలు గోడలో పొదిగినట్లుగా నిలబెట్టబడ్డాయి. ఈ స్తంభాల అడుగు భాగంలో చాలా పురాతన పద్ధతిలో చెక్కిన పునాదిమీద మొనలి చెక్కబడివుంది. ఈ మొనలిమీద స్త్రీ చిత్రువు గాని, పురుషచిత్తరువుగాని ఏదో ఒకటి నిలబడినట్లుగా వుంది. ఈ ఆకృతియొక్క శిరస్సు స్తంభం నెత్తిమీదవున్న రాతిని తగుల్తోంది. ఈ చిత్తరువులు బహుశః యక్షులవై వుంటాయి. భారహూత్ స్తంభాలమీదవున్న వాటిని పోలి వున్నాయి. స్తంభంయొక్క తల బరువుగావుంది. అమరావతి శిల్పసంపదలోని ప్రారంభశిల్పాలను, పిటాల్‌కోరా విహారంలోని శిల్పాలను పోలివుంటాయి. దానిమీద రెండు రెక్కలతోవున్న జంతువులు స్తంభశిరోపరిభాగానవున్న రాతిని తగుల్తూవున్నాయి. ఈ రాయి మూలకు చొచ్చుకొని వచ్చింది. చుట్టుతాగూడా ఈ రాయి దెబ్బతిన్నది.

ఈ నలుచదరపు స్తంభాలను భారాహూత్‌లోని శిల్పాలతోను, పశ్చిమ కనుమలలోని శిల్పాలతోను, అమరావతిలోని ప్రాచీనశిల్పాలతోనూ పోల్చడానికి వీలుగా ఈ స్తూపంలోని వాటిని చూపుతూన్న ఫొటోగ్రాపులను ఇందు పొందుపరిచాను. ఇక వీటిని గురించి విస్తరించి వర్ణించనక్కరలేదు.

ఈ స్తంభాల కట్టడానికి వినియోగించిన రాయిని కాలిస్తే మంచి రకం సున్నం తయారవుతుంది. జగ్గయ్యపేటలో ఈ స్తూపం తాలూకు ముక్కలేవిగూడా కానరాకుండా పోపడానికి కారణం వీటిని కాల్చి సున్నంక్రింద చలామణిచేసి యుండడంవల్ల కావచ్చు.

ఈ రాళ్లలో కొన్నిటిమీద కొన్ని అక్షరాలు కనపడ్డాయి. ఐతే ఒక పేరుగాని ఒక మాటనుగాని సూచించేటంత విపులంగాలేవు. లిపి పరికిస్తే మౌర్యశక లిపిటంకి గోచరిస్తుంది. అంటే క్రీస్తుకు పూర్వం 2 వ శతాబ్దానికి సంబంధించినట్లుగా వుంది.

తూర్పుద్వారాన్ని అలంకరించిన స్తంభాలమీద పెద్ద శాసనం గోచరించింది. దీనిలో వాడబడ్డ లిపి చాలా పాతదిగా కన్పడుతుంది. దీనిని గురించి ముందు వివరిస్తాను. ఇంకా ఇంతకంటె అధునాతనమైన లిపి స్తూపానికి పడమట భాగంలో కప్పబడ్డ రాయిమీద కనపడింది. ఈ రాతి మీదనే బుద్ధుని ఆకృతిగూడా చెక్కబడింది.

కార్లీలోని చైత్యశాలాంతర్భాగము



పునాదికి సంబంధించిన రాయిమీదవున్న ఆకృతులన్నీ పురాతన పద్ధతిలోవున్నాయి.

బాగా పగిలిపోయిన శిలమీద పుణ్యశాలయొక్క ఆకారం గీయబడింది. కొంచెం ఎత్తుగావున్న పునాది, దానిమీదకు వెళ్లడానికి చీడీలు, అవి ఎక్కడంతోటే నాలుగు స్తంభాల మీద నిలిబడిన ముందు భాగం కన్పడుతుంది. దీనికి లోపల అంతగా నాజూకుగాలేని వేదికమీద శ్రీపాదం కన్పడుతోంది. దీనిని ఆచ్ఛాదిస్తూ ఒకగొడుగు; దానినుంచి రెండు దండలు వ్రేళ్లాడుతూవుంటాయి. పై భాగంలోని కిటికీనుంచి అందానికి వ్రేళ్లాడదీసే వస్తువులో లేక పూలదండలో— కొన్ని వ్రేళ్లాడుతున్నాయి. నేలమీద కొన్ని గుండ్రటి వస్తువులు కన్పడుతున్నాయి. ఇవి పూజాపుష్పాలేమో తెలియదు. ముందుభాగంలో ఇరుపార్శ్వములయందు ఇద్దరు స్త్రీలు నిలబడ్డట్టుగా గోచరిస్తోంది. ఎడమభాగంలోవున్న స్త్రీయొక్క ముఖం చెడగొట్టబడింది. రెండవ వైపునవున్న స్త్రీ చిత్తరువు చేతిలో ఒక గిన్నెవుంది. బహుశః పూజ కొరకు పుష్పాలను నిక్షేపించినదేమో! దీనికి ప్రక్కగానే ఒక పురుషుని చిత్తరువుగూడా చెక్కబడివుంది. అయితే ఈ రెండు చిత్తరువుల ఆకారాలకు పొందికలేదు. కాని స్త్రీ చిత్తరువుయొక్క తలసింగారం యావత్తూ అజంతా గుహలలోని పదవగుహ చిత్రాలకు సరియైన నకలుగా కన్పడుతోంది. దీనినిబట్టి ఈ రెండు చిత్తరువులు ఒకజాతికి గాని ఒక కులానికి గాని చెందినట్లుగా భావించడానికి సందేహపడనక్కరలేదు. అంతేకాకుండా అజంతా చిత్తరువులన్నీ ఆంధ్రభక్తులు చివరి రోజులలోవేసిన చిత్తరువుల మీదనే ఆధారపడివున్నట్లుగూడా స్పష్టపడ్తుంది.



జగ్గయ్యపేట

అజంతా గుహలలో పదవ గుహయందు చిత్రించబడిన చైత్యం ఈ స్థూపం అంత పురాతనమైనదిగానే వుండాలి. ఏది ఎలా వున్నా రాతిమీద చెక్కబడ్డ చిత్తరువు తీరును బట్టికదా దాని కాలనిర్ణయంచేసేది. ఈ పదవ గుహలోని చిత్తరువులే అజంతాలోనివాటిల్లో పురాతనమైనవి. భారత దేశంలోనే పురాతనంగా చెప్పవచ్చు. వీటి కాలనిర్ణయం క్రీస్తుకు పూర్వమే, దానిపరం మట్టుకుకాదు. చిత్రకళ ప్రారంభదశను చూపడానికి మనకు దొరికిన వాట్లలో పదవ గుహలోని చిత్తరువులు, పిటాల్కోహరా విహారంలోని చిత్తరువులు, బాడ్యాలోని చిన్ని విహారంలోనివి, ఇప్పుడు జగ్గయ్యపేటలో దొరికిన ముక్కలు, అమరావతిలోనివి ముఖ్యమైనవి. వీటినిగురించి చెప్పేటప్పుడు బాఘహూత్ చిత్ర సంపదను మరచిపోవడానికి వీలులేదు. జగ్గయ్యపేటలో వాటికంటె కొట్టవచ్చినట్లుగా చిత్రములున్నప్పటికీ, రెంటికి సామ్యాలు చాలా వున్నాయి. ఈ సామ్యాల వల్లనే రెండురకాల సంపద ఒకేకాలం నాటిదిగా గుర్తించగలం.

పై చెప్పిన చిత్తరువులోని ఉపరిభాగం రెండవ అంతస్థుగా సూచించబడింది. వంపుతిరిగిన రెండు చైత్య కిటికీలున్నాయి. ఈ రెంటి మధ్య గళ్ళు గళ్ళుగా వున్న గది గన్పడుతోంది. ఈ గదిమీద ఒక చైత్య కిటికీ చెక్కబడివుంది. ఈ కిటికీయొక్క శిరస్సు అంతస్థు కప్పును మించివుంది. అంతస్తు కప్పుకు చక్కగా చెక్కిన నాలుగు చిన్ని గోపురాలు నిలబెట్టబడ్డాయి. వీటిని చూస్తుంటే మహాబలిపురంలోని రథాలు గుర్తుకువచ్చాయి. ఈ భవంతికి కుడివైపున ఒక మనిషి చదరమీద నిలబడ్డాడు. నడుము మీద బట్ట వ్రేళ్ళాడుతోంది. ఈ చైత్యాన్ని పూజిస్తున్నట్లు చిత్రీకరింపబడినది. భవనానికి ఎడమవైపుగా ఈతచెట్టు భవనం అంత ఎత్తున వుంది. ఇలాంటి భవనాల చిత్తరువులే పగిలిపోయిన రాతి ఫలకంమీద కన్పడ్డాయి.

మరొక రాయిమీద పొడుగాటి పురుషుడు మెత్తమీద నిలబడినట్టుగా వుంది. తలకో పాగా, మెళ్ళో వెడల్పయిన

హారం, చేతికి కంకణాలు, నడుముచుట్టూ చుట్టబడిన చలవ ధోవతి, నెత్తిమీద ఆచ్ఛాదనగా గొడుగూ, ఆయనకు ముందుగా ఒక చిన్న స్తంభముమీద చక్రం, ఆయనకు వెనుక వైపున మద్దెలనుపోలు వస్తువుయేదో వుంది. ఇదిగూడా ఒక చిన్న స్తంభాన్ని ఆధారంచేసికొని నిలబడింది. పైన గుత్తులు గుత్తులుగా వున్న వస్తువులు కన్పడుతున్నాయి. ఇవి నంచూల యొక్క అడుగు భాగపు చివర్లుగా పోల్చవచ్చు. వాటిల్లో అయిదు చోట్లనుంచి నలుచదరపు వస్తువిశేషాలేవో పడున్నాయి. బహుశః ఇవి నాణాలుగా చిత్రించారేమో! బారహూత్ శిలాసంపదలో జేతావనను అనంతిపిండికకొనే దృశ్యాన్ని మొరటుగా అనుకరించే ప్రయత్నమేమో యిది! పురుషునియొక్క కుడిభాగంలో స్త్రీ నిలబడివుంది. ఈమెగూడా మెత్తమీదనే వుంది. కాళ్ళకు పాంజేవులు కన్పడుతున్నాయి. ఈ ఆభరణాలు ఈకాలంలోగూడా వాడ్తున్నారు. చెవులకు చాలా పెద్ద లోలాకులున్నాయి. ఇక తలకు చుట్టిన తలపాగా చాలా తమాషాగా వుంది. అది ఇలాంటి పురాతన చిత్తరువులలోనే కన్పడుతోంది. ఈమెకు దిగువగా జీనుతోవున్న గుఱ్ఱం వుంది. అయితే గుఱ్ఱానికి ఈ స్త్రీకి పొందికలో ఏవిధమైన సామ్యం కన్పడదు. పురుషునిలో సగం వుంది స్త్రీ చిత్తరువు. పురుషునికి వెనకగా ఇద్దరు యువకులు వినమ్రులుగా వున్నట్టు చిత్రీకరించారు. నడుముకు జంధ్యంలాగా తుండుగుడ్డ, పెద్ద పెద్ద లోలాకులు, పెద్ద తలపాగాలున్నాయి. వీరిద్దరుగూడా మెత్తలమీద నిలబడ్డారు. బహుశః ఆరోజులలో అదొక ఆచారమేమో! వీరికి దిగువన వీరి ఎత్తులో సగం యెత్తుకు వున్న ఏనుగ అంబారీతో వుంది. తొండం పొడుగాటి మనిషి వైపుకు ఎత్తి వుంది. ఇదంతా దేనిని నిరూపించడానికి చిత్రించినది, మనకు తెలియదు. మంచి స్థితిపరుడు ఆయన భార్య, కొడుకులు ఆయన సంపదగా వున్న గుఱ్ఱము, ఏనుగ, ఆయన అధికార చిహ్నమూ, వీటిని చిత్రించి యుండవచ్చు.

మరొక రెండు రాతిముఖాలమీద దగోబా చిత్తరువు. ఆ చిత్తరువులోనే భరిణతో వున్నట్లుగా చిత్రీకరింపబడింది. అయితే పైనవుండే రాయి లేదు. అయిదు గొడుగులు దగాబామీద విస్తరించివున్నాయి. ప్రతిగొడుగునుంచి రెండు దండలు వ్రేళ్ళాడుతున్నాయి. కొమ్మలులాగా నిలబెట్టబడ్డ రెండు ప్రదేశాలనుంచి ఒకే దండ స్తూపంమీదకు వ్రేల్లాడుతున్నట్లుగా చిత్రీకరింపబడింది.

ఇంకొక పగిలిపోయిన రాతిమీద ఒక పురుషుడు, స్త్రీ స్తూపానికి పుష్పాలు సమర్పిస్తున్నట్లుగా వుంది ఒక వేదిక యొక్క అడుగుభాగం మరొక రాతిమీద చెక్కబడింది. ఒక దానిమీద సింహాసనంయొక్క ముందుభాగంగా కన్పడుతోంది మరొక చిత్తరువు.

స్తూపానికి నాలుగువైపుల్లా యైక్య స్తంభాలు అయిదు వుంటాయి. ఒక్కొక్క స్తంభానికిమధ్య రెండు రెండున్నర అడుగుల మధ్యగా దూరం వుంటుంది; స్తూపానికి స్తంభంకు మధ్యగా 12 మొదలు 15 అడుగులవరకూ దూరం వుంటుంది. ఈ దూరం దక్షిణంవైపున, ఉత్తరం వైపున స్పష్టంగా కన్పడుతుంది. ఉత్తరంవైపున చాలావరకు రాళ్లు పోయినప్పటికిగూడా దూరం 12 మొదలు 15 అడుగులలోపల వున్నట్లుగానే వుంది. తూర్పువైపున మిగిలిపోయిన రాళ్ళనుగూడా కదలించారు. ఏమైన తూర్పున కూడా అల్లాంటి ఏర్పాటే వుంటుందనడానికి సందేహం లేదు. ఇక గోడలమీద స్తంభాలమీద కన్పడిన చిత్తరువులను మినహాయించి ఈ యైక్యస్తంభాలమీదనే ఏమైనా చిత్తరువులు కంటపడింది.

మూడువైపుల పెద్ద స్తంభాలు క్రిందపడివున్నాయి. తూర్పువైపున పడినదానిమీద కొంత వ్రాయ బడివుంది. ఇది 12 అడుగుల వెడల్పుగా వుంది. పైభాగం విరిగి




జగ్గయ్యపేట




జగ్గయ్యపేట

పోయింది. మొదట్లో ఎంత పొడుగు పాటి స్తంభమో తెలియదు. క్రిందనుంచి 7½ అడుగులు చతురంగా వుండి అక్కడినుంచి ఎనిమిది ముఖాలతో వుంది. ప్రతిదిక్కు నుంచి ఆయక్య స్తంభాలు అయిదువున్నాయి. ఇప్పుడు చెప్తున్న స్తంభంలో ఎనిమిది ముఖాలలో ఒక ముఖంమీద క్రీస్తుశకం 3 లేక 4 శతాబ్దులతాలుకు—వీలయితే ఇంకా ముందుదేమోకూడా—లిపితో కొంత స్థలం వ్రాయబడి వుంది. దీనికి సరిగ్గా రెండు సకళ్లు క్రింద విరిగిపోయిన అలాంటి స్తంభాలమీదనే కన్పడ్డాయి. ఒకటి గ్రామీణుల చేతిలో పడి పగిలిపోయి స్థానిక ఉద్యోగికి చిక్కింది. రెండవది కొండకు దిగువభాగంలో శిథిలావస్థలోవున్న దేవళంలో కానవస్తుంది.

ఇక్ష్వాకువంశజుడైన పురుషదత్తుని పాలనలో ఇరువది యవ సం॥లో సిద్ధార్థుడనే శిల్పి తూర్పువైపునవున్న ఐక్య స్తంభాలను తన వంశముపేరిట సమర్పించినట్టూ—చెక్కబడింది. అయితే ఈ పురుషదత్తుడెవ్వరో మనకు తెలియదు. ఇంకా ఇతర పరిశోధనలవల్ల తేలవలసిన అంశమది. ఇక్ష్వాకువంశం సూర్యవంశపు రాజులకు మూలం. పురాణప్రసిద్ధమైనది. వాయుమత్స్యపురాణాల ప్రకారం 24 తరాలువరకు వ్యాపించింది. బౌద్ధులు, జైనులుకూడా ఇక్ష్వాకువంశజులైనవారిలోనుంచే తమ పూర్వీకులలో ప్రసిద్ధులు వచ్చినట్లు చెప్తారు. ఒకొక్కప్పుడు ఇక్ష్వాకులను కేవలం యుద్ధంనల్పే జాతిగానే పేర్కొంటారు. పురుషదత్తుడు ఈ ఇక్ష్వాకువంశానికి జెందాడని చెప్పుకోవడం అతిశయంగా చెప్పుకోవడమే! దిగువకృష్ణలో ఆంధ్రుల తర్వాత రాజ్యమేలిన స్థానికరాజై వుండాలి.

వీరిని బట్టిచూస్తే స్తూపం నిర్మించబడ్డ ఎంతోకాలానికి పై విషయాలు వ్రాసినట్లు కన్పడుతుంది. గోడలలో పొదిగిన నలుచదరపు స్తంభాలలో కన్పడే లిపి ఇంతకు చాలాకాలం ముందుదిగా కానవస్తోంది. నిజానికి మౌర్యుల కాలంలోని లిపిని పోలివుంది. ఏమైనా స్తూపం యొక్క ముఖం మటుకు క్రీస్తుకు పూర్వపు కాలంనాటిది.

ఇంత కంటే దర్శిలాశిల్పం ఒకటి ప్రదక్షిణ మార్గం వాయువ్య దిక్కుగా వున్నరాతి మీదకన్పడింది. నిలబడి యున్న బుద్ధుని ఆకృతి చెక్కబడి వుంది. దానిక్రింద వాక్యాలున్నాయి. కొన్ని పొడుగు; కొన్ని పొట్టిని. దాని లిపి క్రీస్తుశకం 600 సం॥ నాటిది.

ఈ రాయి కొలతలు 3′–11″, 2′–11″ బుద్ధుని ఆకృతి 2′–7″, 0–14″ లోతులో చెక్కబడింది. బుద్ధుని యొక్క పై వస్త్రం మామూలుగానే వదలివేయ బడింది. కుడిచేయి ఆశీర్వదిస్తున్నట్లుగా పైకెత్తబడి వుంది. ముఖం కురుచ. ఆకారం పొంకంగాలేదు. నెత్తిమీద ఆనువాయితగా వేస్తూ వుండే నాజూకుగాలేని పవిత్ర వృక్షము, క్రింద భాగంలో రెండువైపుల మేఘాలలో వుండి నెత్తిన శంఖాకృతిలో వున్న తలపాగలతో విద్యాధరులు, స్తూపం మొదట్లో అయిదు తలలతోవున్న ఆదిశేషుని చిత్రించిన చిత్రం, నెత్తిన శంఖాకృతి తలపాగాతో వున్న వినబడ్డ విగ్రహం— ఇవి అంచున వున్నాయి. బుద్ధుడు ఒక కమలం మీద నిలబడి వున్నట్లు చిత్రించాడు. సంస్కృతంలో దిగువున చెక్కబడ్డ లిపికి కమలం అడ్డుతగుల్తోంది. నాగార్జుని శిష్యుడైన జయప్రభాచార్య శిష్యుడు చంద్రప్రభ ఈ చిత్రాన్ని చిత్రించినట్లు సంస్కృత లిపిలో వ్రాయబడి వుంది.

మెకంజీ, ఇలియట్ వీరిపుర సేకరించిన శిల్ప సంపదనుగూర్చి ఫెర్గూసన్ ముఖ్యంగా ఈవరకే చర్చించారు. ఇప్పుడు చెప్పబోయేది దానికి అనుబంధంగా వుండేది మాత్రమే! ఫెర్గూసన్ వ్రాసిన ట్రీ అండ్ సర్పెంటు వర్షిప్, అనే పుస్తకం వెలువడిన తర్వాత సేకరించిన విషయాలు

ఆయన అభిప్రాయాలను బలపర్చినవేగాని ఖండించేవి మాత్రం కాదు. క్రీస్తుశకానికి పూర్వం అమరావతి స్తూపం దగ్గర భవనాలు వున్నాయనేది అక్కడ దొరికిన శిల్పసంపదలనుబట్టి శాసనాలనుబట్టి రుజువవుతోంది. ఇంకా వీటిని బట్టి ఒక శతాబ్దానికి ముందుదనిగూడా అర్థమవుతోంది. అవి ఒక స్తూపానికి చెందినవి అని ఆ స్తూపం ఈనాటి వరకూ నిలబడివున్నట్లు తేలుతోంది. పులమయి తదితరుల చేత చెక్కబడ్డ విషయాలు, స్తూపానికి చేయబడ్డ మరమ్మతులు, చుట్టూత కట్టిన అడ్డగోడ రెండవ శతాబ్దం వెళ్లక మునుపుగాని మూడవశతాబ్దం మొదట్లోగాని జరిగివుండా అన్నది పులమాయి తదితరులు చెక్కించిన వ్రాతలనుబట్టి ఋజువు అవుతోంది.

ఇంక లోగడగా కట్టిన అడ్డగోడ దరిమిలాకట్టిందిగాను, మూడవ శతాబ్దానికి పూర్వం కట్టబడిందిగానూ అడ్డుగోడ మీద వున్న శిల్పాన్ని బట్టి తెలుస్తుంది.

భారతీయ చిత్రకళను గూర్చి తర్వాత కనిపెట్టబడిన దంతా దానికి అనుగుణంగా వుంది. శిల్పాలయొక్క ఉత్కృష్టతను బట్టి రెండవ శతాబ్దానికి పూర్వం అంకురించి నట్లు కన్పడుతోంది. ఆ ప్రాంతంలో నాజూకుతనం చూపిస్తూ కొంతకాలం తర్వాత పూర్ణత్వం చెంద విశిష్టతను కోల్పోవడం తటస్థించింది.

జగ్గయ్యపేటస్తూపం ఈ చరిత్రను వెలికి తీసింది. అమరావతిలోనూ పశ్చిమ గుహలలోను పురాతనంగా యెంచబడే దానితో తుల్యమైన శిల్పసంపదను బైటపెట్టింది. అమరావతిలో ఈ కాలానికి సంబంధించినవిగా చెప్పకొనే రాళ్ళు పూర్వశిలసంప్రదాయానికి చెంది ఇక్కడ స్తూపం యొక్క ముందుభాగంలో నివిగూడా కావచ్చు.

కొద్దిగా దొరికినప్పటికి అమరావతి స్తూపం క్రీ. పూ. రెండవ శతాబ్దంలో నిర్మించినట్లు, పాలరాతితో అలంకరించినట్లు కొంతకాలమైనతర్వాత పెద్దదిగాచేసి క్రొత్తగా శిల్పాలను చెక్కునట్లు, స్తూపం ఉచ్ఛదశలోయుండగా క్రీ. శ, 200 కు పూర్వం స్తూపానికిచుట్టూ ప్రాకారపుగోడ కట్టినట్లు—ఇవన్నీ తెలుస్తూన్నాయి. ప్రదక్షిణమార్గంలో స్థాపితమైపోయిన రాళ్ళనిబట్టి ప్రాకారపుగోడలో పేర్కొన్న శిల్పాలను బట్టి ఈ స్తూపం యెంతగానో పెంపుదల చేయబడ్డట్టు ద్యోతకమౌతోంది. ఇంకా పరిశోధనలు తత్సంబధకులైన నిపుణుల పర్యవేక్షణక్రింద జరిగితే కొంగ్రొత్త విషయాలు కొన్ని బయల్పడవచ్చు.

జగ్గయ్యపేటస్తూపములో ఆయక స్తంభములమీద దొరకిన మౌర్యలిపిలోనున్న మూడుశాసన పాఠములు యించుమించు ఒకే విషయమును దెలుపుతూ, ఈ స్తూపమునకు ఆయక స్తంభములు కట్టించినదాతల వంశక్రమమును కొంతవరకు వెల్లడించుచుండుటచేతను, అప్పటి ఇక్ష్వాకు మహారాజైన వీరపురుషదత్తుని పేరు పేర్కొనబడియుండుట చేతను, ఈ శాసనము క్రీస్తుకు పూర్వము వెలసినదిగా తెలియుచున్నది: ప్రాకృతభాషలోనున్న శాసనమునకు బర్గిసుదొరగారు వ్రాయించిన సంస్కృతపాఠ మీ విధముగా నున్నది :—

"సిద్ధం—రాజ్ఞోమాఢరీ పుత్రస్యేక్ష్వాకునం వీరపురుషదత్తస్యసంవత్సరః ౨౦, వర్షపక్షః ౬ దివసః ౧౦, కమకరాష్ట్రగ్రామే నడసూరే, వాస్తవ్య ఆవేసనినోనాగ చంద్రాయ పుత్రో, గ్రామే మహాకడరూరే వాస్తవ్యఆవేశని సిద్ధార్థస్య ఆత్మనో, మాతరం నాగలినిం, పురతోకృత్వా, గృహణీంచ నముద్రనిం, బాలకంచమూలశ్రియం బాలికంచ నాగబుథనికం, భర్త్రికంచబుద్ధినకం. తస్యగృహినీం చక్రినికం బాలకోచనాగశ్రీ చంద్రశ్రియో బాలికంచ సిద్ధార్థనికం— ఏవం జ్ఞాతిమిత్రసంబంధివర్గేణ (ర్గః) తేస గ్రామే వేల్లగిరో భగవతోబుద్ధస్య మహాచైత్యే పూర్వద్వారే ఆయకస్తంభః పంచ (ః) సర్వేనియుక్తః ఆత్మనోథ్యేయ ధర్మసర్వసత్వానం హితసుతాయ ప్రతిష్ఠాపిత యితి."

ఇక్ష్వాకురాజైన, మాఢరీ పుత్రుడైన వీరపురుషదత్తుని యొక్క పాలనకాలమైన ఇరువదియవ సంవత్సరంలో,ఆరవ ఋతువైన వర్షాకాలమునందు పదియవ రోజున కమకరాష్ట్ర మండలి నడసూరు వాస్తవ్యులయిన నాగచంద్రుని పుత్రుడును, మహాకడరూరు వాస్తవ్యుడయిన సిద్ధార్థుడు, తన



జగ్గయ్యపేట



బుద్ధుడు. (బెరిక్లిక్, బెర్లిన్)

తల్లి నాగిలిని ముందుంచుకొని, తన భార్య సముద్రిని, కుమారుని మూలశ్రీని, కుమార్తె నాగబుధనికను, సోదరుడు బుద్ధినకుని, అతని భార్య చక్రనికను, పిల్లలైన నాగశ్రీ చంద్రశ్రీలను, బాలికయైన సిద్ధార్థనికను, ఈలా జ్ఞాతులు మిత్రులు కలసి వేల్లగిరి యను గ్రామమునందు బుద్ధభగవానుని మహాచైత్యమునకు, తూర్పు ద్వారమున, అయిదు ఆయక స్తంభములను నిలిపిరి. తమ హితము కొరకు సుఖముకొరకు ఇవి ప్రతిష్ఠింపఁబడెను. ఇందు "ఆవేశని" అని చెప్పిన పదమునకు శిల్పచాతుర్యమును నెరపు తాపీ మేస్త్రీలవంటి వారనియు, ఇట్టివారు స్తూప నిర్మాణములందు మరొకచో ప్రశంసింప బడిరనియు శ్రీ బర్గెసుదొరగారు వ్రాయుచున్నారు.

ఆయక స్తంభములు కట్టిన సిద్ధార్థుడు, ఆయన తండ్రి నాగచంద్రుడు ఆవేశనులనియు, ఆవేశన మనగా నొక శిల్ప విద్యాలయముగాని, శిల్పిగాని కావచ్చునని బర్గెసు దొరగారు అభిప్రాయ పడుచున్నారు. ఆయక స్తంభములనగా ఆర్యక స్తంభములు, పూజా స్తంభములు. భక్తులు వారి భక్తి ప్రపత్తులను దెలుపుకొనుచు చైత్యముల చుట్టు నిర్మించు శిల్పవిశిష్టమైన శిలాస్తంభములు.

సాంచీస్తూప ద్వారమున గూడ శాతకర్ణి మహారాజు పాలనమున ఇట్టి ఆయక స్తంభదానమే వర్ణింపఁబడి యున్నది.

"రాజ్ఞః శ్రీ శాతకర్ణే ఆవేశనినో
వాశిష్ఠీ పుత్రస్య అనందస్య దానమ్"

శాతకర్ణియొక్క శిల్పి (తాపీ మేస్త్రవంటివాడు) యైన వాశిష్ఠీ పుత్రుడైన అనందుని దానము. సాంచీస్తూప శాసనములోని 'ఆవేశని' యను పదమువలన జగ్గయ్యపేట స్తూపములోని ఆవేశని యను పదముకూడా, ఇదే యర్థమున కలదని శ్రీ బర్గెసు దొరగారు తెలుపుచున్నారు.

కమక రాష్ట్రమందలి నడనూరు, మహాకడయూరు, వాస్తవ్యులైన నాగచంద్రుడు, సిద్ధార్థుడు, తమ బంధు మిత్రులతో, వేల్లగిరి యను గ్రామమునగల బుద్ధభగవానుని మహాచైత్యమునకు, అయిదు ఆయక స్తంభములు కట్టించుట ఈ శాసనమునందలి విషయము—బుద్ధభగవానుని యనంతరము ఆ మహనీయుని అవశేషములతో నిర్మింపబడిన మహాచైత్యమునకు భక్తులైన నాగచంద్రాదులు ఈ స్తంభములను నిర్మించిరట—ఈ మహాచైత్యము 'వేల్లగిరి' యందు కలదట! ఈ 'వేల్లగిరి' యెక్కడిది? యను విషయము మనకిప్పుడు విచారించి తెల్పవలసినదై యున్నది.

"వేల్లగిరియందు గల ఈ స్తూపమునకు," అనుటచేత స్తూప నిర్మాణము గల స్థలము 'వేల్లగిరి' యనుట నిశ్చయమేగదా! ఇప్పుడీ స్తూపము గల స్థలమునకు పూర్వము వేల్లగిరి యను పేరుండినట్లు నిశ్చయమగుచున్నది. వేదగిరి - వేల్లగిరి - ఏలాద్రి, వేదాద్రి—ఇవన్నీ శబ్దసాదృశ్యము గలవే; ఇప్పటి జగ్గయ్యపేటకు ఏడుమైళ్ళ దూరమునసనే వేదాద్రి యను నరసింహస్వామి వెలసిన వైష్ణవ క్షేత్రము గలదు. అది కృష్ణకు అనుకొని ఒడ్డుననే కలదు. ఈ దేవాలయము కాకతీయులనాటి నిర్మాణముగా శాసనములను బట్టియు తెలియుచున్నది. ఈ చుట్టుపట్టుల ప్రాచీన శిథిలా విశేషములు యెక్కువగా గలవు. నందిగామ తాలూకా జగ్గయ్యపేటకు చేరువను, స్తూపనిర్మాణమునకు 2 మైళ్ళ దూరములోను 'ధర్మవరప్పాడు' అనే ప్రాచీన శిథిలములు గల పాటిదిబ్బలుగల స్థలమును గలదు. అదియొక ప్రాచీనమైన, బేచిరాకైన పట్టణముగా తెలియుచున్నది. అందనేక శిలాశిల్పములు భూగర్భమున దాగియున్నవి. పూర్వము వేల్లగిరిగా నున్న ఈ స్తూపనిర్మాణమునకు చేరువనే వైష్ణవము యేర్పడిన తర్వాత వేదగిరిగా శ్రీ నృశింహస్వామి ప్రతిష్ఠ జరిగియుండుట భావ్యమనియు పలువురు తలచుచున్నారు. ఇప్పటికిని వేదాద్రిని చాలామంది 'ఏలాద్రి' యనియు, 'ఏలగిరి' యనియు, 'వేదాద్రి' యనియు,

వాడుచుందురు. ఏది ఎట్లున్నను జగ్గయ్యపేట స్తూప నిర్మాణము గల ప్రదేశమునకు ప్రాచీనకాలమున అనగా యిప్పటికి 2000 సంవత్సరముల నాడు 'వేల్లగిరి' యని నామ ముండినట్లు ఈ పై శాసనాధారమున మనము నిర్ణయింపదగియున్నది.

ఇక కర్మకరాష్ట్రము—శిల్పవిద్యను నేర్చుకొని రాతి మీద బొమ్మలను చెక్కగల కర్మకారులరాష్ట్రముగాని కావచ్చును. అనాటి అట్టి కర్మరాష్ట్రీయులందరు బౌద్ధస్తూప నిర్మాణములందు శిల్పకళాకౌశలమును నెరపుచుండి రస వచ్చును. కమ్మవారే ఇట్టివారై యుందురని కొంద రభిప్రాయము వెల్లడించియుండిరి.

జగ్గయ్యపేట స్తూపపు పడమరదిశను ప్రదక్షిణమార్గమున, పద్మముమీద నిలుచునియున్న బుద్ధవిగ్రహము చెక్కబడిన శిలయొకటి కలదు—అయిదు పంక్తులు గల యీ శాసనము క్రీ. శ. ఆరవశతాబ్ది నాటిదిగా తలంపబడు చున్నది.

ఈ శాసన శిల యిపుడు మదరాసు మ్యూజియములో నున్నది.

ఆ శాసన పాఠమిది :—

1. స్వస్తిభదంత నాగార్జునాచార్యస్య.
2. శిష్యః జయప్రభాచార్యః తచ్ఛిష్యేన చంద్ర
3. ప్రభేన కరప....నతు-సుగత-గత ప్రసాద-విశేష-విశిష్ట సంసారే-దేవమనుజ.
4. విభూతి-పూర్వకం-బుద్ధత్వప్రాప్తి-నిమిత్తం-బుద్ధ ప్రతిమాం ప్రతిష్ఠాపితం అనుమోద(సం).
5. కుర్వంతునర్వే సౌగత్యాగ్రాయ (?) నేపి.

ఇందు నాగార్జునుడు, అతని శిష్యుడు జయప్రభాచార్యుడు, అయన శిష్యుడు చంద్రప్రభాచార్యుడు, పేర్కొనబడియున్నారు.

క్రీస్తుతర్వాత 6వ శతాబ్దినాటికి నాగార్జునాచార్యుడు గాని, అయన శిష్యప్రశిష్యులైన జయప్రభ, చంద్రప్రభాచార్యులుగాని ఈ స్తూపమును దర్శించియుందురు. అనాడు వారీ శాసనమునక్కడ చెక్కించియుందురు. ఎవరీ స్తూపమును దర్శించి శాసనము చెక్కినను, నాగార్జునాచార్యుడు ఈ చుట్టుపట్టులవాడనియు, ఈయన శిష్యులు ఇద్దరు గలరనియు స్పష్టమేకదా!

అమరావతి, నాగార్జునకొండ, ముక్త్యాల, జగ్గయ్యపేట ; ఇవి కృష్ణా మహానది తటమున అద్దరినీ, ఇద్దరినీ ఉండే బౌద్ధక్షేత్రాలు. భట్టిప్రోలు, ఘంటసాల, జగ్గయ్యపేట ఇప్పుడు కృష్ణానదికి యించుమించు 10 మైళ్ళ దూరం లోపుగా నుండేటటువంటి బౌద్ధక్షేత్రాలయినా, ఒకప్పుడు ఈ క్షేత్రాలు నదిఒడ్డుననో, సముద్రపుటొడ్డుననో వున్నట్లు



అజంతా గుహాంతర భాగము

నిదర్శనములు కలవు. సామాన్యంగా బౌద్ధస్తూపాలన్నీ తృణకాష్ఠజల సమృద్ధిగల చోట్లనే యేర్పరచినట్లు కనుపడుతున్నది. సామాన్యంగా నదీతీరాలనే యివి యిప్పుడు మనకు లభిస్తున్నవి.

కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో మాత్రం చాలా ప్రాచీన ప్రాభవాన్ని తెలిపే గ్రామాలు చాలా కనుపడు తున్నవి. ఇవన్నీ ప్రాచీన బౌద్ధక్షేత్రాలుగా తలంపబడు తున్నవి. కొండలమీదనో, తిప్పలమీదనో, సేద్యం లేని బంజరుభూములలోనో చాలా విగ్రహాలు, పెద్ద పెద్ద యిటుక రాళ్ళు, కుండపెంకులు, గుర్రపు యెముకలు విరివిగా కనుపడుతూవుంటాయి. అది తెలియనికాలపు చరిత్రచిహ్నములుగా కనుపడే సమాధులు గల ప్రదేశాలు చాలా వున్నవి. ఈ సమాధులలో అజ్ఞాతయుగపు వస్తువులు చాలా దొరకగలవు. అందు కొన్ని కుండలు, కుండలమీద పూజలు, పేర్లు కలవికూడా దొరకినవి. లోహపు బిళ్ళలు, పనిముట్లు, దీపహారతులు, ఆటవస్తువులు మరికొన్ని దొరకినవి. ఎముకలు రకరకములవి సరేసరి; ఇవన్నీ చరిత్రకారులకు చేతినిండా పనిని కల్పించగలవు.

కొన్ని గ్రామాలు, అందలి విశేషాలు వివరింతును.

## బూదవాడ

ఈ గ్రామంపేరే యిది వొక బౌద్ధక్షేత్రమైవుంటుందని తెలుపుతోంది. బోధివాడ—బూదవాడ—బుద్ధవాడ శబ్ద



బుద్ధదేవుని భిక్షాపాత్రకు పూజా సన్మానము-

మహాపరినిర్వాణానంతరము, ధాత్వవశేష విభజనమున, ద్రోణునివంతుకు బుద్ధదేవుని భిక్షాపాత్ర లభించింది. అప్పటి సంరంభాన్ని దెలిపే చిత్రము :

అమరావతీ స్తూప శిల్పభాగము.

సాదృశ్యము కల పేళ్లు. ఇందుకు తగినట్టుగా యిక్కడ ప్రాచీన శిథిలావశేషాలు కలవు.

## పెనుగంచిప్రోలు

ఇక్కడ బౌద్ధశిథిలాలు చాలా వున్నవి. బుద్ధవిగ్రహాలు, జైనవిగ్రహాలు ఇదివరలో చాలా దొరకినవి. ఒక షావుకారు, ఈ గ్రామంలో భూమిలో దొరికిన శిలాశిల్పఖండాలను కొనిపోయి, ఇతర దేశస్థులకు విక్రయించినట్లు తెలుస్తుంది. ఇప్పటికీ పొలం దున్నుతున్నప్పుడు నాగలికి తగిలి చాలా బొమ్మలు దొరుకుతూవుంటవి. ఈ గ్రామంలో దొరికిన ఒక బుద్ధవిగ్రహాన్ని గ్రామస్థులు బజారులో ప్రతిష్ఠించి గౌరవిస్తున్నారు.

## మలకాపురం

మునేరుకు సమీపాన సందిగామకు 16 మైళ్ళ దూరాన, జగ్గయ్యపేటకు 8 మైళ్ళ దూరాన ఈ గ్రామమున్నది. ప్రాచీన శిథిలావశేషాలు వున్నవి—రాళ్లు, గుళ్లు, శిల్పాలు చాలా దొరుకుతవి. 'జయనులపాడు' అనే బేచిరాకు గ్రామము ఈ ఊరిసమీపాన గలదు. ఇక్కడ జైనవిగ్రహాలు చాలా దొరుకుతవి. జయనబస్తీగా ప్రసిద్ధిపొందినట్టి స్థలము. కాకతీయుల పాలనములో శైవము బలసిన తరువాత, ఇక్కడ శివాలయములు, శివవిగ్రహములు, గణేశ్వరులు వెలసినట్లు కనుపడుతున్నది.

## పోలంపల్లి

పాతకుండలు, పెంకులు, పాటి దిబ్బలు గలవు. ఈ మధ్యను కొన్ని నాగములు చెక్కినరాళ్లు దొరికినవి.

## రామిరెడ్డిపల్లి

నందిగామకు 7 మైళ్ల దూరాన గలదు. ఇక్కడ ప్రాచీన బౌద్ధచైత్యాన్ని 1926-27 లో ప్రభుత్వము వారుత్రవ్వించినారు. బౌద్ధశిల్పాలు అనేకం దొరికినవి—1877 లో యిక్కడ స్తూపమున్నదని గవర్నమెంటువారు గుర్తించి దీనిని జాగ్రత్తగా కాపాడుచుండిరి. ఇంకా త్రవ్వి, బయల్పరుప వలసిన శిథిలావశేషాలు చాలా కలవు. ఇది ఒక మహాచైత్యంగా తలంప బడుచున్నది. బయల్పడ వలసిన శిలాఖండాలు యిందు చాలా వున్నవి.

## రావిరాల

ప్రాచీనగ్రామం, ప్రాచీన దేవాలయం కలదు. దేవాలయంలో శిల్పచాతుర్యం తెలిపేరాళ్లు కలవు. కృష్ణకు ఉత్తరపువైపున వేదాద్రికి చేరువనే యీ గ్రామంకలదు. ఇక్కడ పాలేరు కృష్ణలో కలుస్తుంది.

## గని ఆతుకూరు

"మచిలీపట్టణదేశమును నిజాంవారు ఇంగ్లీషు వారికి యిచ్చే కాలంలో వజ్రముల గనులు ఉన్నవని, సందిగామ పరగణాలో చేరిన గని ఆత్కూరు, కొడవటిగల్లు, మోగులూరు, ఉస్తేపల్లి, బత్తెనపాడు ఈ అయిదు గ్రామాలు ఖానాత్ తాలూకాలో చేర్చి వారి క్రిందనే వుంచుకొన్నారు" అని వాసిరెడ్డి వారి వంశచరిత్రలో గలదు. ఇప్పటికి యిక్కడికి చేరువనేవున్న పరిటాల గ్రామంలో వజ్రములు దొరకుతవని ప్రతీతి — వర్షకాలంలో బాగావర్షం కురిసినప్పుడు ఏవోకొన్ని రాళ్లు దొరకటం కద్దు. గని ఆత్కూరును గూర్చిన బౌద్ధగాథలు కూడా కొన్ని తెలియవస్తున్నవి. వజ్రపు గనులు గల గ్రామముగనుకనే గని ఆతుకూరు



**బుద్ధుడు—మిశ్రలోహం, గాంధార. 3-4 వ శతాబ్దిది.**

అయిన దందురు. బుద్ధుని దంతమును గూర్చిన ఒక గాథ ఈ గ్రామమునకు సంబంధించినదియు కలదు.

## ముక్త్యాల

జగ్గయ్యపేటకు అయిదు మైళ్ల దూరాన కృష్ణదరిని యీ గ్రామం, ముక్తీశ్వరపుర మనేపేరుతో నున్నది. సాగి పోతరాజు కాలంలో యిక్కడ ముక్తీశ్వర స్వామిని ప్రతిష్ఠ చేసి, దేవాలయం కట్టించినట్లు శాసనాధారాలు కలవు. ఇంతకు చాలా ప్రాచీన కాలంలోనే అనగా క్రీస్తుపూర్వమే, ఈ గ్రామ పరిసరాలు చాలా చరిత్ర ప్రసిద్ధి గలవన్న సంగతి యిటీవలనే తెలియుచున్నది. 'భోగాలపాడు' అనే బేచిరాకు గ్రామం, ఈ విశేషాలను వెల్లడిస్తున్నది—ఈ విశేషాలను గురించి వేరొకచోట ప్రకటింప బడ్డ వ్యాసంవల్ల విషయాలు సుబోధకం కాగలవు.

ఈ గ్రామం చుట్టుపట్టుల అన్నీ వంపల కొలది శిథిలావశేషాలు కలవు.

నందిగామ తాలూకాలో నివాసులుగా నున్న అయ్యదేవరవారు, బుద్ధిరాజువారు, బుద్ధువారు, జయనువారు, బుద్ధాంవారు, అందరు చాలా ప్రాచీన కుటుంబాలకు చెందిన వారని ప్రతీతి.

ఆర్య దేవుని సంతతి వారే అయ్యదేవర వారయి యుందురని కొందరి తలంపు. జయనువారు జైనసాంప్రదాయులని, వారి ఆచారాల్లో యిప్పటికి జైనసాంప్రదాయా లున్నవని నిశ్చయంగా చెప్పవచ్చును. బుద్ధువారు, బుద్ధిరాజువారు, బౌద్ధసాంప్రదాయ పరంపరలోని వారేనని తలంప బడుచున్నారు.

## గుడిమెట్ట

నందిగామకు 8 మైళ్ల దూరంలో రామన్నపేట అనే గ్రామంలో నున్నది. గుడిమెట్ట శిథిలావశేషాలు ఇక్కడే ఉన్నవి. **1328 A.D.** నాటి శిథిలాలు చాల కలవు. కాకతీయ ప్రభువులు, రెడ్డిరాజులు, సాగిపోతరాజు నిర్మించిన గుళ్లు, గోపురాలు, కోటలు, పేటలు శిథిలావస్థలో యిక్కడ కనుపడుతవి. **1268 A.D.** లో రుద్రమదేవి రాజ్యము చేస్తున్నప్పటి శాసనాలు కనుపడుతున్నవి.

Fig. 1.



దీపస్తంభం—ఘంటసాల

# బౌద్ధశిల్పంలో వ్యక్తమైన వైద్య విషయాలు

డాక్టర్ డి. వి. సుబ్బారెడ్డి

''అనాదికాలంనుంచీ కూడా మానవుడు అభ్యసించిన క్రియా కలాపాలు రెండున్నాయి. వైద్యము—చిత్రకళ. తనను, తన తోటిమానవులను బాధించే వ్యాధులను నివారణచేసుకోవాలన్న కోరిక అన్నిటికన్న ప్రథమంగా కల్గి వైద్యశాస్త్ర అన్వేషణ చేసింది. రెండవది, తనచుట్టూ చూస్తున్న వాటన్నిటినీ చిత్రరూపంలోనో, శిల్పరూపంలోనో స్థిరీకరించాలన్న కాంక్ష చిత్రకళారూపం చేకూర్చుకొంది.''

క్లార్క్, కార్లే.డి.

''మానవుడు రచించిన మొట్టమొదటి చిత్రాలు, శిల్పాలు, దొరకినవి చూసుకొంటే, రాతియుగంనాటి, గుహలలో నివసించిన మానవుడు చెక్కిన శారీరకశాస్త్ర విషయికమైన చిత్రాలు. ఇంతవరకు దొరికినవాటిల్లోకల్లా అతి ప్రాచీనమైన శిల్పం, క్రీ. పూ. **2,000** సం॥ల నాడు చెక్కిన, రాతి యుగం ప్రథమార్ధ కాలంనాటి ఒక స్త్రీ విగ్రహం. ఇది సున్నపురాతితో చెక్కబడి వుంది.''

గారిసన్ పుట **4.**

ఇండియా, చైనా, ఈజిప్టు, అసీరియా, గ్రీసు, రోములు ప్రాచీన నాగరికతలకు ఆటపట్టులు. ఈజిప్టు, అసీరియాలలో భూగర్భ పరిశోధనలలో దొరికిన, చెక్కడాలు స్తంభాలు, శిథిలాలు, శాసనాలు, వీట్ల పరిశోధనలలో ప్రాచీన చిత్రకారులు వైద్యశాస్త్ర విషయాలు చిత్రించిన అపూర్వ వస్తు విగ్రహాలు కొన్ని లభించాయి.

**1. మాంధాత జాతకం. మాంధాత స్వర్గంనుంచి పడిపోయాక రాజోద్యానంలో మృత్యుశయ్యపై నున్న చిత్రం. నాగార్జున కొండ**





2. ఛద్దంతజాతకం. గోలి

## ఈజిప్టు

"పితా" మెంఫిస్ దేవాలయంలోని పురోహితుడు. ఇతడు గొప్ప శిల్పాచార్యుడు. ప్రజల ఆరోగ్య రక్షణ బాధ్యతఅంతా అనాడు ఇతనిమీదా ఇతని సమకాలికుడయిన "ఇంహొతెపు"ని మీదా నిలిచివుండేది. తర్వాత ఇతని పేరిట దేవాలయాలు కూడా వెలిశాయి. "కర్నక్" అనే చోట "పితా" విగ్రహము, అతని దేవాలయముల ఛాయా చిత్రాలు, మేజర్ తన గ్రంథంలో ప్రచురించాడు. (పు. 37-38) "పురాతన చిత్రాలలో ప్రప్రథమంగా కనబడే భిషగ్వరుని విగ్రహము "ఇంహొతెపు" నిదని, అస్లర్ అన్నాడు. ఈతను జోసరీ రాజాస్థానంలో మహామంత్రి ఉద్యోగంలో వుండేవాడు. శిల్పి, పురోహితుడు, జ్యోతిష్కుడు, మంత్రవేత్త, భిషగ్వరుడు, మహాఋషి. గ్రీకో రోమన్ శకంలో ఇతన్ని దైవంగా కొలవసాగారు. ఇతని విగ్రహం కైరో మ్యూజియంలో వున్నది. దీన్ని అస్లర్ కాస్టిగ్లిని, మేజరు, తమ గ్రంథాలలో ప్రచురించారు.

ఈజిప్టులో దొరికిన ప్రాచీన కుడ్య శిల్పాలలో, చిత్రాలలో, వైద్య విషయాలు చిత్రించిన వస్తువు లెన్నో దొరికాయి. నడ్‌హాఫ్, అక్కడి శిథిలాలలో దొరికిన పింగాణీ వస్తువులను క్రోడీకరించి సంపుటంగా ప్రచురించాడు. అందులో తక్కిన వాటితోపాటు ఈ క్రిందివికూడా ఉన్నాయి.

(1) వైద్యుల విగ్రహాలు. (2) జబ్బులను రాకుండా చేసే తాయత్తులు. (3) పురిటి కుర్చీలో నెప్పులు పడుతూన్న నెలలునిండిన మహారాణి, ఆమెదగ్గిర మంత్రసాని (4) 'సున్నత్' కర్మ వివరించే చిత్రము—మేజర్ తన గ్రంథంలో (44 పుట) కైరో మ్యూజియమ్‌లోని ఒక మరుగుజ్జువాని ఎకోండ్రో ప్లాస్టిక్ విగ్రహచిత్రాన్ని ప్రచురించాడు. క్రి. పూ. 2400 నాటి ఒక గుహ లోతట్టు గోడమీద చిత్రించిన "సున్నత్‌కర్మ" చిత్రాన్ని కూడా ప్రచురించాడు.

క్రి. పూ. 2000 నాటి రోమ్ సమాధిలో, కుడికాలు ఈచుకు పోయిఉన్న ఒక బాలరాజు చిత్రం, శిశువులలో వచ్చే పక్షవాతాన్ని తెలిపేది, చిత్రించబడి వుంది.

అన్నా. యల్. హూన్‌గోషెన్ అన్న ఈ క్రింది వాక్యాలను క్లార్క్ తన గ్రంథంలో (4.పు) ఇల్లా ఉటంకించాడు.

"ఈజిప్టు, 5-వ సామ్రాజ్య కాలంనాటి, నక్కారాగోరీలలో, శస్త్రచికిత్సా ప్రయోగం చూపిస్తున్న ఒక రిలీఫ్ చిత్రం వుంది. (గోడపైగాని రాతిపలకపైగాని ఉబ్బెత్తుగా చిత్రింపబడ్డ కుడ్య చిత్రాలను రిలీఫ్ చిత్రాలంటారు.) ఈ చిత్రంలో, వైద్యుడు ఒక స్త్రీకి శస్త్రచికిత్స చేస్తూ వుంటాడు. పక్కనే అతని అనుచరి, రోగి చేతిని కదలకుండా గట్టిగా పట్టుకొని వుంటుంది. మరొక చిత్రంలో, శస్త్రచికిత్స జరుగుతూన్న బిడ్డను, చేతులు గట్టిగా పట్టుకొని కదలకుండా అట్టిపెడుతూంటుంది ఒక స్త్రీ. ఆ గదిలోనే మరెన్నో శస్త్రచికిత్సలుజరుగుతూన్నట్లు నిదర్శనాలున్నాయి. బహుశః ఈ శస్త్రచికిత్సలన్నీ దేవాలయంలోనే, వైద్యుని కని ప్రత్యేకించబడ్డ ఒక గదిలో జరుగుతూ వుండివుండేవేమో—నేటి శస్త్రచికిత్సాలయాలకు పునాది ఈ రూపంలో వుండివుండవచ్చును.

సెచెక్కాలో సమాధి లోతట్టు సున్నపురాతిపలకపై, ఒక చికిత్సామందిర చిత్రం చిత్రింపబడి వుంది. అందులో ఒకస్త్రీ, బిడ్డను కౌగలించుకొని మంచంపై పడుకొని వుంది. (ఇదే క్లార్కు ఉటంకించాడు. పు. 4)

క్రి.పూ. 2300 నాటి, ఐరే సమాధి లోతట్టు చిత్రంలో, (ఇది చియోప్స్ పిరమిడ్ పరిసరాలలో వుంది) ఒక రాజ నేత్ర వైద్యుడు, ఒక పాత్రను ముక్కుదగ్గిర పెట్టుకొన్నట్టు చిత్రించబడి వుంది. (మేజర్ పు. 52.) అతన్నిగురించి, రాజవైద్యులలో ప్రముఖుడని, నేత్రవైద్య ప్రవీణుడని, మంత్రశాస్త్రజ్ఞుడని, ఉదర చికిత్సలో దిట్ట అనీ వర్ణించబడింది.

క్రి. పూ. 15-వ శతాబ్దినాటి అమెనోఫిస్ II అనే రాజు ఆస్థాన వైద్యుడయిన నెబమాన్ సమాధి లోతట్టు చిత్రాలలో ఒక అసిరియన్ రాజు, ఈ రాజవైద్యుని దగ్గిరకు మందుకై వచ్చినట్లూ, అతను ఒక సీసాలోనుంచి ఒక పాత్రలోకి మందు పోసి రాజు కిస్తున్నట్లు చిత్రించబడివుంది.

## అస్సీరియా, బేబిలోనియా

సూసావద్ద ''హమ్మూరాబీ'' రాజు సమాధి లోపలి చిత్రంలో మహారాజు, సూర్యదేవునివద్దనుంచి ధర్మశాస్త్రాలు అందుకొంటున్నట్లు చిత్రించబడివుంది. (ఆస్లర్. చి. 9) (మేజరు. పుట. 24.) ఈ ధర్మాలలో కొన్ని వైద్యవృత్తి ధర్మసూత్రాలు కూడా ఇమిడివున్నాయి. సుమేరియన్ వైద్య శేఖరుని హస్తముద్రిక కూడా లభించింది. ఈ ముద్రికపై, చిత్రలిపిలో వున్న ఒక శాసనంకూడా ఉన్నది. ఇప్పుడు బ్రిటిష్ మ్యూజియమ్‌లో వున్న ఒక పచ్చిఇటుకముక్క పైన ఇల్లాటి చిత్ర లిపిలో మందుల పంటకము, ధాతువుల పాళ్ళూ అన్నీ వ్రాసియున్నాయి. బేబిలోనియన్ శస్త్ర వైద్యములో వాడబడిన కొన్ని కంచుతో చేసిన శస్త్రాలు, నినెవాలో దొరికిన ప్రాచీన పస్తుసంచయంలో ఉన్నాయి. ఇవి ప్రొఫెసర్ మేయర్‌స్టీనిగ్ స్వీకరించగా, కాస్టిగ్లియోని తన గ్రంథంలో వీటి ఛాయాచిత్రాలు (పుట 42, చిత్రం. 12 ; పుట 43, చిత్రం 13) ప్రచురించాడు. బొమ్మలు, బీజాక్షరాలతో వున్న తాయత్తులు, భూతాలను, రోగాలను పారదోలేందుకు ఉపయోగపడినవి, కూడా కొన్ని ఇక్కడ దొరికాయి. (మేజర్. పు. 30) ఇక్కడ దొరికిన ఉబ్బెత్తు చిత్ర ఫలకాలలో (బాస్-రిలీఫ్ చిత్రాలు) ఒక పజీరు - ఒక కొబ్బావాడు వున్న చిత్రం ఒకటి ఉంది. (మేజర్ పు. 29)

## గ్రీ సు

పూర్వకాలపు గ్రీసులో చిత్రకళ వైద్యంకన్నా ఎన్నో ఇంతలు ముందే అభివృద్ధిలో ఉందని క్లార్కు నొక్కి చెప్తున్నాడు. శిల్పకళలో మహోత్కృష్ట శిల్పాలు క్రీ. పూ. 460-435 లో పెరికిల్స్ కాలంలో నిర్మితమయ్యాయి. ఫిడియాస్ మహాశిల్పిని ఈ రాజు ఆదరించటంతో అతనూ అతని శిష్యవర్గము కలిసి, పార్థినాక్ దేవాలయాన్ని నిర్మించారు. గ్రీసులోకూడా పూర్వపు శిథిలాల తవ్వకాలలో పరిశీలిస్తే వైద్యము, చిత్రలేఖనములకు సంబంధమున్నట్లే విదితమౌతుంది. క్రీ. పూ. 420 పరిసరకాలంలో ఎస్క్లిపియోస్ అన్న దేవతావైద్యునికి పూజలు గ్రీసులో ప్రారంభమయాయి. ఎపిడారస్ మొదలైన ప్రదేశాలలో ఎస్క్లిపియోస్ విగ్రహాలు దొరికాయి. (ఆస్లర్ చిత్రాలు 13, 14, 15) (కాస్టిగ్లియోని, చిత్రాలు 51, 52) (మేజర్ పు 103). గ్రీస్‌లో ఎస్క్లిపియోస్ దేవతకు కట్టినది దాదాపు 200 దేవాలయాలున్నాయి. వీటిని ఎస్క్లిపియోన్స్ అనేవారు. ఈ దేవాలయాలలో రోగులు పడుకొనేందుకు పనతిగదులు, స్నానశాలలు, చికిత్సాగృహాలు ఇత్యాదులన్నీ ఉండేవి. ఎపిడారస్, కాస్ అనే ప్రదేశాలలో, పునరుద్ధరింపబడిన ఈ ఎస్క్లిపియోస్ దేవాలయాల చిత్రాలు మేజర్‌పుస్తకంలో 105, 116 పుటలలో ఉన్నాయి. ఈ దేవాలయాలలో ఆ దేవాలయానికి వచ్చి మొక్కుకున్న రోగులు వేయించిన కుడ్యశిలాఫలకాలు, బొమ్మలు, లిపులు ఉన్న మట్టిబిళ్ళలు చాలా దొరికాయి. ఏథెన్స్ మ్యూజియమ్‌లోని ఒక బాస్-రిలీఫ్‌లో ఎస్క్లిపియోస్‌కు కానుకలర్పిస్తున్న ఒక రోగి బొమ్మ చిత్రించబడి ఉంది. ఈ ఏథెన్స్ మ్యూజియమ్‌లోనే ఒక బాస్‌రిలీఫ్ చిత్రం ఉంది. అందులో ఈ వైద్యదేవుని చిత్రమూ, రోగనివారణదైవమైన ఒక నాగుబాము చిత్రము ఉన్నాయి. నాణాలు, పతకాల మీదకూడా ఎస్క్లిపియోస్ చిత్రాలున్నాయి (కాస్టిగ్లియోని చిత్రం 59). వైద్యవిషయాలు చిత్రించిన విచిత్ర విచిత్ర చిత్రాలుకూడా ఈ బాస్-రిలీఫ్‌లలో ఉన్నాయి. ఒకదానిలో వివిధ శస్త్రవిశేషాలు చిత్రించబడ్డాయి (కాస్టిగ్లియోని చిత్రం 70) మరొక దానిలో వైద్యుడు రోగియొక్క ఉదరస్థ భాగాలను పరీక్ష చేస్తున్నట్లు చిత్రించబడింది. ఒక వైద్యుని సమాధిపైని రాతిపలక చిత్రంలో, వైద్యుడు శస్త్రాల సంచిని ముందు పెట్టుకొని వైద్యగ్రంథపత్రాలను చదువుతూన్నట్లు లిఖింపబడి ఉంది. ఇంకా ఎన్నో ఇల్లాంటి స్మృతిఫలకాలలో పై చిత్రాలు దొరికాయి.

1. క్రీ. పూ. 372-360 నాటి ఒక పలకపై (ఏథెన్స్ నేషనల్ మ్యూజియమ్‌లో ఉంది) ఎస్క్లిపియోస్, అతని కొడుకులూ కూతుళ్ళూ వారిచుట్టూ, అతనిచే చికిత్సపొంది కృతజ్ఞతచూపుతున్న కుటుంబాలు చిత్రించబడి ఉన్నాయి.

2. మరొక పలకపై ఒక రోగికాలులో నెత్తురు తీస్తున్న చిత్రం ఉంది, (మేజర్ పు. 120).

3. కుడిభుజంలో జబ్బున్న ఒక రోగికి ఎస్క్లిపియోస్ శస్త్రచికిత్సచేస్తున్న చిత్రంఉన్న ఫలకం (మేజర్ పు 122).

4. ఎపిడారస్‌వద్ద దొరికిన ఇట్టి పలకపైన శస్త్రచికిత్సా విధానం విపులంగా చిత్రించబడ్డ చిత్రం. ((క్రీ. శ. 168.) (మేజర్ 128 పు.)

5. కాస్‌వద్ద దొరికిన ఈ మాదిరి సమాధిపలకలపైన ((క్రీ. పూ. 400 నాటికి) గర్భకోశం మూత్రకోశాల చిత్రాలు, మేజర్ 125 పు.) కొరింథ్‌లో దొరికిన ఇట్టి పలకలపై స్త్రీరొమ్ములో వ్రణం చిత్రము (మేజర్ 130) వృషణాలు, మేహసం, లింగాగ్రం, (మేజర్ 134) మెడడులోపలి మడతలు వీటి వీటి చిత్రాలున్నాయి.

క్రీ. పూ. ఆరవ శతాబ్దంనాటి ఒక మృత్ఫలకమున ఒక క్రీతస్త్రీ బిడ్డకు పాలిస్తున్న బొమ్మ చిత్రించబడి ఉంది. మరొక దానిపై, మద్యంతో మైమరచిన మదోన్మత్తుని చిత్రం ఉంది. క్రీ. పూ. 490 నాటి పురాతన గ్రీకుపానపాత్రపై అఖిలిస్



**3. శిబిజాతకం. అమరావతి**

వీరుడు, పెట్రోక్లస్ చేతి గాయానికి కట్టుకడుతున్నట్లు చిత్రించబడి ఉంది. రక్తనాళచ్ఛేదనం మరొక గ్రీకు పాత్రపై చిత్రించబడి ఉంది.

ఇట్లాగే రోమక సామ్రాజ్యంనాటి అనేక శిథిలాలు, శిల్పాలు, చిత్రాలు, పతకాలు ఫలకాలపైకూడ వైద్యశాస్త్ర విశేషాలను తెలిపే చిత్రాలు ఉన్నాయి. గ్రీకునాగరికత విస్తరింపక పూర్వమే, ఎట్రుస్కన్ వైద్యవిశేషాలు తెలిపే కంచు "లివర్"లు ఉండేవి. ఒక భవిష్యజ్ఞుడు ఒక కంచుకార్జంలో చూస్తూ భవిష్యత్తు చెప్తున్నట్లు ఒక కంచు దర్పణంపై చిత్రించి ఉంది. (మేజర్ 153-154) క్రీ. పూ. 5 శతాబ్దంనాటి దంతాలు స్మృతిఫలకాలమీద గుండె, గర్భకోశం, చన్ను, కన్ను, చెవి ఇత్యాదులు లిఖించిఉన్నాయి.

రోమక సామ్రాజ్యం మహోన్నత స్థాయిలో ఉన్న దినాలలో, పుర ఆరోగ్యానికి, నీటిసరఫరాకు అక్వెడక్టులు మొదలైన కట్టడాలకు, పురజనుల స్నానమందిరాలకు అక్కడ, స్నేహ, స్వేద ప్రకరణచికిత్సా మందిరాలకు, మురుగు నీటి పారుదల విధానాలకు, నిత్యం వాళ్లను శుభ్రంగా ఉంచే జలమందిరాలకు, పురప్రజోపయోగార్థం పాకీదొడ్లు కట్టడానికి (ఈ పాకీదొడ్లలో మనిషి కింతని సుంకం పుచ్చుకొనేవారు) ఇత్యాది పురారోగ్య నియమాలన్నిటికి రోమ్ నాగరికత చాలా ప్రసిద్ధి కెక్కింది.

రోమ్‌ను సందర్శించిన మొదటి గ్రీకు వైద్యులలో ఆర్చగథాస్ ప్రముఖుడు (క్రీ.పూ. 219) ఇతన్ని "వ్రణవైద్యుడు" అని పిలచేవారు.

రోమక వైద్యులలో అస్క్లిపేడిస్ (క్రీ. పూ. 91) ప్రసిద్ధుడు. ఇతని ప్రతిమ, రోమ్ మ్యూజియమ్‌లో ఉంది. ఇతను అలెగ్జాండ్రియాలో చదువు కొన్నాడు. సిసిరో, మార్కస్, అంటొనీ లాంటి ప్రసిద్ధులు ఇతన్ని వైద్యునిగా ఏర్పరుచుకొన్నారు. హిపాక్రిటిస్ సిద్ధాంతీకరించిన, వాత పిత్తాది శారీరక ద్రవప్రకోప సిద్ధాంతాన్ని తృణీకరించి, గ్రీకు వైద్యశాస్త్రంలో డెమొక్రటిస్ అణుసిద్ధాంతాన్ని ప్రవేశ పెట్టాడు.

పాంపై శిథిలాలలో, వైద్యుని గృహనిర్మాణము, రోగాల వసతిగదులు, చికిత్సా మందిరాలు, శస్త్రచికిత్సగది ఇన్నిటి స్వరూపాలు బైటపడ్డాయి. (మేజర్ 184-186)

ఈ శిథిలాల్లోని వైద్యుని గృహంలో, లభించిన వైద్య శాస్త్ర ఉపకరణాలు నేపిల్స్ మ్యూజియమ్‌లో ఉన్నాయి (మేజర్ 178).

రోమక సైన్యాల వెంట ఉండే వైద్యసహాయకుల సమృద్ధిని సింగర్ ఉల్లేఖించాడు. ట్రాజన్ స్తంభాలపై ఉన్న ఒక చిత్రాన్ని కూడా ప్రకటించాడు. అందులో క్రీ. శ. 1వ శతాబ్దంలో రోమక సైనిక వ్రణవైద్యులు, సైనిక ముఖంలో వాళ్ళస్థావరాలు, ఇత్యాదులన్ని చిత్రించ బడ్డాయి. సింగర్ ఈ కథ కూడా చెప్పాడు. "చిత్రంలో ఎడమవైపున ఇద్దరు రోమక సైనికులు ఒక క్షతగాత్రునికి ఊత ఇస్తున్నారు. కుడివైపున ఒక సైనిక వ్రణవైద్యుడు, ఒక సైనికుని తొడ గాయానికి కట్టు కడుతున్నాడు. వైద్యుని దుస్తులు దాదాపు సైనికుని దుస్తుల్లాగా ఉన్నాయి. అతని చంకలో మాత్రం, "ప్రాథమిక చికిత్సా పేటిక" ఒకటి వేలాడుతోంది. (సింగర్ పుట 48 చి. 17) పాంపైలో దొరికిన ఒక ఫ్రెస్కో చిత్రంలో గాయపడ్డ ఏనీస్ తొడలో గుచ్చుకొన్న బాణాన్ని శాణంతోపెరుకుతున్న ఒక వ్రణవైద్యుని చిత్రం వ్రాయబడి ఉంది. (క్లార్క్ 4: మేజర్, 190).

డి యొస్కొరిడీస్, గాలేన్ అన్న ప్రసిద్ధ రోమక వైద్యుల చిత్రాలు, కూడా ఉన్నాయి. (మేజర్ 191, 198 పుటలు).

సిబా సంకలనంనుంచి క్లార్క్, రోమక కాలాలనాటి దిగువ చిత్రాలను ప్రచురించాడు.

1. ప్రాచీన రోమ్‌లో, రక్త స్రవణ చికిత్స:—వైద్యుడు రోగి కూర్చుని ఉంటాడు. రోగి పాదం ఒక పళ్ళెంలో ఉంచబడింది. (ఆస్ట్రియా రిలీఫ్ చిత్రం మూడవ శతాబ్దంది.)

2. రోమక ప్రసూతి చిత్రము:—పాంపైలో దొరికిన దంతపు చెక్కడంలో ఉంది. పురిటి నొప్పులు పడుతున్న స్త్రీ పురిటి కుర్చీలో అరు బయటకూర్చుని ఉంది. ఆమెకు ఎదురుగా మంత్రసాని కూర్చుని ఉంది

3. మట్టి పళ్ళెమీద బొమ్మ. కురుపులతో ఉన్న రోగి చిత్రం

అతి ప్రాచీన నాగరికతలలో మనకు తోటిదైన మిత్ర దేశం చైనాలో, వైద్య దైవమయిన పీన్‌ఛియావ్, సేకరించిన చిత్రాలు (క్రీ. పూ. 255 నాటివి ఉన్నాయి). మనకు ధన్వంతరిపదంలాగే, ఈ పీన్‌ఛియావ్ నామం అక్కడ ప్రసిద్ధ వైద్యులందరికి పేరుగా వెలసింది. ఒక దేవత అతనికి కనబడి, ఒక మూలికల పొట్లం ఇచ్చి, నెలరోజులు సేవించమని చెప్పిందట. అట్లా చేసేటప్పటికి అతనికి మానవశరీరం అంతా అద్దంవలె కనబడి. దేహంలోని ఏ రోగాన్నైనా కనిబెట్టగల శక్తి వచ్చిందట. ఇది అక్కడి సాంప్రదాయమైన కథ. ఆయన చేసిన అద్భుతమైన చికిత్సలు, చెప్పిన అద్భుతమైన జ్యోతిష్యాలను గురించి అనేకమైన కథలున్నాయి. భారతదేశంలో, జీవకుడు, చరకుల కున్నంత కీర్తి అతనికున్నాయి. అతనిమీద ఈర్ష్యతో లీహ్సా—అనే రాజవైద్యుడు అతన్ని చంపించేశాడు.

చైనా పూర్వయుగాల వైద్యులు, వైద్యాన్ని గురించి చిత్రాలుగూడా ఉన్నాయి. ట్సాంగ్ హూంగ్, చాంగ్ ఛుంగ్ ఛింగ్, హువాటో—వీరు ముగ్గురు చైనీయ వైద్యంలో త్రిమూర్తులవంటివారు. ఇందులో మొదటివానిని గౌరవంతో, ట్సాంగ్ బాబు (పిత) అని పిలిచేవారు. అతను చికిత్స చేసిన ఇరవైఐదు రోగాల నిదానాన్ని, చికిత్సను, లిఖించి

4. శిబిచక్రవర్తి తన మాంసమును కోసియిచ్చుట. అమరావతి



వెళ్ళాడు. రెండవవాడైన ఛాంగ్ ఛుంగ్ ఛింగ్ క్రీ. శ. రెండవ శతాబ్దంలో వర్ధిల్లాడు. ఇతడు చైనా వైద్యులలో కెల్ల మహాఘనుడు. "హిప్పొక్రేటిస్ ఆఫ్ చైనా" అనీ, వైద్యఋషి అనీ ఇతన్నంటారు. ఇతని బొమ్మ మేజర్ గ్రంథంలో 97 పుటలో వుంది.

మూడవవాడైన హువాటో క్రీ. శ. 190లో జన్మించాడు. పూర్వకాలపు చైనాలో ఇంతటి శస్త్రవైద్యుడు లేడు. ఇతని చిత్రంకూడా మేజర్ 99 పుటలో ఇచ్చాడు. ఆ గ్రంథంలోనే 100వ పుటలో, యుద్ధంలో గాయపడ్డ వీరునికి శస్త్రచికిత్స చేస్తూ అతని దృష్టిని చదరంగం ఆటలోకి మరల్చినట్టు చిత్రించబడ్డ ప్రాచీన చిత్రం ఉంది.

చిత్రకళలో, వైద్యశాస్త్రం ప్రదర్శితమయిన విషయాలు, అనేకమంది పాశ్చాత్య పరిశోధకులు గ్రంథాల్లో వెలివర్చారు. 1861-62 లో మొట్టమొదట దోవతీసినవాడు పిశ్చా. ఇతని తర్వాత దాదాపు అదేకాలంలో వైద్యంలో చిత్రకళ విశేషాలను సమృద్ధిగా సేకరించి ప్రకటించినవాడు కె.ఎస్. హెచ్. మార్క్స్. కాని నిజానికి ఈ ప్రత్యేక పరిశోధనలకు రాచమార్గం చూపినవారు ఛార్కాట్, అతని శిష్యులూనూ. 1888-1913 మధ్య వీరు అనేక గ్రంథాలు ప్రచురించారు. ఛార్కాట్ గొప్ప వైద్యుడేకాక గొప్ప శిల్పి, కళాకారుడుకూడా. చిత్రరూపంలో వైద్యచరిత్రకు రూపం ఏర్పరచినవాడు ఇతడే. తర్వాత శతాబ్దాలతరబడి వస్తూన్న నానాదేశాల వైద్యచరిత్రల చిత్రరూపాలపై అనేకగ్రంథాలు వెలువడ్డాయి.

కాని, ఇన్ని పరిశోధనలు జరుగుతూన్నా, యూరప్ అమెరికా ఇత్యాది పాశ్చాత్యా దేశాలలో ఇందరు, వైద్యులు, వైద్యచరిత్రకారులు, పూరాతత్వ పరిశోధకులు, చిత్రకారులు, శిల్పులు, ఈ పరిశోధనలు సాగించినా, చిత్రకళలలో వైద్యవిశేషాలపై భారతీయులుగాని ఆసియావాసులుగాని దృష్టి మరల్చలేదు. కారణం, మన వైద్యులు చిత్రకళవైపు ముఖం తిప్పనక్కరలేని స్థితిలో, ఆంగ్లవైద్యశేఖరులకు ఆస్పత్రి అసిస్టెంటులుగా మాత్రమే మిగిలే స్థితిలో ఉంచబడ్డారు. ఏ కొద్ది చోటులలోనో తప్ప, వైద్యము, చిత్రకళ, ఈ శాస్త్రాభ్యాసకులకు, ఏదో ఇతర అవసరంవస్తే తప్ప పరస్పర పరిచయాలు లేక, మానవ శరీరసంబంధీకులైన ఈ రెండు కళలకు అన్యోన్యత చేకూరలేదు. నిజానికి, ఎటుచూచినా శిల్పమో, చెక్కడమో, చిత్రమో, ప్రాచీనకాలంనాటిది కనబడే భారతదేశంలో ఇట్టి పరిశోధన దృష్టి కలగకపోవడం నిజంగా ఆశ్చర్యమైన విషయమే. మనదేశంలో ఏ కాస్త అటూ ఇటూ తిరిగినా, పురావస్తుశాలలూ, అజంతా గుహలూ, ఎల్లోరా చెక్కడాలు, సాంచీ స్తూపం, కోణార్క హంపి శిథిలాలు, పాడుపడ్డ గుళ్ళు, దక్షిణాది దేవాలయాలు ఇంతటి విశాల శిల్పకళా ప్రతిభ గోచరిస్తుంది.

భారతీయ శిల్పులు మతవిషయక శిల్పాల చిత్రాలు, మాత్రమే లిఖించటానికే ఉత్సాహం చూపారని నిత్య సామాన్య జీవిత విశేషాలను మానవశరీరం, తద్వికృతులు, వికారాలు, రోగాలు, చికిత్సలు, దయ్యాలు భూతప్రక్రియలు ఇల్లాంటి విశేషాలను తుచ్ఛ విషయాలుగా జమకట్టి అటు చూడనేలేదని అంటారు. జీవితంలోని అవాంఛిత విషయాలను చిత్రించలేదంటారు. దేవతలు, ఋషులు, చిల్లర దేవుళ్ళు, ఉత్తమ పురుషులు ఇత్యాది విగ్రహాలనే, ఆదర్శ సౌందర్యోపాసనా విధానంలో సశాస్త్రీయంగా చిత్రించారనీ అనుకొంటూ వచ్చాము.

కాని ఈమధ్య నాగార్జునకొండ సమీపంలో మట్టిలో గలిసిపోయిన విజయపురివద్ద త్రవ్వితీసిన చెక్కడాలు, చిత్రాలు, జగత్ప్రశస్తినందిన అమరావతీ శిల్పాలు, కుడ్య, భిత్తికా చిత్రాలు, మన పాతభావాలను తొలగించి, మన దృష్టిలోనే ఒక నవచైతన్యం కల్పించి, కళ, ప్రాచీన కళాఖండాలు, కళకు మానవసమాజానికి ఉన్న సంబంధము, సాంఘికచరిత్ర, సాంఘికవైద్యము, వైద్యచరిత్ర ఇల్లాంటి వాట్లపై మన అభిప్రాయాలను పూర్తిగా మార్చి, అభ్యుదయాత్మక మొనసర్చాయి.

బుద్ధుని జీవితవిశేషాలు, ఆయననుగురించిన ఇతిహాసాలు జాతక కథలు, ఇవన్నికూడా సామాన్యజనులకి చాలా అభిమానపాత్రాలుగా ఉండేవి. ముఖ్యంగా కర్షకులు, వర్తకులు, సముద్రవ్యాపారులు, ఇత్యాది జనం కూడా రాజకుటుంబాలతోపాటు తాముకూడా చాలా ధనం అర్పించి దక్షిణాది బౌద్ధరంగాలలో, అమరావతి, నాగార్జునకొండ ఇత్యాది స్థలాలలో, స్తూపాలకు కొత్త కొత్త అలంకారాలు, చేనూర్చి పడిపోయిన శిథిలాలను బాగుచేయించి, ఆయకవేదికలు, చుట్టూ కటకటాలూ కట్టించి అనేక విధాలుగా ఈ శిల్పాన్ని శిల్పుల్ని పోషించారు.

ఆంధ్ర శిల్పులకు బహుశా సంస్కృత శిల్పశాస్త్రాలలో ప్రవేశము ఎక్కువ లేకపోయి ఉండవచ్చును. కాని వాళ్లు అత్యద్భుతమైన శిల్పకళాకుశలురు. బౌద్ధసన్యాసులుచెప్పిన కథలను అతి ఉత్సాహంతో ఆదరంతో విన్నారు. ఆ కథలలో ఒకటో రెండో ఘట్టాలను తీసుకొని వాట్లచుట్టూ తమ సమకాలిక జీవితాన్ని ప్రతిబింబింపచేస్తూ, చిత్రానికి కావలసినదల్లా తమచుట్టూ ఉన్నవాట్లనే చిత్రించారు. పట్టణాలు, ఇళ్ళు, చెట్లుచేమలు, మృగాలు, పురుషులు, స్త్రీలు, ఆభరణాలు, ఉపకరణాలు, వస్తువాహనాలు, ఇన్ని

టనీ తమ ఎరుకలోవాటినే చిత్రాలలో ఇముడుస్తూ ఆయా భంగిమలు, సంచలనాలు, ముఖవైఖరులు, చేష్టలు, చూపులు, అన్నీ ఛాయాచిత్రంలో కనబడేటంత ప్రకృతి సహజంగా, యదార్థదృష్టితో ఆయా ఘట్టాలను చిత్రసృష్టి చేశారు. ఒక్కొక్కప్పుడు చిత్రకారుడు, చలనచిత్రావళిలో, ఛాయాచిత్రాల వరుసలలాంటి వరుసలనుగూడా చిత్రించి కలిపిచూసుకొంటే సినిమా చూస్తున్నట్లే అనిపించేటట్లు చూపించి, ప్రకృతికి ప్రతిబింబంగా తమ కళను సృష్టించారు. జీవితాన్ని యథాతథంగా, సత్యమూ, శివమూ, సుందరమూ అయిన విషయాలతోపాటు, స్వర్గ మర్త్య పాతాళాలను మూటిని ప్రతిబింబింపచేస్తూ, అత్యుత్తమ విధానంలోనే చిత్రిస్తూ, హీనాతిహీనులైన మానవులను, జంతువులను, మరుగుజ్జులను, వికలాంగులను, రోగులనూ యుద్ధంలో గాయపడినవారినీ, ఏనుగుల కాలిక్రింద నలిగిన వారినీకూడా అంత యథార్థంగా చిత్రించిన ఈ శిల్పాచార్యుల శైలికీ, వారికీకూడా జోహారులర్పిస్తున్నాను.

విధి నన్ను వైద్యునిగా చేయకముందునుంచీ కూడా, కళోపాసనిగా గడిపినవాడనౌటచేత, వైద్యశాస్త్రంలో కళను, కళలో వైద్యవిశేషాన్ని చూడటానికి ప్రయత్నించాను. ఈనాడు మనమింతగా పొగడుతున్న ఈ ఆంధ్ర శిల్పులందరూ, వైద్యశాస్త్రాలతోనూ, వైద్యవిధానవిశేషాలతోనూ పరిచయమున్నవారై ఉండాలి. అంతేకాక గాంధార, యవన శిల్పాలతోపాటు, ఈజిప్టు, రోమ్‌దేశాల, భిత్తికా చిత్ర సాంప్రదాయాలతోకూడా కొద్దో గొప్పో పరిచయమున్నవారేనని నా విశ్వాసము. ఆంధ్రబౌద్ధశిల్పాలనుంచి కొన్ని ఉదాహరణలిచ్చేందుకు ప్రయత్నిస్తాను.

నాగార్జునకొండ చిత్రాలలోని (క్రీ. శ. 100-300) మాంధాత జాతకం. మాంధాత స్వర్గంనుంచి పడిపోయాక రాజోద్యానంలో మృత్యుశయ్యపై నున్న చిత్రం. (చిత్రం 1).

"ఒక మహారాజు, అతి నిస్త్రాణస్థితిలో పాన్పుపై పడి పోతున్నాడు. అతని పట్టపురాణియో ఎవరో ఒక స్త్రీ అతన్ని ఆనుకొని ఒడిలోపట్టుకొని ఉంటుంది. మరిద్దరు స్త్రీలు, (రాణులే అయిఉండవచ్చును) పాన్పు రెండువైపుల దిమ్మలమీద కూర్చునిఉంటారు. దుస్తులనుబట్టి చూస్తే బ్రాహ్మణపురోహితుడుగా కనబడే ఒక వ్యక్తి ఎడమవైపున మరొక దిమ్మమీద కూర్చునిఉంటాడు. అతనిప్రక్కనే మరొక ఆసనంమీద కూర్చుని యువకుడు దుఃఖిస్తూ ఉంటాడు. వివిధ భంగిమలలో పరిచారికలూ, చేటికలూ, కావలసిన పందిస్తూ రోగికి ఉపచారాలు చేసూంటారు



5. జీవకుని చూతవనమున నున్న గురుదేవుని అజాతశత్రుడు సందర్శించుట—అమరావతి.

చిత్రంలో కుడివైపు పైమూల, కొంతభాగం ఆకాశమూ, నెలవంకా చిత్రించబడ్డాయి. కొన్ని నక్షత్రాలుకూడా ఉంటాయి. ఒక అస్పష్టమయిన ఖచరమేదో ఆకాశం నుంచి పడిపోతూంటుంది. వెనకతట్టుగా నిలుచున్న ఒక పురుషుడు, ఒక స్త్రీ, ఆ పడిపోతున్న వస్తువువంక ఆకాశంకేసి చెయ్యిచూపిస్తూంటారు. ఎడమవైపు మూల వెనక చిత్రించబడ్డ ద్వారము సౌధబహిఃప్రదేశంలో ఇదంతా జరుగుతున్నట్లు సూచిస్తుంది. ఈ జాతక కథాచిత్రమే ప్రదర్శిస్తున్న చిత్రాలు ఆంధ్ర చిత్రాలలో చాలాఉన్నాయి.

షడ్దంత జాతకం:—గోలివద్ద ఒక స్తూపంలో దొరికిన చక్రపుచిత్రము. క్రీ. శ. 200 నాటిది. ఒక మహారాణి మృత్యువేదనను చిత్రించిన చిత్రం. (చిత్రం 2).

ఈ చిత్రాన్ని గురించి మద్రాసు గవర్నమెంటు మ్యూజియమ్ వారి కరపత్రంలో ఇల్లావ్రాసి ఉంది. "మహారాజు రాజలాంఛనమైన తలపాగతో సింహాసనం మీద కూర్చుని ఉంటాడు. రాణి అతని ఒళ్ళో తలవాల్చి, మూర్ఛాపస్థలో మృత్యువేదనతోనే వాలి పోతూఉంటుంది. ఆమె ఆవేదనకు కారణం, ఆమెముందు ఒక వేటగాడు ఒక గుండ్రటి తట్టలో ఉన్న ఏనుగు దంతాలను చూపిస్తూంటాడు. అవిచూసి భరించ లేక పడిపోతున్న ఆమెను రాజు అనరాగా పట్టు కొంటున్నాడు"

షడ్దంత జాతక కథ సంగ్రహంగా ఇది: బోధిసత్వుడు ఒకానొక పూర్వజన్మలో, ఆరు దంతాలు గల గజరాజుగా జన్మించాడు. అతని కిద్దరు భార్యలున్నారు. అందులో ఒక ఆడ ఏనుగుకు మగనిపై కోపము ద్వేషము రగుల చొచ్చాయి. ఆ ఏనుగు చచ్చి పోయి, స్త్రీయై జన్మించి కాశీరాజును పెళ్ళి చేసుకొని ప్రియభార్య అవుతుంది. ఆమెలో ఇంకా పూర్వజన్మలో భర్తఅయిన గజేంద్రుని మీద పగ చావలేదు. లేని జబ్బు నటించి, తనకు కలలో ఆరు దంతాల ఏనుగు కనబడిందని ఆ దంతాలు నరికి తెస్తే గాని తన జబ్బు నయమవదని రాజుతో చెప్తుంది. సాహసికుడైన ఒక మృగయుణ్ణి పనికి పురమాయించి పంపిస్తుంది. ఆ మృగయుడు హిమాలయ సానువులకు పోయి, అక్కడ ఒక గొయ్యి తవ్వి, గజరాజును పట్టు కొంటాడు. మృగయుడు గజరాజును చంప బోతూంటే, గజరాజు అతను వచ్చిన పని తెలుసుకొని దంతాలు కోసి తీసు కొనేందుకు తానే అతనికి సహాయం చేసి, దంతాలు కొయ్యడం అవగానే ప్రాణాలు విడిచి నేలబడి పోతుంది. వేటకాడు అదంతాలను తీసుకొని వెళ్ళి రాణికి చూపిస్తాడు. రాణి ఈ కథవిని, పశ్చాత్తప్తురాలై గుండె పగిలి చచ్చి పోతుంది.

శిబి జాతకం, పద్యకావ్యంగానూ, కుడ్య శిల్పాలుగానూ త్రివర్ణ చిత్రాలుగానూ కూడా రూపొంది అమరత్వ మందు కొంది. శిబిమహారాజు, తనను ఎవరేది అడిగినా తన శరీర మైననరే ఇచ్చేస్తానని, ప్రతిజ్ఞ పట్టాడు. "అక్కరలో ఉన్న వాడు ఎవడైనా, నా హృదయం కావాలని కోరినా కూడా, నా రొమ్ము చీల్చి నా గుండెను పెరికి, చెరువులోంచి కాడతో కూడా పెరికి తీసినపుడు నీరోడు తున్న కలువ పువ్వులాగా, నెత్తురోడుతున్న నా గుండెకాయను పెరికి ఇస్తాను. నా శరీరంలో మరేభాగంలో మాంసం అడిగినా కూడా కత్తితో కోసి, విగ్రహంకొరకు ఉలితో రాతిని చెక్కి నట్లు, చర్మమాంసాలను చెక్కితీసి ఇచ్చేస్తాను. ఏ మానవుడైన నా కన్నులు కావాలని కోరితే, తాటి చెట్టు ముప్పను పెరికినట్లు నా కన్నులు పెరికి ఇచ్చేస్తాను."

మహాభారతంలోని మూల ఇతిహాసము, బుద్ధకథలలోని ఈ శిబికథలోనూకూడా పావురాన్ని రక్షించటానికే శిబి తన దేహాన్ని ఖండించి ఇచ్చినట్లుగా చెప్తుంది. హ్యుయాన్ త్సాంగ్ ఉదయన రాజ్యంలో ప్రచారం ఉన్నదంటూ ఈ కథ చెప్పాడు. "ఇక్కడే పూర్వజన్మలో తథాగతుడు బోధిసత్వజీవితానికై కృషిచేస్తుండగా, (ఆ జన్మలో) శిబిక, (శిబికరాజు) అనే పేరుతో వెలిశాడు. బుద్ధత్వం అందుకోటానికై ఈ రాజ్యంలోనే అతడు తన శరీరంలోని మాంసం, కండలు కోసి, పావురాన్ని రక్షింటానికై దేగ కర్పించాడు" అంటూ హ్యుయాన్‌త్సాంగ్, సామాన్య జనులు, అల్లా బోధిసత్వునిలాగా, దేగనుండి పావురాలను రక్షించటానికై తమ దేహాన్ని కోసి ఇయ్యటానికి అభ్యంతర లేదంటాడు. చైనీస్ గ్రంథాలలోనూడా శిబిరాజు పావురాన్ని రక్షించిన కథ వుంది.

ఒకే కథ దేశకాలపాత్రాలతో కొద్ది మార్పులు చెంది వెలసిల్లిందని స్పష్టమవుతూనే ఉంది. బుద్ధునికి పూర్వపు హిందూ సాంప్రదాయాలను ప్రజాహృదయంలో అద్దిన పురాణం మహాభారతం, శరణాగత త్రాణుడైన శిబిచరిత్రం పావురాన్ని వదలకుండా దేగకు తన మాంసాన్ని యెల్లా అర్పించాడో అంతా జనరంజకంగా తెలిపేవుంది. అమరావతి సమీపంలో ఉన్న చేజర్ల దగ్గిర పర్వతఆరామము ఒకప్పుడు పారావత ఆరామము అయివుండవచ్చునని, అదే హైందవ ప్రాబల్యంలో మళ్ళీ, కపోతేశ్వరాలయం ఐందని ఊహించ టానికికూడా ఆస్కారం ఉంది.

అమరావతి శిల్పంలో (చిత్రం 3) శిబిజాతకం ఈ క్రిందివిధంగా వర్ణితమయి ఉంది.

కథానాయకుడైన శిబి, మూర్తి కట్టిన త్యాగశీలరూపంతో మోకరించి ఉంటాడు. వెనుక ఒక మనిషి అతన్ని పట్టు

కొనిఉంటాడు. కాని ఆ మహారాజులో శాంతం స్థైర్యం, మహోన్నతమైన నిగ్రహము, స్థితప్రజ్ఞత్వము ఇన్నికూడా ఆ పావురంకోసం తన మాంసం అర్పిస్తున్న ఆ మహారాజు రూపంలో కొట్టవచ్చినట్టు కానపడేట్టుగా శిల్పి తీర్చిదిద్దాడు. ఈ శస్త్రప్రయోగ చిత్రణంలో కుడివైపు చివర ఒకపళ్ళెంలో కోసిన మాంసఖండాలున్నవి. శస్త్రవైద్యుడు వీపు ఇటు తిప్పి రాజుకు ఎదురుగా మోకరిల్లి, రాజును ఎడమచేత్తో పట్టుకొని ఉంటాడు. వైద్యుడు కుడిచెయ్యి పంచిఉండి నందున కనబడదుగాని చేతిలో కత్తిమాత్రం కనబడుతూనే ఉంది. కత్తి రాజుగుండెలదాకా కూడా చొచ్చుకొని ఉంటుందిగాని మోచేతిదగ్గిర మాంసాన్ని కోస్తూ కన బడుతుంది.

నాగార్జునకొండలో శిబి జాతక కథ గాంధారశిల్పంలో చెక్కబడిఉంది. ఈ బొమ్మ బార్నెట్ తన ఏంటిక్విటీస్ ఆఫ్ ఇండియా అనే గ్రంథంలో ఇచ్చారు. ఇందులో రాజు సింహాసనంమీద కూర్చున్నాడు. కాళ్ళదగ్గిర పావురం ఉంది. ఇద్దరు శస్త్రకులు రాజుగుండెనుంచీ తొడలనుంచీ మాంసం చేదిస్తున్నారు. ఎడమచేతికి పరుసగా మురుగుల దొంతర ఉంది. తలపై జటాజూటపుముడి ఉంది. కత్తితో రాజుమాంసం కోస్తున్న వ్యక్తి మామూలు దుస్తులలో ఒక అంగవస్త్రం ధరించి, పైభాగంలో అచ్ఛాదనలేకుండా ఉంటాడు.

బౌద్ధ వర్గాలలో బహుళ ప్రచారంలో ఉన్న శిబి కథ మరొక మాదిరిది కూడా ఉంది. శక్రుడు (ఇంద్రుడు), ఈ రాజును పరీక్ష చేయటానికి గుడ్డి బ్రాహ్మణుని రూపంలో వచ్చి, "ఓ రాజా నీకు రెండు కళ్ళూ ఉన్నాయి, నా కొక కన్ను లేదు కాబట్టి ఒకటి ఇవ్వవలసిందని" అర్థిస్తాడు. దానంచేసే అవకాశం దొరకిందని రాజు పొంగి పోయి రాజు రెండు కళ్ళూ ఇస్తానంటాడు. శస్త్రవైద్యుని పిలిచి కన్ను లూడదీయమంటాడు. వైద్యుడు కొన్ని మందు మాకులు కూడా రాసి కనుబొత్తలలోంచి కన్నుగ్రుడ్లు తీసి యాచకుని అరచేతిలో పెట్తాడు. ఈ కథ అజంతా చిత్రాలలో చిత్రించ బడి ఉంది.

జీవకుడి రూపచిత్రం ఒకటుంది. ఇతను అజాత శత్రునికి బుద్ధభగవానునికి కూడా రాజవైద్యుడు. ఇక్కడ 5 వ బొమ్మ అమరావతి చిత్రంలోనిది. జీవకుని మామిడి తోటలో ఉంటున్న సిద్ధ పురుషుని చూడటానికి అజాత శత్రుడు వస్తాడు.

జీవకుడు బుద్ధుని శిష్యుడు. అజాతశత్రుడు తండ్రిని చంపిన పాపం చేత అధివ్యాధుల రెంటిపల్లా పీడింప బడుతూ ఉంటాడు. జీవకుని చూతఆరామంలో ఒక శూన్య సింహాసనం తథాగతునికి ప్రత్యామ్నాయంగా ఉంటుంది. చుట్టూ శిష్యులూ సంఘీయులూ నిలచి ఉంటారు. జీవ కుడు రాజు ప్రక్కనే నిలబడి, గురుదేవునికి నమస్కారం చేస్తూ ఉంటాడు.

పరినిర్వాణమునకు దుఃఖితులగు ఉపాసకులు. గాంధార, 2-3 శతాబ్దిది.



# గాథాసప్తశతిలో తొణికిసలాడే గ్రామజీవన సౌందర్యం

శ్రీ తిరుమల రామచంద్ర

**గాథా సప్తశతి బహుశా ప్రపంచంలోనే తొలి చాటు పద్యసముచ్ఛయం. గ్రామ జీవన సౌందర్యాన్ని వెలార్చే ఈ ముక్తకాలను రెండు వేలేండ్లనాడు ఆంధ్రదేశాన్ని ఏలిన హాలసాతవాహనుడు సేకరించాడు. ఇవి కేవలం వర్ణనాత్మకమైన ముక్తకాలేకాని, కథా భాగాలు కావు. వాటిని కథగా గుచ్చి గ్రామ జీవనంలో కొన్ని ప్రధానఘట్టాలను వర్ణించడమే ఈ వ్యాసం లక్ష్యం. తెలుగులో ఇట్టి ప్రయత్నం యిదే మొదలని చెప్పవచ్చు.**

రాజకీయప్రాబల్యం, సాహిత్యప్రాచుర్యం గల భాషలు ఇతర భాషలను, జాతులను లోగొంటాయి. పూర్వం మతానికి, రాజకీయాలకూ అంతరం లేదుగనక సంస్కృతభాష ఇతర భారతీయభాషలను కొన్ని శతాబ్దాల వరకూ తల ఎత్తనివ్వలేదు. మతంతోపాటు వ్యాపించిన సంస్కృతం విభిన్నజాతులతో, సంఘాలతో సంబంధం ఏర్పడినకొద్దీ వాటి భాషల పదాలనూ, భావాలనూ ఆకళించుకుంది. అన్యభాషాపదాలను, సంప్రదాయాలను సంతరించుకొనక పోయివుంటే సంస్కృతసాహిత్యం ఇంత విస్తృతం, సమృద్ధం అయివుండేదేకాదు.

బుద్ధభగవానుడు తన అభిప్రాయాలను ప్రకటించింది పాలీభాషలో. బుద్ధుని సందేశాలు, మతం, పాలీభాష అశోకునికి ముందే దక్షిణాపథంలో, ముఖ్యంగా ఆంధ్ర, మధ్యదేశాలకు వచ్చాయి. అశోకుడు వానిని వ్యాపింప జేశాడు. మతభాష అయిన పాలీ క్రమంగా రాజకీయభాష అయింది. ఈ విధంగా బౌద్ధ జైన మతాలద్వారా దక్షిణాపథంలో పాకుతున్న పాలీ ప్రాకృతాలు సంస్కృతంవలెనే దేశభాషల సంప్రదాయాలనూ, శబ్దజాలాన్నీ సొంతంచేసుకున్నాయి. ప్రాకృతంలో మిళితమైపోయిన రోలంబ, రించోళి, తాలూరాది దేశిశబ్దాలను సంస్కృత మహాకవులు కూడా గతానుగతికంగా ప్రయోగించగా, నిఘంటుకారులు కూడ వాటిని స్వీకరించి, సంస్కృతముద్ర వేశారు.

ప్రాకృతంలో తెనుగు సుబంతాలమాటలు వుండగా చెప్పు, చెక్కు, చూచువంటి తిఙంతాలు చపఇ, చఅఇ, చచ్ఛఇ, చజ్జఇ మున్నగు మార్పులతో గుర్తింపరానంతగా చేరిపోవడంవల్ల ఆచార్య హేమచంద్రుడు దేశిశబ్దాలకు అన్వయమే కుదరదని, అన్వయం కుదిరినా అర్థంకావడం కష్టమని అన్నాడు[1]. దేశికి వ్యుత్పత్తి తెలియనందున ప్రాచీన సంప్రదాయసిద్ధమైన అర్థాన్నే గ్రహించాలనీ హేమచంద్రుడు ఆదేశించాడు. దేశిశబ్దాలు అర్థంకాక తప్పుడు వ్యాఖ్యలు చేసినవారిని "ఇప్పటి దేశికవులవి, వ్యాఖ్యాతలవి ఎన్ని తప్పులని ఏరను" అని కష్టపడ్డాడు.[2]

గాథాసప్తశతి తెలుగుగడ్డపై వెలసిన రచన. ప్రజాకవులు పలికిన ఈ అమరగాథలను సేకరించి ప్రాకృత సాహిత్యవధువును కైసేసినవాడు హాల సాతవాహనుడు. తెనుగుగడ్డనేలిన హాలుడు సేకరించిన ఈ గాథలలో దేశి పదాలు, ముఖ్యంగా తెలుగు పదాలు, సంప్రదాయమూ వెల్లివిరియకమానవు కదా! సాహిత్యం జాతిజీవన ప్రతిబింబమనే అన్నారు గనుక తెనుగుజాతి జానపదలావణ్యం ఈ గాథలలో తొణికిసలాడుతున్నదన్నా ఆశ్చర్యంలేదు.

"ఊరిమీద నూరుపడినా కరణంమీద కాసుపడదు"— అన్నది పల్లెటూరి సామెత. ఒకజాతి నాగరికత, మరొక జాతిని, దేశాన్ని ముంచెత్తినా, పల్లెపట్ల పసదనంమాత్రం చెక్కుచెదరదని చెప్పడానికి మనం ఈ సామెతను ఉపయోగించుకొంటాము. ఏడులక్షల పల్లెలకు పట్టుగొమ్మైన భారత

1. దేశీ దుస్సందర్భా, ప్రాయస్సందర్భితాపి దుర్బోధా
ఆచార్య హేమచంద్రః తత్తాం సందృభతి, విభజతి చ
—దేశీనామమాల

2. అధునాతన దేశీకరాణాం తద్వ్యాఖ్యాతౄణాంచ
కియంతస్సమ్మోహాః పరిగణ్యంతే.
—దేశీనామమాల, అష్టమసర్గ 12వ ఆర్యా

దేశంలో—ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఈనాడు పల్లెపట్లలో కనిపిస్తున్న నాగరికతకు గాథాసప్తశతి నాటి గ్రామ నాగరికతకు ఎక్కువ అంతరం లేదంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

ఇప్పటి పల్లెల పరిస్థితి,—గ్రామాధికారుల పెత్తనం, అధికారుల బంధువుల పెత్తనం, తంటాలు, పంటలు అందరికీ తెలిసినవే. జానపదుల వేషభాషలు, వయ్యారాలు, సరాగాలు, సాహసాలు, విలాసాలు, వినోదాలు, అప్పటిలాగే ఇప్పుడు సహజసుందరమైనవే. ప్రొద్దుగూకగనే పల్లె పెద్దలు రచ్చచావడిమీదనో, గుడిముందరనో కొలువుతీర్చి రాచకార్యాలు చక్కబరచుకొంటున్న సంగతి మనకేమి కొత్తదికాదు. రెండువేల సంవత్సరాలనాడూ మన జనపదాల పద్ధతి ఇదేనా—అని అబ్బురం పడేవారు నాతో రండి, హాలునికాలపు గ్రామాలు కొన్ని చూచివద్దాం.

రండి! రండి! ఏదో కోలాహలం వినివిస్తున్నది! ఏమిటిది? ఏదో పండుగలాగ ఉందే! జాతరకాబోలు! ఆడ, మగ ఇటు అటు పరుగెత్తు తున్నారు. తూర్యారావాలు వినిపిస్తున్నాయి. గాలిలో ఏమి వినపడడంలేదు[1]. ఏదోపొడి చల్లుకుంటున్నారు.[2] ఆడ, మగా భేదంలేకుండా బురద కూడా ఒకరి మీద ఒకరు చల్లుకొంటున్నారు. తప్పు లేదు కాబోలు![3] ఏమిటా తూలడం! తాగారా ఏమిటి! ఆఁ. తాగారు. జంటలు జంటలుగా నాట్యాలుచేస్తున్నారు. జుట్టుముళ్లు జారిపోతున్నాయి.[4] కుసుమరంగు చీరలవారు, చెంగావిచీరలవారు, పైటలు గాలికి ఎగిరిపోతున్నయే· బోసిరొమ్ములు! అబ్బ! ఒకరిద్దరు కుసుమరంగు రైకలు తొడుక్కొన్నవారూ ఉన్నారు. ఏం జాతర ఇది![5] హోలీ లాగుందే! ఆఁ! ఆఁ! హోలీయే. లేకపోతే ఈ విచక్షణ లేని పరవళ్ళేమిటి! మన ప్రాంతంలో నేడు ఇది లేదుగాని, తెలంగాణాలో బాగా అలవాటే. ఇంతకూ నేడు ఫాల్గుణ శుద్ధపూర్ణిమ కాదూ.

దగ్గిరికి వెళ్ళి చూద్దాం రండి. వారంతగా సంబరపడుతూంటే మనం మాత్రం ఆనందించగూడదూ మరి? ప్రకృతిదేవి వీరికి కింకరి అయిందా ఏమిటి! పూలు, మొగ్గలు, చివుళ్ళు కనిపిస్తున్నాయే! కొప్పునిండ పూలు. కొప్పులు పూలను వుమ్మివేస్తున్నట్టులేవూ! ఉత్సవానికి అనుగుణమైన వేషాలు![6] చెవులమీదినుంచి ఏమిటి ఆ వ్రేలాడే నగలు! చెంపసరాలా! ఝుమికీలా! అబ్బే! పూలు, చివుళ్ళును. నల్ల కలువలు, నేరేడు చివుళ్ళు,[7] పాదిపూగుత్తులు, ఇప్పపూగుత్తులు, విరజాజులు, మరువం, ఉదుగుచివుళ్లు, రెల్లుపూలు, కొనకి వెదురాకులుకూడ చెవి సందున ఇరికించుకున్నారే! ఆ చక్కనిచుక్క చెవిలోని పూలు ఆమె చెక్కిలి చక్కదనాన్ని వంగి తాగుతున్నట్టు లేదూ![8] మగవారుకూడా ఈ కర్ణావతంసాలు ధరించారు. తల్లో పూలుకూడా తురుముకున్నారు. ఆ రైతు బిడ్డ తలలో చూడండి మామిడి పూగుత్తి! దాని చుట్టూ తుమ్మెదలు ఎలా వెంటబడి తిరుగుతున్నాయో![9] ఆ పెద్దమనిషి తల్లోని పాదిపూలు గుప్పుమంటున్నవి.[10] ఎవరండీ ఆయన? గ్రామాధికారో, ఆయన కుమారుడో అయివుంటాడు. లేకపోతే అంత ఠీవి, అంత హంగు ఎందుకు! అవును! గ్రామాధికారే-గ్రామణియే.

అందరూ ఎంత ఆనందంగా మైమరచి మైకంతో తిరుగుతున్నారు! ఉండనివ్వండి. మనం గ్రామానికి వెళ్లి విశ్రాంతి తీసుకుందాం.

పొలిమేరలోనే ఏమిటి గుడిలాగ వుందే. గ్రామదేవతదా! ఆఁ! గ్రామదేవతదే. ఉద్వాసన చేసినప్పుడు వేసిన పూల

1. ఉప్పహహావిహజణో పవిజిమివాయ అకలఅలోపహ అతూ
అవ్వో సోచ్చేఅభణో తేణ వినా గామదా హెూవ్వ —6-35
2. ఘేత్తూణ చుణ్ణంముట్ఠిం హరిసూససి అవివేపమాణావి సిఢిణో మిత్తేపిఅఅమం హత్థే గంధోధఅం జాఅం —4-12
3. ఫగ్గుచ్ఛణ ణిద్దోసం కేణవి కద్దమ పసాహణం దిణ్ణం థణఅలసముహపలోట్టంత సేఅధోఅం కిణో ధువసి —4-69
4. దఇఅ కరగ్గహలులిఓ ధమ్మిల్లో సీహుగంధిఅం వఅణం మఅణమ్మి ఏత్తిఅం చిఅపసాహణం హరఇ తరుణీణం —6-44
5. గామ తరుణీఓ హిఅఅం హరంతి ఛేఅణం థణహరిల్లీఓ మఅణే కుసుంభరంజిఅ కంచుఅ అహరణమేత్తాఓ —6-45
6. పిఅదంసణ సుహరస మఉలిఅఇ జఇసోణ హెూంతి ణఅణాఇం
తాకేణ కణ్ణరఇఅం లక్ఖిజ్జఇ కువలఅం తిస్సా—4-23
7. సామాఇ సామలిజ్జఇ అద్ధచ్ఛిపలోఇరీఅ ముహసోహా జంబూదలకఅ కణ్ణావఅంసభరిరీ హలిఉత్తే—2-80
8. సామాఇగురుఅజొవ్వణ విసేసభరిరీ కవోలమూలమ్మి పిజ్జఇ అహెూ ముహేణ వ కణ్ణవఅంసేణ లావణ్ణం— 5-39
9. ణక్ఖ్యడిఅం సహఆరమంజరిం పామరస్స సీసమ్మి బందిమ్మివ హీరంతం భమర జుఆణా అణుసరంతి— 4-31
10. గామణి ఘరమ్మి అత్తా ఏక్కవ్విఅ పాడలా ఇహగ్గామే బహు పాడలంచ సీసం దిఅరస్స ణ సుందరం ఏఅం— 5-69

మాల ఎండిపోయి అలాగే గాలికి ఎగురుతున్నది.[1] ఇటు వైపు కొలను. కొలనిలో తామరపూలు. పచ్చంపళ్లెం మీద పెట్టిన శంఖంలాగ తామరపాకు మీద కదలక మెదలక ఉన్న ఆ కొంగను చూడండి.[2] ఇదేమిటి! పీతలాగవుందే! కాదు. వాలుంకిట. అంటే ఒల్లెంక. కాలివేళ్లకు చుట్టుకుంటుంది. పాపం! పుటుపుటుమని కాళ్లుకాస్త విరిగిపోయాయి[3]. చూచి అడుగు వేయండి నలికిరితోగలాగ ఉంది ఎర్రగా. అబ్బే ఎంత మోసపోయాను. మామిడి మోన ఇది; నలికిరి కాదు[4].

అబ్బ! ఎంత హాయిగా ఉందండీ! ఊరి పొలిమేర కొక మఱ్ఱిచెట్టుంటే చాలు, ఊళ్లో సత్పురుషుడు ఉన్నంత సంతోషంగా, శ్రీరామరక్షగా ఉంటుంది; సత్పురుషుడు పోతే, ఊరంతా పాడయినట్టు ఉంటుంది; మర్రిచెట్టు కూలిపోయినా ఊరిపొలిమేరంతా బిక్కు బిక్కు మన్నట్టు ఉంటుంది.[5] మర్రాకుల మీద ఆ తెల్లటి గుర్తులేమిటి అసహ్యంగా కాకిరెట్టలా? చెట్టంతా రెట్టలు వేసిఉంటాయా. ఎవరో సున్నమూ, పెండో కలిపి చిలకరించి నట్లున్నారు, ఆకులు కోసుకు పోగూడదనో, ఇక్కడికి రాగూడదనో![6] మఱ్ఱి విత్తనం మహత్తు ఏమందో గాని; నలుసంత ఉంటుంది గదా! ఎక్కడ బడితేనూ సరే. తక్కిన చెట్టేదైనా దానిని మించి పోతుందా? అన్నీ దానికిందే కదా![7]

మఱ్ఱివృక్షం ఎంత బాగుంటే ఏమి? రాత్రిఎలాగడుపుతాం? ఇక్కడ ఏదో దేవాలయంలా ఉందే. అక్కడికో, మరెక్కడికో వెళ్లి రాత్రి కాస్తా విశ్రమిస్తే రేపటి సంగతి చూచుకుందాం. ఏమిటీ రొద? గోపురంలోని పావురాలు. దేవాలయ గోపురశిఖరం పడిపోయింది. దాని మేకు మాత్రం గోపుర



అమరావతి

నుంచి దూసుకు రావడం, రొద చూస్తే గోపురాన్ని కొరత వేస్తున్నట్టు లేదూ![8] ఇక్కడ ఆ రొదలో ఉండ లేమండి. ఏ ఇంటి అరుగు మీదనైనా పడుకొందాం. మన పల్లె వాసులు అతిథి సత్కార నిరతులు కదా! అంత మాత్రం ఆదరించరూ!

ఇంచు మించు ప్రతి ఇంటి చుట్టూ కంచె లున్నాయి. సందునుంచి వెలుపలికి వచ్చి మనలను పిలుస్తున్నట్టు లేదూ ఈ ఆముదపాకు? పట్టిదేని రొమ్ములుగల వారు ఇంట్లో ఉన్నారని సూచిస్తుంది సుమా ఈ ఆముదపాకు-అంటారేమో! తప్పుకాదూ అలా భావించడం![9] కంచెల సందులలో నుంచి చూడండి. ఎవరైనా కనిపిస్తారేమో! అక్కడ కంచె అంత ఎత్తుగాలేదు. మీగాళ్లెత్తి చూడండి; ఎవరైనా కనిపిస్తే పిలుద్దాము.[10] ఇంటి అరుగు మీద పడుకొని తొలి కోడి

---

1. సా తుజ్ఞ సహత్థదిణ్ణం అజ్జవిరే సుహఅ గంధరహిఅంపి
ఉవ్వసిఅ ణఅర ఘరదేవదేవ్వ ఓమాలిఅం వహఇ—2-94

2. ఉఅ ణిచ్చల ణిప్పందా భిసిణీ పత్తమ్మి రేహఇ బలాఆ
ణిమ్మల మరగఅ భాఅణ పరిట్ఠిఅ సంఖసుత్తివ్వ—1-4

3. నహి ఈరిసి వ్విఅ గఈ మా రువ్వసు తిరిఅలి అముహఅందం
ఏఅణఁ బాలవాలుంకి తంతుకుడిలాణ పేమ్మాణం—1-10

4. దరపుడి అసిప్పసంపుడ ణిలుక్క హాలాహలగ్గ ఛేప్పణిహం
వక్కంబట్ఠి విణిగ్గయ కోమల మంబంకురం ఉఅహ—1-62

5. సుఅణో జం దేస మలంకరేఇ తం విఅ కరేఇ పవసంతే
గామా సణ్ణుమ్మూలిఅ మహా వడట్ఠాణ సారిచ్ఛం—1-94

6. పహి ఉల్లూరణ సంకా ఉలాహిఁ అసఈహిఁ బహలతిమిరస్స
ఆఇప్పణేణ ణిహుఅం వడస్స సిత్తాఇఁ పత్తాఇఁ—2-66

7. ఏక్కేణవి వడబీఅంకురేణ సఅలవణరాఇమజ్ఝమ్మి
తహ తేణ కఓ అప్పా జహ సేసదుమా తలే తస్స—7-70

8. ఉఅరి దర దిట్ఠ థణ్ణుఅ ణిలుక్క పారావఆణఁ విరుఏహిం
ణిత్థణఇ జాఅవేఅణఁ సూలాహిణ్ణంప దేఅఉలం—1-64

9. పఇ విపరణిగ్గఅదలో ఏరండో సాహఇవ్వ తరుణాణం
ఏత్థఘరే హలిఅవహూ ఏద్దహమేత్తత్థణీ వసఇ—3-57

10. ఏక్కేక్కబ వఇవేఢణ వివరంతర దిణ్ణతరలణఅణాఏ
తఇం బోలంతే బాలఅ పంజరసఉణాఇఅం తీఏ—3-20

తా కిం కరేఉ జఇ తం సితీఅ వఇవేట్ఠ పేల్లి అథణీఏ
పాఅంగుట్ఠద్ధక్కి త్తాణిసహంగీఅ విఇ దిట్ఠో—3-21



అజంతా

కూయగానే లేచిపోదాం.[1] పరుచు కొనేందుకు పక్కలు గూడానా? బాగుంది. ఇక్కడి ఆచారం ప్రకారం గడ్డిమోపు యిస్తారట. పరదేశం, ఏదో సర్దుకుందాం. గడ్డిపరచుకుని పైన అంగవస్త్రం వేసుకుని పడుకుంటే వెచ్చగానే ఉంటుంది. ఎందుకు, ఈ ఇంటి యిల్లాలు గడ్డిమోపు ఇవ్వడానికి కూడా నఖుక్కుంటూంది. రోజు వచ్చి పోయే వారు మన లాంటి వారు ఎందరో పాపం! విసుగుపడితే తప్పామరి?[2] అబ్బా! భరించలేమండీ పల్లెటూళ్లలో కుక్కల గోలను. కొత్తవారు కనిపించారా, ఒకే మొరుగుడు.[3]

లేవండయ్యా, లేవండి. కోడి కూస్తున్నది. ప్రయాణానికి తయారుకండి అని మనకు, మీ మీ పని చేసుకోండని ఇతరులకు, చెబుతున్నట్టుంది.[4] ఏమిటి మిత్రమా! ఆ కోడి కూతకు అంత అదిరిపడుతావు? వెనకటికి మా మిత్రుడొకడు పరగృహాలను మరగినవాడు, కోడికూతతో చల్లగా ఇంటికి చేరుకొనేవాడు. ఒకప్పుడు తన ఇంట్లో పండుకున్నప్పుడు కోడికూత విన్నా పరగృహం అనుకుని పయనం ఆయ్యేవాడట.[5] పదండి. బయలుదేరుదాం. ఊరిబయటి కొలనిలో స్నానంచేసి వద్దాం. ఓహో! నిశ్చలంగా చెరువు యెంత అందంగా ఉందండి. లోపల నీలాకాశం ప్రతిఫలిస్తూ ఉంటే ఆకాశాన్ని ఎవరో విసిరి కొలనిలో పడేశారా—అన్నట్టుగా వుంది. అంత పెద్ద ఆకాశం పడినా ఒక కమలం నలగలేదు; ఒక్క హంస యెగిరిపోలేదు.[6] అమ్మయ్య! నీరు యెంత హాయిగా ఉందండీ. ఈ ఈదుదాం రండి. మహిళలుకూడా మజ్జనం చేస్తున్నారన్న మాట. కొంచెం తప్పుకుని స్నానం చేద్దాం. పల్లెపడుచులు బాగా ఈతున్నారుసుమా. అరె! అరె! మొసలా ఏమిటి? కాళ్లు లాగుతున్నది! అయ్యో! అయ్యో! అరిపిడుగా! మనిషివా? మొసలనుకున్నాను. ఎవరినో లాగబోయి, పొరపాటు చేశానంటావా? ఓహో ప్రియురాలినా ఏమిటి?[7] అవిడను చూచారూ! స్నానంచేసి నిలుచుంది. కురుల నుండి జారేనీరు, యిక తన్ను కట్టి ముడివేస్తారే అని కురులు కన్నీరు జాలువారుస్తున్నట్టు లేదూ![8]

కొలని నుంచి తిరిగి వచ్చేలోపుగానే ఏమిటీ కోలాహలం? నిన్నటిలాగా మరేదైనా ఉత్సవమా? ఓహో! అదా సంగతి? గ్రామణిగారి (గ్రామాధికారి) కుమార్తె పెండ్లట. సకుటుంబ సపరివార సమేతంగా రావాలని ఊళ్లో అందరికి ఆహ్వానాలు వచ్చాయి. మనంకూడా నిన్నవిశ్రమించిన ఇంటి వారి పరివారంలో వారం ఆయాముగా మరి! వెళ్లువాం, పెండ్లి చూడడానికి.

ఈ గ్రామణిగారు మంచి పరాక్రమవంతుడు. ఈయనే కాదు, తాతముత్తాతలు అటు, ఇటు కుమారుడూ మొనగాళ్లేనట. అంతకు ముందు ఊళ్లో దొంగలు పడటం, గ్రామవాసులు భయంతో చెట్టుకొకరు, పుట్ట కొకరుగా పారిపోవడం, కొండల్లో, గుహల్లో తలదాచుకోడం మామూలట. ఈయన పాలనలో అటాటి భయమేమి లేదు, ఊరు అలా

1. తహసోత్తాఇ పులఇఓ దరవలి అంతద్ధ తారఅం పహిఓ జహ వారిఓ వి ఘరసామిణీఇ ఓలింబఏ వసిఓ —3-54

2. భండంతీఅ తణాఇం సోత్తుం దిణ్ణాఇ జాఇ పహిఅస్స తాఇం చ్చేఅ పహేఏ అజ్జా ఆఅట్టిఇ రుఅంతీ—4-79

3. సుణఅపఉరమ్మిగామే హిండంతీ తుహ కఏణ సాబాలా పాస అ సారివ్వ ఘరం ఘరేణ కఇఆ వి ఖంజిహిఇ —2-38

4. చోరాణ(కాముఅణ( అ పామరపహిఆణ( కుక్కుడో పఆఇ రే వమహ వహహ వాహయహ ఏత్థ తణుఆఅఏ రఅణీ —7-98

5. ణిఅఘరణిఅం ఉపఊహన కుక్కుడసద్దేన ఝత్తిపడిబుద్ధ పర వసఇ వాసనంకిర ణిఅఏవి ఘరమ్మి మా ఖాసు. —6-82

6. కమలాఅరా ణ మలిఆ హంసా ఉడ్డావిఆ ణ అ పిఉచ్ఛా కేణావి గామతడాఏ అబ్భం ఉత్తాణఅం ప్యూఢం —2-10

7. పికుశంతి కామిణీణం జలలుక్కపిఅవఊహణ సుహేల్లిం కండఇఆ కఓలుప్ఫుల్లణిచ్చలచ్ఛీఇ( వఅణాఇం—6-58

8. వత్తణిఅంబప్పంసా ణ్హాణుత్తిణ్ణాఏ-సామలంగీఏ జల బిందు ఏహి చిహురా రుఅంతి బంధస్స వ భఏణ —6-55

పరుగెత్తే ఊహ తలపెట్టడం లేదు.[1] ఈయన తండ్రి మరణ సమయంలో ఈయన్ను పిలిచి "నా పేరుతో నీవు సిగ్గుపడ కుండా ఉండేట్టు నడుచుకో" అని ఉపదేశించి మరణించా డట.[2] ఇక ఈయన కుమారుని సంగతి మరీ ముచ్చటైం దట. కుర్రవాడైనా తండ్రికి చేదోడు వాదోడుగా ఉంటాడట. పరిజనులు, ప్రతిపక్షులూ విస్తుపోయేట్టు గ్రామ రక్షణ చేస్తాడు.[3] గ్రామణి పుత్రుడు మేటివిలుకాడు. పోరాటా లలో ప్రహారాలకు గాయాలు, గంట్లుపడ్డ ఆయన రొమ్ము పైన అయన భార్య సుఖంగా నిద్రించ లేక పోయినా, పల్లెంతా హాయిగా గుండె మీద చేయివేసుకొని నిద్రపోతుం దట.[4] ఇక నిష్ఠ అందామా! పరస్త్రీ పరాఙ్ముఖుడు. కనుక కులటందరూ అయన్ను పరమ దుర్దర్శనుడని, నింబకీటం (చేదంటనే తినే వేపపురుగు) వంటి వాడని, పెండ్లానికి భయ పడతాడని, నిర్దయుడని నిందిస్తుంటారట.[5]

గ్రామణిగారిల్లు అందంగానే వుంది. ఇంటి ముందు గున్న మామిడి పూచిందికూడా. మామిడి పూస్తే యిక నేముందీ ఒంటరిగాళ్ళకు అనర్థమే[6]. దొడ్లో పాదిరిచెట్టు న్నట్టుందే; గుప్పుమంటున్నది వాసన. ఊడుగుమాను వుంటే దయ్యాలు రావని నమ్మకం వీరందరికిని. ప్రతి ఇంట్లోను ఊడుగమాను వుండనే ఉంటుంది. అంకోటం (ఊడుగు) వాసన తెలివి తప్పినవారినికూడ బతికిస్తుంది.[7] పాదిరిపూల పసదనమే పసదనం. తల దిమ్మెక్కిపోతుంది[8]. అరె! అరె! ఎవరో అబ్బాయి పాదిరి చెట్టును యెక్కు తున్నట్టున్నాడు. పెద్ద చెట్టు; బోదెలు, కొమ్మలు చాలా యెత్తుగా వున్నాయి; పడిపోతాడు![9] ఈ పాదిరిపూల వాస నతో అసలు సంగతే మరచాము పదండి పెండ్లింటిలోకి.

గ్రామణి పుత్రి మంచి అందగత్తె. సోగకన్నులు, సాగి పోతున్న చెన్నులు, వామనావతారంనుండి త్రివిక్రమావ తారం యెత్తుతున్న రొమ్ములు.[10] మరి చూచినవారు రెప్ప వాల్పరంటేనూ,[11] సౌందర్యాన్ని కథలుగా చెబుతుంటా రంటేనూ తప్పా! పెళ్ళికూతురిని చేస్తున్నారా ఏమిటి? ఎటు చూచినా సుందరీ బృందమే. రత్నాలు విరజిమ్మి నట్టు, పూలుకోసి పడవేసినట్టు లేదూ! ప్రకృతే సవ్వుతు న్నట్టు లేదూ! ముత్యాలహారాలవారు[12], కంకణాలవారు,[13]

---

1. వింఝూరుహణాతం పల్లీ మాకుణఉ గామణీ ననఇ
వచ్ఛజ్జివిఓ జఇకహఇవి సుణఇ తా జీవి అం ముఅఇ
—8-31

2. అప్పాహేఇ మరంతో పుత్తంపల్లీవఈ పయత్తేణ
మహ ణామేణ జహతుమం ణ వజ్జసే తహకరే జ్జాను
—7-32

3. జహ చింతేఇపరిఅణో అసంకఇ జిహ అ తస్సపరివకో
బాలేణ వి గామణి సందణేణ తహ రక్ఖిఅ పల్లీ—7-28

4. పహర వణ మగ్గ విసమే జాఅ కిచ్ఛేణ బహఇవేణిద్దం
గామణి ఉత్తస్స ఉరే పల్లీ ఉణసానుహం సుహదు
---1-31

5. ణిక్కఅ జాఅభీరుఅ దురంశణ ణిముకీటనారిచ్ఛ
డామో గామణిఉందథ తుజ్ఝక్ఛ తహవితణుఅఇ
—1-35

6. ఖేమం కంతో ఖేమం జోసో ఖుజ్జంబఓ ఘరద్దారే
తస్సకిల మత్థఅఓ కోవి అణత్థో సముప్పణ్ణో—5-99

7. పుట్ఠిం పుసను కిసోఅరి పడోహరంకోల్ల పత్తచిత్తలిఅం
ఛేఅహిఁ దిఅరజాఅహిఁ ఉజ్జుఏ మా కలిజ్జిహిసి—
4-13

మహమహఇ మలఅవాఓ అత్తావారేణ మం ఘరాణేంతీం
అంకోల్ల విరిమలేణవి జోణ్హమఓ సో సుఓవ్వేవ
—5-97

8. గామణి ఘరమ్మి అత్తా ఏక్కవ్విఅ పాడలా ఇహగ్గామె
బహుపాడలం చ సీసం దిఅరస్సణ సుందరం ఏఅం
—5-69

9. ణిక్కండ దురారోహం పుత్తఅ మాపాడలింసమారుహసు
అరూఢణివడిఅ కేణమిఅ ణకఅ హఅసాఏ—5-68

10. పఢమం వామణ విహిణా పచ్ఛాహుకఓ విఅంభమాణేణ
థణ జుఅలేణ ఇమీఏ మహుమహణేణవ్వ బలిబంధో
—5-25

11. ఏక్కచ్ఛిఅ రూఅగుణం గామణిధూఅ సముప్వహఇ
అణిమిస ణయణో సఅవో జీఏ దేవీ కఓ గామో-6-92

12. ఖిప్పఇ హారో థణమండలాహి తరుణీఅ రమణ
పరిరంభే
అచ్ఛిఅగుణా వి గుణినో లహంతి లహుఅత్తణం
కాలే—5-29.

13. పాణిగ్గహణే వ్విఅ పవ్వఈఏఁ ణాఅం సహీహిఁ సోహగ్గం
పసువఇణా వాసుఇకంకణమ్మి ఓసారిఏ దూరం
—1-69

సఅహే చింతామణిఅం కాఊణ పిఅం ణిమీలిఅచ్ఛీఏ
అప్పాణో ఉఅఊఢో పసిఢిలవలఅహిఁ బాహాహిం.
—2-33

జో వి ణ అణఇ తస్స వి కహేఇ భగ్గాఇఁ తేణ వలఆఇఁ
అఇఉజ్జుఅ వరాఈ అహవ పిఓ సే హఅసాఏ.—5-38

అణకోవణా వి సాసూ రుఅవిఅ గఅవఈఅ సోణ్హాఏ
పాఅపడణోణ్ణఅఏ దోసు వి గలిఏసు వలఏసు—5-93

పాంజీలవారు,[1] కర్ణాభరణాలవారు,[2] మణిమేఖలలవారు[3]. చెవాకుకూడా కొందరు పెట్టుకున్నట్టున్నారే. పాపం! బంగారు కమ్మలు పెట్టుకున్న చెవుల్లో తాటికమ్మలు.[4] పట్టుచీరలవారు, నల్లచీరలవారు, నవరంగకం-కుసుమ పూవు రంగు చీరలవారు, రక్తదుకూలాలవారు, భేష్![5] ఎవరావిడ! వనలక్ష్మిలా నెమలి పింఛం కొప్పులో తురుము కొన్న నెరజాణ? భిల్లవనితలా వుందే; మెడలో పద్మ రాగాల మాలికలాగ గురువింద దండ! ఈమె ముందు ముత్యాల పేర్లు వేసుకున్న వారంత దిగదుడుపుసుమా![6] ఎవరండీ రైతు పడుచు! కుసుమపూవు రంగు చీర కట్టుకుని మురిసిపోతూ, వీథంతా తనే అయినట్టు నడుస్తూ వస్తున్నది! లేకలేక తెచ్చి ఇచ్చాడు కాబోలు భర్త ఈ చీరను[7].

ఏమిటమ్మా పెండ్లికూతురిని అలా బోసిమెడతో కూచో పెట్టారు? సంబరంలో ఏమీ తోచలేదుకాబోలు! ఆ పచ్చల కంటె వేయించండి.[8] పాపటదిద్ది రేగినజుట్టును దువ్వెనతో అలా అనండి. ఏమి దువ్వెనండీ పుల్లతో మురికి తీసి వేయండి త్వరగా.[9] ముఖంలో తిలకం చెరిగిపోతే యేమి బాగుంటుంది? తిలకం బాగా దిద్దించండి.[10] పసపాడిం చారు; కాళ్ళకు పారాణి పూశారు.[11] కాటుక పెట్టారు. బాగుంది. కొప్పులో పూలు ముడిచారు, స్నానసుగంధిల మైన చికురభారం పూలను ఉమ్మివేస్తున్నట్టు ఉంది; మరీ బాగుంది[12]. కాని కంచుకం లేకపోవడం యేమీ బాగా లేదు. ఈ శుభదినాననైనా కంచుకం తొడగించండి, ఎర్రదో! నల్లదో! కుసుమపూవు రంగుదో! నల్లదైతే తొడ గించండి. మేఘాల్లోని చంద్రుని అందం వస్తుంది మిట్ట

---

1. ణేఉర కోడి విలగ్గం చిఉరం దఇఅస్స పాఅ పడిఅస్స
హిఅఅం పఉత్థమాణం ఉమ్మోఅంతీ వ్విఅ కహేఇ
—2-88

2. రేహఇ గలంతకేసక్ఖలంతకుండల లలంత హారలఆ
అద్ధుప్పఇఅ విజ్జాహరి వ్వ పురుసాఇరీ బాలా—5-46

3. మసిణం చంకమ్మంతీ పఏపఏ కుణఇ కిస
ముహభంగం
ణూణం సే మేహలిఆ జహణగఅం ఛివఇ ణహవంతిం
—5-63
రుందారవిందమందిర మఅరందాణంది అలిరించోలీ
ఝుణఝుణఇ కనణ మణిమేహల వ్వ మహుమాస
లచ్ఛిఏ—6-74

4. పరిరద్ధ కణఅ కుండల గండత్థలమణహరేను నవణేసు
అణ్ణిఅ నమఅవసేణ అ పహిరజ్జఇ తాటవేంటజుఅం
—4-98

5. ణీలపడపాఉఅంగి త్తి మా హు ణం పరిహరిజ్జాసు
పట్టంసుఅం పి ణద్ధం రఅమ్మి అవణిజ్జఇ చ్ఛేఅ
—6-20
నంఝా రాఓత్థఇఓ దీసఇ గఅణమ్మి పడివఅచందో
రత్త దుకూలంతరిఓ ధణణహ లేహో వ్వ ణవవహుఏ
—6-69
ఊహ నంభమ విక్ఖిత్తం రమిఅవ్వఅ లేహలాఏ అనఊఏ
ణవరంగఅం కుడంగే ధఅం వ దిణ్ణం అవిణఅస్స
—5-61

6. సిహిపేహుణావఅంసా వహుఆ వాహస్స గవ్విరీ భమఇ
గఅమోత్తిఅరఇఅ పసాకహణాణం మజ్ఝే సవత్తీణం
—2-73
ణ గుణేణ హీరఇ జణో హీరఇ జో జేణ భావిఓతేణ
మోత్తూణ పులిందా మోత్తిఅఇఁ గుంజాఓఁ గేణ్హంతి
—4-10

7. అప్పత్త పత్తఅం పావిఊణ ణవరంగఅం
హలిఅ సోణ్హా
ఊఅహ తణుఈ ణ మాఅఇ రుందాసు వి
గామ రచ్ఛాసు—3-41

8. ఊఅ పోమ్మరాఅ మరగఅ నంవలిఅ
ణహఅలాఓ ఓఅరఇ
ణహసిరి కంఠబ్భట్ఠ వ్వ కంఠిఅ కీరరించోలీ
—1-75

9. మజ్జేపఅణుఅ పంకం అవహోవాసేను సాణచిక్ఖిల్లం
గామస్స సీన సీమంతఅం వ రచ్ఛాముహం జాఅం
—7-82
ష్ణణ హలిద్దాభరిఅంతరాఇఁ జాలాఇఁ జాలవలఅస్స
సోహంతి కిలించిఅకంటఏణ కం కాహిసీ కఅత్థం!
—1-80

10. తీఅ ముహాహిం తుహ ముహం తుజ్ఝ ముహాఓ అ
మజ్ఝ చలణమ్మి
హత్థాహత్థీఅ గఓ అఇదుక్కరఅరఓ తిలఓ—2-79

11. అహఅం లజ్జాలుఇణీ తస్స అ ఉమ్మచ్ఛరాఇఁ
పేమ్మాఇం
సహి అఅణో వి ణిఉణో అలాహి కిం పాఅరాఏణ
—2-27

12. ఖిణ్ణస్స ఉరే పఇణో ఠవేఇ గిమ్హావరణ్హరమిఅస్స
ఓలం గలంతకుసుమం ణ్హాణసుఅంధం చిఉరభారం—
3-99

లకు[1]. చందనచర్చ చెడదులెండి[2]. ముత్యాల హారాలు యమునా తరంగాలపై దొర్లే నురుగులాగ అందమిస్తాయి కూడను.[3] కట్టిన పట్టుచీర జారిపోకుండ పోకముడి గట్టిగా బిగించండి.[4] బంగారు మొలనూలు మాత్రం మాంచి అదృష్టం చేసుకుందిలెండి. మరి మొదట అ నిప్పులో పడి తర్వాత నీరులో మునకవేసి శ్యామశబలవ్రతం చేసిందికదా, అంతమాత్రం సుందరస్థానం పొందవద్దూ మరి![5] మరచాను పెండ్లికూతురు నగన వర్ణికలు— నమూనాలు బాగున్నాయి.[6] ఏ బత్తుణితో చేయించారు? బంగారులో కల్తీ లేదుకదా! వరపెట్టి చూపించారా?[7] రత్నాలన్నీ పరీక్షచేయించుకున్నారా?[8]

ఏవండీ పూలమాలలేవీ? మొదలే జాగ్రతపడవద్దూ! ఏమిటి గోల వెలుపల? ఓ మాలాకారి! అయితే మంచి నమయానికే వచ్చింది. వెళ్లి పూలమాలలు తెండి. మాలాకారి మంచి జాణ! పూలిచ్చే సాకుతో భుజాలు ఎత్తుతూ తమాషాలుచేస్తూ కొడెగాళ్లను ఆకర్షిస్తున్నది.[9] ఏమిటి తమ్ముడూ! పూలబేరంసాకుతో ఎక్కడ చూస్తున్నావు? మాలాకారి బాహు మూలాలనా? ఛా![10] గృహద్వారతోరణం పైవున్న ఆ ఎండిపోయిన వందనమాలను తీసివేసి కొత్తది వెయ్యిద్దురూ![11] ద్వారంలో మంగళ కలశాలుకూడా పెట్టండి బాబూ! పెండ్లినంబరంలో సర్వసాధారణమైన ఆచారాలు మరిస్తే ఎట్లా?[12]

ఇక పెండ్లికూతురికి పెండ్లికడేలు (అవిధవాలక్షణ వలయాలు) తొడిగించండి.[13] పూజాకలశంలో తామరపూలు వేయండి[14]. మంగళగాయికల మంగళగీతాలాపాలు కానివ్వండి. మంగళగీతంలో తన భావిపతి పేరు, వంశం శ్రద్ధగావింటున్న పెండ్లికూతురు ఒళ్లు పులకరించిపోతున్నది చూచారా?[16] పెళ్లికూతురు మనసు హృదయఫలకం

---

1. అజ్జాఇ ణీలకంచుఅ భరిఉవ్వరిఅం విహాఇ థణపట్టం
జలభరిఅ జలహరంతరదరుగ్గఅం చందబింబ వ్వ—
4-95

2. తావమవణేఇ ణ తహా చందణపంకో వి కామి మిహు
ణాణం
జహ దూసహే వి గమ్హే అణ్ణోణ్ణాలింగణ సుహేల్లీ—3-88

3. మగ్గం చ్చిఅ అలహంతో హారో పీణుణ్ణఆణ థణఆణం
ఉవ్విగ్గో భమఇ ఉరే జముణాణఇఫేణ పుంజో వ్వ—
7-69

4. జాఓ సో వి విలక్ఖో మఏ వి హసిఊణ గాఢ మువగూఢో
పఢమోసరిఅస్స ణిఅంసణస్స గంఠిం విమగ్గంతో—
4-51

అలిఅపసుత్తవలంతమ్మి ణవవరే ణవవహూఅ వేవంతో
సంవేల్లిఓరు సంజమిఅవత్థగంఠిం గఓ హత్థో - 7-46

5. ఇఅరో జణో ణ పావఇ తుహ జఘణారుహణ సంగమ
సుహేల్లిం
అణుహవఇ కణఅడోరో హుఅవహ వరుణాణ
మాహప్పం—3-11

దీహుణ్హపఉరణీసాసపఅవిఓఁ వాహసలిల పరిసిత్తో
సాహేఇసామసవలం వ తీఏ అహరో తుహ విఓఏ—2-85

6. దోఅంగులఅకవాలఅపిణద్ధ సవిసేసణీలకంచుఇఆ
దావేఇ థణత్థలవణ్ణిఅం వ తరుణీ జువజణాణం—
7-20

7. వాఉలిఅపరిసోసణ కుడంగపత్తలణ సులహసంకేఅ
సోహగ్గకణఅకసవట్ట గిమ్హ!మా కహ వి ఝింజిహసి—
7-26

8. దుస్సిక్ఖిఅ రఅణపరిక్ఖఏహిఁ ఘిట్ఠోసి పత్థరే తావ
జా తిలమేత్తం వట్టసి మరగఅ కా తుజ్ఝ ముల్లకహా—
7-27

9. మాలారీ లలిఉల్లులిఅబాహుమూలేహిఁ తరుణహిఅఆఇం
ఉల్లూరఇ సజ్జుల్లూరిఆఇఁ కుసుమాఇఁ దావేంతీ—
6-96

10. మాలారీఏ వేల్లహలబాహుమూలావలోఅణ సఅణ్హా
అలిఅం పి భమఇ కుసుమగ్ఘపుచ్ఛిరో పంసులజుఆణో—
6-98

11. సా తుహ కఏణ బాలఅ అణిసం ఘరదారతోరణ ణిసణ్ణా
ఓససఈ వందణమాలిఅ వ్వ దిఅహం విఅ వరాఈ—
3-62

12 రత్థా పఇణ్ణ ణఅణుప్పలా తుమం సా పడిచ్ఛఏ ఏంతం
దారణిహిఏహిఁ దోహిఁ వి మంగలకలసేహిఁ వ
థణేహిం—2-40

13. అవిహవలక్ఖణవలఅం రాణం సోంతా పుణోపుణో గలిఅం
సహసత్థో చ్చిఅ మాణంసిణీఅ వలఆరఓ జాఓ—6-39

14. కం తుంగథణుక్ఖిత్తేణ పుత్తి దారట్ఠిఅ వలోఏసి
ఉణ్ణామిఅ కలసణివేసిఅగ్ఘకమలేణ వ ముహేణ—
3-56

15. గిజ్జంతే మంగళగాఇఆహిఁ వరగోత్తదిణ్ణఅణ్ణావి
సోఉం వ ణిగ్గఓ ఉఅహ హెూంతవహుఆఇ రోమంచో
—7-42

మణ్ణే అఅణ్ణంతా అసణ్ణవిఅహ మంగళుగ్గాఇం
తేహిఁ జుఆణేహిఁ సమం హసంతి మం వేఅసకుడంగా
—7-43

మీద ఆశ అనే బలపంతో ఏమేమి తియ్యని కలలు వ్రాసుకుంటున్నదో?[1] మంగళవాద్యాలు వాయించండయ్యా. పటహం-తప్పెట వాయించండి.[2] గ్రామణిగారి గొప్పకు తగినట్టు ఏనుగుపై నగారావేసికూడావాయిస్తున్నారు! బాగుంది. ఏనుగుతో పెళ్లిపందిరి మరీ నిండుగా ఉంది లెండి.[3]

పెండ్లినందడిలో భోజనం నంగతి చూచే వాళ్లున్నారా లేదా? మహానసంవైపు వెళ్లివద్దాంరండి. వంటలు మహా జోరుగా సాగుతున్నాయండోయ్. పిండి దంచుతున్నది ఒకామె. అరిసెలకా ఏమిటి? పిండి ఒళ్లంతాపడి క్షీర సముద్రంనుంచి పుడుతున్న లక్ష్మిలాగ ఉన్నావమ్మా, మహా అందంగా![4] లడ్లుకూడ కదుతున్నట్టున్నారు.[5] మోదకాలు కూడానా! పూర్ణంవా? పిండివా? అందుకేనేమిటి సెనగలు వేయించి చేటలో పోశారు! చేట కాలిపోయేని దూరంగా పెట్టండి.[6] ఏమమ్మా వంట మసంతా నీ ముఖానికే పూసుకున్నట్టున్నావే? మసి పూసుకున్నా అందానికేమి కుందు కలుగలేదులే! అయినా సవ్వుతారు తుడుచు కొందూ![7] ఎందు కండీ అలా ఊదుతున్నారు పొయ్యిని మీరు. ఊదిన కొద్దీ మీకు దగ్గరగా ఉందామని కాపోలు నిప్పు మండనే మండడం లేదు.[8] ఆవిడను చూడండి మరీ ఇదిగా ఉంది. పిండి దంచిందా. ఆ పిండి రొమ్ముల పైపడిందా? తామర పూవువద్ద వున్న హంసల్లా లేపూ[9] అనందులు (ముక్కాలి పీటలు) ఒక దానిపై ఒకటి ఉచ్చాపచంగాపెట్టి ఏమిటి అందు కుంటున్నారు?[10] పాల చట్టినా! అయితే దించుకొని దీనిలో పోయనా? దిగేప్పుడు పడిపోయేరు! ఇంతకూ పాలల్లో పాలుకలిపితే ఏమి తెలుస్తుంది, నీళ్లు కలిపినా తెలియనప్పుడు![11] చట్టువంతో అన్నం కలియ బెట్టండి. వార్పా? అత్తెనరా?[12] కాకు లొచ్చి కలుషితం చేసేను, తోలండి, తోలండి.

వంటలెప్పు డవుతాయో! ఆకలవు తున్నది. ఆ వేయించిన సెనగలిలా ఇవ్వండి. నమిలి మంచి నీళ్లుతాగుతాను. ఇదేమిటి? మంచి నీళ్లిమ్మంటే కాగి చల్లారిన నీరిచ్చారు, జ్వరం తగిలిన వానికి ఇచ్చినట్టు: కాగి చల్లారిన నీటిలో రుచా పచా![13] స్వప్నంలో తాగిన నీటిలాగ,[14] చిత్రంలో చూచిన లడ్డూలాగ[15] దాహం తీరుతుందా? ఆశ తీరుతుందా?

---

1. జం జం అలిహఇ మణో అసావట్టీహిఁ హిఅఅ ఫలఅమ్మి
తం తం బాలో వ్వ విహీ ణిహుఅం హసిఊణ పమ్హుసఇ
—7-56

2. అణుత్తం తేణ తుమం పఇణో పహఏణ పడహసద్దేణ
మల్లిణ లజ్జసి ణచ్చసి దోహగ్గే పాఅడిజ్జంతే—7-85

3. ధూలిమయిలో వి పంకంకిఓ వి తణరఇఅ దేహభరణో వి
తహ వి గఇందో గరుఅత్తణేణ ఢక్కం సముప్వహఇ—
6-26

4. పేచ్ఛంతి అణిమినచ్ఛా పహిఆ హలిఅస్స పిట్ఠపండురి అం
ధూఅం దుద్ధ సముద్దుత్తరంతలచ్ఛిం విఅ సఅహ్హా—
4-88

5. కమలం ముఅంత మహుఅర పిక్కకఇత్థాణఁ గంధ లోహేణ
ఆలేక్ఖ లడ్డుఅం పామరో వ్వ ఛివిఊణ జాణిహిసి—
7-41

6. సుప్పం డడ్ఢం చణఅ ణ భజ్జిఆ సో జుఆ అఇక్కంతో
అత్తా వి ఘరే కువిఅ భూఅణంప వాఇఓ వంసో—6-57

7. ఘరిణీఏ మహాణస కమ్మలగ్గమసి మలిఇఏణ హత్థేణ
ఛిత్తం ముహం హసిజ్జఇ చందావత్థం గఅం పఇణా—
1-13

8. రంధణ కమ్మణిఉణిఏ మాజూరసు రత్తపాడలసుఅంధం
ముహ మారుఅం పిఅంతో ధూమాఇ సిహీ ణ పజ్జలఇ—
1-14

9. ముహ పుండరీఅ ఛాఆఇ సంఠిఅ ఉఅహ రాఅహంసే వ్వ
ఛణపిట్ఠ కుట్టణుచ్ఛలిఅ ధూలి ధవలే థణే వహఇ—
7-24

10. కహఁ తంపి తుఇ ణవాఅం జహ సా ఆసందిఅణఁబహు అణం
కాఊణ ఉచ్చవచిఅం తుహ దంసణ లేహలా పడిఅ
—7-97

11. గమ్మిహిసి తస్సపాసం సుందరి మా తురఅ వడ్ఢఉ మిఅంకో
దుద్ధే దుద్ధం మిఅ చందిఆఇ కో పేచ్ఛఇ ముహం దే—
7-7

12. భిచ్చాఅరేఁ పేచ్ఛఇ ణాహిమండలం సావి తస్స ముహ అందం
తం చటుఅం అ కరంకం దోహ్ణ వి కాఅ విలుంపంతి—
2-62

13. పేమ్మస్స విరోహిఅ సంధిఅస్స పచ్చక్ఖ దిట్ఠవిలిఅస్స
ఉఅఅస్స వ తావిఅసీఅలస్స విరసోరసో హోఇ—1-53

14. అవిఅహ్ణ పేక్ఖణిజ్జేణ తక్ఖణం మామి తేన దిట్ఠేణ
సివిణఅపీఏణ వ పాణిఏణ తహ్ణ వ్విఅ ణ ఫిట్టా—1-93

15. కమలం ముఅంత మహుఅర పిక్కకఇత్థాణఁ గంధ లోహేణ
ఆలేక్ఖ లడ్డుఅం పామరోవ్వ ఛివిఊణ జాణిహిసి—
7-41



అమరావతి

పెళ్లి పందిరిలో పిల్లల అల్లరి కూడా సరదాగానే ఉంది. ఎందు కా పెద్దమనిషిని అందరూ ఏడిపిస్తున్నారు? పాపం! ధార్మికుడులా ఉన్నాడు. ప్రాచీన సంప్రదాయంతో తమంత తాము ఉండే వారంటే—ధార్మికులంటే—ఎందుకో కుర్ర కారుకు గిట్టదు. ఎందు కలాఏడ్పిస్తున్నారు—ఆయనను. చిలక కొరికిన మామిడి పండెను కొనుకుంటున్నాడు, మీగాళ్లైత్తి[1]. ఏమిటి ధార్మికయ్యగారు మీ గాళ్లైత్తారు. మామిడికాయ కొనుకుంటూ అలాగే స్వర్గానికి లేచిపోతారా- అని అందరూ కేరింతలు. మొన్న మరొక ధార్మికుడు గోదావరిగట్టున కానుగకొమ్మ విరుచుకుంటుంటే ఒకావిడ అట్లే ఎత్తి పొడిచిందట. పిల్లికి గంజినీరు పెడితే పాలను కుంటుందా? మోనపోతుందా?[3] కోతికి అవాకు తిని పించారా? ఒకే గోలచేస్తున్నది; పొట్ట బాదుకుంటున్నది[4]. ఆ రెండవకోతి నేరేడుపండిచ్చినా తినదేం? ఒకసారి తుమ్మెద కరిచింది. అప్పటినుండి నేరేడుపండంటే తుమ్మెద అని భ్రమపడుతున్నదన్నమాట. ఆ మూడోకోతి సంగతేమిటి? దూలగొండాకు తాకించారా? తెగ బరు క్కుంటూంది ఒళ్లంతా.[6]

నాగవల్లి (చతుర్థిమంగళం) చేసుకుని అల్లుడు వెళ్లు తున్నట్టున్నాడు.[7] ప్రస్థాన కలశం పెట్టించండి.[8] సామాను సర్దుతున్నారా! ఒకే ఎద్దుపై అంతగా బరువువేయకం డయ్యా. బరువుకు కుసిపడిపోతుంది.[9] రండిరండి, ఊరి పొలిమేరవరకు సాగనంపివద్దాం పెళ్లివారిని.[10]

పెండ్లి సందడిలో కనిపించలేదుగాని, ఏమి ఎండలు! ఏమి ఎండలు! భరించలేమండి. ఎండకాలం వచ్చింది గదా, యెండలుకాక మంచు కురుస్తుందా అంటారేమో! అయినా ఇంతటి ఎండలా? నిప్పులు చెరిగేస్తున్నది. చెట్ల నీడకూడ యెండ భయానికి బయటరాదన్నట్టు ఉంది[11] చెట్లలోని కీచురాళ్లు గీపెడుతూంటే, చెట్లు యెండభయానికి ఏడుస్తున్నట్లు కనిపిస్తుంది.[12] ఈ యెండ సంగతి తెలీక ఊరు కదిలాము. అబ్బ అదేమిటి? దూరంగా నిప్పంటు కున్నట్టుందే? ఔనండీ అవి కొండమీది అడవులు. ఎండకు

1. చంచుపుడాహఅ విఅఅఅ సహ అరరసేణ సిత్తదేహస్స
కీరస్సమగ్గలగ్గం గంధంధం భమఇ భమరఉలం—
7-66

2. భంజంతస్సవి తుహ సెగ్గగామిణో ణఇకరంజ సాహాఓ
పాఅ అజ్జ వి ధమ్మిఅ తుహ కహఁధరణిం విహ
ఛివంతి—2-67

3. ణ వి ణా సబ్భావేణ గ్ఘేప్పఇ పరమత్థ జాణుఓలోఓ
కోజుణ్ణ మంజరం కంజిఏణ వేఆరిఉం తరఇ—
3-86

4. గోలాణఇఏ కచ్ఛే చక్ఖంతో రాఇఆఇ పత్తాఇం
ఉప్పడఇ మక్కడో ఖోక్ఖఏఇ పోట్టం అ పిట్టేఇ—
2-71

5. ఓసరఇ ధుణఇసాహం ఖోక్ఖాముహలో పుణోసముల్లిహఇ
జంబూఫలంణగేణ్హఇ భమరో త్తి కఈ పఢమ డక్కో—
6-31

6. ణచ్ఛివఇ హత్థేణ కఈ కండూఇభవేణ పత్తలని ఉంజే
దరలంబిఅ గోచ్ఛ కఇకచ్ఛు సచ్ఛహంవాణరీహత్థం—
6-32

7. ఉఅగఅచఉత్థిమంగలహోఅంత విఓఅ సవిసేసలగ్గేహిం
తీఅ వరస్స అ సేఅంసుఏహిఁ రుణ్ణం వ హత్థేహిం—
7-44

8. హరిహిఇ పిఅస్స నవచూఅపల్లవో పఢమమంజరి
సణాహో
మా రువసు పుత్తి పత్థాణకలసముహసంఠిఓ గమణం
—2-43

9, ఉజ్జుసి పిఅఇ సమఅం తహ వి హు రే భణసికీస
కిసిఅం త్తి
ఉవరి భరేణ అ అణ్ణుఅ ముఅఇ బఇల్లో వి అంగాఇం
—3-75

10. అచ్ఛఉ దావ మణహరం పిఅఇ ముహదంసణం అఇ
మహగ్ఘం
తగ్గామఛేత్తసీమా వి ఝత్తి దిట్ఠా సుహావేఇ—2-68

11. ఘోఅం పిణ ణీసరఈ మజ్ఝణ్ణే ఉహ సరీర తలలుక్కా
అఆవభఏణ ఛాఈ వి పహిఅ తాకిం ణవీసమసి—1-49

12. రోవంతివ్వ అరణ్ణే దూసహ అఇకిరణఫంస సంతత్తా
అఇతార ఝిల్లి విరుఏహిఁ పాఅవా గిమ్హమజ్ఝణ్హే—5-94

దవాగ్ని పుట్టి కాలిపోతున్నాయి.[1] అడవిలో యెండ తాపానికి జంతువులుకూడా వివక్షలేకుండా పడిపోతున్నాయే! ఎనుబోతు నల్లత్రాచుపామును సెలయేటి నీటిజాలని నాకబోతున్నది. అదేమో యెనుబోతు చొంగను నల్లరాతి దొణ నుంచి వచ్చే నీరని నాకబోతున్నది.[2] వడదెబ్బకు అలసి సొలసిన యేనుగైతే కొండ పాముకుబుసాన్ని సెలయేటి నీటి చార అనే భ్రాంతితో తొండం తడుపుకుంటున్నది.[3] అమాయకమైన జింకలు అడవిలో నిప్పంటుకున్నా, పూచినమోదుగ లనుకుని కదలడం లేదు.[4] మామిడి తోటలు నిప్పుమంటలాగ కనిపిస్తున్నాయి. అవేమిటి పొగలా! అబ్బే! తుమ్మెదలండీ[5] చిన్న చెరువులు, మడవలు యెండిపోయాయి.[6] దూరంలో కుండలకపిల(రహట్టం) కనిపిస్తున్నది. అక్కడికి వెళ్ళయినా చుక్క మంచినీళ్లు తాగుదాం. నోరెండిపోతున్నది. కుండల కపిలను చూస్తే దుష్టులు జ్ఞాపకంవస్తారు. నీళ్లు తీసుకోడానికి—వంగి వెళ్ళుతాయి కుండలు. నీళ్లు ముంచుకుని నీలుగుతూ వస్తాయి. దుష్టులు తమ అవసరం వచ్చినప్పుడు వినయంగా వెళ్ళుతారు. పని తీరినతర్వాత పెడమొగం పెట్టుకొని వస్తారు.[7]

బాబూ! ఇది వట్టి దరిద్రగొట్టు గ్రామం. వట్టిమొప్పె పల్లెలా ఉంది.[8] ఎవరితో మాట్లాడం! ఎవరితో తమాషా



అమరావతి

చేయం! గ్రామణిగారేమో మరీమొప్పె. పొట్టపొడిస్తే అక్షరం రాదు. సిద్ధిరస్తు అనికూడా వ్రాయలేడు.[9] గ్రామణి పుత్రి అట వట్టి విషపుత్రీగట.[10] ఆమెను గురించి రకరకాలుగా చెప్పు కుంటారు. గ్రామణిగారికి మంచి చెరకు తోటలున్నాయి. గాను గాడిస్తాడు. ఏంలాభం ఇంట్లో ఉప్పు నేయి కూడాలేని అన్నం.[11] నరకం (చెరకు సారా) తీయించి అమ్ముకుని డబ్బు చేసుకుంటాడు.[12] ఇక్కడ అందరూ తాగుబోతుల్లాగేఉన్నారు-ఆడా, మగా అందరూను.[13] గ్రామణి

---

1. గిమ్హే దవగ్గి మసి మఇలిఆఇం దీసంతి విఞ్ఝసిహరాఇం
   ఆసను పఉత్థవఇఏ ణ హోంతి ణవపాఉసబ్భాఇం—
   1-70

2. గిరసోత్తోత్తి భుఅంగం మహిసో జీహాఇ లిహఇ సంతత్తో
   మహిసస్స కణ్హపత్థర ఝరోత్తి సప్పో పిఅఇ లాలం
   —6-51

3. ఉఅ ఓల్లిజ్జఇ మోహం భుఅంగకిత్తీఅ కడఅలగ్గాఇ
   ఓజ్ఝర ధారా సద్ధాలుఏణ సీసం వణగఏణ—7-40

4. తమ్మిర పసరిఅ హుఅవహ జాలాలి పలీవిఏ వణాహోఏ
   కింసువణంతి కవిఊణ ముద్ధహరిణో ణ ణిక్కమఇ
   —6-88

5. అంబవణే భమర ఉలం ణ విణా కజ్జేణ ఊసుఅం భమఇ
   కత్తో జలణేణ వినా ధూమస్స సిహాఉ దీసంతి
   —6-43

6. వాఉలిఅపరిసోసణ కుడంగపత్తలణ సులహ సంకేఅ
   సోహగ్గకణఅకసవట్ట గిమ్హ మా కహ వి ఝీంజిహిసి
   —7-26

7. ఉఅఅం లహిఊణ ఉత్తణిఅణా హోంతి కేవి సవిసేసం
   రిత్తా ణమంతి సుఇరం రహట్టఘడిఅ వ్వ కాపురిసా
   —5-90

8. వక్కం కో పులఇజ్జఉ కస్స కహిజ్జఉ సుహం వ దుక్ఖం వా
   కేణసమం వ హసిజ్జఉ పామరపఉరే హఅగ్గామే
   —2-64

9. చిరడిం వి అఆణంతో లోఅ లోఏహిఁ గోరవబ్భహిఅ
   సోవారతు లే వ్వ ణిరక్ఖరా వి ఖంధేహి ఉబ్భంతి
   —2-91

10. ఏత్తాఇచ్చిఅ మోహం జణేఇ బాలత్తణే వి వట్టంతీ
    గామణిధూఆ విసకందలివ్వ వడ్ఢీఅ కాహిఇ అణత్థం
    —5-10

11. భుంజసు జం సాహీణం కుత్తో లోణం కుగామ రిద్ధమ్మి
    సుహఅ సలోణేణ వి కిం తేణ సిణేహో జహిం ణత్థి
    —4-16

12. అరుహఇ జుణ్ణఅం ఖుజ్జఅం వి జం ఉఅహవల్లరీ తఉసీ
    ణీలుప్పల పరిమలవాసిఅస్స సరఅస్స సో దోసో—6-34

13. సకఅగ్గహ రహసుత్తాణిఅణా పిఅఇ పిఅముహ విఇణ్ణం
    థోఅం థోఅం రోసోసహం వ ఉఅ మాణిణీ మఇరం
    —6-50

ఇంటికి ఎవరైనా వెళ్లితే స్నానానికి నీళ్లుకూడా దొరకవు. నేరేడు పట్టపాడ యిచ్చి గోదావరికివెళ్లి మునిగిరమ్మంటాడు.[1] దొడ్లో మామిడి చెట్టు. పిల్లవాడు ఏడ్చినా ఒక్క పండు ముక్క ఇవ్వడు.[2] నిధులు దొరికాయట. రాజుకు తెలియ పరచకనే స్వాహాచేశాడు. పాముల్లాగ దానికి కాపలా వుంటాడు.[3] పిల్లికి బిచ్చం పెట్టడు. అంత డబ్బుండి ఏమి ప్రయోజనం, మండే ఎండలో వెళ్లేవాణి నీడలాగ[4]? దొడ్లో గొడ్డూగోదా చూద్దామా! మాంచివే వున్నాయి. అయినా వట్టిన ఆవును కూడా పితుకుతాడు. పిసినారి. మంచి గుడ్డలైనా కడతాడా అంటే అదీలేదు. పడకల పొగచూరిన పాతగుడ్డలు కట్టుకుంటాడు.[5] అయినా అధికారికాదూ! ఊరి వారికంతా భయమే. రాజద్రోహం చేసి వారు మాట్లాడినట్టు అతని సంగతి గుసగుసలుగా చెబుకుంటారే గాని బాహాటంగా చెప్పరు.[6] ఒక్క చలివేంద్ర ఉంది. దానిలో ఒక పడుచుదాన్ని పెట్టారు. దానిని చూడడానికి వచ్చే కొడెగాళ్ల తండాయే ఎక్కువ. ఏంచేస్తాం. నీళ్లు పోసేప్పుడుచూడాలి మరీ ఎగనక్కలు, వయ్యారాలూను.[7]

ఏమిటి అలా పరుగెత్తుతున్నారు. కుండలు చేత్తోపట్టుకుని? నిప్పంటుకున్నట్టుందే. నాచేతికికూడా ఒక కడవ ఇద్దరూ![8] బారులు తీరి నిలబడండి. ఆమడ దూరంనుండి అయినాసరే నీళ్లు అందిద్దాం. లాభంలేదు. ఊరంత నాశనమైంది. చేయదగిందిచేశాం. పెద్దఇళ్లు కూలిపోయాయి. మూలబంధం—పునాది—మాత్రం మిగిలింది[9]. గొడ్డూగోదా కాలిపోయాయి. ఖాళీఅయిన ఆ దొడ్డిచూడండి.[10]. జనం కూడా మరణించారండి. అబ్బా! చూడలేమండీ ఆ వైధవ్య వేషాన్ని[11] బలికి తీసుకుపోతున్న దున్నపోతుకు వేసినట్టు[12]. ఏంసంఘమో! అనుమరణంకూడ నట. కొండపైనుండికూడ పడి అనుమరణం చేస్తారటగా[13]. బలే! బలె! ఆయన బతికాడటగా శ్మశానానికి తీసుకువెళ్లుతూఉంటే. విధవా వలయాలు అవిధవాలక్షణవలయా లయ్యాయటగా[14]! ఎవరాయన? ఇల్లుకాలి చస్తుంటే అగ్నిసమస్కారం చేయక సూర్యనమస్కారా లేమిటయ్యా?[15]

అయ్యో! తేలండీ తేలు![16] ఈ పొద్దు ఊరినుంచి రేపే వెళ్లిపోదామనుకున్నాం. తేలుకుట్టింది. ఎలా వెళ్లడం. వైద్యుడెవడూ లేడూ? మంత్రమా? తంత్రమా? మంగలి వైద్యమా? వైద్యమా? ఏదో చేయించండి. బలే మంత్రమయ్యా! ఏం తలచుకుని చస్తే అదే జన్మవస్తుందటగా. వెంటనే మరొక జన్మలో ఈ గ్రామం రాకుండ మంత్రం

---

1. తుజ్ఝంగరాఅ సేసేణ సామలీ తహ ఖరేణసోమారా
సా కిర గోలా ఊలే ప్హాఅ జంబూకసాఏణ—2-89
2. వినమిట్టిఅ పిక్కే క్కంబ దంసణే తుజ్ఝ సత్తుఘరిణీఏ
కో కోణ పత్తిఓ పహిఅణం డింభే రుఅంతమ్మి—6-95
3. చోరా సభఅ సతహ్ణం పుణోపుణో పేసఅంతి దిట్ఠీఓ
అహిరక్ఖిఅ ణిహికలసే వ్వ పోఢవఇఅ థణుచ్ఛంగే—6-76
4. హొంతి వి ణిప్ఫలచ్చిఅ ధణరిద్ధీ హోఇ కివిణపురిసస్స
గిహ్మాఅవ సంతత్తస్స ణిఅఅ ఛాహి వ్వ పహిఅస్స—2-36
5. సూఇజ్జఇ హేమంతమ్మి దుగ్గఓ పుప్ఫుఅ సుఅంధేణ
ధూమ కవిలేణ పరివిరళతంతుణా జుణ్ణవడఏణ—4-29
6. రాఅవిరుద్ధం వ కహం పహిఓ పహిఅస్స సాహఇ ససంకం
జత్తో అంబాణ దలం తత్తో దరణిగ్గఅం కిం పి—4-96
7. ఉద్ధచ్ఛో పిఅఇ జలం జహజహ విరలంగులీ చిరంపహిఓ
పావాలిఆ వి తహతహ ధారం తణుఇం పి తణుఏఇ—2-61
8. సవ్వస్సమ్మి వి దద్ధే తహ వి హు హిఅఅస్స ణివ్వుది చ్చేఅ
జం తేణ గామడాహే హత్థాహత్థిం కుడో గహిఓ—3-29
9. ధణ జహణ రిఅంబో వరి ణహ రంకా గఅవఅణ వణిఅణం
ఉవ్వసిఅణంగణివాస మూలబంధ వ్వ దీసంతి—3-33
10. గేహంవ విత్తరహిఅం ణిజ్ఝరకుహరంవ సలిలసుణ్ణవిఅం
గోహణరహిఅం గోట్ఠం వ తీఅ వఅణం తుహ విఓఏ—7-9
11. అణుమరణ పత్థిఆఏ పచ్చాగఅ జీవిఏ పిఅఅమమ్మి
వేహవ్వమండణం కులవహూఅ సోహగ్గఅం జాఅం—7-33
12. గోత్తక్ఖలణం సోఊణ పిఅఅమే అజ్జ తీఅ ఖణదిఅహే
వజ్ఝ మహిసస్స మాల వ్వ మండణం ఉఅహ పడిహాఇ—5-96
13. ఖరపవణ రఅ గలత్థిఅ గిరిఊడా పడణ భిణ్ణదేహస్స
ధుక్కాధుక్కఇ జీఅం వ విజ్జుఆ కాలమేహస్స—6-83
14. గామణిణో సవ్వాసు వి పిఅసు అణుమరణగహిఅవేసాసు
మమ్మచ్ఛేఏసువి వల్లహాఇ ఉవరీ వలఇ దిట్ఠీ—5-49
15. సూరచ్ఛలేస పుత్తఅ కస్స తుమం అంజలిం పణామేసి
హసకడక్ఖుమ్మిస్సా ణ హోంతి దేవాణఁ జేక్కారా—4-32
16. పఇ పురఓ వ్విఅ ణిజ్జఇ విచ్ఛుఅ దట్ఠేత్తి జారవేజ్జఘరం
ణిఉణ సహీకరధారిఅ భుఅజుఅలందోలిణీబాలా—3-37

వేద్దురా! బలేవాడివయ్యా. ఎక్కడో మనసుపెట్టి పెదవులు కదిలిస్తావేం. మంత్రం గట్టిగా అను.[1] నలుపండి. నలువు అయునేనా వైద్యుడు. మామూలు నాపితుడనుకున్నాను. ఎందుకావిడ అలా పరుగెత్తుకుని వస్తున్నది? ఆవిడకు కూడ తెలుకుట్టిందా? మంగలివైద్యుని చూచి పిల్లవాడు భయపడుతూవుంటే అలా పరుగెత్తుతున్నదా?[2] అమ్మయ్య! బతికానురా బాబు! మంచిమందే. చేదనుకోండి అయితే నేమి? మందు అందించిన అందగత్తెను చూచి ఎలాటి మందైనా మింగవచ్చు.[3]

ఇదేమిటి ఈ గ్రామం వస్తే వానలు పట్టుకున్నాయి. బాగానేవుంది. వీధులన్నీ బురద. ఆ బక్క ఆవు బురదలో చిక్కుకుపోయిందే; తీయనా?[4] కదలదేమండీ వెలుపలికి? మనకు నిలువ నీడనిచ్చిన యిల్లాలు యెంత ఉత్తమురాలు! ఇల్లు కారుతున్నా మనకు మాత్రం మంచి స్థలమే చూపింది.[5] అదృష్టం బాగానే వుంది ఇక్కడ మనకు నోరు తియ్యనవుతుంది. గహపతి (శెట్టి) గారి కుమార్తె తొలిసమర్తట. తొలి నమర్తగుడ్డను (అనంద పటమును) అందరికి చూపడం ఆచారమట. అలా ఎందుకండీ అందరికీ చూపటం?[6] ముఖానికి నేయి రంగు పూత ఏమిటి వికారంగా? అదీ ఆచారమేనా? సరే. ఆ ఇల్లాండ్లు ఎందు కలా దూరంగా కూర్చున్నారు. ఇంటికి వెలుపల వున్నారా? ముట్టుకోరేమిటి![7] మరి ఈ నమర్త పిల్లో? గహపతిగారికి చాలా మంది భార్య లున్నారటగా? ఇంకా పిల్లలు లేరా? మోజు కాబోలు. ఇంతకూ న్యానం[8] (కుదువ-తనఖా) పెట్టయినా ఎందుకండీ ఈ దుబారా? సరే ఎలాగూ చేయిస్తున్నారు. నమర్తపిల్ల కూర్చునే వెనుక కుడ్య చిత్రాలు సరిగా వేయించండి.[9] మంచి వర్తికఇప్పించండి. అరె! అరె! పడిపోతూందండి అమ్మాయి! వజ్రంగిని పిలపించి అనంది (బల్ల) కోల్లునమంగా దారం (ప్రమాణ సూత్రం) వేయించి రంపముతో కోయించండి.[10] మేకులు కొటించండి, వాయనాలు పంచలా?[11] [12]రాత్రి నాటకం కూడా ఆడారు. చాల బాగుంది. పూర్వరంగంలోనే నాటకం మంచిదని తెలిసిపోయింది. ఏం నాటక మను కున్నారు? కీరాద్విమధనం. నవరసాలూ ఓహ్!

ఎందుకయ్యా అంత తొందర అల్లుడూ? పెరట్లో అమ్మాయి నీళ్లుపోసుకుంటుంటే గాజుల చప్పుడైతే ఎందు

---

1. నంరుథా గహిఅ జలంజలి పడిమా నంకంత గోరి ముహకమలం
   అలిఅం చిఅ పురిఓట్ఠం విఅలిఅమంతం హరం ణమహ —7-100
2. ధావఇ విఅలిఅ ధమ్మిల్లసిచఅ నంజమణ వావడకరగ్గా
   చందిల భఅ విపలాఅంత డింభపరిమగ్గిణీ ఘరిణీ— 3-91
3. సుహపుచ్ఛిఆఇ హలిఓ ముహపంకఅ సురహిపవణణివ్వవిఅం
   తహ పిఅఇ పఅఇకడుఅం పి ఓసహం జహ ణ ణిట్ఠాఇ —4-17
4. కహం సా ణివ్వణ్ణిజ్జఇ జీఅ జహా లోఇఅమ్మి అంగమ్మి
   దిట్ఠీ దుబ్బల గాఈ వ్వ పంక పడిఅ ణ ఉత్తరఇ— 3-71
5. పహిఅవహూ విపరంతరగలిఅజలోల్లే ఘరే అణోల్లం పి
   ఉద్దేసం అవిరఅవాహసలిల ణివహేణ ఉల్లేఇ—6-40
6. కారిమమాణందవడం భామిజ్జంతం వహూఅసహిఆహిం
   పేచ్ఛఇ కుమారి జారో హసుమ్మిస్సేహిం అచ్ఛీహిం— 5-57
7. జఇ లోకణిందిఅం జఇ అమంగలం జఇ విముక్కమజ్జాఅం
   పుప్ఫవఇ దంసణం తహవి దేఇ హిఅఅస్స ణివ్వాణం —5-80
   వణ్ణఅఘఅలిప్పముహిం జో మం అఇఅఅరేణచుంబంతో
   ఏణ్హిం సో భూసణ భూసిఅం పి అలసాఅఇ ఛివంతో— 6-19
8. ణానం వ సా కవోలే అజ్జ వి తుహ దంతమండలం బాలా
   ఉబ్భిణ్ణ పులఅ వఇవేఢ పరిగఅం రక్ఖఇసరాఈ—1-96
9. హిఅఅం హిఅఏ ణిహిఅం చిత్తాలిహిఅ వ్వ తుహముహే దిట్ఠీ
   అలింగణ రహిఆఇం ణవరం ఖిజ్జంతి అంగాఇం— 5-85
   వణ్ణక్కమ రహిఅస్స వి ఏసగుణో ణవరి చిత్తకమ్మస్స
   ణిమిసం పి జం ణ ముంచఇ పిఓ జణో గాఢమువఊఢో—7-12
10. విరహ కరవత్త దూసహ ఫాలిజ్జంతమ్మి తీఅ హిఅఅమ్మి
    అంసూ కజ్జల మఇలం పమాణసుత్తం వ్వ పడిహాఇ 2-53
11. దిఢమూల బంధగంఠి వ్వ మోఇఆ కహ వి తేణ మే బాహూ
    అమ్హేహిం వి తస్స ఉరే ఖుత్త వ్వ నముక్ఖఅ థణఅ— 3-76
12. మాణదుమ పరుస పవణస్స మామి సవ్వంగ ణివ్వుఇ అరస్స
    అవఊహణస్స భద్దం రఇణాడఅ పువ్వరంగస్స—4-44

కలా అవరిపడతావు? నీళ్లగది తూమునుంచివచ్చే నీళ్లలో పసువును పరిశీలిస్తున్నా వేమిటి?[1] మరదండ్లు బాగానే ఏడిపిస్తున్నారే![2] ఉత్పుల్లికలు (విద్దెంవిద్దెం) ఆడించ మంటున్నారా?

ప్రస్థానకలశమట! మంగళవారమట! వెళ్లవ య్యా. జ్యోతిష్కుని పిలిపించి హోరలు వేయించి (పలకపై గీతలు మొదలయిన లెక్కలు వేయించి) బాధపడడ మెందుకు?[3] లక్ష్మి ప్రక్కనవుండగా ఏమిటయ్యా భయం ప్రయాణానికి?

ఏమిటయ్యా రైతూ అలా చూస్తావు? ఈ ఆకాశం ఎంత బాగా కప్పినా, ఇంతగా కారుతుందేమా అనా? వరదలకు దున్నపోతుకొట్టుకొపోతే, మరోదున్నపోతు దొరకదని దాని గంటలపట్టెడను అమ్మవారిగుడికి చేర్చావటగా. మరొక ఊరిలో వెదకలేకపోయావా?[4]

ఈ పూరు ఇంకా బాగుందండోయ్, వానలు వెలిసాయి. దారిబురదే అయినా సత్పురుషుల మనస్సులా పైకి అరి గరుగ్గా, లోపల మెత్తగావుంది. ఏరువాక అప్పుడే అయిం దేమో! తిండితెస్తున్న ఇంటావిడను చూస్తూ దున్నుతున్న కావు మైమరచిపోతున్నాడు. మేడి వదలకయ్యా, పూబోడిని చూచి[5]. ఇక కొన్నినెలలకు వరిచేలు పండి తెల్లబారు తాయి. హరివళం అలదుకొన్న ఆటవెలదివలె జనప చేను సొగసవుతుంది. పత్తికాయ నగంవిచ్చినదీ, ఆ కాపుదంపతులను చూచి నవ్వుతున్నట్టులేదూ?[6] పత్తి చేనును ఎనుపోతు విరగబడి మేస్తున్నది అంటే చూస్తా వేమిటి తోలవయ్యా.

గ్రామసమీపంలోనా యవలు విత్తుతారు? పందులు పాడుచేయవూ? అమ్మాయి, అమ్మాయి, కుసుమచేనుల్లో ముండ్లుంటాయి. పూలకోసంపోయి ముళ్లుతొక్కేవు. ఆ అమ్మాయి కలమ ధాన్యాన్ని బాగా కాస్తుందే. చెరుకుగాను గాడడం కూడా రెండు నెల్లకే కదూ? నిలువెత్తు పెరిగిన నూలచేనులోను వరిచేనులోను దాక్కున్నా కనిపించం నుమండీ!

ఏమి పాడేస్తున్నాడయ్యా రైతు; పైరుకోర్కొ దైవార పండం గాను. చక్కగా దంచిన బియ్యంలా వున్న వెన్నెల్లో హాయిగా గొంతు విప్పాడు[7]. ఈ పొలంచుట్టూ కంచె వేసుకోవయ్యా. బాగా మొరిగే కుక్కను బలే సంపాదించావులే. అదలించ వయ్యా వెళ్లిపోతాం.

బాగాపండింది. భాజాలు, భజంత్రీలు, నాట్యాలు, సరే. మురజానికి మరింత అన్నం మెత్తి వాయించండి. ఇదేమిటి ఈ మహిషబలి? శ్యామాకవ్రతం చేసుకోండి; వాయ నాలు పంచి పెట్టండి; తినండి. బుద్ధుని ఒక వైపు పూజిస్తూ ఇదేమిటి బలి? శ్మశానం బూది పూసుకున్న కాపాలి కూడా వున్నట్టుందే. కానివ్వండి. కాని ఒక వైపు విష్ణుపూజ కూడానా? కృష్ణుడంటే కూడ పడి చస్తారటగా!

చలి, చలి, ఎముకలు కొరికేచలి. ఎందుకు వచ్చాంరా ఈ పూరికి బాబూ! వట్టికుగ్రామం. శిథిలదేవాలయం ముందేవరో చలి మంట వేస్తున్నారు. వెళ్లదాం గడ్డినెగడు ఆరిపోతున్నది. దానిని కర్రతో కదుపుతూ ఎలుగు బంటిని చీల్చు తున్నట్టు సాహసంచేస్తున్నాడు ఒకాయన[8]. ఏం దేవళం ఇది? గణపతి విగ్రహం ఇలాపడిందే? ఒక ప్రక్కె అరిగి పోయిందేం? తలగడగా ఉపయోగించుకొనేవారా ఏమిటి?

పిడకనిప్పు పొగకంపులో పొగులు నడలిన చిరుగు గుడ్డలు కప్పుకొని పేదవారెలా బాధపడుతున్నారో?[9] ఒక

---

1. మామి హాఆలం వ పీలం తేణ జాఆణేణ మజ్జమాణావి ణ్హాణ హలిద్దా కడుఅం అఋసో త్తజలం పిఅంతేణ—3-46
2. ఉప్పుల్లిఆఇ ఖేల్లఉ మా ణం వారేహి హెూఉ పరిఊఢా మా జహణభారగరుఈ పురిసాఅంతి కిలిమ్మిహిఇ—2-96
3. కత్థగఅం రఇబింబం కత్థ పణట్ఠాఓ చందతారా ఓ గఅణే వలాఅపంతిం కాలో హెూరంవ కడ్డేఇ—5-35
4. గహవఇణా ముఅసైరిహ డుండుఅదామం చిరం వహే ఊణ వగ్గసఅలం వేఊణ ణవరిఅ అజ్జాఘరే బద్ధం—2-72
5. ణవకమ్మిఏణ హఅపామరేణ దట్ఠూణ పాఉహరీఓ మోత్తవ్వే జోత్తఅపగ్గహమ్మి అవహాసిణీ ముక్కా—7-92
6 అజ్జం మోహాణ సుహిఅం ముఅత్తి మోత్తే పలాఇఏ హలిఏ దర పుడిఅవేంటభారోణఆఇ హసిఅం వ ఫలహీఏ—4-60
7. ణిప్పణ్ణ సస్సరిద్ధీ సచ్ఛందం గాఇ పామరో సరఏ దలిఅ ణవసాలితండుల ధవలమిఅంకాసు రాఈసు—7-89
8. ఫాలేఇ అచ్ఛభల్లం వ ఉఅహ కుగ్గామదేఉలద్దారే హేమంతఆల పహిఓ విజ్ఝాఅంతం పలాలగ్గిం—2-9
9. సూఇజ్జఇ హేమంతమ్మి దుగ్గఓ పుప్ఫాఅ సుఅంధేణ ధూమ కవిలేణ పరివిరల తంతుణా జుణ్ణవడఏణ—4-29

కావు పచ్చడం అమ్మి యొద్దును కొన్నాడట. చలిలేదా నీకు అని అంటే, రెండు కుమ్ముల ఆ జవరాలు వుందిలే అన్నాడట. ఈ ఊరిలోనేనా ? ఇదేమిటయ్యా, అతిథ్యంకూడా సరిగాలేదు. ఉప్పు అన్నం చాలా ? వ్రేళ్ళన్నా నేతిలో తడప వద్దూ. ఊరంతా విపరీతంగా వుందే. క్రొత్త జున్నుపాలు (నవ పీయూషం) త్రాగిన గేదెదూడలాగ మధ్యాహ్నం నిద్ర పోతే జబ్బుకాదూ చలికాలంలో ! వింత కుక్కను పెంచిం దయ్యా ఆవిడ. మగని చూస్తే మొరుగుతుంది ; మిండని చూస్తే మెడవూపుతుంది. రాత్రి యింటి ముంగిట్లో పండు కుంటే, ఇక్కడ నేను, యిక్కడ అత్తగారు, యిక్కడ తక్కినవారు అంటుందేమిటి ఆవిడ ? మాకు రేచీకటి లేదే?[1]

ఇక్కడ గోరువంకలు, చిలుకలు, గయ్యాళివే. రాత్రి పటకటింటి సంగతులు పగలు వీధిని పడేస్తాయి. ఇతను మనశరణువేడాడు కాపాడమంటూ మిండగాని మగనికే అప్పగించిందట, ఒక జాణ.

తొలికాన్పువేళ నొప్పులు పడలేక మగని మాట ఇక వద్దంటుందటగా ఒక ప్రసూతివిరాగిణి. దయ్యాలుకూడా వున్నాయటగా ఈ పూళ్ళో. మంచి కట్టెలు దొరకవా? యేమిటా పొగ? పొమ్మనలేక—పొగపెట్టడమా యిది ?

గుండె తరుక్కుపోతుంది, ఆ కమలవనాన్ని చూస్తే. ఊరికంతా ఒక్క సొమ్ముగావున్న కమలవనం మంచుకు చెడి రాలిపోయి కొసననువ్వుచేనిలా దంట్లు మాత్రం మిగిలింది. గుడిగోడమీద గీతలేమిటి ? ఏవో సంకేతాలులా. రెండక్షరాలు వ్రాయడానికి చేతకానివారే ఊరివారిలో చాలామంది. ముత్యాలువదలి గురివిందలకు మోజుపడతారేమిటి ఆడవారు ? అడుసులో చిక్కుకున్న నాగలిని ఈడ్చి మగడు అలసి నిద్రపోగా, ఆ కాపువడతి ఉపచారం చేయడంమాని వియోగబాధపడుతుందేమిటి ? పేదల కోరికలు తీరే అవకాశమే లేదే ఇక్కడ !

మరదులతో వదినెల ఎకసెక్కాలేమిటి ? చేతగానివాని భార్య ఊరికంతా వదిన అంటే ఇదేనా ? అయ్యో, అయ్యో. అదేమి పాపకర్మ ! ఆడవాళ్లు బందీలా ? వాళ్లు బలవంతులై మిమ్మల్ని బందీలుగా తీసుకుంటే ? వద్దుబాబూ ! ఈ పూరు ! మరొక మంచి పూరికిపోదాం.

బయలుదేరి సంవత్సరమైంది కదా ! మరొక ఊరెందుకు ? సవవసంత రాజు రథ శిఖరంధ్వజంలా మామిడి చివుళ్లు కనిపిస్తున్నాయి. ఆ మోదుగు మొదలు చుట్టూపడిన మోదుగుపూలు చూడండి. తథాగతుని పాదాలపై ఎరగిన భిక్షుసంఘాలులాగ ఉన్నవి. మనమూ సమంతభద్రుని స్మరిస్తూ మనఊరికే వెళ్లదాం.[2]



1. ఏత్థ ణిమజ్జఇ అత్తా ఏత్థఅహం ఏత్థ పరిఅణో సఅలో
పంథిఅ రత్తీఅంధఅ మా మహ౦ సఅణే ణిమిజ్జిహిసి
—7-67

2. కిం ముహ నచ్చ హేహిం రేహఇ వసుహా పలాసకుసుమేహిం
బుద్ధస్స చలణ వందణ పడిఏహిం వ భిక్ఖు సంఘేహిం
—4-8

# క్షీరనీరాలుగా కలిసిపోయిన హైందవ, బౌద్ధమతాలు

## డాక్టర్ అయ్యప్పన్

సూపరింటెండెంట్; మదరాసు మ్యూజియం

అమరావతీ స్తూపమునందలి యొక (యుష్ణీష) ఫలకము మీది శిల్పము రమారమి రెండు దశాబ్దులుగా నాకెంతయో ముచ్చటగొలిపినది. బుద్ధుని భౌతికశేషములు పంచుటయే యీ శిలాఫలకములోని విషయము. 1948 లో బుద్ధభగవానునివంటి మరియొక భారత పుత్రరత్నము ఈ భౌతికకాయమును విడచిన విషయము యీ శిలాఫలకచిత్రము నాకు స్మరణకు తెచ్చుచున్నది. తథాగతుని భౌతికజీవనపు చిట్టచివరి ఘట్టమున, దానియందలి వివరణములను, విపులముగ దీక్షాస్ఫూర్తితో, చాతుర్యముతో, యీఫలకమున తీర్చిదిద్దుటయందు ఆంధ్రశిల్పుల కళావిశిష్టత పరాకాష్ఠనందుకొన్నది.

మహాపరినిబ్బణసూత్తపు దీఘనికాయమున (ii పే. 179/191) బుద్ధభగవానుని నిర్యాణమును, ఆయన భౌతికావశేషముల నెవరెవరు ఎటుల పంచుకొన్నదీ వర్ణితమైయున్నది. సూక్ష్మముగా అందలి యంశమిది:—

ఆనందునివలన, తథాగతుడు కీర్తికాయుడైన విషయము వినిన కుసీనరవాసులగు మల్లులు, దుఃఖసాగరమున నుండిరి. భగవానుని యంత్యక్రియలు జరుపునుద్దేశ్యముతో సుగంధద్రవ్యములనూ, పూలమాలలనూ, చేకూర్చుకొని వారచటి యుద్యానమునకు వచ్చిరి. ఈ యంత్యసంస్కారములు ఒక సప్తాహమువరకు సాగెను. తుదకు బుద్ధభగవానుని భౌతికకాయము చితిపైనుంచుటకు తీసికొనిపోయెడు సమయము వచ్చెను. ఈలోగా మహాకశ్యపు డచటికి విచ్చేసి బుద్ధదేహము నర్చించెను. దహనసంస్కారము జరిగినపిమ్మట కుసీనరమల్లులు తథాగతుని యస్థిశేషములను తమ పాలనా ప్రాసాదమునందలి సభామందిరమునకు గొనిపోయిరి. అచట యీటెలూ, ధనుస్సులూ కూర్చి యీ యస్థిశేషముల చుట్టునూ, ఒక శస్త్రప్రాకారమును నిర్మించిరి. సుగంధద్రవ్యములతో, ధూపదీపములతో, పుష్పములతో, నాట్యాది విశేషములతో నొక సప్తాహము యీ భౌతికశేషములకు శ్రద్ధాంజలి నర్పించిరి.

త్వరలో, నిర్యాణవార్త మగధరాజగు అజాతశత్రుడు వినెను. వైశాలీవాసులగు లిచ్ఛవులునూ, కపిలవత్తుకు చెందిన శాకీయులునూ, అల్లకప్పలో నివసించు బూలీయులునూ, రామగామ నివాసులగు కోలీయులునూ, పవయందుండెడు మల్లులునూ, వేథద్వీపమునకు చెందిన బ్రాహ్మణులునూ కూడ వినిరి. బుద్ధుని భౌతికశేషములలో కొంత తమకు చెందవలెనని యర్థించిరి. కాని, భగవానుడు తమ మండలమున ఐహికదేహమును వీడినాడని అందువలన శరీరశేషముల నిచ్చుటకు వీలులేదని కుసీనరమల్లులు వాదించిరి. ఆ సమయమున దోసుడను నొక బ్రాహ్మణుడు, శాంతిసౌహార్దముల బోధించిన బుద్ధుని భౌతికశేషముల పంచుకొనుటలో యిట్టి తగవు తగదని మల్లుల మదలించెను. అందుమీదట మల్లులు యా బ్రాహ్మణునే యీ భౌతికశేషముల యందరి మధ్య పంచవలసినదిగా



పద్మపాణి — అమరావతి



బుద్ధుడు — అమరావతి

కోరిరి. శేషములను యెనిమిది భాగములుగ విభజించి, అతడు అందరికిని పంచినపిమ్మట యస్థిశేషములుంచిన పాత్రమాత్రము తనకడనుంచికొనెను. దానిపై దోనుడొక స్తూపము నిర్మించినాడు. పిప్పలివనవాసులగు మోరీలు కూడా యస్థిశేషములలో భాగమర్థించిరిగాని, అప్పటికే చాల జాగాయెను. వారికి కేవలము యస్థికలమీది భస్మము మాత్రము లభించెను. కాని, దీనిపైకూడ నొక స్తూపము నిర్మించిరి. ఇటులనే, తక్కిన యస్థికల యెనిమిది భాగములమీద నొక్కొక్క స్తూపము నిర్మించుట జరిగెను.

ఇక, యీ యమరావతీ శిలాఫలకపు దృశ్యపు విషయము :—క్రింది భాగమున కుడివైపున బుద్ధభగవానుని యంత్యక్రియల సన్నాహము, భౌతికశేషముల గీతనృత్యాది విశేషములతో సర్చించుట కానవచ్చుచున్నది. దీనిపైనున్న మరియొక చిత్రమున—కుడివైపుగ—బుద్ధుని భౌతికశేషములను యర్థించుచున్నవారికి కుసీనర మల్లులు నిరాకరించుచుండుట కనిపించుచున్నది. ఇందుకు యితరులను పప్పించెడి చూపుతో, కూర్చుండిన ఆ యుదాత్తవదనపు మానిసియే దోనుడను బ్రాహ్మణుడగుట స్పష్టము.

తరువాతి ఫలకమున మల్లులతోబాటు తక్కిన యభ్యర్థులుకూడ నభతీర్చియుండుట కానసగును. చతురస్రముగా నొక బల్ల, దాని కటునిటు నలుగురు నలుగురుగా రెండు వరుసలుగా దోనుని సాయమున యస్థిశేషములను యెనిమిది భాగములుగ పంచుకొనిన వారందరుసూ, సూచింపబడియున్నారు. ఇక, యెడమగానున్న దృశ్యములో, కుసీనర సింహద్వారమునుంచి యేడు యేనుగులు వెడలుట కనుపించుచున్నవి. ఒక్కొక మాతంగము నధిరోహించియున్న మనిషిచేతిలో శిథిలావశేషముల పుటిక, గౌరవార్థము చామరముపట్టు మరియొక మానిసి సూచించబడినాడు.

ఈ పై గాథయందలి పాత్రలలో రాజగు నజాతశత్రుడు పితృహంత; తన పుత్రులవలన వ్యథచెందిన ఈ క్షత్రియునకు బుద్ధుడు శాంతి ప్రసాదించెను. దోణుడను బ్రాహ్మణుడు విజ్ఞాన ఖనియగు శాంతిదూత. వీరావేశముగల వివిధ తెగలు, నాయకునిగా యీయనను గౌరవించిరి. అజాతశత్రుడు క్షత్రియుడు ; దోణుడు బ్రాహ్మణుడు. బుద్ధుడు వేద ధర్మములపట్ల సంపూర్ణముగా వ్యతిరేకియయిన వ్యక్తిగా పరిగణించబడిన పక్షములో, తథాగతుని భౌతిక శేషముల కొరకు బ్రహ్మ, క్షత్రియులు ఇంతటి యాందోళన చెందినారనుట విడ్డూరమగును. బౌద్ధ పక్షపాతమున, వాఙ్మయ గర్భితములైన విషయములందలి యతిశయోక్తియు యటుండనిచ్చిన, భౌతికశేషముల విభజనకు సంబంధించిన ఈ గాథలోని వివిధ ఘట్టములలో నంతర్గర్భితమైయున్న సత్యము నెవ్వరుసూ సందేహింపజాలరు. అనగా బౌద్ధమత స్థాపకుని కాలమున బౌద్ధము బ్రాహ్మణ మతమునకు వ్యతిరేకము కాదని యీనాటి హైందవులు ఈ మతమును యామోదించిరని, నేటి హిందువులు యార్య సమాజ, బ్రహ్మసమాజములవంటి వాని నామోదించుట వంటిదే, ఇదియునని మనము తీర్మానించవచ్చును.

రెండు శతాబ్దుల తదుపరి, అశోకుని కాలమున యీ మహాచక్రవర్తి బ్రాహ్మణులు, శ్రమణులు నన్న పదములను సమాన గౌరవముతో, ప్రాధాన్యముతో ధర్మపథమునందు వలెనే యుపయోగించుటగూడ కనిపించుచున్నది. షబజ్ గరీ శాసనములందు అశోకచక్రవర్తి కళింగమున బ్రాహ్మణులకుసూ, యితరులకునూ తాను నొప్పిగల్గించినందుకు తన వ్యాకులత వ్యక్తపరిచెను. ఆ కాలమునకే యశోకుడు బౌద్ధోపాసకుడైనాడు. ఆ స్థితిలో బ్రాహ్మణులపట్ల నాస్రామాట్టు యింతగా బాధపడినాడన, మౌర్యుల కాలమునందు బౌద్ధమునకును హిందూమతమునకునూ ప్రాతికూల్యమున్నదన్న ప్రసక్తికి యవకాశము లేదు. సాంచీవద్ద నుండిన, కాకనద విహారమునందలి బౌద్ధభిక్షువులను పుష్యమిత్రశుంగుడు మారణహోమము చేయించినాడన్న విషయము రాజకీయమైన విషయమును మాత్రము సూచించుచున్నదికాని, బౌద్ధముపట్ల బ్రాహ్మణ మతావేశపు దారుణకాండగా కనుపించుటలేదు. ఇదియునుగాక, సేనానియగు పుష్యమిత్రుడు బ్రాహ్మణుడనుట నామకార్థమే యగును. అతని వెనుక గద్దెక్కిన యగ్నిమిత్రుడు స్థాప

ములను, శిల్పములను, విహారములను మరామత్తు చేయించుట, విశాలమొనరించుట జరిగెను. అనగా, తనకు ముందువాడైన పుష్యమిత్రుడు బౌద్ధ సంఘము పట్ల జరిపిన హానికి ప్రాయశ్చిత్తముగా యితడిట్లు చేసినట్లయినది. మౌర్యుల తరువాత బౌద్ధ హిందూ ధర్మములు రెండునూ సమాంతరముగా యభివృద్ధి చెందుచునే వచ్చినవి. నాటి హిందూమతము, బుద్ధునియొక్క శక్తిమంతులగు శిష్యులయొక్క విమర్శల వలన, పోటీ వలన, బౌద్ధాచార్యులలో చాలవరకందరునూ, బ్రాహ్మణులైన కారణమువలన, బౌద్ధముముందు నిలువదొక్కుకొనుటకై, తనయందలి లోటుపాట్లు దిద్దుకొని మెరుగు తేలినది. బౌద్ధ హైందవ ధర్మములు రెండునూ, సమాంతరములుగా వర్ధిల్లిన మాట నిజమేయైననూ, యశోక, కనిష్క చక్రవర్తుల రాజపోషణ లభించుటవలన బ్రాహ్మణ మతముపై బౌద్ధమతముదే కొంత పైచేయియైనది. హిందూ సంస్కృతికి యిది కొంత లొజ్జులను కల్పించిననూ, యా సంస్కృతి, సంస్కృత సారస్వతము, హైందవ శిల్పము, తత్వశాస్త్రము గుప్తుల కాలమున యెంతగానో ప్రాణము పోసి కొనినవి. ఎదురులేక, బెదురునదురులేని హిందూ ధర్మముకన్న, ప్రత్యర్థులకు యెదురొడ్డవలసిన యవసరమేర్పడిన హిందూ ధర్మమే, రక్షణకై ప్రతిఘటించవలసిన హిందూధర్మమే, యెక్కువ సజీవమునూ, శక్తివంతమునూ యయినట్లు గోచరించును. అయిననూ, వైదికధర్మము ననుసరించి గుప్తరాజులుగాని, వాకాటక వంశీయులుగాని, బౌద్ధముపట్ల బాహాటముగా ఎట్టి ప్రాతికూల్యమును గాని యుండుటవలన యిట్టి వైదిక మతాభిమానము నవలంబించినట్లు తోచదు.

అసలు బుద్ధభగవానుని వాక్కులలోనే యొక విషయము సుస్పష్టముగా నున్నది. బౌద్ధము, హిందూధర్మమునకు వ్యతిరేకముగాదని, హైందవ ధర్మమునకు యనుబంధముగనే దానికి సంపూర్ణత్వము ప్రాప్తింపచేయుట కొరకే బౌద్ధముద్భవించెనని యాయన స్పష్టము చేసినాడు. సంయుక్తనికాయమను గ్రంథమున తథాగతుడొక యుపమానము నెత్తి చూపినాడు.—ఒక ప్రయాణీకుడు, మార్గమున బోవుచున్నవాడు, యొకానొక ప్రాచీన ఘంటాపథము గుర్తించెను. ఆ మార్గము వెంబడి ముందుకు సాగిన యా పథికునకు రమ్యహర్మ్యములతో, కనుల పండువైన సరోవరములతో, చూడముద్దుగా నుండిన యొక పురాతన నగరము గోచరించినది. అతగాడు, మరల దీనిని నివాసయోగ్యముగ జేయగలిగెను—ఆ యా ప్రాచీన పథము సనాతనమగు భారత ధర్మపథమగుట, యా పురాతన నగరము, యనపసరమగు కర్మకాండను వర్జించి



సింహనాథ — అమరావతి

కల్మషరహితము గావించబడిన హిందూమతమగుట స్పష్టముగా గోచరించుచున్నది. బుద్ధ భగవానుడు బ్రహ్మపదార్థపు నిత్యత్వమును శంకించలేదని, వేదవాక్కుయొక్క సాధికారశక్తిని నమ్ముట యందలి సత్యమును మాత్రమే కాదనెనని యాధునిక పాండిత్య పరిశోధన స్పష్టీకరించినది. నిజమునకు బౌద్ధమతమున గల త్రిరత్నాది సంకేతములు, బ్రహ్మపదార్థమును గూర్చిన సమస్యల విషయములను, బుద్ధుడు చెప్పక విడిచిన వానినెల్ల వివరించుచున్నది. బోధి వృక్షము, గాథల రీత్యా, సిద్ధార్థగౌతముడు దివ్యబోధనందికొనిన వటవృక్షము మాత్రమే కాని బౌద్ధ సంకేతములలో యిది బుద్ధుడే. తత్వశాస్త్ర ప్రకారము యిది యుపనిషత్కారకులగు ద్రష్టలు చూచిన బ్రహ్మపదార్థ చిహ్నము—ఏకసత్వము. ఇటులనే సూర్య భగవానుని సంకేతముగా, లోకపాలకుడగు చక్రవర్తి చిహ్నముగా కనుపించు బౌద్ధ ధర్మచక్రము, శ్రీ మహావిష్ణువు తాల్చిన సుదర్శనాయుధము గూడనగును. మూర్తిరూపమున తథాగతుని యారాధన ప్రారంభముకాక పూర్వము యాయనకు జ్యోతిర్‌స్తంభము యొక సంకేతముగా నుండెడిది. సూక్ష్మముగా పరిశీలించిన యిది లింగాకారము; జ్వాలలు ఉబుకుచున్న లింగమువంటిది. అగ్ని దేవుడు వైదిక దైవము. బౌద్ధులు దీనిని తమదానినిగా జేసికొనిరన వచ్చును.

తరువాతి కాలపు మహాయాన బౌద్ధమునందేమి, భక్తి ప్రధానమైన హిందూమత కాలములందేమి, పోటాపోటీలుగా

యనేక దేవతామూర్తులు నారాధనా రంగమునందు చిల పలుపలవలుగా వ్యాపించియుండుట వివరించనవసరము లేదు. బోధిసత్వుల యమోఘమైన కారుణ్యాది గుణములు శివ, విష్ణుదేవులకు గల యిట్టి సమానగుణములతో పోల్చ బడుట, యిట్లే మహాయానమునందలి తార మొదలగు దేవీమూర్తులకుసూ, హైందవ స్త్రీ దేవతలకుసూ, పోలిక లుండుట జరిగినది. హిందువుల శ్రీ దేవి, మహాయాన బౌద్ధుల సిరిమాయకిణి. బౌద్ధగాథలలోని గజకర్ణముగల యక్షమూర్తి పరిణామమే విఘ్నేశ్వరుడు. హైందవాలయ ద్వారముల గాచు దిక్పాలురవలెనే బౌద్ధారామ సింహ ద్వారములను లోకపాలురు కాపాడుట కాననగును. కొన్ని శతాబ్దులుగ జరిగిన యీ పరిణామము లన్నిటి యందును, యెవరు యే విషయము యెవరి నుండి సంగ్రహించిరనినది చరిత్రకు సంబంధించిన విషయము. కాని బౌద్ధులేమి హైందవులేమి యుభయులుసూ యొకేయొక సమాన సంస్కృతికి చెందిన సంప్రదాయము నుండి తమతమ సంకేతములను యూహలసూ గ్రహించిరనుట వాస్తవము. మహాయాన బౌద్ధపు చివరిపరిణామపు దశకుసూ—జెన్ బౌద్ధముతో సహా—పౌరాణిక హిందూ మతమునకుసూ మధ్యనున్న విభేదము కేవలము పైపైననేగాని పునాదుల విషయమున కాదు. ప్రాతిపదికలైన సిద్ధాంతముల విషయ మునగాదు. మహాయానమునందు, బుద్ధుడు బ్రహ్మపదార్థ ముతో సమానుడుగా పరిగణించుట జరిగెను. బోధి సత్వులు బుద్ధాంశ సంభూతులైరి.

ఉపనిషత్తులతోబాటు బౌద్ధముగూడ వేదవేదాంగాధ్యయ నముకన్న యాత్మనిత్యమనుచు పరావిద్య యెరుగుటయే ప్రధానమైన విషయముగా భావించెను. ముండకోపనిషత్తు నందు కేవల కర్మనిష్ఠాపరులైనవారిని బుద్ధిహీనులుగా భావించుట జరిగినది. బృహదారణ్యకమునందునూడ, కేవల యజ్ఞయాగములు చేయువారిని తమ తమ యజ మానులకు సేవచేయు పశువులుగా పోల్చుట కనుపించు చున్నది. ఆత్మజ్ఞానములేని యిట్టి యజ్ఞయాగములు నిష్ప్రయోజనములని యుపనిషద్భావము. వేదములద్వారా సంప్రాప్తమైన యధికారపు తెరచాటున యుపనిషత్తులు ప్రజలయందు గల విశ్వాసమునకు దూరముగానుండుట జరిగెను. కాని బుద్ధుడు సాహసముతో బహిరంగముగా యీ సత్యము వ్యక్తపరిచెను.

బుద్ధుడేమి, యుపనిషత్తులేమి ప్రవచించిన ప్రాచీన పథమనునది వేదప్రోక్తమైన యజ్ఞమనుదానియందే నిజము నకు యంతర్భూతమైయున్నది. యజ్ఞమనగా యనలు యాజ్ఞికుని హృదయ యంతర్ముఖత్వమువలన పునీత మగుట. యజ్ఞముయొక్క ప్రాధాన్యత బాహిరమగు కర్మ కాండయందు లేదు. అంతరంగమునందు కలిగిన పరి ణామమునందు దీని ప్రాధాన్యత యిమిడియున్నది. మాన వుని ప్రతికార్యమును యజ్ఞమువంటిదే. ఇట్టి యజ్ఞము నిరంతరాయముగా సాగునదైయుండవలెను. అనగా, యితవులకై బ్రాహ్మణులు జరిపెడి యజ్ఞములు అనలుకి కేవలము ఛాయలుగా నెంచవగును. అందువలననే, బుద్ధుడు వైదికయజ్ఞమందలి క్లిష్టమార్గముకన్న యితర మార్గమును చూపవలసివచ్చెను.

సంయుక్త నికాయమున బుద్ధుడు నిజమైన యగ్ని హోత్రము శరీరములోనే నున్నదనెను. హృదయమును యజ్ఞవేదికపై స్వయంవ్యక్తమైన యాత్మయనెడి జ్యోతిని ప్రజ్వరిల్లజేయుటయే యజ్ఞమనెను. ఐతరేయ యారణ్యక మునగూడ నీ విషయమే ఇదే రీతిగా జెప్పబడినది.

ఇట్టి సమానమైన యూహలలో యుపనిషత్తులతో నుండిన బౌద్ధ హిందూ ధర్మములయందు యేయే హంశములవలన బౌద్ధము హిందూధర్మమునకు వేరుగానుండుట, జరిగినదిన్నీ విచారింపవలయును. బుద్ధుడు వేదవాక్కును నిరాకరిం చిన విషయము నింతకుముందే వ్యానమున పేర్కొంటిని. గ్రంథములందుండిన విషయములకన్నా, యెవరో ఋషులు చెప్పినవానికన్నా, యనుభవమునకే యాయన ప్రాధాన్య మిచ్చెను. మతసిద్ధాంతమునకన్నా, సుశిక్షితమగు యనుభ వైకవేద్యమగు జీవితమే ముఖ్యమనెను. మొదట ప్రజలు తమ హృదయములనుండి కామము, లోభము, పారద్రోల వలెనని యూపైన యవిద్యపోగొట్టుకొనవలెనని యటు పిమ్మట కోరికలనునవే, బాధలకన్నిటికినీ తల్లివేరువంటివని గ్రహించి, కోరికలు విడనాడవలెననెను. తానే, యొక పథికుడనని బుద్ధుడు చెప్పుకొనెను. తత్వరహస్యముల వివరించుటకుగాని వాటి చర్చకుగాని తథాగతుడు యిష్ట పడలేదు. కేవల శబ్దప్రాయమైన వాదములుగాని, యూహా గానపూర్వకములైన యుపపత్తులుగాని, యాయనకు నచ్చ లేదు. ఇదియంతయు నాస్తికత్వముగా, భగవంతుని యునికిపట్ల తాత్సారముగా తీసికొనుట జరిగెను. ఆవేశము, యేదియో కర్మకాండచేయుట, కాక మత విషయముల గూర్చి తర్కదృష్టితో యాలోచించుట యన్నది· బుద్ధ దేవుడుపెట్టిన మరియొక భిక్ష. తర్కము, సన్యాసము, కారుణ్యాపూరితమైన మానవత్వము, నాధారములుగా బౌద్ధ మతమేర్పడెను. ఇట్టి మతము ప్రజాసామాన్యమున వ్యాపింపజేయుట మిగుల కష్టము. కాని, బౌద్ధమతపు ప్రాథమికదశయందు గౌతమబుద్ధుని యమోఘమైన వ్యక్తి త్వము దీనికి రక్షయైనది. జనసామాన్యము యీ యపూర్వ వ్యక్తిత్వమునకు సమ్మోహితమైనది.

ఈ శక్తివలన బౌద్ధమునకు దొరకిన యూపు రమారమి రెండు శతాబ్దులు దానికండగా నుండినది. కాని, మూఢ

విశ్వాసమునకునూ, ఆవేశమునకునూ బదులుగా, తర్కము ప్రవేశపెట్టుటకు ప్రయత్నించిన బుద్ధభగవానుడే మతావేశమునకు గురియాయెను. ఆయన ప్రజాదృష్టిలో నొక దేవత యాయెను. పరలోకమున సౌఖ్యార్జనమునకై, మానవులు బుద్ధునికి విగ్రహముల నేర్పరిచిరి. స్తూపముల నిర్మించిరి. ప్రజల యానందముకొరకై, వారిలో విశ్వాసమేర్పరచుట కొరకై, చిత్రవిచిత్రములగు వివరణలతో, భావనాప్రేరితములైన యనేక గాథలు బుద్ధుని జీవితముచుట్టును అల్లిబిల్లిగా నల్లిరి. స్తూపముయొక్క నిర్మాణము, పారమిత ప్రయుక్తారాధనము, వ్యాప్తిచెందిన కాలమున బౌద్ధము భారతదేశమున నెంతయో పెరిగెను. బుద్ధుని దైవముగా నారాధించుట యారంభమైనది మొదలు, బౌద్ధముయొక్క ఆదిమ స్వరూప మీ క్రొత్త వరదలో మునిగినదనుకొనవచ్చును.

గౌతమబుద్ధుడు, తన యనుయాయులొక్కరొక్కరు, ఒక్కొక్క జ్యోతిగా ప్రజ్వరిల్లగలరని భావించెను. వ్యక్తిగతమైన కృషి మీదనే మోక్షసాధన కవకాశమున్నదనీ, యేయొకడును యితరుల నుద్ధరించలేరనీ యాయన స్పష్టముగా జెప్పినారు. బౌద్ధసంఘ ప్రవేశమనునది యాధ్యాత్మిక జీవనమునకు తొలి మెట్టుమాత్రమే యనెను. మహాయానీయులు యీ యాధ్యాత్మిక యత్నపుకష్టములను పేలవము జేసిరి. ఈ కృషి కేవలము నామమాత్రమగునట్లు చూచి, తామొక్కరొక్కరు, మోక్షసాధన కుపకరించు జ్యోతులుగా నుండుటకు బదులు కారుణ్యదృష్టితో తమ ప్రార్థనల నందుకొని తీర్చెడి దేవతలమీద నాధారపడిరి.

బుద్ధుని ఘనత, బౌద్ధసంఘ నిర్మాణమున నా మహనీయుడు సృష్టించిన కొన్ని క్రొంగ్రొత్త యేర్పాటులలో వ్యక్తమైనది. బౌద్ధులకి పూర్వముండిన హిందువు లెవరునూ యితరులను తమ మతమున జేర్చుకొనుటకు యత్నముజేసినట్లు కానరాదు. వ్రాత్యులకి మతమిచ్చుటకై జరిగిన ప్రాయశ్చిత్తాదికాండల ప్రసక్తి యున్నదికాని, యిందు మతబోధ యగుపించదు. ఇక బుద్ధుడన్ననో ప్రపంచప్రజల యోగక్షేమములకొరకై ముందుకేగుడు అని తన భిక్షువుల నాదేశించినాడు. బౌద్ధయుగ ప్రారంభమున నానాటి భిక్షులు యెందరెందరిని తమ మతమున జేర్చి కొనిరో చూచిన, క్రైస్తవమతపు తొలిదశలో, ఫాదరీలు యీ మతముమార్పు వ్యవహారముగురించి తమ తమ మాతృదేశముల పీఠాధిపతులకు సమర్పించిన నివేదికలు జ్ఞప్తికి వచ్చును. గ్రీకుదేశీయుడగు నొక బౌద్ధభిక్షువు అపరాంతమున—పాశ్చాత్యమున గాబోలు—ముప్పదియేడు వేల మందికి దీక్షనిప్పించినట్లు తెలియుచున్నది. అశోకుని కుమారుడునూ కుమార్తెయూ సింహళమునకు యిందుకై యేగిరనినది పుక్కిట పురాణముగా భావించరాదు. వివిధ దేశములందలి ప్రజలకు ధర్మమునందు ఆదరణ హెచ్చి వారి నుద్ధరించుకొరకు తాను ధర్మదూతలను విదేశములకు బంపినట్లా చక్రవర్తి తన శాసనములలో జెప్పినాడు.

అశోకుని నాటియుండియు బౌద్ధులు రాజాదరణ నూతగాగొనిరికాని, యితర మతముల కిట్టి రాజపోషణ లేకుండ జేయజాలిరాయన్నది సందేహాస్పదము. బౌద్ధము నాదరించిన మహాశక్తిసంతులగు స్రామ్రాట్టులు అశోకుడు, కనిష్కుడు. ఆ చక్రవర్తులు ప్రాజ్ఞులు. అందువలన బౌద్ధము నాదరించిరేగాని, తమ హిందూప్రజల నొప్పించుట కిచ్చగింపరైరి. అశోకుని కుమారుడు జైనుడని ప్రతీతి. బౌద్ధమునాదరించిన శాతవాహనులు బ్రాహ్మణ మతము సంతకన్న నధికముగనే పోషించినారు. భక్తిపూర్వకమగు హిందూమత పునరుజ్జీవనమునకు బాధ్యులగు గుప్తరాజులు బౌద్ధముపట్ల యభిమానము కొంత మాత్రమే యుంచిరి. ఈ స్వల్పాభిమానమునకైననూ, రాజకీయములే కారణమై యుండవలెను.

క్రీ. పూ. మూడవ శతాబ్ది మొదలు క్రీ. వె. నాల్గవ శతాబ్ది వరకూ బౌద్ధము మెరుపుదీగవలె సాగినది. గుప్త శకమునుండి దీని పతనమును అంత విపరీతముగనే యుండెను. గుప్తరాజుల కాలమునందు మొగ్గదొడిగి, పూచి, ఫలించిన వైష్ణవమతమునందులోని బేదియును నాటి మహాయాన బౌద్ధమున గానుపింపదు. మహాపురుషుడుగా ప్రజానీకమును ఈ నూతన ధర్మముపట్ల నాకర్షించిన బుద్ధుని వ్యక్తిత్వపు ఘనత యెనిమిది, తొమ్మిది శతాబ్దములలో నస్సుగిల్లెను. అప్పటికి బుద్ధుడొక దేవతామూర్తి యాయెను. దేవతలలో నొకడుగా మారెను. ఇంతకన్న భక్తి, యావేశములెక్కువగా నుండిన వైష్ణవమతపు టాకర్షణ ముందు బౌద్ధమునకు విశిష్టత యనునది లేకపోయెను. ఇదిగాక గుప్తయుగమునాటి సాంస్కృతికోద్ధరణము ముందు బౌద్ధము నిలువలేకపోయెను. రామాయణ, మహాభారత కావ్యముల కానాడే తుదిమెరుగులు దిద్దితీర్చుట జరిగెను. కాళిదాసమహాకవి యమరప్రాయములగు కవిత్వము, నాటకకళ గూడ యానాడే తలయెత్తెను. శిల్పమునగూడ హైందవులదే పైచేయియాయెను. బుద్ధుని మూర్తి నెంత సుందరపుష్టముగా, భక్తి ప్రేరితముగా జెక్కిరో యట్టి భావనాబలముతో, శ్రద్ధతోనే,విష్ణువిగ్రహముల గూడ బృందావన మథురయందలి కళాకారులు సృష్టించిరి. శ్రీదేవీ సమేతుడగు విష్ణువు నెట్లు హిందువు లూహించిరో, అజంతాయందలి బోధిసత్వుని యాకృతిని, ఆయన దేవియగు శక్తిమూర్తినీ బౌద్ధ చిత్రకారులుగూడ కల్పించిరి.

అనగా, తమకు తాముగా, తెలుసుకొనకుండగానే, బౌద్ధములో హిందూమతమును, భారతీయ బౌద్ధులే ప్రవేశ

పెట్టుట యారంభమాయెను. ప్రాచీనమైన మగధయందు, స్తబ్ధముగానుండిన హిందూ శిల్పతటాకమున బుట్టిన బౌద్ధ కళాస్రవంతి, కాలక్రమమున మరల జన్మస్థానమున సంగ మించెనని, భారత శిల్పకళా చరిత్రబట్టి యూహింపవచ్చును.

హిందూమతము, ఇతర మతములవారిని తనలో చేర్చు కొనుట యొప్పనట్టిది. తత్కారణమున, హిందూమత సిద్ధాంతములు మార్పడగని వెన్నడునూ కాజాలకుండెను, అందువలన బౌద్ధమునందు యనేకములగు చక్కని యంశములను హిందూధర్మము సులభముగా స్వీకరింప జాలెను. బౌద్ధుల యద్వైత సిద్ధాంతము, వారి యహింసా వ్రతము—హిందువులు జంతుయజ్ఞము విడనాడిరి—స్వీక రించిన హైందవులు, తమ పురములపు, బౌద్ధా, బుద్ధుడు గూడ మహావిష్ణువు నవతారములలో నొకడగుటతో పరకాష్ఠ నందినది. శంకరాచార్యుడు తన దశావతార స్తోత్రమున, యోగులలో నగ్రగామి బుద్ధుని ప్రస్తుతించుట గమనార్హము. తథాగతునిపట్ల నాయసకుగల భక్తి గౌరవముల కిది చక్కని తార్కాణము. తీవ్రమైన యెట్టి తాత్విక తర్క వాదములలో గూడ పేర్కొనదగిన హిందుపనబడును. బుద్ధుని అగౌరవ పరచుట జరగలేదు.

భారతదేశమున బౌద్ధపు చివరి దశను నలందా శకమన వగును. నాటి బౌద్ధముతో పోల్చిన అప్పటి హిందూమతము నందు ఆచార్యుల ప్రాబల్యము సూర్యుని ముందు దివ్వె వంటిది. బౌద్ధాచార్యుడగు అనంగుడు, దేవలోక ముక్తి విషయమునసేగాక, యైహిక వాంఛలపట్ల గూడ ప్రార్థనల స్వీకరింతురని బోధించుట మహాయానమునకు గొడ్డలి పెట్టుగా నాయెను. పైగా, నా దేవతలు హైందవ దేవతలు బుద్ధుని వివిధ శక్తి ప్రవత్తులకు మూర్తీ చిహ్నములుగా, యీ హిందూదైవములు బౌద్ధారాధనా తంత్రమున జొర బడిరి. ఇంతటితో నాయెనా! ఈ యసంగుడు, తాంత్రిక వ్యవహారమును గూడ బౌద్ధమున ప్రవేశ పెట్టెను. మహమ్మ దీయ దండయాత్రలు ప్రారంభ మగువరకునూ, యీతంత్ర వ్యవహారము వంగ దేశమునప్రబలముగా నుండెను.

నలందా విశ్వవిద్యాలయపు టావరణమునకు పెద్ద ప్రాకారముండెడిది. ద్వారములకు దుర్గరక్షణ లుండెడివి. ఈ రక్షణ సన్నాహములకు కారణములు రెండు. ఒకటి: శ్వేతహూణుల వలని దండయాత్రాభయము, రెండవది: యీ బౌద్ధారామములు, ఆర్థిక, రాజకీయ ప్రాబల్యముగల వారికి కూడలులగుట. భిక్షు సంఘముల ప్రారంభించి నపుడు బుద్ధుడు, యీ యారామములిట్లు కాలక్రమమున, సంపదల కాలవాలమగునని యనుకొన లేదు. బౌద్ధులకు పూర్వము దేశమున పరివ్రాజకులునూ, సన్యాసి మఠము లునూ లేక పోలేదు గాని, ఒక పద్ధతిలో యిట్టిసంఘముల దీర్చుటలో తథాగతునిదే తొలియత్నము. ఇట్టి సునంఘ టితమైన యీ సంఘారామములలో దీక్షావ్రతులైన యసంఖ్యాకులగు స్త్రీ పురుషులుండుట ఆ మతవ్యాప్తికి యమేయమైన శక్తినొసగెను. శిల్ప శాస్త్రాది విషయము లలో కృషికి దోహదము జరిగెను.

కాని బౌద్ధమతపు అంతిమదశలో యివియే యామతము నకు రావణనాభిగా నాయెను. దేశవ్యాప్తముగా నుండ వలసిన బౌద్ధధర్మము యీ యారామముల యావరణము లలో బిగిసిపోయెను. హూణ, మహమ్మదీయసేనలకు సులభలక్ష్యములాయెను. వాయవ్యదిశన గాంధారమున గల బౌద్ధారామములు హుణుల మొదటి తాకుకు నేల గూలెను. గంగానదీ ప్రాంతపు యితర బౌద్ధారామముల కునూ నదే గతిపట్టెను. హూణులు కొల్లగొట్టగా శేషించినవి మహమ్మదీయుల యాగ్రహమునకు గురియాయెను. ఇవి కాక శైవులు గూడ బౌద్ధము పై కత్తి గట్టినట్లు చారిత్ర కాధారములున్నవి. శైవుడగు శశాంకుడను వంగరాజు మతావేశమున బుద్ధగయలో వున్న బోధివృక్షమును యించు మించు నాశనము చేసెను. భరతవర్షపు పశ్చిమ, దక్షిణ భాగములందు శైవమతమునకు కేంద్ర స్థానములుగా నేర్పడిన ప్రదేశములందు గూడ యిట్టిది జరిగినట్లు తోచును. ఇస్లాము తాకిడికి తట్టుకొని మరల నూపిరి పీల్చు గొనగల శక్తి సమర్థతలు, బ్రాహ్మణ మతమున కున్నట్లు బౌద్ధమునకు లేకుండెను. కావున దేశముననది వేరు పాతు కొన్నదికాదు. ఈ సందర్భమున నొకటి తోచుచున్నది. ఆంధ్ర దేశమునందలి గుంటూరు మండలమున గల చేజర్ల పద్ద ఒకనాటి బౌద్ధ చైత్యమే యీనాటి శివాలయమైనట్లు యొక యూహయున్నది. ఇట్లే బౌద్ధారామముల ఆస్తి పాస్తులు శైవమతములకు దఖలు పడునట్లు గూడ సాక్ష్య మున్నది. ఈ హంశముల గూర్చి వివరములు సేకరించిన యిక నెంతయో బోధపడును.

స్థూలముగా నా యభిప్రాయము లివి:- 1. హిందూ దేశచరిత్రలో వ్యాప్తిరీత్యా నేమి, సంఖ్యాబలమురీత్యానేమి ఏ కాలమునందుగాని హిందూమతము కన్న బౌద్ధమున కెక్కువ ప్రాధాన్యముండినట్లు తోచదు. కొన్ని కాలములలో యెవరైన ప్రభువు గాని యొక ప్రజావర్గముగాని దీనిపట్ల నాదరాభిమానము లుంచి యుండవచ్చును. మరియొక విషయము, యిది పట్టణవాసములో ప్రబలినంతగా పల్లె పట్టులలో వ్యాపించినట్లు తోచదు.

2. బౌద్ధమునకు పూర్వమున్న హిందూ ధర్మముతో బోల్చిన, సిద్ధాంతములలో భేదము విశేషముగా కానరాదు

గాని, పాతయూహలు మానవ జీవితమునకు కొంగ్రొత్త పద్ధతితో వర్తింపజేయుట బౌద్ధముయొక్క విశిష్టలక్షణ ముగా జెప్పబడును. యజ్ఞమనగా పశుయజ్ఞముగాదనీ యాత్మయజ్ఞమనీ బౌద్ధము స్పష్టపరచినది.

3. ఉపనిషత్తుల కాలము తరువాత హిందూ మత మునూ, మహాయాన బౌద్ధమునూ సమాన ఫాయాలో అభి వృద్ధి చెందినవి. వైష్ణవమునకు వాసుదేవారాధన ప్రధా నముకాగా, బుద్ధుని యారాధన బౌద్ధమునకు జీవగర్ర యాయెను.

4. తథాగతుని మార్గము ప్రజాబాహుళ్యమును సులభ ముగా నాకర్షించగల్గినది కాదు. ప్రాచీన ధర్మసూత్రము లకు నూతనములైన ప్రమాణముల సృష్టించి కొన్ని క్రొత్త యూహలు బోధించిన తొలి నాటి బౌద్ధము క్రీ. పూ. రెండవ శతాబ్దికి తన విద్యుక్త ధర్మము నెరవేర్చిన దాయెను.

5. బౌద్ధవిహారములందలి మేధావులు వివిధ శాస్త్ర విషయములందును. కళలందును జరుపుచుండిన కృషి సమీపముననున్న హిందూ ధర్మములందు క్రొత్త యూహలు పుట్టించెను.

6. దూరప్రాచ్యమున, మధ్య, ఆగ్నేయాసియా ప్రాంత ము[illegible]మతమూలో నుండిన నూతన విషయ ములు అచ్చటి ప్రజల కాకర్షణీయములైనట్లు భారతదేశ మందలి వారికి కాజాలకపోయెను.

7. తొలిదశలో హిందువులు బుద్ధునకును, ఆ మహ నీయుని బోధనలకును స్వాగతమొసగిరి. క్రీ. వె. మొదటి శతాబ్దులలో బౌద్ధులను సహించిరి. కాని తీవ్రమైన శైవ మత పునరుద్ధరణ ప్రారంభమైన దాదిగా బౌద్ధముపట్ల ప్రాతికూల్య మినుమడించెను. అప్పటికి బౌద్ధుల యనేక విషయములను హిందువులు స్వీకరించి, తమ స్వంత ముగా చేసికొనిరి.

8. బౌద్ధముయొక్క పతనము భక్తిప్రధానమైన హిందూ మతము ప్రారంభమగుటతో నారంభమాయెను. ఏలయన ఈ భక్తిమార్గము జనసామాన్యము నెక్కువగా నాకర్షించెను. ఇటులుండ, హూణుడగు మిహిరగులుని మూకలు దేశము పై బడెను. తరువాతి మహమ్మదీయ దండయాత్రలు, శైవ మతానుయాయుల వీరావేశమును, బౌద్ధమును కడతేర్చెను.

9. మహాపురుషునిగా, మహావ్యక్తిగా బుద్ధునిపట్ల భక్తి గౌరవములు భారతవర్షమున వర్థిల్లుచునే యుండెను. హైందవ హృదయమున యా మహనీయుని పవిత్రబోధలు హత్తుకొనియుండెను. ఈ రీతిగా హైందవ మనోకోశమున బుద్ధుడు ఒక అంతర్జాతీయ మూర్తి యాయెను.

బుద్ధదేవుని పరినిర్వాణం

